# శ్రీ శివభక్త చరితము




అభినవ వాగీశ,

విద్వాన్: ప్రు.సూర్యనారాయణ శర్మ P.O.L.

## భారతి

జూలై, 1962.

శ్రీ సూర్యనారాయణ శర్మగారి తెలుగు సేత [illegible] విధేయమై పఠనయోగ్యమై యున్నది. ఇందుకు వారొనర్చిన పరిశ్రమము ప్రశంసనీయము. తెలుగు సేత చక్కగా [illegible]న్నది. వారి కృషిని మరొకతూరి కొనియాడుచున్నాను. ఈ తెలుగు సేత అవశ్య పఠనీయము. అందును మన వీరశైవ కవుల రచనములను విమర్శనాన్వృక్పథముతో పరిశీలింప నభిలషించు భాషా జిజ్ఞాసువులు తప్పక పఠించవలసిన గ్రంథమిది. ఇక శివపాద సేవాతత్పరులకా ఇది పారాయణ గ్రంథమే.

---

## ఆంధ్రపత్రిక

ఆదివారము జూలై 15, 1962.

దక్షిణభారతమున మహోపకారకములైన అనువాద గ్రంథములలో శ్రీ శివభక్త చరిత మొకటి. కన్నప్ప కథలోని చెంచుగూడెముల వర్ణనము నందనారు కథలోని హరిజనవాడ చిత్రణము మిక్కిలి సహజసుందరములు. శ్రీ సూర్యనారాయణ శర్మగారి రచన సర్వస్వతంత్రముగ గన్పట్టును. అనువాదమని చెప్పినను నమ్మజాలముకూడ. మిక్కిలి సరళమైన భాష. చిన్న చిన్న వాక్యములతీరు. జిగివీడని పలుకుబడి వీరి రచనలో తొణికసలాడుచున్నది. వీరి గద్యరచన చక్కని తీరుతీయముల నలవరచుకొన్నది. భాష నిర్దుష్టము. ఈ కావ్యము తమిళకవుల భావము లెట్టివో వారి సంస్కృతి ఎట్టిదో కొంత వరకు మనకు తెలుపకపోదు. శర్మగారిట్టి రచనలే కొనసాగించి ఆంధ్ర వాఙ్మయమును అలంకరింతురుగాక.

RGHO10332

# శ్రీ శివభక్త చరితము

శేక్కిళారు రచించిన పెరియపురాణమునకు అనువాదము

(అఱువది మూవురు శివభక్తుల చరితము)

(వచన కావ్యము)



రచయిత

విద్వాన్, పొం. సూర్యనారాయణ శర్మ, P.O.L.

సర్వస్వామ్య సంకలితము] [వెల రూ. 8-50 న.పై.

A

ప్రథమ ముద్రణము—1,000 కాపీలు. 1962 సం॥

మృకండుమునిసూనునుత । మంతకభయంకర
మభంగురిత కింకిణీరవం
జటాతట వలత్సురధునీ । ఝుర కచాకచి
విచక్షణ మమంద ఫలదం
సమజ్జన తమోభరహరం । ఫణాధరేశ మణి
దీపితదిగంత మవతాత్
ముకుందవిధిహస్తధృత । మద్దళగతధ్వని
సమానుస్మృతిశంభు నటనం ॥

This Book can be had from the Author :—

ADDRESS—

P. SURYANARAYANA SARMA,
44 B/1 Vellala Street,
Purasawalkam, Madras-7.

Printed at The Premier Art Press, Purasawalkam, Madras-7.



ఓం నమో నటరాజాయ

(శివ తాండవము)

[11]

శ్రీః

1. నమశ్శివాయ దేవాయ, భవాన్యర్ధాంగధారిణే
భవబంధ వినాశాయ, భవ్యాయ పరమాత్మనే॥

2. త్వత్ప్రసాదా దహం దేవ, భక్తానాం చరితం ముదా
ఆన్ధ్రీకరోమి మధురం, జన్మ సాఫల్యకారణం॥

3. చరితం శివభక్తానాం, కైవల్య ప్రాప్తికారణం
పుష్పదామ సమం రమ్యం, స్వీకురుష్వ మయార్పితం॥

4. గజాస్యం గిరిజాపుత్రం, విఘ్నేశం గణనాయకం
నమామి సతతం దేవం, భావభవ్యార్థ సిద్ధయే॥

5. శ్రీ వేంకటాచలపతిం, ప [illegible]యం కులదైవతం
శిరసా మనసా నిత్యం భు [illegible]భూయో నమామ్యహం॥

6. దేశిమార్గ ప్రియానార్యాన్, గీర్వాణాంధ్ర మహాకవీన్
రసవద్రచనాసక్తాన్, స్మృత్వా దత్తోయమంజలిః॥

7. పితరం సాధుచరితం, సుబ్రహ్మణ్యాం సుచేతసం
వేంకాంబాంమాతరం సాధ్వీం, వన్దేహం వినయాన్వితః॥

8. వందేగురూన్సవినయం, శాస్త్రసాహిత్య బోధకాన్
యజురధ్యాపకాన్ సర్వాన్, శ్రేయసే భూయసేన్వహం॥

9. సుధీర్గుణవతాం శ్రేష్ఠః, జ్ఞానసంబంధ నామకః
చకార సుమహాత్సాహ్యం, పార్థస్యేవ యదూద్వహః॥

10. యస్య జ్ఞానమయీ మేధా, శిష్యసంవర్ధనేరతా
తస్మైద్రావిడ విజ్ఞాయ, దదాతు శ్రియ మీశ్వరః॥

11. భారద్వాజ కులేజాతః, సూర్యనారాయణాహ్వయః
శివేభక్త స్సదా ధన్యః, భక్తగాథానుకీర్తనాత్॥

12. ధీమతా మాంధ్రలోకానాం, భక్తానాం వృత్తమీదృశం
కిమతః పరమాకాంక్ష్యం, ప్రమోదాయ భవేద్యది॥

IX A



పొంగూరు సూర్యనారాయణ శర్మ
(రచయిత)



శ్రీ తిరుజ్ఞాన సంబంధుఁడు
(తమిళ గాథలను వివరించి తెల్పిన
తమిళ పండితుఁడు)

# అభిప్రాయములు

HON. VICE PRESIDENT OF INDIA, NEW DELHI

Thank you for your Letter and enclosures which I glanced through with interest......

with best wishes,

2nd March 1962. (Sd.) S. RADHAKRISHNAN.

---

కవిసమ్రాట్

శ్రీ విశ్వనాథ, సత్యనారాయణగారు, M. A., M. L. C.

వచన రచన మిక్కిలి రమ్యముగ నున్నది. శ్రావ్యముగ నున్నది. ధూర్జటి పాల్కురికి, సోమన్నగారి కథల కిది మూల గ్రంథము. మూలమున అధిక గుణములుండుటచే నిది తప్పకుండఁ జదువఁదగిన గ్రంథము. శర్మగారు చక్కని సంస్కృత పండితులు. అధ్యయనపరులు. శ్రౌతి. వీరిరచన కివి యలంకారమును తెచ్చుచున్నవి.

శ్రీ వేదుల, సత్యనారాయణ శాస్త్రిగారు, కావలి కాలేజి, కావలి.

ఇది యెల్లవిధముల నత్యుత్కృష్టమైన యాంధ్రసాహితీ సేవ. మీయట్టి బహుభాషాకోవిదు లిట్టి పనికిఁ బూనుకొనుట, జాతికిని, భాషకును నిజమైన సేవ. మీ రచనవలన ఎన్నో మతరహస్యములు, సారస్వత విశేషములు, చారిత్రక విషయములు తెలుఁగునకు లభింపఁగలవు. మీ యీ సారస్వత కృషి ప్రయోజనకరమేగాక యావశ్యకమనియు మనవి చేయుచున్నాను.

---

అభినవతిక్కన—శ్రీ తుమ్మల,
సీతారామమూర్తి చౌదరిగారు, అప్పికట్ల.

శివభక్తచరితముఁ గొంత చదివి లెస్స తనిసి, యంతయుఁ జదువు టెపుడా యని యువ్విళ్లు గొంటిని. చాఁగు! చాఁగు! ఉత్తమసృష్టి. శర్మగారి రచన స్వతంత్ర రచనవోలె నుంటయ కాక ప్రౌఢమై, నిర్దుష్టమై, యెన్నో అందచందములఁ జాటుచు, మనగద్య వాఙ్మయమున కొక విశిష్టత నొదవించుచున్నది, పూజ్యులు చిన్నయసూరిగారి నీతిచంద్రిక తరువాత నింత చేవగల తెల్గు వచనము పుట్టలేదేమో! శ్రీ శర్మగారు ధన్యులు. వారికి నా యేటికోళ్లు.

2—4—'62. తెలుఁగు లెంక.

మహాకవి, సరస్వతీపుత్ర, శ్రీ పుట్టపర్తి, నారాయణాచార్యులుగారు, కడప, 5—4—'62.

శివభక్త చరితమును ఎక్కువ ఆసక్తితో చదివినాను. తమిళము భక్తి సాహిత్యమునకు పెన్నిధి. తమరెంతో కృషి చేసి, శివభక్తుల చరిత్రము నాంధ్రమునకుఁ దెచ్చినారు. దీనికి తమకు తెనుఁగువారు కృతజ్ఞులుగ నుండవలెను. తమ గద్య రచన చాల లలితమైనది. రచన దీర్ఘసమాసములు లేక అలఁతి యలఁతి వాక్యములతో సాగిపోవుచుండును. తమ పాండిత్యము సార్థకమైనది.

---

శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజు, B. A., B. L. అధ్యక్షులు—ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (హైదరాబాదు) చిత్తూరు, 8-4-62.

శివభక్త చరితమును చదివినవారి కిది యెంతటి యుద్గ్రంథమో బోధపడఁగలదు. తమిళము భక్తిపూరితములగు నుత్తమ గ్రంథములకుఁ బుట్టినిల్లు. అట్టి కోవకుఁజెందిన పెరియపురాణముఁ దెనిఁగించి, యాంధ్రలోకమున కందించుట సర్వదా శ్లాఘనీయమైన కృషి. కంబరామాయణాదులఁ దెనిఁగించిన శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి కృషితోఁ బాటు శ్రీ శర్మగారి కృషి గూడ నత్యంత ప్రశంసనీయము. ఇందలి భాష విషయానుకూలముగ, అతి ప్రౌఢముగ, నిర్దుష్టముగ శ్రవణపేయముగ నున్నదని చెప్ప సాహసించుచున్నాను. ఈ గ్రంథమాంధ్రభాషా జగతిని మేలుబంతియై యలరుఁగావుత మని యాశించుచున్నాను.

భాషాభూషణ శ్రీ బూదూరు, రామానుజులు రెడ్డిగారు,
తిరుత్తణి, 10-4-'62.

బహుభాషాకోవిదులైన శ్రీ శర్మగారు నెల్లూరు మండలమునకుఁ జెందిన పక్కా తెలుఁగువారయ్యు, వృత్తిధర్మమున చెన్నపురిఁ జేరుకొన్న వీరు తమిళభాషయందును సమగ్రమగు పాండిత్యము నార్జించి, తమిళభాషను ఉద్గ్రంథమై విరాజిల్లుచున్న "పెరియపురాణ"మును తెనిఁగించి, ప్రత్యేక వైలక్షణ్యముగ నొక యద్వితీయ స్వతంత్ర వచనకావ్యమువోలె "శివభక్త చరితము" అను పేర నిర్మించి ఆంధ్రభాషాయోషకలంకార ప్రాయమైన కుసుమగుచ్ఛముగ వెలార్చిన సాహితీసేవా కృషి సంశ్లాఘ్యమై యొప్పుచున్నది.

మహోదధివంటిదైన, శివభక్త చరితమందలి కథాకథన విధానము రచనము నిర్దుష్టమైన జలిబిలి ముద్దుఁబలుకులతో, ధారాళమైన ధారతో, లలితమృదుమధుర పదములతో, సరళమైన శైలితో ఆంధ్ర గద్యవాఙ్మయమునకు మకుటాయమానమై విరాజిల్లుచున్నది.

పండితవరేణ్యులగు శ్రీ శర్మగారుత్కృష్టమైన గ్రంథ రాజములు రచించుటకుఁ దగిన ప్రోత్సాహమును ఆంధ్ర సాహితీ ప్రియులు కల్పింత్రుగావుత మని యభ్యర్థించుచున్నాను.

---

శివభక్త చరితము నామూలాగ్రము చదివితిని. ఇందలి రచన సలక్షణమై చక్కని శైలిలో సాగినది. నేఁడాంధ్ర సాహిత్యమునఁగల సలక్షణ గద్యగ్రంథముల కొఱంత నియ్యది తొలఁగింపఁగలదు. ఈ రచన ఆంధ్రసరస్వతికొక యలంకారమై యొప్పుననుట యతిశయోక్తి కాదు.

విద్వాన్ తిరుపతి కోదండరామయ్య, B.A., L.T.,

---

ఆర్యా!

మీ శివభక్త చరితముఁ జదువఁజదువఁ జవులూరుచున్నది. ఏ తద్గ్రంథ పఠనమున నా హృదయ మానంద వారిధి నోలలాడినది.

సలక్షణమై, హృద్యమగు గద్యరచన పద్యరచనకంటె కష్టతరము. "గద్యం కవీనాం నికషం వదంతి." ఇందలి మీ గద్యకవితాస్రవంతి గంగాప్రవాహమువలె పవిత్రమై, నిరాటంకముగా సాగినది.

ఇయ్యది సాహితీప్రియులకేగాక, యాముష్మిక జిజ్ఞాసువులకు నవశ్యపఠనీయము. తెలుఁగు భాషాయోష కిది చక్కని చేర్పుచుక్క.

యనమండ్ర రామమూర్తి,
భాషాప్రవీణ.

విద్వాన్, రావూరి దొరసామి శర్మ, ఎం. ఏ.

క. సరసులు కోవిదులు సదా
తరులగు పొంగూరి సూర్యనారాయణ శ
ర్మ రచించిన శివభక్తుల
చరితమ్మును వచనకృతి ప్రశస్తి వహించున్. ॥ ౧ ॥

చ. తమిళ మహాపురాణము యుదాత్త కథాకలితార్థయుక్తిమై
నమలిన పేశలోక్తి సముదంచిత మార్దవ మాధురీధురీ
సమధిక భావబంధుర రసప్రకటంబుగ గద్యకావ్య ర
త్నముగఁ దెనుంగులోన రచితంబిది భక్తచరిత్ర పేరిటన్.

సీ. అఱవ బాసఁ జెలంగు పెరియపురాణంబు
గాథలందున్నట్లుగా గ్రహించి
ప్రకరణోచితచారు వర్ణనాచాతురి
పొలుపార రసవంతముగ నొనర్చి
యనువాద మనిపించుకొననియట్టుల స్వతం
త్రగ్రంథ మిది యను తలఁపుఁగూర్చి
ప్రౌఢగంభీర శబ్దస్ఫూర్తి నిర్దుష్ట
శైలిలో శిష్టభాషను వరించి,

గీ. తెనుఁగులో గద్యకావ్యమై ఘనతఁగాంచఁ
బేర్మి సూర్యనారాయణశర్మ రచిత
మైన శివభక్తచరిత మీ యాంధ్రవచన
వాఙ్మయంబున మిన్నయై వఱలుఁగాత. ॥ 3 ॥

క. అలనాఁటి సూరివచనముఁ
దలఁపించుచు లక్షణాన్వితంబుగ సంశో
భిలు శివభక్త చరిత్రము
వలనుగ నెల్లర కవశ్య పఠనీయమగుఁ౯. ॥ ౪ ॥

గీ. తమిళమందలి భావసౌందర్యగరిమ,
తెనుఁగు నుడికారమందున్న తేటతనము
భక్తుల మహత్త్వ, మీ శివభక్త చరిత
తెలుఁగువారికిఁ దెలుపుచు వెలయుఁగాత. ॥ ౫ ॥

---

# UNIVERSITY OF MADRAS

N. VENKATA RAO, M.A., Triplicane, Madras-5,
*Head of the Departmeut of Telugu.*

It is with great pleasure that I have gone through the Telugu Prose work entitled " Sivabhakta Charitamu " which is a rendering of the famous Tamil Classic " Periapuranam " by Shekkizhar of the 12th Century.

Periapuranam described the lives and deeds of the 63 Tamil Saivaite devotees popularly known as " Aruvathumoovar ", who played an important role in the evolution of Saivism in South India.

It is no doubt true that Palkuriki Somanatha, the great Telugu poet and apostle of Vira Saivam (1190-1260) that first brought to Telugu, the name of the sixty three Nayanars and also a selected few stories of the well known Nayanars, while writing the two works, Basavapuranamu and Panditaradhya Charitramu, which are the biographies of the two promulgators of Virasaivism in South India. Even these are not strictly in accordance with Periapuranam.

A complete version of Periapuranam is therefore a desideratum in Telugu to assess the literary value of the works of Somanatha. It is also necessary as this is a time, when we are on the threshold of assimilating our neighbouring cultures.

Vidwan Sri P. Suryanarayana Sarma Garu, the author of the present prose work, has to be congratulated by bringing this huge work into Telugu, and that too in prose, which is the Chief Vehicle for expression of thought in modern times.

It is no easy task to undertake the translation of Periapuranam. The author Sri Sarma Garu is a good Sanskrit and Telugu scholar, and well acquainted with Tamil. But he makes no pretentions and appropriately acknowledges his indebtedness to his Tamil preceptor which is a guarantee for the faithfulness of translation and for keeping up the spirit of the original.

The style of the work is lucid chaste and intelligible to all strata of society. It is especially useful in academicable bodies and literary circles as the stories are interesting both from subjective and objective points of literary criticism. As a text book it elevates the thought and language of the students.

Siva Bhaktha Charitamu is an invaluable addition in modern Telugu Prose literature.

Sd/-N. VENKATA RAO.

# UNIVERSITY OF MADRAS

*Triplicane. Madras.*

Dr. A. CHIDAMBARANATHAN CHETTIAR,
M.A. PH.D., M.L.C.,
*Chief Editor*
ENGLISH-TAMIL DICTIONARY.

I have had the privilege of getting to know that Vidwan Sri P. Suryanarayana Sarma has brought out in prose the Periyapuranam of Sekkilar, which contains the lives of 63 Saiva Saints. The author has taken pains to get an adequate knowledge of the stories as contained in the Periapuranam, which is a sacred book of the Tamil Saivates. The stories relate to rare and marvellous deeds done by persons who were living in this world along with them surpassed them by being unlike them in certain respects. The chief merit of the saints is that they did the deeds in a transcedental manner. That is to say, though they were alike their countrymen in flesh and body, they were unlike them in spirit and in the achievement of their noble ideals. Many of them were not afraid of death; some of them welcomed it because they did not want to compromise on essential matters of conviction of the heart; several of them were martyrs and several others were harbingers of happiness and bliss. Sri P. Suryanarayana Sarma has brought home these truths in his Telugu version of the Periyapuranam and has placed the Tamil and Telugu alike under a great debt of gratitude.

I hope the book will be welcomed by the Telugu people who want to understand certain Tamilian aspects of life of the mediaval centuries. On understanding each other will depend further promotion of love between these communities.

(Sd.) A. C. CHETTIAR.

# కృతజ్ఞత

ఈ గ్రంథరచనకుఁ దోడ్పడి తమిళకావ్యమందలి నిగూఢార్థములను విప్పి చెప్పిన చిదంబరవాసి తమిళ విద్వాన్ (పులవర్) శ్రీ తిరుజ్ఞానసంబంధునకు నా ధన్యవాదములు. శ్రీ పట్టుసామి ఓదువార్ గారు వ్రాసిన గద్య పెరియపురాణము నా రచనకు విశేషముగ నాధారమగుట వారికి నా నమోవాకములు.

ఈ గ్రంథరచనకుఁ బ్రోత్సహించిన మిత్రులందఱకు నా కృతజ్ఞతాపూర్వకాభివందనములు. ముద్రణ దశయందు విశేష సహకారమొనర్చి, వృద్ధులయ్యు నాయందలి ప్రేమచే దీనికొక రూపమిచ్చిన శ్రీ విద్వత్కవిభూషణ, విద్వాన్, వేదము వేంకటకృష్ణశర్మగారికి నా నమస్సులు. అడిగిన వెంటనే యిందలి చిత్రములను చిత్రించి యొసఁగిన శ్రీ అనపిండి సోమేశ్వరరావుగారికిని, వానిని తమ వ్యయముతో ముద్రించి యిచ్చిన శ్రీ ఉప్పుటూరు ఎంబెరుమానారు శ్రేష్ఠి గారికి వారి సోదరులకు నా యాశీస్సులు. ఈ గ్రంథమును ముద్రించిన శ్రీ యం. ఆర్. అప్పాదొర పిళ్లైగారికి నా యభినందనములు.

ఈ శివభక్త చరితమును చదివి, విని తమ యభిప్రాయ ములనొసంగిన పెద్దలందఱకు నా హృదయపూర్వక నమస్కృతులు.

ఇందలి కొన్ని చిత్రములను ముద్రించుకొనుటకు నంగీకరించిన శైవ సిద్ధాంత సంఘమువారికి నా ధన్యవాదములు.

*Thanks to*

A. N. PARASURAMAIAR, M.A., *Principal, Minerva College.*

B. VENKATAKRISHNAIAR, B. A., ,, ,,

V. S. GOPALAKRISHNA IYER, B.A., L.T.,

S. NARASIMHAN, B. A., L. T.,
*Headmaster Sir, M. Ct. M. High School.*

Vidwan Sri SOMASUNDARA THAMBIRAN SWAMIGAL,
*Dharmapura Adhinam Madras.*

మీరు పంపిన శివభక్త చరిత్ర మందినది. ఇది అచ్చు కాక పూర్వమే కడచిన పర్యాయము నేను మద్రాసు వచ్చి నపుడు చదివి వినిపించినారు. అప్పుడే మీ పుస్తకము ప్రశస్తిని గ్రహించితిని. తమిళదేశమున శివభక్తిని వ్యాపింపజేసిన అఱువది ముగ్గురు శివభక్తులలో కొందఱి చరిత్రలు బసవ పురాణ, పండితారాధ్య చరిత్రాదులందు వర్ణితములైనను తమిళ మున శేక్కిళారు సంకలితమైన అఱువది ముగ్గురు నాయనారుల (భక్తుల) చరిత్రము తెనుఁగులోనికి రాలేదు. వారిలోని పూసల నాయనారు మొదలైన కొద్దిమంది శివభక్తులు ఆంధ్ర దేశీయులని కైఫీయతులు వక్కాణించునంతగా వీరి కథలు తెలుఁగు దేశమున దృఢముగా పాతుకపోయినవి. ఈ శివ భక్త చరిత్రమును తమిళమునుండి అనువదించి శివభక్తులైన తెలుఁగువారికిని ఆంధ్ర సాహిత్యమునకు మహోపకారము కావించినారు. ఇందుకు ఆంధ్రులందఱు మీకు కృతజ్ఞతానిబ ద్ధులుగా నుండగలరు.

ఈ గ్రంథమునందలిది సులభమైన శైలి; మనస్సు నాక ర్షించు మనోహరమైన రచన; వర్ణనలు లలితపద విలసితములై హృద్యముగ నున్నవి. గంగాధరేశ్వరుని కృపవలన ఈ గ్రంథ మచిరకాలమున గొప్ప యశస్సు నార్జించునుగాక!

మల్లంపల్లి సోమశేఖర శర్మ.

---

# ప్రస్తావన

ఆర్యర్షులు తత్త్వజిజ్ఞాసువులుగ మెలఁగిన మనభరతఖండ మెల్లమతములకును ఆలవాలమనఁజెల్లును. శీతనగమునుండి కన్యాకుమారివఱకుఁ గల ప్రదేశమంతయు పుణ్యావంతమైనది. ఆర్యావర్తమునందువలె దక్షిణాపథమునందును కొన్నిమతము లుప్పతిల్లినవి. ముఖ్యముగ శైవ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు దక్షిణభారతసంభూతములే. ఆ యా దేశకాల పరిస్థితుల కనుగుణములగు నాధ్యాత్మికవిచారములు ప్రజలలో రేకెత్తినపుడు, వారి మనఃపరివర్తనము లాస్తికత్వమునకో నాస్తికత్వమునకో హేతుభూతములగును. అట్టియెడ దైవాంశగల మహోపదేశకుఁ డొకఁడవతరింపవలసిన యవసరమేర్పడును. మానవలోక సముద్ధరణార్థ మతఁడేర్పఱచు సిద్ధాంతసముదాయ మొకనూత్నమతసృష్టి యొనర్చును. అంతతో క్షీణదశ నందు చున్న తత్పూర్వమతములన్నియు నపాస్తములగును.

ఆర్యులు ప్రప్రథమముగ శైవమతమునే యవలంబించి యుండిరని కొన్నినిదర్శనములఁబట్టి తేలుచున్నది. ఋగ్వేదముఁ బట్టి చూచిన ఆర్యులు పంచభూతముల నారాధించినట్లు గోచరించును. సూర్యచంద్రాదులను వారర్చించిరి. ఈ భూతాతిరిక్తమగు మహోన్నతాత్మ యొకటిగాని మహోన్నతపురుషుఁడుగాని యుండెవలెనని భావించి యర్చించినటులఁ దెలియుచున్నది. అట్టి రూపమును వారు "అష్టమూర్తి" యనిరి.

బ్రహ్మవిష్ణుమహేశులకు భిన్నమును అతీతమునగు వ్యక్తిని "సహస్రశీర్షాపురుషః" అనియు "సహస్ర శీర్షం దేవం" అనియు వర్ణించిరి. అట్టి మూర్తినే ఆర్యులు "శివం" అనిరి. దానినే వారు విశ్వసించి "శాంతంశివంసుందరం" అని ఘోషింగెత్తి చాటిరి. అట్టి పరమశివప్రభావమును తరువాతి వారెన్నియో విధములఁ బ్రకటించిరి. లింగరూపుఁడగు శివునియాద్యంతములఁ గాంచు నిచ్ఛ బ్రహ్మవిష్ణువులు యత్నించిరనియు, అందొక పూర్ధ్వదిశను మఱొకరు అధోహరిత్తునకు వెడలిరనియు ఎంతదూరమేఁగినను వారాశివుని యాద్యంతములఁ గానక తిరిగివచ్చిరనియు పురాణములు దెల్పుచున్నవి.

భారతావనిలోఁ బ్రసిద్ధికెక్కిన శివక్షేత్రములఁగూర్చియు శివభక్తులనుగూర్చియు వక్కాణించు స్కాందపురాణమును కృష్ణద్వైపాయనుఁడు విరచించెను. కాశీఖండము భీమఖండము మొదలగునవి యనేకములు అందుగలవు, అష్టమూర్తియగు శివునిరూపములుగల పుణ్యక్షేత్రములగు చిదంబర శ్రీకాళహస్త్యాదుల మహిమలు, గననివారుందురేమో గాని వినని వారరుదు. ఆంధ్రదేశము త్రిలింగమధ్యగతము. హంపియందలి విరూపాక్షాలయము మహారాజాధిరాజ పూజితము.

అఱవమే మాతృభాషగాఁగల తమిళదేశములో శైవము ముఖ్యముగ తలయెత్తినది. చోళపాండ్యదేశములలో శివాలయములేని యూరుగాని, నగరముగాని లేదనుట యతిశయోక్తిగాదు. అచట కొంతకాలము రాజాదరణమును పొంది

జైనబౌద్ధమతములు విజృంభించినవి. రాజుల ననుసరించి ప్రజలును ఆ మతముల నాదరించిరి. వేదబాహ్యము నాస్తికత్వావలంబము నైన జైనమునందు బౌద్ధమునందు జనులకు క్రమముగ విశ్వాసము సన్నగిల్లజొచ్చెను. నూత్నమతబోధకులు నూతనమతావశ్యకత యెంతేని యపసరమయ్యెను. మరల వేదచోదితమైన శైవము నుపదేశించు దేశికుల యవతారావసర మేర్పడెను. అపుడు కొందఱు శైవభక్తులవతరించి శైవమును వ్యాపింపఁజేసి జైనబౌద్ధమతముల నడఁగఁద్రొక్కిరి. అట్టివారే జ్ఞానసంబంధుఁడు, తిరునావుక్కరసు, సుందరమూర్తి మొదలగువారు. వారు విభూతిమహిమను శివపంచాక్షరీమహిమను వ్యాపింపఁజేసిరి. వారు తమకవితతో, దివ్యమహిమలతో, కొంతరాజాదరముతో నీ మతమును మానవలోకమున వ్యాపింపఁజేసిరి. అట్లొనర్చినవారే అఱువదిమూవురు శివభక్తులు. వీరినే తమిళమువ నాయనార్లందురు. వీరిగాథలు పాటలు తమిళ సోదరులం దత్యంతవ్యాప్తి నంది ప్రచారములో నున్నవి. 11-వ శతాబ్దాదిలో ఆయఱువదిమూవురు నాయనారుల చరితములు "పెరియపురాణ"మను మహాప్రబంధముగ వెల్వడెను.

ఈశివభక్తులు పుణ్యతీర్థాటనాతత్పరులై దివ్యశివక్షేత్రములను దర్శించి యచటి శివమూర్తులను కీర్తించి, భక్తులను గలిసికొనుచు శివమహిమలఁ జాటుచు శైవమును వెల్లివిరియఁజేసిరి. అప్పటి జైనబౌద్ధాచార్యులను వాదములందోడించి రాజులను శైవులుగఁజేసిరి. ఈ విషయముల నెఱుఁగఁగోరువారు పెరియ

పురాణమును తప్పక చదువవలయు. నాయనార్లు ఆంధ్రదేశ మందలి శ్రీకాళహస్తిని వర్ణించుటయేగాక "శ్రీశైలపదిహము" అను పదిహములతో భ్రమరాంబామల్లికార్జునులను వినుతించి యున్నారు. ఈచరితమందు వర్ణింపఁబడిన నగరములు గ్రామములు ఆలయము లిప్పటికిని లోకప్రసిద్ధిఁ గాంచియున్నవి. నాయనారుల పాట లిప్పటికి వ్యాప్తిలో నుండుటయేగాక ముద్రితములై బహుళప్రచారము నందియున్నవి.

ఈనాయనారులలో కొలఁదిమందిమాత్రమే కవులు పండితులు జ్ఞానులు. కన్నప్పవంటి మూఢభక్తులనేకులున్నారు. ఈ ఇరువాగులవారిలో కొందఱు స్వాత్మోద్ధరణమునకు మాత్రమే గాక, లోకోద్ధరణమునకు యత్నించినవారు గలరు. ఈయఱువదిమూవురేగాక యింకెందఱో మహాభక్తులు గలరు. వారిని సూచనాప్రాయముగ నిందు పేర్కొనియున్నారు. శైవము జైనబౌద్ధమతములకు వినాశముగల్పించి, యతివేగముగ ప్రాంతదేశములకుఁ బ్రాఁకెను. దక్షిణదేశ శైవము వైదికశైవమైనను కొంతఱిగాథలలో శైవవీరము గన్పించుచున్నది. చిఱుతొండఁడు కొడుకును చంపి శివునకాహారమిడెను. ఒకభక్తుఁడు పత్నిహస్తమును ఛేదించెను. మఱొకఁడు శివార్థమె తన్ను తాఁబొడుచుకొనెను. ఒకఁడు భార్యనే యర్పించెను. ఇట్లు భక్తివీరముతో గూడిన గాథలు చరితములు అనేకములు వ్యాప్తమై, కడకు వీరశైవమునకు దారితీసెననుట సాహసముగాదు.

అప్పటి కన్నడసీమలోని కల్యాణపురాధీశుఁడైన బిజ్జలుఁడను రాజునకు ప్రధానిగఁ బెంపారిన బసవేశ్వరుఁ డాదేశమున శైవమతమును నెలకొల్పెను. నందియే వీరశైవమతవ్యాప్తికై పరమశివుననుమతి బసవేశ్వరుఁడుగా జన్మించెనను ప్రతీతియు గలదు. మల్లికార్జునపండితారాధ్యునకు చందవోలురాజగు రెండవకులోత్తుంగచోళ ఉదయావనీశాదులు సమకాలికులు. కర్ణాటకమున శైవమతవ్యాప్తికి బసవేశ్వరుఁడు ముఖ్యుఁడు. అతఁడు రాజ్యమున ముఖ్యాధికారి గావున తన్మతమచట వేగముగ వ్యాప్తినందెను. పండితారాధ్యుఁడును బౌద్ధజైనమతముల నెదిర్చి వారినోడించి వీరశైవమును పోషించెను. ఇతఁడు వీరశైవుఁడయ్యు "బ్రాహ్మ్యంబుఁ బాయని" వాఁడు. పండితారాధ్యులు శైవులను దప్ప తక్కినమతస్థులను తెగనాడెను. "పాతకులాత్మాద్వైతులు నీతినెఱుంగుదురె! గతశిఖా గాయత్రీ యజ్ఞోపవీత నాస్తికు లజ్ఞులు. శివునిఁగొలువని వారు మానిసిగాడ్దియలు, దుర్మదులగు మాయావాదులు, ప్రచ్ఛన్నదోషు లద్వైతుల్." అని యిత్యాది వాక్యములచే దూషించియున్నాఁడు. ఇట్టి ద్వేషభావము మచ్చునకైన పెరియపురాణమందు లేదు సరికదా; అందలిశివభక్తులును వేదములనుగాని, వైదికధర్మాదులనుగాని నిందించలేదు. తిరస్కరింపలేదు. వారు జాత్యాదులను ద్వేషింపలేదు. బసవేశ్వరునకు ముందు అఱవదేశమున "శివుని గొలువనివారు మానిసిగాడ్దియలు" అని చెప్పనంతటి ధీరులున్నట్లు కానరాదు. బసవేశ్వరుని యుద్భవముచే మతవిప్లవ మేర్పడినది. పాల్కుఱికి, సోమ

నాథాదులు శాస్త్రహేతువాదములలో తమకుఁగల సామర్థ్య ముచే గ్రంథాదుల రచించుటచే వీరశైవము ప్రబలెను. వైదిక దూషణయు విజృంభించెను. తమిళదేశమందలి శివభక్తులకు అన్యమతదూషణబుద్ధి గానరాదు. వారిభక్తిప్రపత్తులు ఈర్ష్యా సూయాద్వేషాదిక దోషకళంకితములు గావు.

పాల్కుఱికిసోమన గ్రహించిన కొందఱి భక్తులగాథలు ఈపెరియపురాణమందలివే. కాని యేకారణముననో యతఁడీ కథలను యథాతథముగ గ్రహింపక మార్చియున్నాఁడు. కొందఱి కథల నెత్తనేలేదు. ఈనాయనారుల దివ్యచరిత్రము లెల్లరు ఎఱుంగఁదగినవి. కాని యింతవఱ కీపెరియపురాణ మనువదింపఁ బడలేదు. కంబరామాయణాదు లాంధ్రమునకు వచ్చినవి. ప్రకృతమీపెరియపురాణ మిట్లు "శివభక్తచరిత ము"గ వెలువడుట తెలుఁగువారి సుకృతమే యని వాకొనఁ దగును.

ఈయుద్గ్రంథము నిట్లనువదించి యాంధ్రప్రపంచమున కర్పించుచున్న బ్రహ్మశ్రీ పొంగూరు సూర్యనారాయణశర్మ గారి కృషి యిహపరసార్థకము. వారిమోపిక యట్లుండనిచ్చి బహుళవ్యాపృతులయి వెలయునిట్టివారి కింతటియవకాశ మెట్లు లభించెనా యని యబ్బురమందుచున్నాఁడ. అసామాన్య దీక్ష, అచంచలసంకల్పమున్ననే తప్ప నిట్టికృతినిర్మితి మతికిఁ బట్టదని స్వానుభవమునఁ' దెల్పుచున్నాఁడ. శ్రీ శర్మగారు గీర్వాణాంధ్రవైదుషీభూషితులు. గద్యపద్యకావ్యసృష్టియం

దత్యంతానుభవము గడించినవారు. వీరికడ విద్యనభ్యసించిన వారు వేలున్నారు. వీరి పాండిత్యమునకు ఫలమే ఈశివభక్త చరితము. విశేషించి వీరు నాకు మిత్రులు. బాంధవులు.

ఇందలికథ లాబాలగోపాలము సులభముగ నర్థముచేసి కొనుభాషలో నడపుట కొనియాడఁదగినది. మొదటినుండి తుదివఱకు ఒకేశైలిలోఁ గృతిని గొనసాగించుట యన, నది, శక్తివాదరమీఁదిసాము'' వంటిది. కాని శర్మగారి కది ''నల్లేరుపై బండినడక ''వోలెఁ బరగినది. మచ్చునకేని యిందు ప్రౌఢదీర్ఘసమాసములు, మాఱుమూలపదములు, పాదపూరణ నిరర్థకశబ్దములు,లక్షణవిరుద్ధప్రయోగములు గానరావు. చదువఁ జదువఁ జవులూరించుచు, విసువు జనింపనీయని ద్రాక్షాపాక మునఁ బడిన యీ రచన మెల్లర కుపలబ్ధముగాని పోహణి నలవఱచుకొని యెల్లరియుల్లములు పల్లవింపఁజేసెడిని. ఇది శ్రీ శర్మగారి తొలిరచనమగునేమో, గాని వారి వాణీవరివస్య మాత్ర మనుభవపూర్వకమని యీయాంధ్రీకరణమే తార్కాణించుచున్నది.

ఇట్టి యుత్తమకృతులింకను వెలువఱించి, యాంధ్రి నలంకరించు పాటవమును ఆయురారోగ్యములను నుమాధవుఁ డొసఁగి యత్యంతకరుణమెయి రక్షించుఁగాక.

మదరాసు-7.<br>
12—4—'62 } (విద్వత్కవిభూషణ) వేదము-వేంకటకృష్ణశర్మ.

భాషాజీవి,

XXV

# తొలిపలుకు

"మద్భక్తాయత్రగాయంతి తత్రతిష్ఠామి నారద" భక్తు లెచట భగవంతుని గీర్తింతురో యచట భగవంతుఁడుండును. 'భక్తి, భజ—సేవాయాం.' భగవంతుని సేవించుటయే భక్తి. భక్తి పలువిధములుగఁ జెప్పఁబడినది. భక్తివలన జ్ఞానము. జ్ఞానమువలన ముక్తి గల్గును. సంసార విముఖతనంది వైరాగ్యాదులచే జ్ఞానియై ముక్తుఁడగును. మనస్సును నిగ్రహించి దైవోన్ముఖ మొనర్చుటకు భక్తిమార్గము సులభాతి సులభము, అరిషడ్వర్గములను జయించి సర్వసంగ పరిత్యాగియై పరతత్త్వము నెఱుఁగుట సామాన్య మానవులకు దుస్సాధ్యము. యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, మనన, సమాధ్యష్టాంగయోగములు క్రమసాధ్యములు. ఆదిశంకరుఁడు భక్తిజ్ఞానములకు ప్రాధాన్యమిచ్చినను, జ్ఞానమునే యుత్తమ మార్గముగఁ దెల్పెను. రామానుజాదులు భక్తికే ప్రాధాన్యము నొసఁగిరి. నారదుఁడు భక్తిమార్గములు నవవిధములనెను. పోతన "తనుహృద్భాషల సఖ్యముఙ్ శ్రవణముఙ్, దాసత్వముఙ్, వందనార్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయుఙ్, సంకీర్తనల్, చింతవంబు, అను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మునఙ్..." ఇట్టి భక్తికి భరతవర్షము నిధానము.

ఉపనిషదాదులలో నిరూపింపఁబడిన పరమాత్మ నామ రూప గుణక్రియా రహితుఁడు. సచ్చిదానందస్వరూపుఁడు.

యోగగమ్యుఁడు. అట్టి నిర్గుణ పరబ్రహ్మ నెఱుంగుట కష్ట తమము. అతి తీవ్ర తపస్సాధ్యము. బ్రహ్మాదులకే దురాసద మని చెప్పినను విప్రతిపత్తి లేదు. "ఆనందో బ్రహ్మేతివ్యజానాత్" ఇత్యాది వాక్యములలోఁ జెప్పఁబడిన పరతత్త్వము నెఱుఁగుట యస్మదాదుల కలవిగానిది. పరమయోగి దురాసద మగు నా తత్త్వమును మానవులు సులభముగఁ దెలిసికొనఁ జాలరని మహర్షులు తాము దర్శించిన సగుణబ్రహ్మను గూర్చి లోకోద్ధరణార్థము పురాణాదులలో విస్పష్టమొనరించిరి. "యేయథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం" అను గీతావాక్యార్థమును గ్రహించిన జన్మాంతర సంస్కార వాసనా వశంబున నెవరిబుద్ధి కే తెఱఁగునఁ దోఁచునో, యా తెఱంగున నా పరబ్రహ్మమును సగుణముగ నేని, నిర్గుణముగ నేని యుపాసించి పొందనెంచుచో, వారు మనన మొనర్చిన మాడ్కిఁ బ్రత్యక్షమయి యుద్ధరింతునని భగవద్వాక్యముగదా! జిజ్ఞాసువులు వారివారి కందిన మార్గము ననుసరించి భగవత్కృపా పాత్రులగుదురు.

మతత్రయ స్థితికి కారణమిదియే. వేదచోదితములగు జ్ఞానకర్మ కాండలు పరస్పర దోహదములే; "నకర్మణి త్యజతే యోగీ" అను వాక్యము కర్మత్యాగమును నిరాకరించుచున్నది. భక్తిమార్గము కర్మత్యాగము నంగీకరింపదు. భగవత్సేవాదులు భక్తునకు విహితకర్మలు. యజ్ఞాదులు భక్తునకు నిరాకృతములు గావు. ఇవన్నియు పరతత్త్వము నెఱుఁగుటకు

సోపానములు. కావుననే వేదములు కర్మజ్ఞానములను రెంటిని శాసించినవి. శ్రుతితత్త్వము దురవగాహమగుటచే తదర్థము వివరించుటకు పురాణ కావ్య నాటకాదులు వెల్వడినవి. అయ్యవి మానవుఁడు పునర్భవ రహితమగు శాశ్వత కైవల్యప్రాప్తి నందుటకుఁ దోడ్పడుచున్నవి. ద్వంద్వాతీతము నిత్యానంద రూపమగునునికిఁ జేరుటయే మోక్షమనియు, తదాప్తికై మానవుఁడు సకల యత్నముల నొనర్చి యమృతత్వము నొందుటను బోధించుటయే శ్రుత్యాదుల పర్యవసితార్థము.

భగవదస్తి నాస్తిత్వములు మానవుని మొదట కలఁత పఱచునవి. అవిశ్వాసమే నాస్తికతా హేతువు. ఆస్తికునకు విశ్వాసము ప్రధానము. విశ్వాస మెట్లేర్పడును? పుట్టిన శిశువునకు తన్నుఁగనిన తల్లిదండ్రుల నెఱుఁగు శక్తియుండదు. క్రమముగ నా శిశువు పెరుగుకొలఁది ఆ తల్లిదండ్రులను పరులు చూపి చెప్పుటచే నతఁడెఱుఁగునటుల, మాయా మోహితుఁడై యజ్ఞానాంధకారమున మునిఁగిన నరుఁడు పురాణాదులను విని పెద్దలవలన బోధితుఁడై, భక్తచరితాదుల నెఱిఁగి విశ్వసించి జగతఃపితరుల నెఱుఁగఁగలఁడు. అట్టి వినికిడి బోధలేనివాఁడు కూపస్థ మండూకమువలె నజ్ఞానియగును. అట్టివాఁడే నాస్తిక వాదమునకుఁ గడఁగును. నాస్తికుఁడు కంటకావృత మార్గమునఁ బడి దరిగానక నశించును.

మన పురాణములు భక్తచరితములు మొదలగునవి కల్పిత కథలు (Myths) అసత్యకథలు (Legends) అని పాశ్చా

త్త్యులు పాశ్చాత్య వ్యామోహితులు పల్కుట విచిత్రము గాదు. వీనిని కల్పితములని చెప్పుచు బైబిలు కథలను వాస్తవములని ప్రచారము చేయుచు నమ్మువారు నేడు మన యిరుగు పొరుగులందే యుండుట యెంత హాస్యాస్పదమో విజ్ఞులూహింతురుగాక. మన పురాణములను తఱచి యందలిలోఁతు పాఁతుల రయువారి కెన్నియో రత్నములవంటి తత్త్వములు సత్యములు గోచరించును. మొదటనే యవిశ్వాసమున నవి కల్పితకథలను భావము దృఢముగ మనంబున నాఁటినవారు రహస్యతత్త్వమందేమి గలదని వెదుకఁగలరు? సాగర నీలజలములఁ గాంచుచు గట్టున గూర్చుండినవానికి నందలి యమూల్యరత్నము లెట్లు లభింపఁగలవు? ఇట్లే భక్తుల చరితము లీనాఁటివారికి కల్పిత కథలుగ దోఁచుటలో వింత లేదు.

మన దేశమున వివిధ భక్త సంఘములు విలసిల్లుచున్నవి. వైష్ణవ భక్తాగ్రేసరులు ఆళ్వారులు, శైవభక్త శిఖామణులు నాయనారులు, పురందరదాసాదులు, పాండురంగ భక్తులు, చైతన్య మతభక్తులు ఇట్లెందఱో గలరు. అందరు నిత్యానందమునకై తపించినవారే. అందఱి చరితములు, సేవారీతులు, భగవత్ప్రీతికరములై సదారాధ్యములై భారతీయ జనోద్ధరణ హేతువులై యలరారుచున్నవి. అన్నింటికి ప్రాప్తిస్థాన మొకటియె.

భక్తచరితములు కల్పితములా! వాస్తవికములా! ఈ భక్తులుండిరా! వారికి భగవత్కరుణ గల్గెనా! వారు ముక్తిఁ

జెందిరా! ఈ కథలు ప్రకృత మానవోపయోగములా! ఈ యసత్య చరితములను చదివి, నమ్మి, కాలమును వ్యర్థపఱచుట కంటె కష్టపడి ధనమార్జించి సుఖజీవనము సాగించుటయే మేలనువారి సంఖ్య నేఁడు పెరుగుచున్నది. ఐహికచింత యధికమగుచున్నది. పారమార్థిక చింత సన్నగిలుచున్నది. జ్ఞానదృష్టి మందగించి విజ్ఞానదృష్టి యధికమగుచున్నది. దీనికి హేతువు కొంతవఱకు పాశ్చాత్య సాహచర్య వాసన యని చెప్పక తప్పదు.

ఈ శివభక్తచరితము కల్పితమా! విచారింతము. పరస్పర జిగీషచే మారణాయధోత్పత్తికి ధన వివేచ నేంద్రియాదులను వ్యయమొనర్చు నిక్కాలమున అణువిచ్ఛేదనమునకై సర్వము ధారవోయు విజ్ఞానులకు "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను ఆత్మతత్త్వముఁ దెలిసికొను జిజ్ఞాన శూన్యమైనది. అహంకార పూరితులకు పరతత్త్వమునకు సర్వత పరమాణుభేదము గలదు. పాశ్చాత్య వ్యామోహమున మునుఁగక భారతీయ జ్ఞానసంప్రదాయ స్రవంతీవీచికలందు మునిఁగి సత్యమును వెదకి గైకొని చరితార్థుఁడగుట నేఁటి భారతీయున కెంతేని యవసరము. వెదకిచూచిన పంచభూతములను నడపు మూలశక్తియే పరమాత్మయని గోచరింపక మానదు. జిజ్ఞాస భారతీయులకు వెన్నతోఁ బెట్టినవిద్య.

దక్షిణదేశమున నతి ప్రాచీనకాలమునుండి వైదిక శైవము వ్యాప్తమై యున్నది. వైదిక సంప్రదాయములను త్రోసి

రాజని బౌద్ధ జైనములు కొంతకాలము విజృంభించినవి. అవి వేదధర్మముల నంగీకరింపక వేదధర్మములలో నొకటియగు అహింసాధర్మమును గైకొని ప్రచార మొనర్ప సాగినవి. నిరీశ్వర వాదము విజృంభించెను. కపట తంత్రములు పెంపొందెను. జనసామాన్యమున కర్థమగు భాషలో వారు ప్రచార మొనర్చుటచే దురవగాహమగు వేదములను తద్ధర్మముల నెఱుంగజాలని జనులు వారి మతధర్మవాగురలోఁ జిక్కుకొనిరి. అట్టి వారి నుద్ధరించినవారే నాయనారులుగఁ బేర్కొనఁబడు శివ భక్తులు. వీరి ప్రతీకలు దక్షిణదేశ శివాలయములం దంతట పూజోత్సవాదుల నందుకొనుచున్నవి.

నాయనారుల చరితము సత్యమా? వీరిలో జ్ఞానసంబంధుఁడు, వాగీశుఁడు, సుందరమూర్తి, కారైక్కాలమ్మయారు మహాకవులు గాయకులు. వీరి గీతములు కొన్నివేల సంఖ్య గలవి. కాని నేఁడు ప్రచారములో నున్నవి, సంబంధునివి 384 పదిహములు, అప్పరునివి 312 పదిహములు, సుందర మూర్తివి 101 పదిహములు, కారైక్కాలమ్మయారు రచనలు తిరుఇరట్టై మణిమాల, పొన్వణ్ణత్తందాది, అవి యన్నియు శివ స్తోత్రములు. వానిని నేఁడు తేవారములనుచున్నారు. ఆ భక్తులే లేకున్న వారి కవితలెట్లు వచ్చినవి.? వారి కవితలో ననేకసంభవములు, స్థలవర్ణనలు, స్తుతులు గలవు. ఆ స్థలాదులు నేఁటికిని గలవు. ఇఁక అవిశ్వాసమునకుఁ దావేది? సంబంధునకు 16, అప్పరునకు 81, సుందరునకు 36 సంవత్సరములని

చెప్పఁబడుచున్నది. వారి యాయుఃపరిమితి ఇట్లు చెప్పఁబడినది "అప్పరుక్కు ఎన్బత్తొన్ఱు, సుందరరుక్కు మూన్ఱారు, అరుళ్ జ్ఞాన సంబంధరుక్కు అంత పదినాఱు ఎన్ఱి అఱి."—అని.

దక్షిణదేశమున వ్యాపించినది యాదిశైవము. ఈ శైవము వైష్ణవాది మతద్వేషపూరితమైనది గాదు. వైదికకర్మ ద్వేషమిందు లేదు. వర్ణవైమనస్యములకు తావులేదు. దీనినే శివాద్వైతమందురు. వీరశైవాదులు దీనికి పిదప నుద్భవించినవే. తమిళదేశమున వ్యాపించిన తేవార తిరువాచకములు వేదార్థ ప్రతిపాదకములే. ఈ నాయనారులలో కొలఁదిమంది భక్తి వీరమును ప్రధానముగఁ గైకొనినందున పిదప నా వీరమే వీరశైవమునకు దారి సూపియుండునని తోఁపక మానదు.

శివభక్తుల చరితము తమిళమున, కన్నడమున, సంస్కృతమున, తెలుఁగునఁ గలదు. తమిళమున పెరియపురాణము (తిరుత్తొండరు పురాణము) సంస్కృతమున అగస్త్య భక్తవిలాసము, ఉపమన్యు భక్తవిలాసమని రెండు గ్రంథములు గలవు. మొదటిది వారణాసియందు, రెండవది మద్రాసునందు ముద్రితములైనవి. ఉపమన్యు భక్తవిలాసము పెరియపురాణమునకు అత్యంత సన్నిహితముగ నున్నది. అది స్కాందోపపురాణముగఁ జెప్పఁబడినది. ఈ సంస్కృత తమిళ గ్రంథములలో నేది ప్రథమము? సంస్కృతానువాదము తమిళమా! తమిళానువాదము సంస్కృతమా! విమర్శించి చూచిన పెరియపురాణమే సంస్కృతమునకు మూలగ్రంథమని చెప్పవలసియున్నది.

సుందరమూర్తి చెప్పిన "తిరుత్తొండత్తొహై" అను పద్య మాలికయం దీ అఱువదిమ్మూవురు పేర్కొనఁబడిరి. నంబి యాండారునంబి "తిరుమూలచ్చిరప్పు" అను గ్రంథమున తిరుత్తొండర్ తిరువందాది అని 37 పద్యమునుండి 39 వఱకు నీ శివభక్తులఁ బేర్కొనియున్నాఁడు. సుందరుఁడు తేజో రూపమునఁ గైలాసముఁ జేరుచుండ ఉపమన్యువు గాంచి మ్రొక్కి, మునుల ప్రార్థనచే సుందరుని చరితముఁ దెల్పినటులఁ బెరియపురాణ కథ ప్రారంభమగుచున్నది. సంస్కృతమున నట్లే గలదు. పెరియపురాణ రచనానంతరమే యీ చరితము లన్యభాషలలోని కెక్కినట్లూహించవచ్చును. అగస్త్య భక్త విలాసమున అగస్త్యుఁడు సెప్పినటులుండుటచే మూలగ్రంథము అగు సుందరుని తిరుత్తొండత్తొహై యీ సంశయమును సమూల ముగ తొలఁగించును. పెరియపురాణము క్రీ. శ. 11-వ శతాబ్దిలో తమిళనాఁడును పాలించిన అనపాయచోళుని మంత్రియగు శేక్కిళారునిచే రచితమగుటచే, పాల్కుఱికి సోమన బసవనలకు ముందే యీ గ్రంథరచన సాగినదనవచ్చును. కన్నడమున చెన్న బసవపురాణము, అరుపత్తుమూవరు చరితములు పెరియ పురాణమున కనువాదము కొంత మార్పులుగల శివభక్తవిలా సము ననుసరించి యున్నవి. ఆంధ్రమున ద్విపదకావ్యములగు పండితారాధ్య చరితము, బసవపురాణములందు పాల్కుఱికి సోమన పెరియపురాణమును వినియో చూచియో చదివియో దాదాపు ఇరువది యెనిమిది కథలను గ్రహించి మఱికొన్నింటికి తెలుఁగుఁదనము గల్పించి వ్రాసియుండుట గమనింపఁదగినది.

28

క్రీ. శ. 8-వ శతాబ్దములో సుందరుఁడు చెప్పిన తిరుత్తొండత్తొహై, నంబాండారునంబి తిరుత్తొండరు తిరువందాదులను చూచి సోమన అరువదిమూవురు భక్తుల పేళ్లను పండితారాధ్య చరితమున చెప్పియున్నాఁడు. తిరుత్తొండత్తొహైలోని మొదటి పాదమును "తిల్లైవాళ్ అందనర్దం అడియార్గళ్కు-అడియేన్" అనుదానిని వదలి తిరునీలకంఠునినుండి గ్రహించి కొంవటి పేర్లను మార్చి కూర్చి సోమన చెప్పెను. చిదంబర దీక్షితులను గ్రహింపకుండుట కాతని వీరశైవము కారణమై యుండును. కాదేని వారు అఱువది మూవురిలో చేరిన నాయనారులుగారని భావించియుండును. కాని సోమన బసవ పురాణమున ద్వితీయాశ్వాసములో "భువి నఱువత్తాది ముప్పురిలోన శ్రీనిలయుఁడు దిరుచిట్టంబలుఁడు నానొక్క-భక్తుఁడు..." అని చెప్పియున్నాడు. పండితారాధ్యచరితలోఁ జెప్పఁబడిన అఱువది ముగ్గురిలో నీ తిరుచిట్టంబలుఁడు లేఁడు. ఎవఁడీ తిరుచిట్టంబలుఁడు?. సోమన కల్పిత భక్తుఁడు. సూక్ష్మముగ విచారించిన చిదంబర దీక్షితులకు బదులుగా తిరుచిట్టంబలుఁడు సోమన సృష్టిగాఁ గన్పించుచున్నాఁడు. కాఁగ అఱువది మూవురిలో తా గ్రహించిన కొలఁది గాథలలో నీతఁడు మొదటనే యేల గ్రహింపఁబడును? చిట్టంబలమన చిదంబరములోని కనకసభ. తిరు=శ్రీ. సోమన చిదంబరమును విడువఁజాలక, దీక్షితులను చెప్ప నిష్టములేక, యీ తిరుచిట్టంబలుని సృష్టించియున్నాఁడు.

క్రీ. శ. 1090—1108 వఱకు చోళమండలమును పాలించిన అనపాయచోళుని ఆస్థానమందు శేక్కిళారను సజ్జనాగ్రణి కవిసత్తముఁడు మంత్రిగ నుండెను. కొందఱు అనపాయ చోళుఁడే రెండవ కులోత్తుంగచోళుఁడని యతని కాలమును 1132 అని చెప్పుచున్నారు. ఈకాల నిర్ణయము దాదాపు ఇరువది సంవత్సరముల భేదముతో సరిపోవుచున్నది. సోమన బసవపురాణ రచనాకాలమును క్రీ. శ. 1190 అని శ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిరి. మఱికొంద ఱాతనికాలమును 1267, 1300 అని భావించిరి. వీనిలో నేకాలమును గ్రహించినను సోమన శేక్కిళారునకు పూర్వుఁడుగాఁడుగదా! శ్రీ శాస్త్రిగారు "సోమన ఈ కథలను పెరియపురాణమునుండి గ్రహించియుండఁ గూడును" అన శ్రీ చిలుకూరు నారాయణ రావుగారు "సోమనకు పెరియపురాణము తెలియదు" అని వ్రాసిరి. సోమనతిరుత్తొండత్తొహైను చక్కఁగ చూచియున్నాఁడనుటకు "ధరరాజ్య మొల్లక తిరుముడిదాల్చి...ననుచు నంబన్న భక్తావలిఁజేర" అను చరణములే సాక్ష్య మిచ్చుచున్నవి. సోమన సంస్కృతాంధ్ర కర్ణాటక ద్రావిడ భాషలందు పండితుఁడు; కవి. సోమన తమిళపరసు శ్రీశైలమున కేఁగుచు పాడినట్లు ద్విపదలో "అరులుగిరితి యెన్నె యరనే పిరానే..." అని వ్రాసియున్నాఁడు. కావున నితనికి తమిళమున నతిమాత్ర పాండిత్యము గలదనుట నిస్సంశయము. తనకు దాదాపు ఒక శతాబ్దమునకు పూర్వము రచింపఁబడిన

మణాం = వివాహము.



పెరియపురాణము నితఁడు తప్పక చూచియుండును. అంతియ గాక తేవారముల నితఁడెఱిఁగియే యున్నాఁడనియు చెప్ప నగును. కాని సోమన పెరియపురాణ కథలను మార్చియు కూర్చియు కొన్నింటిని విసర్జించియు తన బసవపురాణమును సాగించుట కితని సాహసము వీరశైవ దృఢదీక్షయు కారణ ములనఁ జెల్లును.

సుందరమూర్తి కల్యాణము జరుగుచుండ శివుఁడా వివాహము నాఁపి యతనిని తనకు దాసునిగ గ్రహించిన స్థలము ఇప్పటికి 'మణంవందపుత్తూ'రని ప్రసిద్ధి వహించియున్నది. మణం అనగా వివాహము. నేటికి నచట సుందరుని కల్యాణోత్సవము జరుగుచున్నది. అది లోకవిదితమైయుండ సోమన అతి సాహసముతో సుందరుని యుపనయనము నాఁపి శివుఁడు దాసునిగ గ్రహించెనని వ్రాసెను. ఇట్లు మార్చుటలో నితని భావమేమి? కల్యాణము నాఁపిన శివుని సుందరుఁడు "పిత్తా" (పిచ్చివాఁడా) యనెను; శివుని కరుణచే సుందరుని కవితా ప్రారంభమున కాపదమే యాదిపద మాయెను. "పిత్తాపిరై శూడి పెరుమానే..." ఈ తేవారము సోమనకు చక్కఁగ తెలియును. కాన, నతఁడు "వరవిప్రులు బంధువర్గంబు సూచిఁ యతి చోద్యమంది బ్రాహ్మణ వృద్ధ। ముదిసి మతి దప్పినాఁడో యున్మత్తుఁడో బ్రమసె" అని వ్రాయుచు పిత్తాయనుటకు సరిగ ఉన్మత్తుఁడనెను. ఈ వివాహ వృత్తాంతము నెఱిఁగియే సోమన మార్చి వీరశైవ ప్రోద్బల కారణమగునట్లు" కపిముఖ

ప్రియునిభు గర్భాష్టకమున నుపనయనము సేయనున్న యత్తె
టని. . .వడుగు సేయఁగ నెట్లు వచ్చు మాదాసి'' అని యుపనయ
నము నాఁపినట్లు మూలకథను తాఱుమాఱు చేసియున్నాడు.
బసవన ఉపనయన మాఁగుటకు నీడుజోడుగ నుండఁదలఁచి యిట్లు
వ్రాసియుండును. కర్మ నిరాసమే ముఖ్య సిద్ధాంతముగాఁగల
సోమన ఈ కథా సంవిధానమును మార్చుటలో వింత లేదు.

తిరునీలకంఠ నాయనారే (సోమనగారి కుమ్మరిగుండయ్య)
కప్పెర దాఁచనిచ్చి శివుఁడు తానే యపహరించి నాయనా
రపహరించినటుల నేరము మోపి చిదంబర దీక్షితులకు విన్న
వించుట పెరియపురాణగాధ. ఆ దీక్షిత వృత్తాంతముకప్పి
పుచ్చు సోమన కథను స్వేచ్ఛానుసారముగ నడపెను. రుద్ర
పశుపతి కథను మార్చుటలో సోమన సాధించిన ప్రయోజనము
మృగ్యమగుటయేగాక, పశుపతి నొకమూఢాత్ము నొనర్చెను.
పెరియపురాణమున బ్రాహ్మణుఁడైన పశుపతి రుద్రసూక్త
పారాయణముచే కైలాసమునంద నిట సోమన రుద్రపశుపతి
శివుని కాలకంఠముఁజూచి విషము మ్రింగిన శివుఁడు ఆపదల
పాలగు నేమో యని చింతించినట్లు మార్చి యాతని నొకమూఢ
భక్తునిగ ప్రదర్శించెను.

అమాత్య బ్రాహ్మణుఁడైన పరంజ్యోతి శివారాధన
పరుఁడై చిఱుతొండఁ డాయెను. ఇతఁడు వాతాపిని జయించి
రాజును మెప్పించి పిదప సైన్యాధ్యక్ష పదవిని వీడి భక్తుఁ
డాయెను. ఈ చిఱుతొండని వైశ్యుఁడని చెప్పి సోమన సాధిం

చిన దెద్దియో విజ్ఞులూహింతురుగాక. "గతానుగతికో లోకః" అనునటుల శ్రీనాథుఁ డీతని వైశ్యుఁడనెను. శ్రీనాథుఁడు సోమన గ్రంథమునుచూచి వ్రాసెను గాని నిజమెఱుఁగఁజాలఁ డయ్యె. సోమన చిఱుతొండని వైశ్యునిగ నొనర్చుటలో స్వలాభ మెంతేని యాశించినటుల దోఁచుచున్నది. తిరుకురుప్పు త్తొండనాయనారునకు మడివాలు మాచయ్యలకుగల సామ్య భేదంబులను గుర్తింపనగు.

జాతిభేదములను పాటించని సోమన నందనారు కథ నవశ్యము గ్రహించియుండవలెను. పేరునుమాత్రము తిరునాళ ప్పోవ అనిచెప్పి యూరకుండెను. పెరియపురాణమున చిదంబర ప్రవేశమునకు నాజాతి యడ్డమ్యెనే యని భావించి నందనా రూరి బయట నిద్రింప శివునాజ్ఞచే మఱునాఁడు బ్రాహ్మణు లాతని నగ్నిఁబ్రవేశింపఁజేయుట సోమనకు ప్రాణగొడ్డముగాక మతే మగును? అంతియగాక చాల కథలను విడుచుటలో నందలి వైదిక విప్రులగాథ లనిష్టములై ఇతని కావ్యమున కెక్కలే దనుట సాహసముగాదు.

చిఱుతొండని కథలో సోమనచేసిన మార్పులు విచా రార్హములు. సిరియాళు నొకనాయనారుగ చెప్పియున్నాఁడు. ఆతని తల్లిని సోమన అఱువదిమూవురిలో చేర్చియున్నాఁడు. సోమన మార్పులను కూర్పులను తత్కారణములను కూలంకషముగ నెఱుఁగఁ దలఁచువారికీ శివభక్తచరిత మెంతేని తోడ్పడఁగలదు.

అఱువది మూవురిలో కొందఱి భక్తి వీరభక్తి. చిఱుతొండఁడు పుత్త్రుని చంపి శివునకు వండిపెట్టుట, భక్తుల కపకార మొనర్చినవారిని నిర్దాక్షిణ్యముగఁ జంపుట, మొదలగు భక్తుల శౌర్యము వీరశైవమునకు దారితీసెనాయని తోఁపక మానదు. ఒకఁడు తండ్రి పాదములనే నఱికివేయును. ఒకఁడు భార్యను మిండజంగమున కిచ్చును. ఈ కథలందు సాత్త్విక రాజస తామస భక్తిమార్గములు గలవు. సోమన గ్రహించిన పెరియ పురాణ కథలను ప్రయోజనాంతరాకాంక్షియై మార్చినటులఁ దోఁచును.

తమిళమున కవులు పండితులై కవితను చెప్పిన భక్తులు, ఆ దేశమునందే జన్మించి యచటి క్షేత్రములను నుతించిరి. వారి చరితములను తమిళమున వర్ణించినటులఁ దెలిసికొని యా కథల నితరు లెట్లు గైకొనిరో గ్రహించుటకు పెరియ పురాణము నిట్లు తెనిఁగించితిని. తమిళ కావ్యరీతులు వర్ణనా విధానములు ఆచార వ్యవహారాదులు తెలిసికొనఁ గోరువారికి విమర్శకులకు నీ గ్రంథము కొంత సాయపడును. పెరియపురాణము తమిళులకు పూజ్య కావ్యము. 4286 పద్యములతోఁ గూడిన మహాప్రబంధము. ఇరుగు పొరుగువారి సంస్కృతి నెఱుఁగఁ దలఁచు సాహితీప్రియుల కిది చేదోడు కాఁగలదు. భక్తులు, దీని నా మూలాగ్రము చదివి శివపాదసేవా తత్పరులై ఆనందామృతము ననుభవింతురుగాక.

రచయిత.

"భవోభవతు భవ్యాయ"

సత్యం శివం సుందరం.

XXVIII B



A. భీంసింగుగారు,

సినీ డైరెక్టరు.

ప్రియ శిష్యుఁడు. ఆంధ్ర భాషాభిజ్ఞాని.

శివభక్త చరితమునకు దోహకుఁడు.

ఈ గ్రంథ ముద్రణ వ్యయములోఁ గొంత భరించిన సదయహృదయులగు వీరికి సర్వేశ్వరుఁడు కరుణమెయి ఆయురారోగ్యైశ్వర్యంబుల నొసంగి ప్రోచుఁగాక.

శ్రీ ఉప్పుటూరు వింబెరుమానారు శ్రేష్ఠి సోదరులు,
హౌ అండు కంపెని, మద్రాసు.
,, ఏ. భీమసింగుగారు, సినీ డైరెక్టరు, మద్రాసు.
,, సూరా నాగమయ్య శ్రేష్ఠిగారు, ,,
,, సూరా బాలసుబ్రహ్మణ్య శ్రేష్ఠిగారు, ,,
,, సూరా చంద్రశేఖర శ్రేష్ఠిగారు, ,,
,, డి. గోపాలస్వామి సెట్టిగారు, ,,
,, కపలవాయి పూర్ణచంద్రరావుగారు, ,,
,, పాక్కి రెడ్డి సేతువరామి రెడ్డిగారు, అల్లీపురం,
నెల్లూరు జిల్లా.
,, కే. వి. భక్తవత్సలం, మద్రాసు.
,, డబ్ల్యు. ఎస్. పార్థసారథి నాయఁడుగారు, ,,
,, టి. ఆదినారాయణగారు, B.Sc., ,,
,, బి. వెంకటేశ్వర రావుగారు, వెన్న, నెయ్యి వ్యాపారులు
మద్రాసు.
,, నాళ్ల సాంబయ్యగారు, ,,
శ్రీమతి నాళ్ల సాంబయ్య భార్య మాణిక్యమ్మగారు ,,

---

ఓం

త్ర్యంబకం యజామహే సుగంధిం
పుష్టివర్ధనం । ఉర్వారుక మివ బంధనా
న్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ।
యోరుద్రో అగ్నౌ యో అప్సు
యఓషధీషు యోరుద్రో విశ్వా
భువనావివేశ తస్మై రుద్రాయ
నమో అస్తు ॥

॥ తన్మేమనః శివసంకల్పమస్తు ॥

ఓం

# అనుక్రమణిక

(కథల సూచిక)





D

# శ్రీ శివభక్త చరితము

## 1. సుందరమూర్తి

కైలాస మహిమ :—

శ్రీమంతంబై నగాధిరాజంబగు హిమవంతంబున రాజ హంస విహారరమ్యంబై, మునిమానససేవ్యంబైన మానససరో వరంబు గలదు. దానికి నుత్తరంబున ననతిదూరంబున కైలాసంబు గలదు. హిమవంతు నమ్ముంగుఁబెండ్లికొడుకగు శివునకది వాసస్థానము. పవిత్రతకు సౌందర్యాతిశయమున కది సాటిలేనిది. వెండికొండయని ప్రసిద్ధిఁగాంచిన యన్న గము ప్రభాతకాల బాలభాస్కరుని బంగారు కిరణజాలస్పర్శచే స్వర్ణచ్ఛాయలనీను శిఖరములతో నొప్పుచు, భస్మోద్ధూళిత దేహుఁడైన భవునిరూపమోయనఁ బ్రకాశించుచుండును. అద్దాని మహిమ శివభక్తులకే యగోచరమన నతిశయోక్తి గాదు. ముల్లోకంబులు నాల్గువేదములొనర్చిన తపఃఫలమా యన, చంద్రశేఖరుని నిలయంబగు నీ పర్వతరాజము శివ స్వరూపమై యొప్పుచుండును. సకల శివక్షేత్రలతలకిది పూచిన పువ్వువలె శోభాస్పదమై, భక్తజనహృదయానంద సంధాయ కమై విలసిల్లుచుండును.

కైలాసమున ప్రణవసహితమైన నాల్గువేదముల పవిత్ర ధ్వనులు, దేవగంధర్వ వీణానినదములు, యుగాంత కాల మేఘ గంభీర ఫెళఫెళార్భటులు, సమదగజ ఘీంకారములు, దేవ దుందుభి ధ్వానము లేకమై దిక్కులం బిక్కటిలంజేయుచుండును. నాగలోకవాసులైన దేవతలు నందనవన పారిజాత ప్రసూన మాలికలం జేబట్టి కైలాసముకడ శివపూజావసరముం బ్రతీక్షించుచుందురు. ఒకవైపు పంచభూతాధినాధులు శివసేవా విధిని నిర్వర్తింప వేచియుందురు. సకల మానివర్గమా కొండ దరి మస్తకన్యస్తహస్తులై శివపంచాక్షరిని జపించుచుందురు. మఱొకవైపు దేవగణంబులకుం బదవులనొసంగి, కాపాడు ప్రమథులాడుచుం బాడుచుందురు. శివుని సేవింప నేతెంచిన బ్రహ్మ తన వాహనంబగు హంసను విడిచి, దేవదేవుని సేవావసరము లభింపమిం దిరిగిపోవుచు, నెద్ది హంసయో యెద్ది కైలాసమో గ్రహింపంజాలకుండుటం గాంచి, ప్రమథకాంతలు దరహసితవదన లగుచుందురు.

కైలాసగోపుర ద్వారముచెంత బ్రహ్మ విష్ణువులు, మహేంద్రాదిదిగీశులు, దేవర్షులు, శివసారూప్యమునందిన పరమ మాహేశ్వరులు, త్రియంబకుని దర్శనమునకై యువ్విళ్ళూరుచు పడిగాపులై యుందురు.

ఉపమన్యువు :—

కైలాసప్రాంత భూమియందొకనాఁడు మహర్షులు శివ యోగులు సభఁగావించిరి. వారి మధ్యలో నుపమన్యు

మహర్షి చుక్కలలోఁ జంద్రునివలెఁ బ్రకాశించుచుండె. అతఁడొక్కింతకాలము శివధ్యానములో మునింగియుండెను. బాల్యమందాతఁడు శంకరుని కృపచే క్షీరసాగరమందలి దుగ్ధములఁ గ్రోలి, యాఁకలిఁ దీర్చికొనిన శివభక్తాగ్రేసరుఁడు. బృందావనమున లోకరక్షణార్థమై యవతరించిన శ్రీకృష్ణుని మౌళిపై పాదమిడి, శివదీక్షనొసంగిన గురువీ మహర్షియే. మహా తపశ్శాలియగు నిమ్ముని తన జీవితమునంతయు శివ కైంకర్యమునకై వినియోగించి ధన్యుఁడయ్యెను. ఇతఁడు వ్యాఘ్రపాదునకుఁ బుత్రుఁడు. మహర్షులట్లు సభఁ జేయుచుండ, కోటిసూర్యసమప్రభతో నొక దివ్య తేజము కైలాసముఁ జేరుచుండెను. వారద్దానింగాంచి, ‘‘ఇది యేమని’’ ప్రశ్నించిరి. ఉపమన్యువు కొంతవడి ధ్యానములో మునింగి, దివ్యదృష్టి నెఱింగి, వారితో ‘‘కైలాసమునుండి దక్షిణదిశ కేగి, తిరునావలూరిలో నవతరించిన సుందరమూర్తి, శివుని కృపచే మఱల శివసాయుజ్యము నందుచున్నాఁడు. అతనిదే యీ దివ్య తేజస్సు.’’ అని పలికి కేల్దోయి శిరమునఁ గీలించి, యా తేజమునకు నమస్కరించెను. మునులాతని చర్యకు నాశ్చర్యపడి, ‘‘స్వామీ! మీరు పరమశివునకుఁదప్ప మఱెవరికిని వందనమాచరింపనివారుగదా! ఈ జ్యోతిస్సునకేల మ్రొక్కితిరి?’’ అని యడిగిరి. అంత ఉపమన్యువు ‘‘భగవంతునకు భక్తునకు భేదములేదు. ఈ సుందరమూర్తి శివుని దేహాలింగనముఁ బొందిన ధన్యుఁడు. కావున నా నమస్కృతికి నర్హుఁడు.’’

అని పల్కుటయే తడవుగ నారందఱా తేజమునకు వందనం బాచరించి, ‘‘యా సుందరుని చరితముఁ జెప్పుఁడ’’ని ప్రార్థించిరి.

హాలాహలసుందరుని యుత్పత్తి :—

మహాదేవుఁడొకనాఁడు చక్కఁగ నలంకరించుకొని, దర్పణమునఁ దన రూపమునుగాంచి, విస్మయావిష్టచేతస్కుఁ డాయెను. స్వరూపసందర్శనముచే ముగ్ధుఁడైన శంకరుఁడా ప్రతిబింబమును ‘‘సజీవముగ వెలికి రమ్మ’’ని యాహ్వానించెను. అట్లు వెలికివచ్చిన రూపమే సుందరమూర్తియని ప్రసిద్ధిఁబడ సెను. అతఁడు శివపరిచారకులలో నొకఁడై అహరహము నందన వనమున కేగి పూవులంగోసి, మాలలుగట్టి, శివునకర్పించుచు, విభూతిని సేకరించుచు, శివునారాధించుచుండెను. ఒకనాఁడు బాలభాస్కరుని యరుణకిరణజాలంబులు నందనవనవృక్షములఁ దాఁకి, యందలి కుసుమములను వికసింపఁజేయు నవసరమున సుందరమూర్తి పూవులఁగోయ నచటికేఁగెను. అతని రాకకు మున్నే గిరిజకుఁజెలులు, పుష్పలావికలునగు అనిందిత, కమల, యను లతాంగులు వచ్చి పుష్పాపచయ మొనర్చుచుండిరి. సుందరమూర్తి వారి సౌందర్యమునకు ముగ్ధుఁడై పుష్పబాణుని సాయకనికాయంబులకు గుఱియయ్యెను. వారును దివ్య సుందరదేహుఁడగు సుందరునిఁగాంచి, మదనవశలై కొంతవడి మనంబాతనికి నర్పించి చేష్టలు దక్కియుండిరి. కామమెంత

4A



సుందరుఁడు - కమలిని - అనిందిత

వారినేని బంధించుఁగదా! వారి దృష్టులేకమయ్యెను. ఆ చూపులలో నెవ్వియో రహస్యార్థములిమిడియుండును. వానిని మనము పఠింపఁజాలము. అనంగుని శరములకు గుఱియైన వారట్లు కొంతవడి నిలిచి, పూవులఁగోసికొని స్వస్థలంబుల కేఁగిరి.

శివాజ్ఞ:—

సకల భూతాంతర్యామియు సర్వజ్ఞుఁడైన సర్వేశ్వరునకుఁ దెలియరాని దేమియుండును! హాలాహలసుందరుని కామప్రవృ_త్తిని శివుఁడెఱింగెను. వెంటనే యాతనిఁగాంచి, "నీవు వనితలయందాస_క్తి కలిగినది. కాన నీవు దక్షిణాపథమునఁ బుట్టి, నీవలె నచటజన్మించిన, ఆ వనితలతో గార్హస్థ్యభోగముల ననుభవించిరమ్ము" అని శాసించెను. ఎంతవారికేని విధి దాటరానిది. సుందరమూ_ర్తి శివునాజ్ఞనువిని, హృదయము గుభిల్లుమన దుఃఖించి, సాష్టాంగమొనర్చి "దేవా! మీ సేవను వీడి మనుష్యజన్మమె_త్తినను, మీ పాదభ_క్తి వీడకుండునట్టి జ్ఞానమొసంగి, మరల మీలోఁజేర్చుకొన నంగీకరింపుఁడు" అని ప్రార్థింప శివుఁడాతని ప్రార్థన నంగీకరించెను. అట్లే సుందరమూ_ర్తి దక్షిణభారతభూమిలో నుద్భవించి, యా వనితలతో నిష్టభోగముల ననుభవించి, భ_క్తశిరోమణియై శివానుగ్రహమునఁ దేజోరూపమున శంకరునిఁ జేరవచ్చుచున్నాఁడు. ఆ జ్యోతిఃప్రకాశమే యిది" అని యుపమన్యువా మహర్షులకుఁ దెలియఁజెప్పెను.

దక్షిణాపథ మహిమ:—

"దక్షిణప్రాంత మేల మహిమఁగాంచినదని" మును లుపమన్యువు నడిగిరి. అమ్మహర్షి "చిదంబరమను దివ్యక్షేత్ర మచటఁగలదు. మా తండ్రి వ్యాఘ్రపాదుఁడు చిదంబరేశ్వ రుని సేవించి శివసాయుజ్యమునందెను. తపోరూపధారిణి యుమాదేవి దర్శింపఁదగిన యానందతాండవనృత్యమును శివుఁ డచటనే ప్రదర్శించెను. నృత్తాంతమున శివుని డమరుకము నుండి పదునాల్గు స్వరములుద్భవించి వ్యాకరణశాస్త్రమునకు మూలసూత్రములగుట యా క్షేత్రమునందే సంభవించెను. భూదేవికి హృదయకమలమనఁదగు "తిరువారూరు"నందు ప్రణవస్వరూపుఁడగు త్యాగేశుఁడు వెలయుచున్నాఁడు. జగన్మాత, సప్తలోకస్రష్టయగు కామాక్షీదేవి పాలారునదీతీర మందలి కాంచీపురమున కాంచీదామభూషితయై, శ్రీచక్ర మధ్యవాసినియై లోకాలోకంబులను దయాలవాలయై కాపాడు చున్నది. ఘోరతపముచే నందీశ్వరుఁడు శివానుగ్రహముఁ బొందిన 'తిరువయ్యారు' అను దివ్యక్షేత్రమచటనే గలదు. భక్తాభీష్టప్రదాతయై శివుఁడుద్భవించిన శీర్గాళి దక్షిణదేశము నందే గలదు. పాండ్యు ననుగ్రహించిన మీనాక్షీ సోమసుందరులకు నిలయమగు మధురానగరమందే గలదు. ఇట్లనేక పవిత్రక్షేత్రములచే దక్షిణదేశము ప్రసిద్ధినంది యున్నది." అని పల్కెను.

చోళదేశము—కావేరీనది :—

హిమవన్నగమువఱకు దండయాత్రలు సలిపి రాజ్యములను కైవసముఁగావించుకొని, యన్నగాగ్రశృంగములపై విజయచిహ్నముగ తమ వ్యాఘ్రధ్వజమును ప్రతిష్ఠించిన చోళులు పాలించినదే చోళదేశము. వారి మాతృభాష తమిళము. అట్టి దేశమందు కావేరీనదీమతల్లి స్వచ్ఛశీతలజలపూరితమై ప్రవహించుచున్నది. అగస్త్యుఁడు దేవాదులచే ప్రార్థింపఁబడి దక్షిణదేశమున కేతెంచుచు మందాకినీజలపూరిత కమండలువుఁగొని, వచ్చెను. అతఁడు "శయ్యమల" యను కొండలోఁ బయనించుచుండ, హస్తమునుండి జాఱి కమండలువు దొరలి నేలఁబడెను. అందలి జలమే కావేరినదియై ప్రవహించె. అన్నది, భూదేవి వక్షమునఁదాల్చిన ముక్తాహారమాయన నొప్పుచు, సకల జీవలోకమునకు జీవనములొసఁగి సంతసముఁ జేకూర్చుచున్నది. ఈ నదికి నిరుగెలంకుల లెక్కకుమించిన శివక్షేత్రములు విలసిల్లుచున్నవి.

దేశమహిమ :—

కావేరీనదీ పరీవాహప్రదేశములు సారవంతములగుటఁ జేసి వరి యున్నెత్తునఁబెరిగి బంగరుకాంతుల నీను వెన్నులతో చూపఱచూడ్కికి హాయిఁగొల్పుచుండును. పొడవుసాగిన వెన్నులు వంగి, భక్తులు సేతులుమోడ్చి వినమ్రులై యొకరినొకరు మ్రొక్కుచున్నారాయనఁ దోపింపఁజేయు. కళ్లములందు ధాన్యమును నుఱుచు కాఱెనుబోతులు మేఘములాయన

నుండును. కుప్పలువేసిన గడ్డిగాదములు కొండలఁ దోఁపింపఁ జేయును. ఎచటఁగాంచిన నుద్యానవనములు, చెఱకుఁ దోఁటలు, అరఁటితోఁటలు పూగీఫలవృక్షములు కన్నులకు విందులై యుండును. సస్యశ్యామలమైన యచటి ప్రదేశములు మరకతమణినిబద్ధభూములా యన నుండును.

ఆ దేశము తపోధనులకాకరము. అచటి వేదాధ్యయనపరులగు విప్రుల వేదఘోషలు దిక్కులఁ బిక్కటిలఁ జేయుచుండును. వృక్షములు యాగహోమధూమములచే నావృతంబులయి, యాజ్యగంధములను వెదచల్లుచుండును. ప్రతిపదమునందు, మఠములు, దేవాలయములు గన్పించుచు నా దేశీయుల యాస్తికతను చాటుచుండును. అచటి జనులందఱు సంగీతప్రియులు. ప్రతి గృహంబునుండి రాగతాళలయ యుక్తంబులగు గానములే వినిపించు. వేణువీణానాదములు శ్రుతిపేయములై మనోహరముగ శ్రవణగోచరంబులగుచుండు. వారి యానందమునకు మేరయేయుండదు. వీథులందుత్సవనినదంబులు, గృహములందతిథి సత్కారవాక్యములు, ముంగిళ్లలో క్రీడాసక్తులగు బాలుర కేరింతల నెంతని వర్ణింపఁగలము! రాజులు వర్ణాశ్రమధర్మములను చక్కఁగఁ బోషించుటఁ జేసి జనులు సత్యధర్మములను వీడక భగవద్భక్తిపరులై యుండిరి. ఆనాఁట ధర్మము నాల్గుపాదముల నడచుచుండు. అకారణమున చపలయని ప్రసిద్ధివడసిన లక్ష్మి యచట నచంచలయై స్థిరనివాసమేర్పఱచుకొనియెను. రామరాజ్యమున "రామో

రామ ఇతి ప్రజానామధవన్కథాః" అన్నటుల చోళదేశ మందలి ప్రజలెల్లప్రొద్దు పంచాక్షరిని జపియించుచుండిరి. కావున జనులాధివ్యాధిబాధితులుఁ గాకుండిరి. ఇట్లనపాయ చోళుని కాలమంధు దేశము సుభిక్షమైయుండెను. లోక క్షేమమున కేకొఱంతయు లేకుండెను.

తిరువారూరు మహిమ :—

చోళదేశమందలి మహానగరములలో 'తిరువారూరు' అతి ప్రాచీనమైనది. అయ్యది రమాలలామచేఁ బూజితుఁడైన శ్రీ త్యాగేశున కాటపట్టు. అన్నగరిలో సుధాధవళితములై మేరుమందరతుల్యములైన హర్మ్యములనేకములు గలవు. పార్వతీదేవి చెలికత్తె కమల శివాజ్ఞను తలఁదాల్చి, యచట "పరవియారు" అను పేరుతో రుద్రగణికల వంశమున జన్మించెను. ఆమె జన్మించిన వీధియందే పరమశివుఁడు సుందరమూర్తికొఱకు నడచి దౌత్యము నడపుటఁ జేసి యయ్యది పరమపవిత్రమయ్యెను. మహామునులు యోగులు వేదవిదులు నివసించుటవలన యీ నగరము కమలకు నివాసంబగు కమలము వలె నొప్పుచుండును.

మనునీతిచోళుఁడు :—

పూర్వమినవంశజుఁడైన అనపాయచోళుని పూర్వీకుఁడగు మనునీతిచోళుఁడా తిరువారూరును ప్రధాననగరముఁ జేసికొని చోళదేశమును పాలించెను. అతఁడు మనుధర్మము ననుస

రించి, కన్నబిడ్డలవలె ప్రజలను పాలించి రాజనామమును సార్థకపఱచెను. జనులను ధర్మమార్గమున నడపించుచు, ననేక యాగములనొనర్చి, దేవతలకుఁ దృప్తిఁగలిగించెను. ప్రజలు పరస్పర విరోధములను మఱచి, సోదరభావమున మెలంగిరి. శత్రుభయంకరుఁడగు మనునీతిచోళునకు రాజులందఱుఁ బాదాక్రాంతులై కప్పములఁ గట్టుచుండిరి. సామంతులు పాళెగాండ్రు ఎల్లపుడాతనిని సేవించుచుండిరి. కోశాగారములు ధనధాన్యములతో, కనకరత్నరజతరాసులతో, నిండి కుబేరుని సంపదను గేలిసేయుచుండెను. అతనికి సంపదతోఁబాటు భక్తిసంపదయు పారములేనిదగుట నా నగరమందున్న వల్మీకనాథునకు శైవాగమవిధుల ననుసరించి నిత్యోత్సవార్చనావిధులు సక్రమముగ జరుగుటకపార ధనంబులొసంగెను. జన్మాంతరకృత పుణ్యవశంబున నా రాజన్యునకు నొక తేజశ్శాలియైన పుత్రుఁడు గల్గెను. తండ్రి యా బాలకునకు జాతకర్మాదులను నిర్వర్తించి. "వీథీవిటంకుఁడు" అను నామమిడి గోముగఁ బెంచెను. బాలుఁడు శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానుఁడై పంచశరద్వయస్కుఁడయ్యెను. విద్యాభ్యాసప్రాయమగుట తండ్రి యాజ్ఞఁగొని, యాతఁడు గురువులకడకేఁగి, చదువసాగెను. మేధానిధియగు నాతఁడత్యల్పకాలంబుననే సకలశాస్త్ర పారంగతుఁడయ్యెను. శివభక్తి యాతనికి వెన్నతోఁబెట్టిన విద్యయయ్యెను. యుక్త వయస్సునందాతఁడు రాజోచితమైన అస్త్రశస్త్రాదివిద్యలందు

నిపుణుఁడయ్యెను. గజాశ్వారోహణములందు రథచోదనమందును, లక్ష్యభేదనము, వ్యూహాదులు పన్నుటయందును, ఖడ్గసంచాలనమందును సాటిలేని మేటియయి, బాలార్కునివలె దుర్నిరీక్ష్య తేజోవిరాజమానుఁడయ్యె.

విషాద సంఘటనము :—

ఆ రాకుమారుఁ డొకనాఁడలంకృతుఁడై, సమవయస్కులగు మిత్రులఁగూడి, వీరభటులు బలిసిరా, శ్వేతాశ్వంబులఁ బూన్చిన యరదమెక్కి, వందిమాగధుల జయజయనినాదములు మిన్నంటుచుండ, భేరీమృదంగ శంఖధ్వనులు దిక్కులు నిండుచుండ, వాహ్యాళికై వెడలెను. అపుడు ధర్మదేవత మనునీతిచోళుని పరీక్షించుట కేతెంచెనా యన, నొక గోవత్సము త్రుళ్లి పరుగిడుచు, దారికడ్డముగవచ్చి, రథచక్రమునఁ జిక్కుకొని మరణించెను. కొడుకు చావును కన్నారఁ గాంచిన గోవు కంటికి కడివెడుగ నేడ్చెను. దుఃఖభారముచే మనస్సు చలింపవడఁకుచు మూర్ఛిలి లేచి, యంబాయని యఱచుచు, నేలకొఱిగెను. వత్సముఁ గోల్పోయినదాని దుఃఖమునుగాంచి, రాకొమరుఁడు చింతాక్రాంతుఁడయ్యెను. అతఁడు తొట్రుపడుచు నోటమాటలురాక నిశ్చేష్టితుఁడై మూర్ఛిల్లెను. కొంతవడికి తెలివినొంది, యా మడిసిన లేఁగనుగాంచి నిట్టూర్చెను. మనునీతి ననుసరించి పాలించు తండ్రికి నపకీర్తిఁ దెచ్చుటకేగదా నేఁబుట్టుటయని యంగలార్చెను. తండ్రికా దుర్వార్త తెలియుటకుముందే యతఁడు న్యాయశీలురగు

వైదికులను బిలిపించి, తన యశ్రద్ధచే గోవత్సము మరణించుటఁ దెల్పి, తనకుఁ దగినశిక్ష విధింపుఁడని ప్రార్థించెను. తండ్రిని మించిన పుత్రుఁడౌఁగదా!

గోవు గంటను మ్రోగించుట:—

గోవు సుతశోకసాగరము నీదలేక కన్నీరు మున్నీరుగ నేడ్చుచుండెను. కొంతవడికి దాని దుఃఖము కోపముగ పరిణమించెను. దాని ముఖము జేవురించెను. కన్నుల నుండి విస్ఫులింగము లెగిసెను. వెంటనే యది యెద్దియో తలంచి రాజాంతఃపురమునకుఁ జేరెమువారెను. మనునీతి చోళుఁడార్తుల బాధలను విని, తీర్చుటకై ద్వారముకడ గంట నొకదానిని కట్టియుంచెను. గోవాగంటకడ కేగి, శృంగములతో దాని నాడించి మ్రోగఁజేసెను. ఆ మ్రోత వినిన జనుల మనంబులు కలతవడెను. రాకొమరుని ప్రాణములఁ దీయవచ్చిన కాలుని మహిషము కంఠమందలి ఘంటానాదమోయన రాజునకా నినదము వినిపించెను.

మనునీతిచోళుండా ధ్వనిని విని, యాసనమునుదిగి, యెవరికేమి యాపదఁగల్గెనోయని, సత్వరముఁగ ద్వారముకడ కరుదెంచెను. ద్వారపాలురు రాజునకు మ్రొక్కి, "మహాప్రభూ! గోవొకటి యేతెంచి, గంటను మ్రోగించినది" యని వినయావనతముఖులై విన్నవించిరి. రూపెత్తిన దుఃఖమాయన నచట నిలిచియుండు ధేనువుఁగాంచిన రాజునకును దుఃఖము పొంగిపొరలెను. అంతలో నచటఁగూడిన యమాత్యులవైపు

ఆ ప్రభువు స్వాభిప్రాయముగఁ జూచెను. వృద్ధామాత్యుఁ డొకఁడు ముందునకువచ్చి, వందనమొనర్చి, "పురుషోత్తమా! యువరాజు పురవీధినేగుచుండ గోవత్సంబొండు రథచక్రమునఁ దగుల్కొని మృతిఁజెందెను. పుత్రమరణ దుఃఖితయగు నా ధేనువిట్లొనర్చినది." అని వడంకుచుఁబల్కెను. పిడుగువంటి యా వార్తనువిని, రాజు కరుణార్ద్రచిత్తుఁడై యా ధేనువువలె నాక్రందించెను. కన్నకడుపెట్లోర్వఁగలదని విచారించెను. ఈ యపవాదము నెట్లోర్వఁగలనని కలవరపడెను. నా పాలన మందిట్టి విషాదసంఘటనము విననగునని కలనైనఁ దలపనైతిఁ గదా! ఎట్లీగోవు నోదార్పనగునని పరిపరివిధముల వాపోయెను. అతని విచారము ఱాతిగుండెలను సైతము కరగఁదీయసాగెను.

ధర్మవిచారము :—

అయ్యమాత్యులెట్లో ధైర్యమువహించి, "ప్రభూ! ఇట్టి విచారమునై గోవునకు నుపకృతి గల్గదు. కృతంబునకు పరిహారము లేదు. వేదవిదులఁబిలిపించి శ్రుత్యుక్తవిధానంబున ప్రాయశ్చిత్తంబు నొనర్చుట పాడి" యని పల్కిరి. రాజట మీఁద "మీ నుడివిన ప్రాయశ్చిత్తంబునఁ జేసి సుతశోకముచేఁ దపించు, నీ గోవు పరితాపముఁదీరునా! ఏల ఈ మాటలు? ఈ హత్యావిధితో నా కుమారునకు మరణశిక్ష ప్రాప్తించునను చింతతో నున్నాఁడనని యిట్లు పల్కుచున్నారా! కాక ప్రాయశ్చిత్తవిధులు నాకు బోధించి, పెడత్రోవఁబట్టించుట వలని లాభమేమి? మీ మాటలను నేను మన్నించిన ధర్మము

నకు వినాశము గల్పించినవాఁడనగుదును. సకలప్రాణిరక్షణమే రాజధర్మమని మీ రెఱుంగరే! తనచే, సేవకులచే, శత్రు, చోర, క్రూరమృగాదులచే ప్రజలకుఁగల్గు పంచవిధభయంబులఁ బోనడచి, ధర్మము సెడకుండఁ గాపాడువాఁడే రాజనామముఁ దాల్ప నర్హుఁడు. ధర్మపరిపాలనమందు స్వపరభేదవిచారణ యుండరాదు. నా పుత్రుఁడైనను, గోవత్సమైనను, లాఁతులైన నొకటియ. ఒకండొకనిఁ జంపిన మరణదండనమెట్లో యట్లే నా పుత్రుఁడొనర్చిన పాతకమునకు నా శిక్షయే విధింపనగును. ధర్మము తనకొకటి పరులకొకటి యెట్లగును? స్వార్థమునకై మనుధర్మమునకు భంగము వాటిల్లఁ జేసి యపకీర్తిపాలు గాఁజాలను. మీరు నా మేలునుగోరి యొక నీతిని పల్కితిరి. అది నీతిగాదు. స్మృతులమార్గము మీఱరాదు.'' అని పల్కెను. అంత నమాత్యులు చలించి ''రాజా! మేము పల్కినది లోకమర్యాద. మున్నిట్లే జరిగియున్నది. దీనికై కుమారుని జంపుకొంట పాడిగాదు. ప్రాయశ్చిత్తాదులచేఁ బాపపరిహార మొనర్చుటయు ప్రాచీనాచారమైయున్నది. పశువునకై పుత్రుని బలియిచ్చుటకెవరు సాహసింతురు? ''అపుత్రస్య గతిర్నాస్తి'' యనుదానిఁ దలంపవలదా!'' యని విన్నవించిరి.

మంత్రుల పల్కులు చెవిఁబడగనే రాజు మోము నిప్పులోఁబడిన చెందామర పూవాయెను. అంత రాజు ''ధర్మరహస్యము నెఱుంగుట యసాధ్యము. లోకమందెచట

నైన పశువు స్వీయదుఃఖముఁదెల్ప గంటను మ్రోగించుటను వింటిరా? బ్రహ్మేంద్రాదులచే సదా పూజితుఁడగు సర్వేశ్వరుని నిలయమగు నీ తిరువారూరున జన్మించిన ప్రాణిని నా కుమారుఁడు చంపెను. హంతకునకు మరణమే శిక్ష. పుత్రశోకమున మునింగిన గోవువలె నేను సుతశోకము ననుభవింప వలయు. అదియ నీతి. అదియే ధర్మము." అని పల్క మంత్రులు మాఱువల్కనోడిరి.

పుత్రుని చంపుట :—

మనునీతిచోళుఁడు సేవకులఁబంపి, కుమారునిఁ బిలిపించెను. తలవని తలంపుగ జరిగినదానికి పశ్చాత్తప్తుఁడై యుండిన పుత్రుని దోషియను తలంపునఁగాంచి, యొక మంత్రిని బిలిచి, "వీనింగొంపోయి గోవత్సము మరణించిన వీధియందే పరుండఁబెట్టి, వీనిపై రథమును నడపి చంపుము" అని యాజ్ఞాపించెను. కఠోరమైన రాజాజ్ఞను మీఱజాలకయు, నెఱవేర్ప సాహసమును లేనట్టియు నా మంత్రి "యిదోవత్తు"నని పల్కి రాజసమ్ముఖమును దప్పించుకొనిపోయి, యాత్మహత్య గావించుకొనియెను. మంత్రి యెంతవడికి రాకుండుటఁగాంచి, కుమారునిఁదోడ్కొని రాజు గోవత్సము మరణించి పడియుండు తావునకు వచ్చెను. ఏకైకపుత్రుఁడనియైన తలంపక, ధర్మమార్గము నుండి తొలఁగని మనంబుతో నిశ్చలుఁడై పుత్రునిపై రథమును తానే నడపెను. రథచక్రఘట్టితదేహుఁడై యాతఁడసువులం బాసె. రాజధర్మమెంత కఠినమోగదా!

శివుని కృప :—

చోళభూపతికృత్యముఁగాంచి జనులు గోలుగోలున నేడ్చిరి. ఆ ప్రభువతంసుని ధర్మదృష్టికి మెచ్చి, దేవతలు పుష్పవర్షముఁ గురిసిరి. మనునీతిచోళుని నీతికిమెచ్చి, త్యాగేశుఁడు శిరమున చంద్రకళను, శరీరమున నాగాభరణములను, కర్ణికారపుష్పదామములను ధరించి మూఁడవకన్ను శీతమయూఖంబుల నీనుచుండ, ఉమార్ధదేహుఁడై వీధీవిటంకుఁడై ప్రత్యక్షమాయెను. సంభ్రమాశ్చర్యచకితుఁడగు రాజు "మహాదేవశంభో! పాహిమాంపాహి" యని మృత్యుంజయుని శ్రీపాదములకు ప్రణమిల్లెను. శంకరుఁడు భూమీశుని దయతో లేవనెత్తి, కరుణతో గోవత్సమును, రాకుమారుని, మంత్రిని సజీవుల నొనర్చెను. వారు నిద్రనుండి మేల్కొని నట్లు లేచి, యుమాపతిని నుతించిరి. భగవంతునకసాధ్య మెద్దిగలదు? సజీవుఁడగు యువరాజు తండ్రి పాదములపైఁ బడెను. నృపుఁడాబాలుని లేవనెత్తి కౌఁగిలించి, శిరము మూర్కొనెను. బ్రతికిన వత్సమును గాంచిన గోవు సంతోషాతిశయమునఁ గార్చిన క్షీరముల నా వత్సము గుటగుటద్రావి, వాలము నెత్తి యటునిటు పరుగిడసాగెను. మంత్రి యువరాజునకు మ్రొక్కెను. మనునీతికిఁ బ్రత్యక్షమై ప్రాణదానమొనర్చి కాపాడిన త్యాగేశుని జనులాబాలగోపాలము స్తుతించిరి. భక్తమందారుఁడగు శివుని కృప నెంతయని పొగడఁగలము! ముల్లోకవాసులా పరమశివుని కృపాపాత్రులేగదా! దయా

సముద్రుఁడగు త్యాగరాజునకు నిలయమగు తిరువారూరు మహిమ యింతింతనరాదు. అట్టి తిరువారూరు హృదయ కమలమే యచటి శివాలయము.

దేవాశ్రయ మండపము:—

వేవితముల పొగడ్తలనందిన తిరువారూరునందలి వల్మీక నాథుని కోయిల "పూంగోయిల" యని ప్రసిద్ధిఁగాంచి యుండెను. ఆ యాలయ బహిఃప్రాకారమునుదాఁటి, లోని కేఁగిన నొక మండపము కన్నులకు విందుగొల్పుచుండును. అయ్యది సహస్రస్తంభసమన్వితమైనది. హరిబ్రహ్మేంద్రాదులు త్యాగేశుని సేవార్థమై వచ్చి, యా మండప సౌందర్యమున కచ్చెరువంది, యచటనే స్థిరనివాసమేర్పఱచుకొనుటచే, నద్దానికి "దేవాశ్రయమండపంబని" పేరు వచ్చెను. శివభక్తులచట గుమిగూడుచుందురు. వారి దివ్యతేజఃపుంజములతో, వారి దేహమందలి విభూతిప్రకాశముచే వెలుంగు నా మండపము, వారి మనంబులవలె నిర్మలమై, తదుదీరిత పంచాక్షరీమంత్ర ఘోషములవంటి తరంగఘోషలతోనిండి, క్షీరసాగరముఁ బోలె నొప్పారుచుండును.

శివునిచే నాహూతులై తత్పాదకమలభక్తిప్రపూర్ణులగు భక్తులామండపమునఁ జేరుచుందురు. అటఁజేరువారందఱు రుద్రాక్షమాలాలంకృతవక్షులు. విభూతిచే నలంకృతసర్వాంగీణులు. భస్మమువలె నిర్మలాంతఃకరణులు. భక్తిప్రేమలతో నిండినవారై సదా తమ హృదయకమలములందు సదా

శివశ్రీపాదముల నారాధించుచుందురు. వార్తాశారరహితులై మంటిని బంగారము నొకటిగాఁగాంచు నిస్పృహులు. దోష రహితమైన గుణరత్నములకు వారు నిధులు. వారికి మణ్ణాస, పెణ్ణాస, పొన్నాసలు లేవు. సేవావిధిగాక మోక్షమిత్తుమని నను వారాశఁజూపెడివారుగారు. భక్తివినా వారికి వేరొకటి ప్రియముగాదు. కొఱంతలేని మనంబులతో వివిధ వేష ధారులై వారు సంచరింతురు. రుద్రాక్షలే వారికి వివిధ రత్నాభరణంబులు. చినిఁగిన బొంతలే వారికి పీతాంబరములు. భిక్షాన్నమే వారికి నమృతాశనము. వారి క్రియలన్నియు శివకైంకర్యములే. ఇట్లు సదానందులై దేవాశ్రయమండప నివాసులైన భక్తుల చరితము అగమ్యము, అనూహ్యము, అప్రతిమానము, సదాధ్యేయము. అట్టి భక్తసంఘముఁగూర్చి సుందరమూర్తి యొకపద్యమాలికం జెప్పెను. అయ్యదియే "తిరుత్తొండత్తొహ" యను పేరఁ బ్రసిద్ధిఁగాంచెను. అందుఁ జేర్పఁబడిన భక్తబృందచరితమా సుందరుని చరిత్రముతోఁ బాటిందు వర్ణింపఁబడును.

సుందరమూర్తి జననము :—

గంగాదేవిని, అమృతాంశుని, నాగాభరణములను, పారిజాతసుమములఁ, దాల్చిన పరమశివుఁడు ప్రతిబంధరచనా చాతుర్యముచే వశముఁగావించికొనిన సుందరమూర్తి ద్రమిళ దేశమందలి మునైప్పాడను మండలమందలి "తిరువారూరు"న జన్మించెను.

అన్నగ్రరాజము వేదవిదులకు శివదీక్షాపరులకు నిలయమై ప్రసిద్ధిఁగాంచియుండెను. అందు ముక్కంటిని షట్కాల పూజలచే సేవించు భక్తాగ్రణి, శడయనారుఁడను విప్రోత్తముఁడు నివసించుచుండెను. అతని కుటుంబిని "ఇశైజ్ఞానియారు." ఆ శివబ్రాహ్మణదంపతులకు సర్వేశుని కృపచే నొక బాలుఁడుదయించెను. తలిదండ్రులు వానికి "నంబియారూరుఁడ"ని నామమిడి యల్లారుముద్దుగఁ బెంచుకొనుచుండిరి.

రాజు నంబియారూరునిఁ గాంచుట:—

సితపక్షమందలి రోహిణీపతిచందమున నా బాలుఁడు క్రమాభివృద్ధి నందుచుండెను. తల్లి నిత్యమా బాలుని జలకమాడించి, యలంకరించి యాతని సొబగునుగాంచి మురియుచుండెను. ఒకనాఁడా బాలుఁడు వక్షమున రతనాలపదకమును, శిరమున చంద్రవంకను, రావిరేకులను, కటియందు చిఱుగంటలతోఁగూడిన బంగరు మొలత్రాటిని, పాదములందు మణిమంజీరములను, దాల్చి, యాటబండిని త్రోయుచు వీథియందాఁడుకొనుచుండెను. క్రీడాసక్తుఁడగు నా బాలునిఁగాంచి ముగ్ధులుగానివారు లేరన, తలిదండ్రుల యానందముఁగూర్చి పలుకవలయునా!

ఆ దేశమునేలు "నరసింగమునైయరయర్" అను రాజు కార్యవశమున నా నగరమునకే తెంచియుండి, వీథియందు క్రీడించు నా బాలునిఁగాంచెను. ఆతని తేజస్సౌందర్యలావణ్యాదులు రాజు మనంబు నాకర్షించెను. రాజునకా బాలుని

యందు వాత్సల్యమేర్పడెను. వాఁడు తన యంతిపురమున నున్న, బంగారమునకు తావియబ్బినట్లే యని, యా నరపతి తలంచెను. వెంటనే యా బాలకుని మాతాపితరులను రావించి, బాలుని తన కభిమానపుత్త్రునిఁగ నొసఁగఁ బ్రార్థించెను. వారాతని కోరికను త్రోసిరాజనక మన్నించిరి. రాజాబాలునిఁ దోడ్కొనిపోయి, రాజకుమారునివలెఁ బెంపసాగెను. నంబియారూరుఁడు సకల రాజభోగముల ననుభవించుచున్నను చిత్తము శివునియందిడి, శివబ్రాహ్మణుల నియమనిష్ఠలను వీడకుండెను. తామరపాకునందలి జలబిందువువలె యాతని చిత్తము విషయాదిసంగరహితమై యుండెను. యుక్తవయస్సునందుపనీతుఁడై యా బాలుఁడు వేదముల నభ్యసించెను. కావ్యములను ఆగమశాస్త్రాదుల నభ్యసించుటయేగాక రాజోచితవిద్యలందును సాటిలేని మేటియయ్యెను. సకలకలావిదుండైన నంబియారూరుఁడు నూనూఁగుమీసాల నూత్నయౌవనము నందెను.

పాణిగ్రహణ యత్నము:—

స్నాతకుఁడై గృహస్థాశ్రమస్వీకారయోగ్యుఁడగు పుత్త్రునింగాంచి, శడయనారు వివాహముసేయఁ దలపెట్టెను. తిరునావలూరు సమీపమున తిరుపుత్తూరను గ్రామము గలదు. అందు శివాచార్యుఁడని ప్రసిద్ధిఁగాంచిన 'శడంగవి' యనువాని పుత్త్రిక యందకత్తెయనియు, తన కుమారునకుఁదగిన సుగుణవతియనియు, లక్షణవతియనియు విని, కులవృద్ధులను కన్య

నడుగఁబంపెను. వారు పుత్తూరునకేఁగి శడంగవినిగాంచిరి. వారి నా శివాచార్యుఁడు సత్కరించి, వచ్చిన కారణమడిగెను. వారు "నంబియారూరునకుఁ గన్య నడుగవచ్చితి"మని తెల్పిరి. వరుని కులగోత్రాద్యులను విజ్ఞానమునుగూర్చి విని, యాతఁడు కన్యనీయ నంగీకరించెను. వారు మరలివచ్చి, యా శుభ వార్తను శడయనారున కెఱింగించిరి. అతఁడానందభరితుఁడై రాజునకావార్త నెఱింగించెను. రాజు నంగీకారముతో రాజోచిత పద్ధతిని పెండ్లిగావింప నిశ్చయించి, మహూర్తికులను రావించి, లగ్నము నిశ్చయింపఁజేసెను. విప్రవరులను ముత్తైదువలను లగ్నపత్రికనొసంగ పుత్తూరునకుఁ బంపెను. శడంగవియు సుమంగలీసహితుఁడై యెదురేఁగి లగ్నపత్రికఁగైకొని, తానును వైవాహికకృత్యములు గావింప కృతప్రయత్నుఁడయ్యెను. బంధుమిత్రాదుల కాహ్వానపత్రికల నంపిరి. పెండ్లిపందిరిని నిర్మించి పుష్పములతో నలంకరించిరి. అందు నవధాన్యము లతోనిండిన పాలికలను, బంధుస్త్రీలు మంగళగీతములఁబాడుచు స్థాపించిరి.

తిరునావలూరున వివాహమునకుఁ బూర్వరాత్రమున వరునింట మంగళతూర్యరవంబులు మిన్నంటెను. శంఖభేరీ వేణువీణానినాదములు చెలంగెను. విప్రోత్తముల యాశీ ర్వచనంబులు మిన్నంటెను. విధివిధానము ననుసరించి పురో హితులు అక్షతలఁజల్లుచు వరుని దక్షిణహస్తంబున మేషరోమ సహితమైన స్వర్ణకంకణముఁగట్టిరి. అంతలో భాస్కరుఁడు

శివభక్తుని కల్యాణముఁగాంచుటకోయనఁ దూర్పుకొండపై నుద యించెను.

సుగంధవాసనావాసితంబులగు జలంబులతో వరుని వృద్ధ సువాసినులు జలకమాడించిరి. పట్టువస్త్రంబులఁ గట్టనిచ్చిరి. నంబియారూరుఁడు మైనిండ చందనము నలందికొని, వివిధా భరణంబులను పూదండలను దాల్చి, నుదుట విభూతిపై తిలకముఁ దిద్దికొనెను. బ్రాహ్మ్య తేజమొకవైపు, రాజతేజమొకవైపాత నికి నింపుసొంపుల నొడఁగూర్చెను. తిరునావలూరంతయు వైవాహికోత్సవముతో శోభిల్లెను.

పెండ్లికిఁ దరలుట :—

శ్రోత్రియులు శకునశాంతిసూక్తములు పఠింపసాగిరి. వేద ఘోషములతోఁబాటు సుమంగలీ మంగళగానములు, మంగళ వాద్యధ్వనులు చెలరేఁగుచుండ, నంబి పార్వతీపరమశివులను మనంబునఁదలఁచి శ్వేతాశ్వము నధిరోహించి, పుత్తూరునకు బయలుదేఱె. ఆత్మీయులగు బంధుమిత్రులు పల్లకులనెక్కిరి. పౌరులు పరివారంబులు వారి ననుసరించిరి. అట్లు దరలిన యా జనంబు పొంగిపొరలు సముద్రమాయన నుండెను. వారంద ఱట్లుత్సవముతో పుత్తూరున కేఁగిరి. ఆనాఁటినుండి యాయూరు నకు పెండ్లిపుత్తూరని (మణంవందపుత్తూరు) పేరువచ్చెను.

ఎదుర్కోలు :—

వధువువైపువారు పుత్తూరు వీధులను గొజ్జంగి నీటఁజల్లి, చందనమ్ముతో నలికిరి. వీధి కిరువైపుల నరఁటిచెట్లఁగట్టి

తోరణములతో నలంకరించిరి. పుష్పాదిని లాజలను చల్లుచు, బూర్ణకలశములతో, ధూపదీపములతో వారు వరునెదుర్కొని వివాహమండపమునకుఁ గొని తెచ్చిరి. అట్లుత్సవముగ నేతెంచు వరునిఁగాంచి, జనులు మననేత్రద్వయమీతనిఁ జూడఁ జాలవని తలంచిరి. ఇట్టి వరుని పొంద నాకన్య యెట్టి తపమొనర్చెనో యని కొందఱు తలంచిరి. ఇట్టి యల్లునిఁగాంచు భాగ్యముఁ గల్గెనని బంధువులు భావించిరి. కొందఱు సంతసమును భరింపఁ జాలక నాట్యమాడిరి. తెల్లని శంఖములు తొలకరి మబ్బుల వలె శబ్దించుచుండ నంబియారూరుఁడు శ్వేతాశ్వముదిగి, విలాసముతో వివాహాగారముఁ బ్రవేశించి, వేదికపై సుఖాసీనుఁ డయ్యెను.

నల్లూరునుండి శివుని రాక :—

కైలాసమందు సుందరునకొసంగిన వాగ్దానంబును మనంబునఁదలఁచి, యాతనినుద్ధరింపఁ నీలగళుఁడు వృద్ధబ్రాహ్మణ వేషముఁదాల్చి, యా పెండ్లియింటికి కేతెంచెను. నొసట విభూతిరేఖలు, శిరమున చంద్రుని వెన్నెలలవలె నెఱసిన జటాభారము, కర్ణములందు మకరకుండలములు, జన్నిదములు, భుజమున నుత్తరీయమునుదాల్చి, యొక హస్తమున ఛత్రమును, మఱొకదాన కుశలు, వస్త్రముఁజుట్టిన వేణుదండముఁ బట్టి, తొట్రిలునడలతో నాతఁడు పెండ్లిపందిరిలోని కేతెంచెను. బిగువుసడలని యాతని దేహపటిమఁగాంచినవారు "ముదుసలియైన నితఁడు నడిమివయస్సున నున్నట్లు నడచుచున్నాఁడ" ని

తలంచిరి. కొందఱు "వేదమార్గప్రవర్తకుఁడగు త్రిపురాంతకుఁ డితఁడగునా" యని భావించువారు నందుండిరి.

పురుషోత్తముఁడైన యా వృద్ధబ్రాహ్మణుఁ డటునిటు చూడక, వివాహ వేదికను సమీపించి, సుందరుని యెదుట నిలిచి, అటనుండు పెద్దలవైపు తేఱిచూచి, "యేఁ జెప్పఁదలఁచినది వినుండు" అనెను. ఆ గంభీరవాక్కులను వినిన సుందర మూర్తియు, శివబ్రాహ్మణులును "స్వామీ! మీరు సెప్పఁ బూనిన దెద్దియో తెల్పుఁడు. అద్దాన నుభయులకును మేలగు. మా యొనర్చిన తపఃఫలమెట్టిదియో వినఁగుతూహలమగు చున్నది" యనిరి. వెంటనే యా వృద్ధుఁడు పెండ్లిపీటపై నాసీనుఁడగు సుందరమూర్తినిఁగాంచి "నీకును నాకును వ్యాజ్యె మొకటి గలదు. అది యిప్పటిదిగాదు. అది తీరినపిదప నీవు వివాహమాడవచ్చును" అని పేరెలుంగునఁబల్కెను. "మన యుభయులమధ్య తగవుండుట నిజమగుచో, నద్దానిందీర్పక యేఁ బెండ్లియాడను. అదెట్టిదియో వేగమ తెల్పుఁడు" అని సుంద రుఁడాతనితో బల్కెను. అంత నాముదుసలి సభ్యులఁగాంచి, "ఇతఁడు నాకు దాసుఁడు. ఇదియ నా వ్యాజ్యెము" అనెను. వారంద ఱాపల్కులకుఁ జకితులైరి. ఈతని తలంపేమని కొందఱు చింతింపసాగిరి. కొందఱాతనిపై కోపించి చురచురఁ జూచిరి. కొందఱు నవ్విరి. సుందరమూర్తియు "మేలుమేలు. నీ మాటలు విన సొంపుగనున్నవి" యని నవ్వెను. వెంటనే వేషధారియగు నా వృద్ధ విప్రుఁడు కోపముతో నాతని చేరువకు

వచ్చి "ఏమిర్రా! ఆ నవ్వులు. మీ తాత నాకు వ్రాసి యిచ్చిన పత్రము నాకడ యున్నది. నీ పరిహాసమున కర్థ మేమి?" అని గద్దించి పల్కెను. సుందరుఁడాతని మోము తేటిచూచెను. అంతట నవ్వులాఁగెను. చూపులాతనిపై నిల్పి "శైవబ్రాహ్మణుఁ డితరునకు దాసుఁడనుమాట మొట్టమొద లుగ మీవలన వినుచున్నాఁడను. "బ్రాహ్మణుఁడు దాసుఁడు" అను మాట యే శ్రుతులందు గలదు. ఇట్లు వలుక నీవేమి పిచ్చివాఁడవా?" యని సుందరుఁడు వల్కెను.

వృద్ధుఁ డా యువకుని మాటలను విని "నన్ను నీవు పిచ్చి వాఁడవనినను, పిశాచ మనినను, నా కవమతి లేదు. లజ్జఁ బొందను. దీనఁ జేసి నీవు నా శక్తి నొక్కింతయుఁ దెలిసికొన వైతివని తెలియుచున్నది. దానఁ గొఱంత లేదు. నీ పరిహా సంపుఁ బల్కులను వీడి, నన్ను సేవింప వత్తువా? లేదా!" యనెను. వృద్ధునిఁ జూడఁజూడ సుందరమూర్తి మనంబున నెద్దియో యనిర్వాచ్యమైన ప్రేమానుబంధము కలఁతపఱుప సాగెను. కాని యతఁడా వృద్ధునిపైఁ గోపించి, దానపత్ర స్థితిని నిజముగ నెఱుంగఁగోరి, "మీకడ పత్రమున్నఁ జూపు" డనెను. అంత వృద్ధుఁ డాతనితో "నీ కాపత్రముఁజూడ నర్హత కలదా! సదస్యుల కద్దానిఁ జూపెద. వారు దానిఁ గాంచి, తీర్పు చెప్పినపిదప నీవు నా దాస్యమున కర్హుఁడవగు దువు" అనఁగనే క్రుద్ధుఁడై, సుందరమూర్తి యా పత్రమును బలాత్కారమున గ్రహింపఁబోయెను. వృద్ధుఁడాతని దురూహ

నెఱింగి, వివాహమండపమున పరుగిడెను. బ్రహ్మాదులు సయి తము వెన్నంటఁజాలని యా ముదుసలిని, సుందరుఁడు వెన్నంటి పట్టఁజూచెను. పరమశివుని వెన్నంటుశక్తి సుందరమూర్తికిఁ గాక మఱెవరికి సాధ్యమగును! అతఁడు వేగముగ పరుగిడి సమీపించి వృద్ధుని చేతిలోని పత్రము లాగికొని "బ్రాహ్మణుఁ డితరునకు దాస్యము సేయుట ధర్మమా! ఎందుఁగలదు?" అని ప్రశ్నించుచు, దానిని ముక్కలుగఁజేసి పారవైచెను. ముదు సలియు వాని హస్తమును గ్రహించి, "పత్రము చింపుట ధర్మమా!" యని యెలుఁగెత్తి యఱచెను. బంధువులు వారిని విడఁదీసి, లోకము కనని వినని తగవుఁదెచ్చి వాదాడుచున్నాఁ డవు. నీవెచట నుండువాఁడవు?" అని ప్రశ్నించిరి.

సర్వాంతర్యామియు సర్వత్రయుండు నా బ్రాహ్మణుఁడు "నేను నివసించునది చాలదూరముగాదు. చేరువనున్న "తిరువెణ్ణైనల్లూరు" నా నివాసభూమి. వీఁడు నా చేతిలోని పత్రమును లాగి చింపివైచెను. కావున వీఁడు నాకు దాసుఁ డగుట సత్యమని తెలియుచున్నది గదా!" యని నుడువ సుందరుఁడాతనిని వ్యాజ్యమాడుటలోఁ గుశలునిఁగ ననుభవ పరునిఁగ గుర్తించెను. ఇట్టి తలంపుతో నాతనియందు ప్రీతి యతిశయింప "దేవా! తాము సమీప గ్రామవాసులగుటచే నచ్చోట నీ తగవు తీర్పఁబడుఁగాక రండు పోదము" అని పిలిచెను. "నీవటకు వచ్చుటయే మేలు. మా యూర నాల్గు వేదముల నెఱింగిన తీర్పరులు పలువురు గలరు, వారికిఁ దగవు

నివేదించి, మూలపత్రముఁ జూపెద. నీవు చించినది నకలు. తన్మూలమున నీవు నాకు దాసుఁడవగుట నిశ్చితమగును. రమ్ము" అని పలికి వేణుదండము నూనుకొనుచు సాగిపోయెను. అయస్కాంతముచే నాకర్షితమైన యినుమువలె సుందరుఁడు, ఆతని బంధువులును వృద్ధుని వెన్నంటిరి.

వృద్ధబ్రాహ్మణుఁడు నల్లూరున కేఁగి, వేదవిదుల సభను జేరి, "విప్రోత్తములారా! తిరునావలూరులో పుట్టిన యీ సుందరుఁడు నా ప్రియ దాసుఁడు. ఆ విషయముఁ దెల్పు పత్రము నితఁడు నాశమొనర్చెను. ఇదియ నా తగవు. న్యాయాన్యాయములను విచారించి, తీర్పుఁడు" అనఁగనే వారు నవ్వి, "నీ తగవు లోకమర్యాద నతిక్రమించినది. బ్రాహ్మణుఁడు నీకు దాసుఁ డెట్లగును? అట్టి యాచార మెచటఁగలదు? నీ వన్యాయమైన తగవుఁ దెచ్చితివి" అనిరి. ఆ వృద్ధుఁడంత "నా వ్యాజ్యము న్యాయసమ్మతమైనది. వీని పితామహుఁడు నాకు మనఃపూర్వకముఁగ వ్రాసియిచ్చిన పత్రమును వీఁడు నాశమొనర్చెను" అనెను. అంత సదస్యులు "సుందరా! పత్రము నాశమొనర్చిన జయము లభించునా! నీ పెద్దలు మనఃపూర్వముగ వ్రాసియిచ్చినదాని నేల యట్లొనర్చితివి? ఇతని వాదము న్యాయముగ నున్నది. నీవేమి చెప్పెదువు?" అని ప్రశ్నించిరి.

అంత సుందరమూర్తి "జ్ఞానవృద్ధులారా! ఇతఁడు మాయావాది. నేను ఆది శైవ బ్రాహ్మణుఁడనని మీ రెఱుంగుదురు. ఈతఁడు మతివిహీనుఁడై వైదికుఁడనగు నన్ను దాసుఁ

డనని నిర్ణయించి పల్కుచున్నాఁడు. ఈతని కపట మిద్దాన బట్టబయలగుట లేదా! అతని యంతరార్థమేమియో తెలియ రాకున్నది. ఇందు నేనేమి చెప్పఁగలాఁడ"నని ప్రత్యుత్తర మొసంగెను. పిదప వారా వృద్ధునిఁగాంచి "సుందరుఁడు నీ దాసుఁడని నిరూపింపవలయును. రాజనీతిని చూపిగాని సాక్షులఁ దెచ్చిగాని, పత్రముచేగాని నీ వాదమును నీవు స్థాపింప వలసి యున్నది. అట్లొనర్పఁగలవా" యనిరి. వెంటనే యా మాయలమారి "వీఁడు కోపముతోఁ జింపినది నకలు గాని యసలు గాదు. వీఁడు నా దాసుఁడని నిరూపించు మూల పత్రము నాకడఁ గలదు. దాచియుంచితిని." అన వారద్దానిఁ జూపఁగోరిరి. "వీఁడు ముందొనర్చినట్లు సేయఁడని మీరు బాసఁజేసిన, చూపెద: వీనిని నమ్మఁజాలను" అని వృద్ధుఁడు పలికెను. సభ్యులు "నీ పత్రమున కేహానియుఁ గల్గ"దని నొక్కి చెప్పిరి.

సుందరుని పరితాపముఁ దీర్చి తనకు సేవకునిఁగాఁ జేసి కొన నేతెంచిన కపటవేషధారియగు శివుఁడు పత్రమును సభ్యులకు నొసంగెను. వారొక లేఖకునిఁ బిలిచి పత్రములోని వాచకముఁ జదువ నాజ్ఞాపించిరి. వాఁడిట్లు పఠించెను.

"తిరునావలూరులోనుండు ఆది శైవుఁడైన 'ఆరూరుఁ' డను పేరుగల నేను, తిరువెణ్ణైనల్లూరులోనుండు పిచ్చివానికి వ్రాసియిచ్చినది. నేను నా సంతతివారు పరంపరగ నితనికి

దాసులమై.యితనిని సేవింతుము. నేను త్రికరణశుద్ధిగ వ్రాసి యిచ్చితిని........" చేవ్రాలు: సాక్షి సంతకములు.

ఇట్లు లేఖకుఁడు చదువ విని, సంతకములను గాంచి పత్రము నిజమైనదని గ్రహించి, సుందరుని గాంచి తీర్పరులు "అయ్యా! ఇది మీ తాతగారు వ్రాసియిచ్చినదే యగును. ఇందలి వ్రాలు వారిదేయగునా! ఆలోచించి తెల్పుము" అనిరి. వృద్ధుఁడామాటలను విని స్మితమొనర్చి, "అయ్యలారా! వీని తాత వ్రాసిన చేవ్రాఁతను వీఁడెట్లు తెలిసికొనఁగలఁడు. వీని పితామహుఁడు వ్రాసిన యితర పత్రములఁ దెప్పించి, సరిచూచి మీకుఁ దోఁచిన న్యాయముఁ దెల్పుఁడు" అనెను. వారు సుందరుని పితామహుఁడు స్వయముఁగ వ్రాసిన పత్రాంతరములఁ దెప్పించి చూచి వ్రాఁత యొక్కటిగ నుండఁగాంచి, యాశ్చర్య చకితులైరి. సభ్యులు సుందరునిఁగాంచి, యీతని వ్యాజ్యెముఁ ద్రోసిరాజనుటకుఁ గారణము గన్పింపదు. ఈతనికి నీవోడితివి. కావున నాతనికి దాసుఁడవగుట విధి" అని తీర్పు నొసంగిరి. అంత సుందరుఁడు "ఇట్లు దాసుఁడఁగావలయునని విధి వ్రాసి యుండ నేనెట్లు కాదనఁగలను" అని పల్కి, దాసుఁడగుటకు సమ్మతిఁ దెల్పెను.

పిదప సదస్యులు వృద్ధునిఁగాంచి, "అయ్యా! నీవు చూపిన పత్రమందు నీయూరిదియే యని కలదు. నిన్ను మేమీ యూర నెన్నఁడు చూడలేదు. నీ యిల్లెక్కడ? నీ వృత్తి యేమి?" అని యడిగిరి. వృద్ధుఁడు "మీలో నొకఁడైన

నన్నొకనాఁడైనఁ జూడనట్లు పల్కుచున్నారు. వలసిన నాతో రండు. నా గృహమును వృత్తినిఁ జూపుదు"నని ముందు నడచెను. సభ్యులు సుందరుఁడు నాతని ననుసరించిరి. ఆ వృద్ధుఁడు కొంతదూరమేఁగి యచటఁగల "తిరుఅరుళ్తురై" యను శివాలయముఁజొచ్చి యంతర్ధానముఁ జెందెను. అతని వెంట వచ్చిన సభ్యులాతనిఁ గానక వెదుకసాగిరి. సుందరమూర్తి యొంటరిగ నేఁగి, వెదకి వేసారి యాతనిఁగానక, గొంతెత్తి భయభక్తులతో నాతనిఁ బిలిచెను. వెంటనే యుమాపతి వృషభవాహనుఁడై ప్రత్యక్షమై "యోయీ! పూర్వభవంబున నీవు మాకు దాసుఁడవై కైలాసముననుండి సేవించితివి. అపుడు నీవు వనితల నిరువురఁగాంచి కామించితివి. అక్కారణంబున నా యాజ్ఞ ననుసరించి భూమియందు జన్మించితివి. ఐహిక దుఃఖములంటకుండ నిన్ను రక్షింప నేనిపు డేతెంచితిని. సభ్యుల యెదుట నీతో వాదాడి నా వశము గావించికొంటిని. నీ పూర్వేచ్ఛ ననుసరించి నిన్ను తప్పుదారిఁ బట్టకుండఁ గాపాడితి"నని భక్తునిపైఁ గృపారసంబుఁ గురియించెను.

శివుని యాశ్రిత రక్షణాసక్తిని, కరుణను గాంచిన సుందరుని యానందమునకు మేరలేకుండెను. అతని దేహము పులకాంకితమయ్యెను. తల్లి యంభారవమును వినిన వత్సమువలె నాతఁడు చలించెను. సుందరుఁడు శిరమునఁ జేదోయి సంధించి మ్రొక్కెను. "ఇట్లు నన్ను నిర్బంధముగ దాసునిగ గ్రహించిన మీ దయ నెంతయని పొగడఁగలను! దేవసభలో నటన

మాడిన యప్పటి కరుణాకటాక్షములే, నాపై నిప్పుడు సూపితిరి" అని స్తుతించుచుండ, పంచవాద్యముల ధ్వని దిగంతములు నిండెను. గీర్వాణులు పుష్పవృష్టిని గురియించిరి. భూలోకవాసులు జయజయధ్వానములఁ గావించిరి. అపుడా యుమాపతి భక్తదాసునిఁగాంచి, "నీవు బలవంతుఁడవని నన్నెదిరించి, దాసుఁడవైతివి గాన, నేఁటినుండి నీవు "వన్తొండఁడు" అని ప్రసిద్ధిఁ గాంచఁగలవు. నన్నుగూర్చి భక్తులు గానముసేయు గీతములే నాకుఁ బ్రియార్చనలు. నీవు నన్ను సేవించుచు తమిళమున నీ కవితాధారతోఁ గీర్తింపుము" అని కరుణించెను. భక్తుని తమిళమునఁ గీర్తింపుమని వేదోచ్చారణదక్షుఁడగు దాక్షాయణీప్రియుఁడే కోరెను. సకల వాఙ్నిచయకర్తయు వేదాది సమస్త విద్యల కధిపతియునగు భవానీపతికి వాక్కులన్నియు ప్రియతమములే. "యే యథామాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం" అను గీతావాక్యమిట స్మర్తవ్యము.

సుందరుఁడు "అజ్ఞుఁడనగు నేను నీ మహిమల నెట్లు కీర్తింపఁగలను" అన శివుఁడు "పూర్వము నన్ను నీవు పిచ్చివాఁడా! యని సంబోధించితివి గాదే. ఆ పదముతో ప్రారంభించి కీర్తింపుము" అనెను. వెంటనే సాంబశివుని దయావిశేషముచే నాతనికి సుకవితాధార వెల్లివిరియ (1) "పిచ్చివాఁడా! చంద్రకళాధరా! పరమేశా! కృపాసాగరా! నిను నే మఱువఁజాల. నినువినా నామనమెందుఁ బోవదేమి? దక్షిణపినాకినీస్రవంతీతీరమున నల్లూరులో "నరుళ్తుర" యాలయ

వాసా" సదాశివా! నేను నీకు దాసుఁడఁగానని యెటులఁ జెప్పగలను" అను నర్థమ్ముఁగల గీతముఁ బాడి స్తుతించెను.

"పిత్తా పిరైశూడి పెరుమానే అరుళాలా........"

మహాదేవుఁడా గీతమందలి భావమునకు మెచ్చి "యిట్లే యిక నీ కవిత తామరతంపరయగుఁగాక" యని కృపఁజూపి తిరోహితుఁడయ్యెను.

కాలకంఠుఁడు సుందరుని కల్యాణము నడ్డి, యాతని లోఁబఱచికొనినందున పుత్తూరున వివాహయత్నములన్నియు నాఁగెను. పాపమా శడంగవి శివాచార్యుని పుత్రిక పీఁటల మీఁది పెండ్లి యాఁగినదే యని తన దౌర్భాగ్యమును నిందించికొనుచు, తాళిఁగట్టకున్నను సుందరుఁడే తనకు గతి యని తలంచినదై మనంబున నాతని రూపమునే ధ్యానించుచు, తదేక చింతతో కృశించి, దేహము వీడి శివసాయుజ్యముఁ గాంచి ధన్యయయ్యెను. సతీమతల్లులు పతిదేవతలు గారే.

సుందరమూర్తి తీర్థయాత్రలు :—

సుందరమూర్తి శివక్షేత్ర దర్శనోత్సుకుఁడై నల్లూరును వదలి శిష్యబృందములతో యాత్ర సాగించెను. కొంతదూర మేఁగ, కమలసరోవరంబులతో నిండి, హృదయాహ్లాదకరంబగు తిరునావలూరను క్షేత్రము భక్తునిపాలిటి కల్పద్రుమమో యనఁ గన్పించెను. అచట శివుని భక్తిమై మ్రొక్కి గేయములతో స్తుతించి, 'తిరుత్తురయూరు'న కేఁగెను. అచటి శంకరుని

ముందు సాగిలపడి, "స్వామీ! నాకుఁ దపోమార్గముఁ బ్రసా దింపుఁడని పది పద్యములతో (పదిహేము) వేడుకొనెను. సులభ గమ్యుఁడగు పశుపతి, భక్తుని వేఁడికోలున కామోదముఁ దెల్పెను. అచటినుండి యానంద తాండవకరుఁడగు నటరాజు నిలయమగు చిదంబరమును దర్శింపఁ గుతూహలియై పయనమాయెను. మార్గమున శ్రీచందనవనములను, మయూరనృత్యములచే నందమైన పొగడ పొన్న చెట్లతో నిండిన పూఁదోఁటలఁ గాంచుచు, నవరత్నముల కాకరంబులగు ప్రాంతములు గల్గి యున్నతంబులగు తరంగములచేఁ దరింపరాని దక్షిణపినాకినీ నదీమతల్లిని తరించి, 'తిరువదిహావీరస్థానమ'ను దివ్యక్షేత్రముఁ జేరెను.

శివుఁడు సుందరుని శిరముపైఁ బాదముల నిడుట :—

తిరునావుక్కరసను పరమ మాహేశ్వరుఁడు స్వహస్త ములతో శుద్ధమొనర్చిన కోయిలఁగల దివ్యక్షేత్రమే తిరువ దిహావీరస్థానము. అట్టి పవిత్రస్థలమును పాదములతోఁ ద్రొక్కి, యపవిత్రమొనర్ప నిష్టములేని, సుందరమూర్తి యాయూరు నకు సమీపమునఁగల సిద్ధవటము అను మఠమున భక్తబృంద ములతో విడిసెను. ఆ స్థానేశ్వరునిఁ దలంచుచు నతఁడధ్వ ప్రయాసవిహ్వలుఁడై యా రేయి యచట విశ్రమించెను. వీరస్థానేశ్వరుఁడు ప్రియభక్తుని రాక యెఱింగి, వృద్ధబ్రాహ్మణ వేషమున నా మఠముఁ బ్రవేశించి, సుందరుని శిరముపైఁ దన

పాదము నిడి నిద్రించువానివలె నుండెను. పాదస్పర్శచే నాతఁ డులికిపడి లేచి, "ఓయీ! వేదాధ్యాయీ! నీ పాదములను నా తలపై నిడితివేల?" అని యడిగెను. అంత నా వృద్ధుఁడు "నేను వృద్ధుఁడను. కన్నులు గానని మూఁడు గాళ్ల ముదు సలిని. నీవెచట నిద్రించుచుంటివో కానక యట్లొనర్చి యుందును" అని బదులు పల్కెను. సుందరుఁడు వేరొకచో నిద్రింప, మఱల నతఁడచ్చె పాదముల నిడెను. ఎటు సరుండినను ముదుసలి పాదము లాతని శిరమును దాకుచుండెను. అందుల కాతఁడు కుపితుఁడై నన్ని విధమునఁ గాళ్లఁ ద్రొక్కు నీవెవఁ డవు?" అని గద్దించెను. వెంటనే శివుఁడు "ఇంతవఱకు నన్నెఱుంగవైతివి" అని పల్కుచు తిరోహితుఁడయ్యెను. సుందరమూర్తి "అయ్యో! శిరముపైఁ బాదమిడి యనుగ్ర హించినవాఁడు నా తండ్రి పరమేశ్వరుఁడే యని గ్రహింపఁ జాలనైతి. నా యహంకారమే నన్నీగతికిఁ దెచ్చెఁగాదే!" యని పరిపరివిధముల దుఃఖించెను. వెంటనే "భగవంతునిఁ దెలియనివా రెవరురా..." యని ప్రారంభించి ఛందోబద్ధంబు లగు వాక్కులతో స్తుతించెను. అరుణోదయమున 'గడిలమ'ను నదిలో నీరాడి వీరస్థానేశ్వరుని పూజించి, యటనుండి పయ నమై వామనుఁడైన శ్రీమహావిష్ణువుచే నర్చితమైన 'తిరు మాణిక్కుళి' యను క్షేత్రేశుని దర్శించి 'తిరుత్తిన' నగర మందలి మహేశ్వరుని స్తుతించి చిదంబరమార్గముఁ బట్టెను.

చిదంబరము:—

చిదంబరపు ప్రాంతభూములన్నియు కేదారక్షేత్రములతోనిండి, మరకతమణినిబద్ధ భూములా యన నుండును. వరిమళ్లలో వికసించిన రక్తాంభోజముల నాడించుచు గండుమీలు త్రుళ్లిపడుచుండును. అటనట కుల్యాంతరములలో విహరించు రాయంచల రవములు శంఖధ్వానములా యన నుండును. అచట నుండు చూతవనములందు స్వేచ్ఛగ విహరించుచు చూతాంకురాస్వాద కషాయకంఠములగు పికములు కుహూకుహూ నినాదములతోఁ బాంధుల నాహ్వానించుచుండును. నందవనము గేలిసేయు పూఁదోఁటనుండి వీచు గంధవాహములు పాంథుల శ్రమ నపనయించి, హాయిని గొల్పుచుండును. అట్టి యుద్యానవనంబులాపురినిఁజుట్టి లెక్కకు మించియుండును. వానినిదాఁటి యేఁగిన నాకసమునంటు కోటగోడలు, వాని నానుకొని గంభీరమైన యగడితలు గన్పించును. వాని ననుసరించి మొగలిచెట్లు దట్టముగఁ బెరిగియుండును. ఆ గేదంగిపూవుల పుష్పొడిలో నాడు షట్పదములు విభూతిఁదాల్చిన శివభక్తులా! యన నుండును. వాని ఝుంకారములే ప్రణవసహితపంచాక్షరీ మంత్రములా! యన వినిపించును. సుందరమూర్తి యా ప్రకృతి దృశ్యముల కలరుచు చిదంబరపు టుత్తరద్వారమును సమీపించెను.

భగవంతునిచే దాసుఁడుగా గ్రహింపఁబడిన భక్తాగ్రేసరుఁడు సుందరుఁడే తెంచుచున్నాఁడని యెఱింగిన శివభక్తులాత

నికి నెదురేగి స్వాగత మొసంగిరి. పరస్పర వందనాదులపిదప సుందరుఁడా భక్తబృందము ననుసరించి, పురవీధిని ప్రవేశించెను. అచటి సౌధములు సుధర్మను తలఁదన్నునట్లుండెను. గృహాంగణములందు వేదాధ్యయనాధ్యాపనధ్వనులు వినిపించుచుండెను. కొంతదూర మేఁగ పంచవాద్యధ్వనులు (ఢక్క, మురళి, తాళ, వీణ, గానము) నాట్యమాడు సుందరుల మణిమంజీర మంజుల శబ్దంబులు, కాంతలు దాల్చిన పూవులందలి యళీక ఝుంకారములు, శ్రుతిపేయములై యేతెంచుచుండె. భక్తులు "హరహర మహాదేవ శంభో" యని దిక్కులఁ బ్రతిధ్వనింపఁ జేయుచుండిరి. విప్రవాటికలనుండి వెల్వడు నిత్యాగ్నిహోత్ర హోమధూమము లాకాశముతో నైక్యమందుచుండెను. గోపురాగ్రమందలి మయూరములు హోమధూమములఁగాంచి మేఘ భ్రాంతినంది నాట్యమాడుచుండెను. యాగశాలలందు ప్రజ్వరిల్లు హోమాగ్నులు వెదచల్లు నరుణార్కప్రభలను, ముంగిళ్లలో రచింపఁబడి వెన్నెలలవలెనుండు చిత్రవిచిత్రంబులగు ముగ్గులను, భోజనశాలలలో కైలాసభ్రాంతిఁగల్గించు శాల్యోదనపు రాసులను, దేవతలు గొనివచ్చిన పూర్ణకలశములా యన దోఁచు మందిరాగ్రములందలి బంగారు కలశములను గాంచి సంతసించుచు, నా యందము నభినందించుచు నేఁగి సుందరుఁడాలయగోపురముఁ గాంచెను.

గోపురపుటందమునకుఁ గొంతవడి ముగ్ధుఁడై లోనికేఁగి మేరువని ప్రసిద్ధిఁజెందిన "పేరంబలము"నకు (పెద్దసభ) ప్రదక్షిణ

ముగ నేఁగి, యాదిమధ్యాంతరహితము భక్తహృదయకమల మందుఁ బ్రకాశించు "చిత్సభా" (చిత్రంబలము) ద్వారము కడకేఁగెను. ఆ చిత్సభయందే వేదమయమైన యందెలు ధ్వనింప నటరాజేశ్వరుఁ డానందతాండవ మొనర్చెను. సుందరమూర్తి శిరమునఁ గరములు గీలించి, యేకాగ్రచిత్తముతో పంచాక్షరీసోపానముఁ దరిసి, కనకసభలో నటించిన నటరాజుఁగాంచి వందనమొనర్చెను. దర్శించునపుడాతని నేత్రంబులు శివునియందు లగ్నముకాఁగా, మిగిలిన యవయవములు నిశ్చేష్టితములయ్యెను. ధ్యానము తప్ప మిగిలిన చతుష్క్రియలు చలనరహితము లయ్యెను. త్రిగుణములలో శుద్ధసత్వమే ప్రకాశించెను. ఇట్లు తన్నుఁ దా మఱచి యేకాగ్రతతో ధ్యానించి మ్రొక్కెను. శివుని యానందతాండవదర్శన భాగ్యము ననుభవించి, సుఖసాగరమున మునింగెను. అట్టి యానందానుభూతితో "తాండవ నటనాధీశుని మ్రొక్కు-భాగ్యముఁ గల్గించు నీ మానవ జన్మమే నాకు సంతోషదాయకము" అను భావముఁగల గీతముతో నుతించెను.

తిరువారూరుఁ గాంచుట:—

నటరాజును స్తుతించి "యారూరులో నన్ను దర్శింపుము" అను అశరీరవాణిని విని, వెంటనే తన్ననుసరించి వచ్చు భక్తులతోఁగూడి, యా క్షేత్రమునకుఁ బోవఁగోరి, దక్షిణద్వారముఁ జేరి సాష్టాంగ మొనర్చెను. అచటనుండి చిదంబరపుటెల్లను దాఁటి భవబంధవిమోచనుఁడగు భవునిఁ

మాయవరము



గీర్తించుచు కొల్లడమను నదిని దాఁటి, శీర్గాళిని సమీపించెను. పూర్వమా క్షేత్రమునందే జ్ఞాన క్షీరములఁ ద్రావి పెంపొందిన జ్ఞానసంబంధస్వామి జన్మించియుండుటఁ జేసి, యద్దానిని తన కాళ్ళనడలచేఁ ద్రొక్కరాదని వలఁగొని వచ్చెను. యుగాంత కాలమున సకలము సంహారము గాఁగ శివుని కృపచే నశింపక మిగిలిన నగరమగుటఁజేసి యద్దానికి "తోణిపురమ"ను పేరు గల్గెను.

అచట నుమాదేవిఁగూడి వృషభవాహనారూఢుఁడై కైలాసమున నుండురీతి యా కైలాసనాథుఁడు సుందరునకు దర్శన మొసంగెను. "గిరీశునిఁ గైలాసమునఁ గాంచినట్లే యిచట దర్శించితి"నను వాక్యముతో నారంభించి నలువది పాదములు గల పాటను పాడి స్తుతించి, "తిరుకోలక్కా," "తిరుపుంగూరు"లలో వెలసిన శివమూర్తులపైఁ బద్యములు చెప్పి స్తుతియించి, యేఁగి యనేక శివక్షేత్రములఁ గాంచుచు, కవేరకన్య యని ప్రసిద్ధివడసిన కావేరీ నదీతీరమును సమీపించెను. అతఁడా నదీమతల్లియందుఁ గ్రుంకులిడి "తిరుమైలాడుదుర" (మాయవరము)ను ప్రవేశించి, మయూరనాథునకు మ్రొక్కి తిరుఅంబరు మాగళము, తిరుప్పుహలూరు, మొదలగు శివక్షేత్రములఁ గాంచి తిరువారూరునకుఁ బయనించెను.

తిరువారూరు త్యాగేశుఁడా క్షేత్రవాసులైన భక్తుల స్వప్నమునఁ గన్పించి సుందరుని రాకఁ దెల్పి, "నే నాహ్వానింప నాథఁడు నన్ను సేవింప వచ్చుచున్నాఁడు. కాన మీ

రాతనికి సుస్వాగతమిడి తోడ్తెండు" అని యాజ్ఞాపించెను. భక్తులందు భగవంతుని దయ సాధమెఱుంగనిది గదా! శివాజ్ఞను తలఁదాల్చి, భక్తులు పురము నలంకరించిరి. వీధులన్నిటఁ దోరణములఁ గట్టి పూవుల దండలతో నలంకరించిరి. అరఁటిచెట్లను స్తంభములుగఁ గట్టిరి. వీధులందు గొజ్జంగి పూనీటిని చల్లిరి. వేదికలపై చందనచర్చఁ గావించిరి. పందిళ్లువేసి శ్వేతాంబరములతో మేలుకట్లు గట్టిరి. వివిధ పుష్పంబులను లాజలను వీధులందుఁ జల్లిరి. మంగళవాద్యములు మ్రోగుచుండ. భక్తులు సుందరునకు స్వాగత మొసంగ నెదురేఁగ, దేవతాసంఘము నడచుచున్నదా యనఁ దోఁచె. శివభక్తులు తనకు నమస్కరించుటకు ముందే సుందరుఁడు వారికి మ్రొక్కెను. అతఁడు వారి స్వాగతమున కలరి వారితోఁ బురిఁజొచ్చి, "నా తండ్రి యిట నున్నాఁడు. నన్నా స్వామి దాసునిఁగ నంగీకరించునా? పృచ్ఛసేయుఁడు" అని ప్రారంభించు పదిహాముఁ బాడుచు, త్యాగేశు నాలయముఁ జొచ్చి, ముందుఁగ దేవాశ్రయ మండపమునకు మ్రొక్కెను. పిదప దేహాత్మలకు మోక్షము నొసంగు వల్మీకనాథాలయము లోనికేఁగెను. వల్మీకమునఁ బుట్టి సుందరతరాలయమున సుప్రతిష్ఠితుఁడై సకలలోకవ్యాప్తుఁడై రమాదేవికిఁ గృప సూపిన త్యాగేశునకు సాష్టాంగముగ వందన మాచరించి, తన జన్మము సఫలమాయెనని సంతసించెను.

సుందరుఁడు భావావేశముతో మధుర కవితాధారను వర్షించెను. ఆనాఁటి కవితాగానము తుంబురు నారదాదుల

గానమును ఋంచియుండెను. శివుఁడాతని పదబంధములకు నానందించెను. "నేఁటినుండి నేను నీకు మిత్రుఁడ. తిరునావలూరులో నీ వివాహము నాఁపి నిన్ను దాసునిఁగఁ జేసికొనిన నాఁటి కల్యాణవేషముతోడనే నీ వెల్లప్పుడు నుందువుగాక" యను నశరీరవాణి వినిపించెను. అంత నతఁడు "తిరువారూరు మాణిక్యమా! అర్ధనారీశ్వరా! నన్ను దాసునిఁగ గ్రహించిన పరమపురుషా! నీ దయాసంపదను నేనెట్లు నుతింపఁగలాఁడ." అను మకుటముఁగల పద్యమాలిక నా వల్మీకనాథున కర్పించెను. ఇట్లు స్తుత్యంజలుల నర్పించి, శివునకు ప్రదక్షిణ వందనము లాచరించి, యాలయమునుండి యొక మఠముఁ జేరెను. ఆనాఁటినుండి సుందరుని భక్తులు "శివమిత్ర" యని పిలువ సాగిరి. శివాజ్ఞ ననుసరించి నాఁటి మొదలా సుందరుఁడు కల్యాణవేషమున సంచరించుచున్నను పరిశుద్ధతపోనిధియై యలరారెను. తిరువారూరునందే నివసించుచు నతఁడు ప్రత్యహము త్యాగేశు నాలయమున కేఁగుచు నారాధించుచుండెను.

పరవియారు :—

పూర్వము కైలాసమున నుమాదేవి చేటికలలో నొకతె యగు కమలిని కామవశురాలైనందున శివుని యాజ్ఞచే తిరువారూరులో రుద్రగణికల వంశమున జన్మించెను. ఆమెకు తల్లిదండ్రులు పరవి యను పేరిడి యల్లారుముద్దుగఁ బెంచిరి. ఆ బిడ్డ దినదినాభివృద్ధి నంది, హరిణశాబకమా! పారిజాతకోరకమా! ప్రవాళలతయా! శీతాంశు ప్రతిబింబమా! మన్మథుని

40 A



సుందరమూర్తి కల్యాణవేషము

పుష్పబాణమా! యన నా బాలిక తరుణ వయస్కయయ్యెను. ఆ తరుణికి భవానియందలి భక్తితోఁబాటు పరువముఁ బెరుగ సాగెను. బ్రహ్మ తన సృష్టిలోని సౌందర్యమునంతయు నొకచోఁ జేర్చి యామెను సృష్టించెనా! యన నామె లోకోత్తర సౌందర్యవతియై యొప్పెను. అచ్చనగాయలు, కుందును గుమ్మలు, కందుకక్రీడలు డోలావిహారములు మొదలగు నాటల నాడుచు చెలుల నామె సంతసపఱచుచుండెను. ఆటలతోఁ బాటామె గానకళ నభ్యసించెను. ఆమె కంఠ మాధుర్యము వసంతాగమనమునఁ గోయిల కూజితము నధఃకరించుచుండెను. రాగతాళలయలతో కీర్తనల నామె గాన మొనరింప, సరస్వతియే భూమికి దిగివచ్చెనాయనఁ దోచును. బాల్యమును గడచి యౌవనమునఁ బ్రవేశించిన పరవియా రన్వహముఁ జెలులఁ గూడి, త్యాగేశుని సేవించి వచ్చుచుండెను. ఒకనాఁడు భగవద్దర్శనార్థ మేఁగి వచ్చు సుందరమూర్తి, యొక వీధి మలుపులో నాలయమున కేఁగు నా పరవియారును గాంచెను. దేవలోకమునుండి యవతరించిన తిలోత్తమయా యన నొప్పు నా సుందరినిఁ గాంచి, సుందరుఁడు ప్రేమవాగురలఁ జిక్కెను. ఈమె పుణ్యమునకుఁ బున్నెమా! మూర్తీభవించిన శివుని కృపయా! పారిజాతకుసుమమంజరియా! యని యతఁ డాశ్చర్య రసమగ్నుఁడాయెను. పరమశివున కర్పించిన నా మనంబు నీమె యెట్లాకర్షించెనని సంభ్రమించెను.

పరవియు సుందరునిఁ గాంచి, సంచలితహృదయ యయ్యెను. అది విధి సంకల్పమేమో! ఒండొరుల దృష్టు లేకమయ్యెను. వెంటనే సార్థక నామధేయుఁడగు సుందరుని. తన్ననుగ్రహింపవచ్చిన కుమారస్వామియా! లోకంబులఁ దన పుష్పబాణములచే వశ్యమొనర్చుకొను పూవిల్తుఁడా! విద్యాధరుఁడా! లేక శివుని కృపాసాగరమున మునింగిన భక్తాగ్రేసరుఁడా యని యామె తలంపసాగెను. "నా మనంబును క్షణములో నాకర్షించిన నీ యువతీమనోహరుండెవ్వండో" యని కొంతవడి యట్లేయుండి సుందరునిలో లగ్నమైన తన మనంబు నెట్టకేలకు మఱల్చికొని, యామె త్యాగేశు నాలయమున కేఁగెను.

ఆలయమున కేఁగు నీ సుందరి నా మనంబునుగూడ గొంపోవుచున్నదని తలంచిన సుందరుఁడు వెంటవచ్చువారిఁ గాంచి "ఈ వనిత యెవ్వర"ని ప్రశ్నించెను. ఆమె పరవి యను పేరుఁగల గణిక యని యెఱింగి మఱలి యాలయమున కేఁగెను. ఆ యువతి వల్మీకనాథుని సేవించి సుందరుని రాకకు ముందే వేఱొక గోపురద్వారమునుండి వెడలి యింటి కేఁగెను. సుందరమూర్తి గణికాలగ్నమనస్కుఁడై శివుని బ్రార్థించి, తన మనంబును వెంటఁ గొంపోయిన భూలోకరంభను వెదుక నారంభించెను. సుందరుఁ డామెను వెదకి వేసారి, చివరకు దేవాశ్రయమండపముఁ జేరెను. అంత సహస్కరుఁ డాతని మనంబుంబోలె కిరణజాలంబుల సంకుచించుకొని యస్తాద్రినిఁ

దరిసెను. సంజకెంజాయ తెల్లెడల నలముకొనెను. పంచాక్షరీమంత్రము నెఱుంగనివారి మనంబునందువలెఁ బెంజీకటి దిశలం దలముకొనెను. విరహులకు సంతాపప్రదాతయగు చంద్రుఁ డాకసమెక్కెను. ఆ శీతకిరణుని హస్తస్పర్శచే కలువలు విప్పారెను. మలయమారుతము మెలమెల్లగ వీవసాగెను. లోకానందకరుఁడగు సుధాంశుని కిరణజాలంబు సుందరునకు గ్రీష్మాతపమాయెను. కమ్మతెమ్మెర లాతని తాపము నినుమడింపఁజేసెను. అదెట్టి తాపమో యతఁడు గ్రహింపలేక కుములుచుండెను.

గృహమున కేఁగిన పరవియారు తపించుచు చంద్రశాలఁ జొచ్చి, పూసెజ్జపైఁ బరుండి పొరలాడసాగెను. చెలులామె తాపశాంతికై యొనర్చిన సేవలు విఫలమాయెను. ఆమె గాఢముగ నిట్టూర్చుచుండెను. సెజ్జపైని పూవులు కఱకు టెండలోని తొగ కామలయ్యెను. చెలులది మదనతాపమని గ్రహించిరి. 'ఏల సంతప్తవైతి'వని వారడుగ నామె "ఇది నా మనోబాధ. నేఁ డాలయమున కేఁగునపుడు కన్పించిన దివ్యపురుషుఁ డెవఁడో" యన వారాతఁడు శివుని మిత్రుఁడు సేవకుఁడునగు సుందరమూర్తి యని, నీ వెఱుంగవా!, యనిరి. "ఓహో! నా దేవునే సేవించు భక్తుఁడా" యని యామె సానురాగంబునఁ బల్కెను. ఆ రాత్రి యామె సుందరునే దలంచుచు నిద్రలేకయే గడపెను. తాపాధిక్యముచే నామెకు మూర్ఛయు వచ్చెను. సంతాపజ్వర మధికముఁగా శ్రమ

పడసాగెను. వీలోకో యని యెఱుంగక యే కన్నీరుం గార్చెను. తన బాధను వారింపుమని త్యాగేశుని ప్రార్థించెను. "మృగాంకా! నీవు నన్నేల బాధింతు" వని యుపాలంభించెను. రాత్రి గడువలేదే యని చింతించెను.

కైలాసోద్యానవనమున పుష్పాపచయావసరమునం గామించి, శివాజ్ఞచే సుందరమూర్తి పరవియారులుగ భూమి యందు జన్మించి, యా దేవదేవుని ప్రేరణచేఁ దపించు నా భక్తుల నేక మొనర్పఁ జింతించిన మదనాంతకుని చిద్విలాసముల నేమని కొనియాడఁగలము! త్యాగేశుఁడాయూర నుండు భక్తుల స్వప్నమునఁ గన్పించి, పరవియారునకు సుందరునకు విధ్యుక్తముగ వివాహముఁ గావింపుఁడని పల్కెను. అట్లే మదనాశుగములకు గుఱియైన వధూవరులకుఁ గన్పించి, యొండొరులు వివాహితులరై సుఖింపుఁడని యనుగ్రహించెను. వివస్వంతుఁ డుదయించగనే భక్తులందఱు శివాజ్ఞఁ దలఁదాల్చి, కల్యాణయత్నముల నొనర్చిరి. భక్తులే బంధువులై సుందరునకు పరవియారు నొసంగి కల్యాణమొనర్చిరి. వివాహానంతరము వధువుతో సుందరుఁ డాలయమున కేఁగి, మున్ను తన పెండ్లి నాఁపి, యిపుడు పరవి నొసంగిన మహోదాతయగు మహాదేవునకు పద్యమాలికల నర్పించి స్తుతించి యానందించెను. బంధవిమోచనములకా శివుఁడు కర్త, కారయితయు నగుఁగదా!

ఒకనాఁడు సుందరమూర్తి బంగరు బెత్తముఁ జేఁదాల్చి, కర్ణములందు మకరకుండలములు దివ్యకాంతుల నీనుచుండ,

విభూతి రుద్రాక్ష మాలాధారియై, జన్నిదములు వింత కాంతుల నీనుచుండ, నవరత్నాభరణ భూషితుఁడై పీతాంబరధారియై సొగసుగ స్వామిని సేవింప నాలయమున కేఁగెను. "ఈ చక్కఁదనమున కీ వేషమెంతయుఁ దగియున్న"దని పౌర కాంతలు గుసగుసలు వోవుచుండ, దేవాశ్రయమండపమున కాతఁడేఁగి యచటి భక్తులఁగాంచి "వీరికి దాసుఁడనై సేవించు భాగ్యము నాకెన్నఁడు గల్గునోయని భావించుచు, శివుని పురోభాగముఁ జేరెను. భక్తకల్పద్రుమమగు పరాత్పరుఁడు నా భక్తుని కోరిక నెఱిఁగి ప్రత్యక్షమాయెను. సుందరుఁడా మహాదేవుని వేనోళ్ల స్తుతించి, భక్తవరుల చరితము నెఱుంగఁజాలు జ్ఞానము నొసంగఁ బ్రార్థించెను.

అంత నా మహాదేవుఁడు "భక్తుల చరిత మెఱుంగుట సులభముగాదు. వారికి వారే సాటి. భక్తులు సదా నాపైఁ బ్రేమఁ గల్గి, నన్నే యాశ్రయించి యుందురు. వారు ఏకాగ్ర చిత్తులగుటఁజేసి లోకములను తమ శక్తితో జయించు సత్వ సంపన్నులై యుందురు. నా భక్తుల కీ లోకమున నెట్టి కొఱంతయు నుండదు. వారు సదాచారసంపన్నులై యిహ పరసుఖముల నాశింపరు. అట్టివారి నెఱింగి వారితోఁ జేరుము" అని యాజ్ఞాపించెను. వెంటనే సుందరుఁడు "నేనిచట శ్రేష్ఠులఁ గాంచితినని యారంభించు పదిహముఁ బాడెను. శివుఁడు "నీవు సదాచారముఁ బాటించి భక్తదాసుఁడవై వారిఁగూర్చి కవితా చమత్కృతితో పద్యములఁ జెప్పుము" అనెను. అంత

నాతఁడు "స్వామీ! నేను భక్తుల చరితమ్ముఁ గాని, వారి ప్రేమామృతసాగరమునుగాని తెలియనివాఁడఁగదా! వారి నెట్లు గీర్తింతు? దాసునకు వారి కీర్తిచరితముల నెఱుంగు శక్తినిఁ బ్రసాదించి, ధన్యాత్ముఁ జేయరే!" యని ప్రార్థింప వేదాది పరావాక్కులకు నాధారుఁడగు నా చంద్రశేఖరుఁడు "చిదంబరవాసులగు భక్తులకే దాసానుదాసుండ"నను పాదముతో నారంభింపుము. నా మహిమచే నీ కన్నియు నెఱుంగ నగును" అని పల్కెను. సుందరమూర్తి "దాసునిపై నెంత దయయో" యని మ్రొక్క శివుఁ డంతర్ధానమొందెను.

ఇట్లనుగ్రహీతుఁడై సుందరుఁడు దేవాశ్రయమండపముఁ జేర నరిగి, దూరమునుండియే భక్తసమాజమునకు సాష్టాంగ మొనర్చి, వారిని సమీపించి, సర్వకాల సర్వావస్థలందు నశింపని తేజోవంతులగు భక్తుల కొక్కొక్కరికి వందన మాచరింపఁదలచి, యొక్కొక్క భక్తుని పేరు నుచ్చరించుచు "దాసానుదాసుఁడ"ననుచు మ్రొక్కెను. అట్లే యితర భక్తులకు సాష్టాంగమొనర్చి "తిరుత్తొండత్తొహ" యను గీతముఁ బాడెను. అట్లు పాడుటఁజేసి వారి చరితము "శివభక్త చరితము" అని ప్రసిద్ధిఁగాంచెను. (ఇట సుందరుఁడు సెప్పిన "తిరుత్తొండత్తొహ" వివరింపఁబడు.)

భక్తవరులు:—(అరువది మూవురు)

"చిదంబరవాసులగు బ్రాహ్మణులకే దాసానుదాసుండ. కులాలుఁడగు తిరునీలకంఠునకు, లేదనని త్యాగి యియల్పహకు,

ఇళయాన్కుడిమారునకు, విజయశీలుఁడగు మెయిప్పొరుళు నాయ నారునకు, నుద్యానవనములతో విలసిల్లు కున్ఱియూరువాసి విరన్మిండునకు, మల్లికామాలికలఁ దాల్చు నమరనీతికి, త్రిశూల ధారియగు నెరిబత్తునకు, ఏనాదినాథునకు, సకలకళాచతు రుఁడగు కన్నప్పనాయనారునకు, కడయూరి కళయనారునకు, పర్వతస్థిరభుజుఁడగు మానకంజారునకు, వాట్టాయనునకు సముద్రతరంగముల నంటు తిరుమంగలవాసి యానాయనునకు, మూఁడడుగులతో లోకములఁ బాలించు మూర్తినాయనారునకు, మురుగనునకు, రుద్ర పశుపతికిని, దాసానుదాసుండను. సదా చిదంబర దర్శనాకాంక్షియగు నందనారునకు, కారుహస్తకులజుఁ డయ్యు శివభక్తాగ్రణియగు తిరుక్కురుప్పు తొండరునకు, చండే శ్వర నాయనారునకు, శ్రమణాశ్రయుఁడయ్యు శివపాదసేవా రతుఁడగు తిరునావుక్కరసునకు, శివభక్తియే ధనమని భావించిన కులచ్చిర నాయనారునకు, పెరుమిళమునఁ బుట్టిన కురుంబరునకు, పేయారునకు, నే దాసానుదాసుండను. పురుషశ్రేష్ఠుఁడగు అప్పూది నాయనారునకు, నీలనక్కరునకు, నమినంది విశ్వాసికిని, యుమాదేవికి నసుంగు బిడ్డఁడగు జ్ఞానసంబంధునకు, శివునకుఁ దప్ప నన్యులకు శిర మొగ్గని యేయర్కోన్కలికామునకు, తిరు మూలరునకు, దండికిని, మూర్ఖనాయనారునకు, నే దాసాను దాసుండను. సోమాశిమారునకు, బౌద్ధులకు భీతిల్లి శిలా ఖండములతో శివునారాధించిన, శాక్య నాయనారునకు, శిఱప్పులి నాయనారునకు, తిఱుచెంగాటవాసియగు చిఱుతొండ

నికి, వారివాహామువలె నిష్కారణ ధర్మాత్ముండగు కళరిచ్రలి వారునకు, సకలజీవుల భాషల నెఱుంగు, గణనాథునకు, కూట్రువ నాయనారునకు. అతిభక్తరునకు, కలకంబనికి, ఎళంబుల్లునకు, నే దాసానుదాసుండను. అసత్యభాషల్కుగాని విద్వాంసులకు దాసుండను. కరువూరులో నుండు పుగళ్చోళునకు, నరసింగ మునికి, కలియనారునకు, సత్యనాయనారునకు, అయ్యాళిగ ళ్కాడవర్కోన్నాయనారునకు, కారినాయనారునకు, నెడు మారునకు, వాయిలారునకు, మనైయడువారునకు, నే దాసాను దాసుండను. కడర్సింగ నాయనారునకు, ఇడంగళికి, చెఱు త్తొణ నాయనారునకు, పుగళ్తుణ నాయనారునకు, కోట్పులి నాయనారునకు, శివభక్త సంఘమునకు, శివుని నుతించువారికి, తిరువారూరు భక్తులకు, నే దాసానుదాసుండను. ముక్కా లములందు శివు నారాధించు నాచార్యులకు, భస్మధారులకే దాసానుదాసుండను. పూశలారునకు, మంగయక్కరిశికి, నేశనాయనారునకు, కోశంగచోళునకు, తిరునీలకంఠయాల్పాణ నాయనారునకు, శడయనాయనారునకు, ఇశై జ్ఞానికి నే దాసాను దాసుండను'' అని పాడి మ్రొక్కి సుందరుం డానందించె.

చిదంబర దీక్షితులు :—

వర్ణనాతీతమైన నటరాజేశ్వరుని పాదారవిందములను సదా మనసార ధ్యానించుచు చిదంబరవాసులై ప్రసిద్ధివడసిన శివభక్త దీక్షితులు మహిమోపేతులు. వారు భస్మాభ్యక్త దేహులై నటరాజు కైంకర్యమునందే దేహాత్మలను వినియో

గించు ధన్యులు. వారు గుణాధికులై మహిమకుఁ బరాకాష్ఠ వందియుండిరి. నిత్య శివసేవాభాగ్యము వారి సొమ్ము. శివ పూజలందేకాక వారు మంగళనాట్యములందు నానంద మనుభ వించుచుండిరి. వారెల్ల వేళల ఋగ్వేదాదులను మననము సేయుచుండుటయే కాక యితర ధర్మకృత్యములం దత్యంతా సక్తులై యుండిరి. వేదాంగాదులైన శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్త జ్యోతిషాదులందు వారికి వారే సాటి. వారు మీమాంసా న్యాయపురాణ స్మృత్యాదులను పఠించి, యందలి సమస్యలను చక్కఁగ విడఁదీయ సమర్థులు. ఉపాయచతు ష్టయసహిత నీతిశాస్త్ర మందఱకు చేతిలోని యుసిరికమై యుండెను. త్రికాలములందును వారగ్నిత్రయమందు సవన మొనర్చి దేవప్రీణనము గావించుచుందురు. వారు సకల జీవులందు సదయులు. ధర్మాతిక్రమణమను పల్కును వా రెఱుంగరు. నటరాజసేవయే పరమధర్మమని భావించు నా దీక్షితులు భూదేవోత్తములని విఖ్యాతి నందిరి. విధ్యుక్తమైన కర్మల నాచరించుచు, సన్మార్గగాములగుటఁ జేసి లోకసహజము లగు నాధివ్యాధిక్షుద్బాధలు వారిదరిఁ జేరకుండును. వారికి అలభ్యలభ్యమగు ధనము విభూతియ. నాట్యశేఖరునందలి నిరంతర భక్తియే వారి భాగ్యమై యుండెను.

శివాగమములందుఁ బేర్కొనఁబడిన జ్ఞాన క్రియాచర్యా యోగముల నాపాతముగ నెఱింగి యనుష్ఠించు నా దీక్షితులు తపోదానాదులందును నియతవ్రతులై యుండిరి. దురాగత

ములు వారియందు మచ్చునకైన గన్పింపవు. అభిమానధను లైనను వారు శాంతాత్ములు. గృహస్థాశ్రమముఁ జక్కఁగ నిర్వహించుచు వారు, సదాచారపరులై యుండిరి. వేదచోదిత ధ్యాన నిష్ఠాగరిష్ఠులగు దీక్షితులా పత్తనమున మూఁడు వేలమంది యుండిరి. వారిహామందే పరాత్పరుని సమగ్రకృపాపాత్రు లగుటఁ జేసి, వాంఛారహితులై సుఖులై భోగభాగ్యములతోఁ దులఁదూఁగుచుండిరి. వారి ప్రతిభ వర్ణనాతీతము. శంకరుఁడే సుందరమూర్తికి "చిదంబరవాసులగు దీక్షితులకే దాసాను దాసుండ"నను పాదమెత్తి యిచ్చియుండుటచే వారి మహిమ లోకాతీతమని దెలియవచ్చెడిఁ గదా!

"బ్రహ్మజ్ఞాన నిష్ఠాగరిష్ఠులు బ్రహ్మతుల్యులు గారే."

# 2. తిరునీలకంఠ నాయనారు

భక్తాగ్రేసరులకు నిలయంబగు చిదంబరమునఁ గులాల కులమందొక భక్తుఁడు జన్మించెను. అతఁడాబాల్యము శివ పూజాధురంధరుఁడై స్వకుల ధర్మమును వీడక, శివదాసులకు దాసుఁడై యుండెను. గృహస్థుఁడయ్యు శైవమార్గమును జవ దాఁటక, సదా శివసేవలో నిమగ్నుఁడై యుండువాఁడు. కుండలను చేసి విక్రయించుచు, దానివలన లభించు నల్పాదాయముతో, కుటుంబమును పోషించుకొనుచుండెను. అవకాశము లభించినపుడంతయు మంటితో భిక్షాపాత్రములఁ జేసి, యోగులకు మాహేశ్వరులకు నొసంగెడివాఁడు. అతని గృహిణియు నందకత్తెలలో మిన్నయై, పతిపాదములను సేవించుచు, భర్త ననుసరించుటచే నాతని గృహస్థ జీవనము, చింతారహితమై మూఁడు పువ్వు లారు కాయలయ్యెను.

క్షీరసాగర మథన సమయమున లోకభయంకరమై, దేవ దానవ విద్రావణకారణంబై, పై కుబికి వచ్చిన హాలాహలమను కాలకూట విషమును, లోకరక్షణార్థమై శివుఁడు భుజింప, నది కుక్షిలోని కేఁగక కంఠమునందే నిలుచుటఁజేసి, యాతఁడు నీల కంఠుఁడని లోకవిశ్రుతుఁడయ్యెను. అట్టి నీలకంఠు, నీ కులాలుఁడు సర్వకాల సర్వావస్థలయందు ధ్యానించుచు "నీలకంఠా!" యని గొంతెత్తి, పిలుచుటచే జనులందఱాతనిని "తిరునీల కంఠుఁడ"ని పిలువఁజొచ్చిరి.

ఇనుప • కచ్చడాల్దాల్చిన మునులు సయితము త్రామ రసనేత్రలిండ్ల బందా లగుదురు, లోకసహజముఁ గాన నీ నీలకంఠుఁ డొకనాఁడు వేశ్యవాటికఁ బ్రవేశించి, యొక యందాల బరణి గాఁగిట సుఖించి, యింటికి వేగుజామున వచ్చెను. సానివాడలో పరకాంతాశ్లేషము నంది, తచ్చిహ్నములతో నింటి కేఁతెంచిన, భర్తను గాంచి, యాతని సతి యీాషత్కుపిత యయ్యెను. పరాంగనాసక్తుఁడగు భర్తను గాంచి, యే మానిని యోర్వఁ గలదు! ఆనాఁటినుండి యా సతి యథాపూర్వము భర్తను సేవించుచున్నను, దేహసంపర్కమునకు మాత్ర మంగీకరింపక, జీవయాత్రను సాగించుచుండెను. నీలకంఠుఁ డామె మనంబుఁ దేర్పఁబూని యొకనాఁ డాశ్లేషసౌఖ్యము నాశించి చేఁజాచెను. అంత నా కోపన "నీవు మమ్ము తాఁకిన నీలకంఠునిపై నొట్టు" అని పల్కెను. శివునిపైఁ బల్కిన శపథమును విని, యాతఁడా నాఁటినుండి భార్యాసౌఖ్యమును మనంబునఁ దలంపక విడనాడెను. భార్యను పరస్త్రీవలెఁ జూడఁజొచ్చెను. "మమ్ము తాఁకిన" అను బహువచన ప్రయోగముచే నాతఁడా వనితనే గాక, లోకంబులోని యువతులందఱను మాతృభావమునఁ గాంచు చుండెను. ఆ దంపతులు రత్యాది తుచ్ఛ సుఖములను వీడి, శపథానుసారమున్నను, పరులకా విషయము దెలియని విధ మున నడచుకొనిరి. వారి శయ్యలు వేఱు. ఇవ్విధంబున నేండ్లు పూండ్లు గడచెను. వారు వృద్ధులైరి. ముదుసలితనముతోఁ బాటు దైవభక్తియు వృద్ధియగుచుండెను.

వారి నియమనిష్ఠలను లోకమున కెఱింగింపఁ గోరి పరమశివుఁ డొకనాఁడు మొలత్రాటికి బిగించి కట్టిన కౌపీనమును, నొడలినిండ విభూతిని, నొసట భస్మత్రిపుండ్రముల, నురమున తెల్లని జన్నిదములఁ దాల్చి, శిరమునఁ జటాబంధముఁ, జేత భిక్షాపాత్రఁబట్టి యొకానొక శివయోగివేషముఁదాల్చి, చిఱునగవొక వింతఁ గొల్పుచుండ, నీలకంఠ నాయనారు నింటికి హుటాహుటి వచ్చెను.

నీలకంఠుఁడా యోగిగ వచ్చిన శివున కెదురేఁగి, భక్తిఁ దోడ్తెచ్చి, యాసనార్ఘ్యాదులఁ బూజించి, నమస్కరించెను. "శివా! యీ దాసుఁడు సేయఁదగు సేవ యెద్దియో దెల్పవేఁడెద" ననెను. అంత నా కపట శివయోగి యాతనిఁ గాంచి "భక్తుఁడా! యీ భిక్షాపాత్రను నీకడ భద్రముగ దాఁచుము. నే మఱల వచ్చి యడిగి తీసికొందును. దీనికి సాటి లోకమందు మఱొకటి లేదు. ఇది పరిశుద్ధము, పవిత్రమును. నాకిది స్వర్ణరత్నాదులకంటె ప్రీతిపాత్రమైనది. దీనిని భద్రపఱుపుము" అని దాని నాతని కొసంగెను. తిరునీలకంఠుఁడు శివయోగి యొసఁగిన పాత్రను ప్రసాదమని గ్రహించి, యింటిలోఁ బదిలమొనర్చెను. ఆ యోగియు నిశ్చింతుఁడై యెటకో పోయెను. నాయనారా యోగిని సాగనంపి వచ్చెను. ఆ యోగి శివుఁడై చిదాకాశమనఁదగిన కనకసభఁ జేరెను.

కొన్ని వాసరములు గడచెను. శివుఁడు నాయనారుని పరీక్షింపఁదలఁచి, తానొసఁగిన భిక్షాపాత్ర నాతఁడు దాఁచిన

స్థలమున లేకుండ నొనర్చెను. నీలకంఠుని భక్తిని లోకము నకుఁ జాటఁగోరి, శివుఁడు యోగివేషమున నా కులాలభక్తు నింటి కేతెంచెను. భక్తుఁడు యోగి నర్చించి, "తమ రాకచే నా జన్మ తరించినది. ఆజ్ఞ యే"మనెను. శివయోగి "నే నీకడ దాఁచిన భిక్షాపాత్రను దెచ్చి యిమ్ము" అని సాధికార ముగఁ బల్కె. నాయనారు, తా భద్రపఱచిన స్థలమున కేఁగి పాత్రను వెదుక, నది కన్పింపదయ్యె.

అంత నాతని దేహము వడఁకెను. ఇంటిలోనివారిని పాత్రమెచట? యని యడుగ వారు మాకుఁ దెలియదనిరి. "అయ్యో! యోగికేమి బదులొసంగఁగలాఁడ. నాకెట్టి దుర్దశ వచ్చెను?" అని వాపోయెను. దుఃఖాధిక్యముచే నాతఁడు సొమ్మసిల్లెను. ఇల్లడ యుంచిన వస్తువు నొసంగి, కృతార్థుఁడఁ గానైతినే యని, పరితపించెను. అతని వంత కంతము లేక పోయెను. 'ఎంతకు లోనికేఁగినవాఁడు రాఁడయ్యె'నని యోగి "శీఘ్రముగ వత్తునని లోనికేఁగి, యింతకు రాకుండుటకు హేతు వే"మని గొంతెత్తి పల్కెను. ఆ యార్భాటము వినిన నాయనారు వెలికి వచ్చి, నమస్కరించి, "స్వామీ! ముప్పిరి జన్నిదముఁ దాల్చిన ప్రభూ! క్షమింపుము. మీ పాత్ర నే దాఁచిన చోట నెమకితిని. కన్పింపదయ్యె. ఇల్లంతయు గాలించి తిని. దానికంటె క్రొత్తదానిని దృఢముగ చిరకాలము మను నట్టిదిగఁ జేసియిత్తు. ఈ యపరాధమును సైరింపుఁ"డని పాదములపైఁ బడి మ్రొక్కెను.

శివయోగి కను లెఱ్ఱఁజేసి, రుద్రుఁడై "నీయొద్ద న్యాస మొనర్చిన నా పాత్ర నపహరించి, వంచింపఁ దలఁచుచున్నాఁడవు. నే నీ కొసంగిన దానిఁ దప్ప నీవు బంగారపుఁ బాత్ర నిత్తు ననినను నే నొల్ల. నా మృణ్మయ భిక్షాపాత్ర నే తెచ్చి యిమ్ము" అని కఠినముగఁ బల్కెను. నాయనా రాతనిఁ గాంచి, "ఓ నిత్యాత్మా! యెంత వెదకినను నీ పాత్ర దొరక దయ్యె. నేను వేఱొక మృణ్మయపాత్ర నొసంగెద. కైకొనుఁడు. దేవర కోపించి యదియే కావలయు ననిన, యేమి చేయఁగలను? ఎట్లు సమర్పింపఁగలను? అనుగ్రహింపుఁ డీ దాసుని" అని ప్రార్థించెను.

అంత నా యోగి "ఓయీ! నీ యింట దాఁచిన నా పాత్రను దొంగిలించి, కపటనాటక మాడుచున్నాఁడవు. నీ వపకీర్తికి వెనుదీయువాఁడవుగఁ గన్పించుట లేదు. కాన నగర వాసుల యెదుట నిన్ను బంధించి, నా పాత్రను పొందక, యే మఱలువాఁడఁ గాను" అని పల్కెను. నాయనారు "స్వామీ! నేను చోరుఁడఁ గాను. కపటుఁడ గాను. నా మాట నిల్పు కొన, నీవేమి యాజ్ఞ యిడినను శిరసా వహింతు" చెప్పఁ డనెను. అట్లగుచో "ఓయీ! నీవు నీ కుమారునితో సరో వరమున, 'మునింగి నే నపహరింప లేదని సత్య మొనర్పుము" అని కోరెను. అంత నాయనారు "మీ మాట నెరవేర్ప నే నశక్తుఁడను. నాకు పుత్త్రుఁడు లేఁ"డ నెను. అట్లగుచో

"నీవు నీ యిల్లాలి కరము గ్రహించి, నీట మునింగి శపథ మొనర్పుము" అనెను.

అంత నా కులాలభక్తుఁడు "అయ్యా! నేను నా భార్యను తాఁకనని శపథ మొనర్చితిని. కావున మీరు గోరినట్లాపె కరముఁ బట్టి ప్రతిన యొనర్పఁ జాలను" అనెను. యోగి "ఓయీ! మిథ్యావాదీ! పాత్ర నొసంగవు. చెప్పిన విధమున భార్య చేఁబట్టి నీట మునింగి, శపథ మొనర్పవు. ఏమి నీ కపట నీతి. నీ వైరాగ్య మేమి? చూచెదఁ గాక. నే నిపుడు శివదీక్షితుల సభ కేఁగి దీనిని వివరింతు"నని కనక సభలోనుండు దీక్షితులను సమీపించెను. నీలకంఠుఁ డాతని వెన్నంటి సభ కేఁగెను.

శివయోగి సత్పురుషులు శివదీక్షాపరులగు మూఁడువేల మంది దీక్షితులుండు కనకసభఁ జొచ్చి, "అయ్యలారా! నే నీతని కడ దాఁచిన భిక్షాపాత్ర నొసఁగక లేదనుచున్నాఁడు. భార్య కరముఁబట్టి నీట మునింగి యపహరింపలేదని ప్రతిన సేయు మన, నద్దియుఁ గాదనుచున్నాఁ"డని వాద మొనర్చెను. దీక్షితులు "కులాలా! దీనికేమి బదులిత్తు" వనిరి. అతఁడు వారికి మ్రొక్కి, యితఁడు గొప్ప ధనమని చెప్పి దాఁచ నిచ్చిన పాత్ర గన్పింపదు. అదెట్లో పోయినది" అనెను. వాని మాటలకు వారు "ఓయీ! పాత్ర లేనిచో నితఁడు గోరినట్లు నీట మునింగి శపథ మొనర్పుము. అదియే న్యాయ"మనిరి. భార్య నంట రాదను తన నియమమును వారికి నివేదింపక, యా కులాలుఁడు

విజయమందిన యోగినిఁ గాంచి "మీరు గోరినట్లు సత్య మొనర్తు రండ"ని పల్కి యింటికేఁగి సతిని దోడ్కొని వ్యాఘ్ర పాదుఁడు పూజసేసిన తిరుపులీశ్వరమను శివాలయమునకు ముందుండు కోనేటిని చేరి, యొక వేణుదండము చివర నొక దానిని భార్యను గ్రహింపు మని చెప్పి, తానొక యగ్రమును బట్టికొని, నీట మునింగెను.

అంత నా యోగి "ఓయీ! భార్యాహస్తము గ్రహించియే మునుఁగుము" అనెను. నాయనారు జనులందఱు విన, తన భార్య చేతిని ముట్టరాదను తన నియమముఁ దెల్పి, వేణుదండముఁ బట్టియే నీట మునింగి లేచెను. మునిఁగి లేచిన యా వృద్ధ దంపతులు నవయౌవనసుందరాంగులై యుండిరి. ఆ యద్భుతముఁ గన్నులార గాంచిన జనులందఱు వారిని పొగడిరి. ఇంతలో తీరమున నున్న శివయోగి యదృశ్యుఁ డాయెను. అతనిఁ గానక యందఱు భీతిల్లిరి.

పార్వతీపరమశివులు అభయమిచ్చుచుఁ మింటఁ గన్పింప నీలకంఠుఁడు సతీసమేతుఁడై యా యాదిమదంపతులకు సాష్టాంగమొనర్చి స్తుతించెను. భవానీపతి కులాలదంపతులఁ గాంచి "మీరు నిత్య యౌవనవంతులరై నా నిలయ మందు సుఖింపుఁ"డని యనుగ్రహించి యదృశ్యుఁడయ్యెను. నీలకంఠ నాయనారు నాతని సతీమణియు తరుణులై శాశ్వత కైలాసస్థితిఁ గాంచి సుఖించిరి.

"నియమపాలనము ఇంద్రియ నిగ్రహములు
శివసాయుజ్యప్రాప్తి హేతువులు."

# 3. ఇయల్పహ నాయనారు

(జనేంగితప్రదుఁడు)

విజయసూచకమగు శ్వేతాతపత్రముఁదాల్చిన, అనపాయచోళుని వంశీయుఁడగు "యశోవంతుఁడు" పాలించినది చోళదేశము; అందు తన జలంబులచే సస్యశ్యామల మొనర్చు పవిత్రమైన కావేరీ నది యొయ్యారపు నడలతో, తన ప్రియుఁడైన సాగరుఁ జేరుచుండును. అచ్చోట "పుహార"ను ప్రసిద్ధిఁగాంచిన కావేరీపూం పట్టణము చోళరాజులకు ప్రధాన నగరమై విశ్వవిఖ్యాతి నందియుండెను. అన్నగరమందు వైశ్యకులావతంసుఁ డొకఁడుండెను. ఆతఁడు కుబేరుని తిరస్కరించు సంపన్నుఁడు. ఆఢ్యుఁడగుటయే గాక చంద్రకళావతంసునకు దాసుఁడై భక్తాగ్రగణ్యుఁడై యుండెను. భస్మధారు లేజాతి వారైనను, వారేమి కోరినను లేదనక, యొసంగుచు విశ్వదాత యని, లోకవిఖ్యాతి నందియుండెను. దాన మొసంగుటలో లోకసంప్రదాయములకు విరుద్ధముగ భక్తుల కోరికలఁ దీర్చు త్యాగి యగుట జనులాతని "ఇయల్పహ నాయనార"ని పిలువసాగిరి.

"భక్తుల కోర్కెలఁ దీర్చుటయే గృహస్థధర్మ"మని విశ్వసించి, జీవించు నా భక్తుని త్యాగమును లోకములఁ జాటఁదలచి, శివుఁడు ధూర్తబ్రాహ్మణ వేషముఁ దాల్చి, యా దాసు

నింటి కేతెంచెను. (పరాంగనా రతిచిహ్నములతో వచ్చు శృంగార నాయకుఁడు ధూర్తుఁడు) ధూర్తలక్షణముతోఁ బాటు విభూతియుఁ దాల్చి వచ్చుటచే నాతని నొక శివభక్తునిగఁ జింతించి, నాయనారుఁ డాతనికి స్వాగత మొసంగి, గృహంబు లోనికిఁ గొంపోయి, అతిథి పూజఁ గావించి, "దేవర రాకచే నా గృహంబు పావనమయ్యె"నని ప్రస్తుతించెను.

ధూర్త వేషధారియైన యా విప్రుఁ డతనింగాంచి, "వర్ణప్రకర్షముఁగల కొండగోఁగుఁ బూవులందాల్చు శివభక్తు లెద్ది గోరినను, "నాస్తి" యనక ప్రీతితో నొసంగు దాతవు నీ"వని విని, నిన్నొక వస్తువు నర్థింప వచ్చితిని. నేఁ గోరు దానిని కాదనక యిత్తునన్న నా కోరికఁ దెల్పెద"ననెను. ఇయల్పహ నాయనారా పల్కుల నాలించి "స్వామీ! నాకడ నుండు ద్రవ్య మెద్దియైన నయ్యది శివభక్తులకు సొంతమే యగు. నే నీయరాని దేదియు నుండదు. సంశయము వీడి మీ కోర్కెఁ దెల్పుఁడు. అది యెట్టిదియైనను నెఱవేర్తును" అనెను. అంత నా కపట ధూర్త విప్రవేషధారియగు శివుఁడు "ఓయీ! నేను నీ ప్రియపత్నిని పొందఁగోరి వచ్చితి" అని నుడివెను. ఆ దుర్వార్తను మఱొకరైన సహింపఁగలరే! అట్లడిగినవానిని యముని సదనమున కతిథిఁగఁ బంపియుండరా! కాని లోకాసహజములఁగూడ తీర్చు నా నాయనారవ్వార్తను వినుటకుఁ బూర్వ మెట్లు నగుమోముతో నుండెనో, యట్లే యద్దానిని వినియు, వికసితవదనారవిందుఁడై యా కపట వేష

ధారి పాదపద్మములకుఁ బ్రణమిల్లి "తాము నా యధీనమందలి వస్తువునే కోరితిరి. అది నా పూర్వపుణ్యఫలమే" యని యంతర్గృహములోని కేఁగెను.

సతీమతల్లియు గృహిణీధర్మము నున్నతముగ నెఱవేర్చునది, యనురాగపాత్రయు నగు భార్య నాతఁడు గాంచి "నిన్ను నేఁడు మన యింటిని మెట్టిన యతిథివరేణ్యున కొసంగితి. "నేఁటినుండి నీవా తపస్విని యనుసరింపవలయు"నని నుడివెను. ప్రాణనాథుఁడు వల్కిన యా వార్తలను వినిన యా సతి కలఁతఁ జెంది, మూర్ఛపోయి, కొంతవడికి స్వాధీనచిత్తయై నాథునిఁ గాంచి, "ప్రాణనాథా! మీ యాజ్ఞను శిరసావహింతును. భర్తల యాజ్ఞలను తలఁదాల్చి నెఱవేర్చుటకంటె సతులకు వేఱు ధర్మమేమి గలదు" అనిన యామె మనోభావమున కాతఁడు సంతసించి యామెకు మ్రొక్కెను.

అడిగిన వెంటనే కాదనక ప్రాణాధికయైన సతినిఁగూడ తెచ్చి యిచ్చి "స్వామీ! యిఁక నేఁ జేయవలసినది యేమియైనఁ గలదేని యానతిం"డని వందన మాచరించెను. అంత నా ధూర్తాగ్రేసరుఁడు "భక్తా! నే నీ వనితను గొంపోవునపుడు నీ బంధువులు నగరవాసులు, నన్నడ్డగింపకుండునటులును, వారి వలన నాకే యాపద గల్గని విధంబున నీవు నాకుఁ దోడుగ రావలయును" అని కోరెను. "అయ్యో! యీ కైంకర్యము మీరు గోరక ముందే నేనే చేయవలసి యున్నది. అట్లు పల్కని నా దోషమునకు లజ్జించుచున్నాను. మీతో నిదె

వత్తు ''నని నుడివి యింటిలోని కేఁగి, మొలదట్టిని బిగించి, యిరు గేలఁ గత్తిని డాలును దాల్చి, ''వీరుఁడు చనుఁడు. మీ వెంటనే వత్తు ''నని బయలుదేరెను.

భార్య నొక ధూర్తునిపర మొనర్చెనను వార్త నగర మందు క్షణములో వ్యాపించెను. నాయనారుని చుట్టాలు అతని భార్యకు నాప్తబంధువులా వార్తను విని, ''భార్యను పరుల కర్పించు మూఢు లీ లోకమునఁ గలరా! యిది లోక మర్యాదకు విరుద్ధము. ఇతఁ డున్మత్తుఁడా యేమోఁ గాఁబోలు. మన జాతి యువిదను పరుఁడు గొంపోవ, మనము చేతగాని వారమై చూచుచుండుటయా! ఇట్లెన్నటికిని జరుగరా''దని వారాగ్రహోదగ్రులైరి. ''లెండు. వంశప్రతిష్ఠఁ బాపి కొందము'' అని ధనుర్బాణములను, ఈటెయలను, కరవాలము లను దాల్చి, యొకరి నొకరు పిలుచుకొనుచు, వీరావేశమున బయలుదేరిరి.

నగరి బాహ్యప్రదేశమునఁ బయనించు ధూర్తుని, వైశ్య కాంతను గాంచి, వారు చుట్టుముట్టిరి. ''ఓరీ! దుష్టా! నిలు నిలుము. అడుగెత్తితివా చత్తువు'' అని యాతని మార్గము నడ్డగించిరి. మా కులకీర్తిరూపయగు నబలను నీ వెట్లు గొంపోవ నుంకించితివి? విడుతువా! లేదా!'' యని హుంకరించిరి. వారి వీరరసోన్మాదముఁ గాంచిన ధూర్తుఁడు వడంకెను. భీతి గ్రస్తునివలె నటించెను. దీన దృష్టులతో నా కాంతవైపు చూచెను. వెంటనే యా సతి ''భగవంతుఁడా! మీరేల

కంపించెదరు. నాయనారు వీరిని జయింపఁగలాఁడు. మీరు భయముడుగుఁ"డని నుడివెను.

వెంటనే నాయనారా మాటలను విని "స్వామీ! వారి వలన మీకే కీడును గల్గదు. మీరు చూచుచుండ వారిని నాశ మొనర్తు. ఈ సంఘటనమునకు మీ రాయాసపడకుఁ"డని పల్కి, దారి కడ్డునిలిచిన బంధువులను తీక్ష్ణదృక్కులఁ జుఱచుఱఁ గాంచి, "మీరిట నిలువక పాఱిపొండు. ప్రాణములఁ గాపాడుకొనుఁడు. అట్లేఁగకున్న మిమ్ము నా కత్తికి బలియిత్తు"నని గర్జించెను. అంత నాతని బంధువులు బెదరక "ఓరీ! నీచాత్మా! నీవేమి ఘనకార్యముఁ జేసితివని మాట్లాడుచుంటివి? నీ వొనర్చిన యీ నీచకార్యము కులమునకే తలవంపని చింతింపవైతివి. మన పగవారు పరిహసింపరా! కాంతను పరులపాలొనర్చిన పాపాత్మునకుఁ బల్కులుగూడ పరుసములగుచున్నవియే. మేమందఱ మిచట సంఘమరణము నొందినను నీ ధూర్తుని కులకాంతతో పోనీయము" అని చలింపక నిల్చిరి.

అంత నాయనారాస్పందదధరోష్ఠుఁడై దంతముల పెటపెట గొఱుకుచు "మొదట మిమ్ము ఖండఖండములుగ నఱికి పిదప నీ భక్తుని మార్గము నిర్నిరోధ మొనర్చి సాగనంపుదు" నని పల్కెను. వారాతని బెదరింపులకు బెదరక ధూర్తుని మార్గము నడ్డగించిరి. నాయనారు కోపము భరింపఁజాలక ఖడ్గమును జళిపించుచు, వారిపైఁబడి, పురుషవ్యాఘ్రమువలెఁ

జీల్చుచు, సవ్యపక్షీణములం దాఁకి, వారి హస్తపాదములను శిరము లను నఱకుచు, మొండెములను భూమిపై దొరలఁ జేయుచు నా స్థలమును భీభత్స మొనర్చెను. అచ్చోటు హాహాకార ముల కిరవయ్యెను. పొట్టలు తెగి ప్రేగులు వ్రేలాడుచుండ కొందఱు పడిరి. తలలు లేని మొండెములు నాట్యమాడెను. రుధిరపు మడుఁగు లేర్పడెను. చచ్చినవారి మాంసముఁదిన నాకాశమందంతట సందులేక గ్రద్దలు రాబందులు దిరుగాడ సాగెను. ప్రాణభీతిచే పిక్కబలముఁ జూపిన కొందఱు పురము సొచ్చి సెప్ప, జనులందఱు నానాదిశలనుండి తండోపతండము లుగ వచ్చి, నాయనారుఁ దాఁకిరి. వారిఁగాంచి కొంచె మేనియు భయపడక యభిమన్యునివలె నొంటరివాఁడయ్యు ధైర్యముఁ జిక్కఁబట్టి వారి నెదిర్చి పోరసాగెను. దెబ్బకు నూర్గురు చచ్చిరి. చావఁగ మిగిలినవారు కాలికి బుద్ధి సెప్పిరి. కాదు కూడదని యెదిరించినవా రసువులఁ గోలుపోయిరి. నాయనారు హరిణములమధ్య సింహమువలె విహరించి, శత్రువు లను నిశ్శేష మొనర్చి "స్వామీ! భయములేని రీతి మిమ్మ రణ్యము దాఁటింతు. రండు" అని వారికిఁ దోడు పోవసాగెను.

ముప్పురును ఛాయావనముఁ జేరిరి. అంత ధూర్త వేషధారియగు శివుఁడు నంబిని గాంచి "ఇఁక నీవింటికిఁ బోవచ్చును" అని పల్కి, నాయనా రాతనికి మ్రొక్కి "మీ కృపాసంపదకు నర్హుఁడనైతి"నని యింటి దారిఁబట్టెను. పరమ శివుఁడు మఱలి పోవు నా వీరభక్తునిఁగాంచి, "ఓయీ! దాస

వరేణ్యా! రమ్మిటు రమ్ము. మహాత్మా-ర్యాశరణదక్షా! భక్తాగ్రేసరా! రమ్ము ర''మ్మని గొంతెత్తి బ్రహ్మాదుల కగమ్యుఁడగు నాతఁడు పిలిచెను. అతఁడా పిలుపును విని మరలి "దేవరను బాధించు దుష్టాత్ములింక నున్నారా! అట్టివారున్న వారి ప్రాణములఁదీయ ఖడ్గము సిద్ధముగ నున్నది. ఇదిగో వచ్చుచున్నా''నని యాతఁడు పరుగిడి వచ్చెను.

కాని యట ధూర్త బ్రాహ్మణుఁడు గానరాలేదు. సతి యొక్క-ర్తుక నిలిచియుండఁ గాంచి యాశ్చర్యచకితుఁడాయెను. అపుడు కైలాసముపై కనకశైలమా యన నందిపై భవానీ సహితుఁడు భవుఁడు ప్రత్యక్షమాయెను. నాయనారు సాష్టాంగ మొనర్చి, కన్నులనుండి యానందాశ్రువులు రాలుచుండ "భక్తపాలకా! నీ ప్రేమ సాగరమున నన్ను ముంచితివి. మధ్యే మార్గమున నన్ను దాసునిగ పరిగ్రహించితివి. కనక సభలో దివ్యనాట్యావసరమున నుద్ధృతమగు నీ పాదపద్మము ను నా శిరమునఁ గీలింతు''నని స్తుతించెను.

భవానీపతి భక్తుని ప్రియమార గాంచి, "నీ భక్తికి మెచ్చితి. ప్రాణాధికమైన భార్యనే, త్యాగమొనర్చి, నా ప్రీతికిఁ బాత్రుఁడవైతివి. నీవు నీ ధర్మపత్నితోఁ గలిసి నా లోకమునకు వచ్చి, నా వెంట నుందువు'' అని కృప సూపి, యంతర్ధానమంది చిత్సభను చేరెను. ఆ దంపతులపై నమృతాంధసులు పుష్పవృష్టిఁ గురిసిరి. దేవదుందుభులు మ్రోఁగెను. దేవర్షులు స్తుతించిరి. ఇయల్పహా నాయనా

రిట్లు శివుని కృపాపాత్రుఁడై పత్నీసహితుఁడై శివలోకమున కేఁగి, శాశ్వతముగ శివసాన్నిధ్యము వీడక సుఖించెను. నాయనారు నెదిరించి మరణించినవారు వీరస్వర్గముఁ జేరి సుఖించిరి.

"భక్తుల కొసఁగరానిది లోకమందేదియు నుండదు. ప్రాణమును ప్రాణాధికయగు సతియు భగవంతుని సొమ్మే. అహంకార మమకార రహితులే శివుని కృపాపాత్రులు."

# 4. ఇళయాన్కుడిమార నాయనారు

రామనాథమండలమందు 'ఇళయాన్కుడి' యను గ్రామ మొండు గలదు. అందు కృషికకులమందు మారుఁడను శివ భక్తుఁడుండెను. అతఁడు చిదంబర కనకసభలో తాండవ మొనర్చు నటరాజేశ్వరుని మనంబున నిల్పి, యా దేవదేవుని పాదార విందములను ధ్యానించువాఁడు. కాన శివదాసులలో నతఁడు ప్రథమగణ్యుఁడై యుండెను. కృషీవలుల తపఃఫలమా యన నా జాతికే రత్నమై యుద్భవమంది, మారుఁడు ధర్మశీలుఁడై సంసారధర్మములను నిర్వర్తించుచుండెను. అతనిది భాగ్యో పేతమగు కుటుంబమయ్యు, కులధర్మమును వీడక భూమిని దున్ని, పైరుఁబెట్టి పంటలను పండించుచుండెను. అతఁ డే కార్యముఁ జేయుచున్నను మనంబును శివాధీన మొనర్చి, నిష్కామకర్ముఁడై యుండెడివాఁడు. శివభక్తులు గన్పించిన శివుఁడే దర్శనమిచ్చినట్లు భక్తితో భావించెడివాఁడు. శివుని యందువలె శివదాసులందును భక్తిపరుఁడై యుండెను. కపాల మాలాధారియగు శివుని భక్తుఁ డెట్టివాఁడు గృహమునకే తెంచి నను, ప్రత్యుత్థాన మొనర్చి, సుఖాసీనులంజేసి, పూజించి, షడ్ర సోపేతమైన యాహారమిడి, తృప్తిపఱచుటయే తన విధిగఁ దలంచుచుండెను.

ఇంట ధాన్యాద్యాహారవస్తువులకే కొఱంతయు లేనందు నను భక్తులెప్పు డేతెంచినను, నాతఁడు భక్ష్య భోజ్య లేహ్య

చోష్య పానీయంబులగు నాహారంబులను షడ్రసోపేతముగ బ్రాత రాజనాల దివ్యాన్నంబు నర్పించి, సంతృప్తులం గావించి, సేవిం చెడివాఁడు. అన్నార్థులై యెందఱు వచ్చినను 'నాస్తి' యను పల్కాతని నోట వచ్చెడిది గాదు. ఇట్లాతఁడు నిరతాన్న దానము లొనర్చుటఁ జేసి, క్రమముగ నాతని సంపదయు పెరుఁగ సాగెను. సంపదతోఁబా టాతని యన్నదాన మతిశయించెను. దినమున కొక శకలముఁ దీసిన పర్వతమైన పరమాణువు అగును గదా! దినములు గడచుకొలఁది యాతని ధనధాన్య ములు తఱగెను. భాగ్య దినములందు వలె దారిద్ర్యావస్థ యందు నాతఁడు భక్తుల కాహార మిడుట మానలేదు. అట్టి వాని దానగుణమును లోకులకుఁ దెలుపఁ దలఁచి, మహా దేవుఁ డాతని భాగ్యమంతయు నశించుఁగాక యని యాత్మ నెంచెను. దేవదేవుఁడే యట్లు భావించిన చపలయగు లక్ష్మి యేల నిలుచును?

దినక్రమమున మారునకు తినఁ దిండియు కట్ట గుడ్డయు లేకపోయెను. కాని యాతఁడు ధైర్యము వీడక వీటఁగల నగ లను పశ్వాదులను అమ్మియు, ఋణమొనర్చియు, భక్తుల కాహార మిడుచుండెను. తలకు మించిన యప్పులాయెను. తన్నమ్మికొని తీర్పఁదలచినను ఆ ఋణము తీరునట్లు లేదు.

దారిద్ర్య దుఃఖము ననుభవించుచున్నను మనస్సును మార్చుకొనక, భక్తుల కన్నప్రదాన మాచరించు మారునిఁ గాంచి, యింకను ఆతని శివుఁడు బరీక్షింపఁ దలంచెను. ఒక

నాఁడు శివుఁడే శివదాస వేషమున నాతని గృహమున కేతెంచెను. అది వర్షకాలము. సంతత ధారగ మిన్ను మన్నేకమగునట్లు కుండలతో ముంచిపోసినట్లు వర్షము గురియు చుండెను. దాసుఁడు వచ్చినది యపరరాత్రి. అపుడు కాఱు చీఁకటులు దిశల నావరించి యుండెను. అట్టి భయంకర కాళ రాత్రియందు వర్షమునఁ దడిసివచ్చిన యతిథి, నాయనారుని బంధిత కవాటముఁ దట్టెను. నట్ట నడురాత్రి యగుట నాయ నారు తలుపులు మూసి లోనఁ బరుండియుండి, తలుపుఁ దట్టిన చప్పుడు విని, వేగ లేచివచ్చి, కవాటముఁ దెఱచి, శివభక్తుని గాంచెను. ఆతని గాంచినంతనే యతఁడు తడిసి యాఁకలితో నకనకలాడుచుండుటఁ దెలిసికొనెను. ఆ నాఁ డంతయు మారనాయనారునకే తినఁ దిండి లేకుండెను. ఊరంతయుఁ దిరిగి యెవరి నడిగినను పిడికెడు బిచ్చము పెట్టువారు లేనందున, యుపవసించి యుండెను. వచ్చిన యతిథిని లోని కాహ్వానించి యాతని మేని తడి తుడిచి యొకచోటఁ గూర్చుండఁ జేసెను. ఆతని కెట్లేని యాహార మును సమకూర్ప నెంచెను. లోనికేఁగి సతిని గాంచి "భక్తుఁ డొకఁడు వానఁ దడిసి యన్నార్థియై వచ్చియున్నాఁడు. మనమే నిట్రుపాసముతో నున్నారము. అట్లని భక్తున కన్నము పెట్ట కుండుటెట్లు? దీనికి దారియేది?" యనెను.

ఆతని సతి యాతని వేదనను గ్రహించి, "కుండలు నిండుకొన్నవి. ఊర నప్పిచ్చువారుఁ గఱవైరి. మరల నడిగి

చూతమనిన నిధి నడికిరేయి. ఎవ్వారును తలుపులఁ దెఱువరు. అసమయమిది. ఏమిసేయఁ దోఁపకున్నది” అని గొంతవడి యాలోచించి “నాథా! నేఁడు మీరు పొలమున కేసరి గింజ లను చల్లి వచ్చితిరిగదా! అవి యిప్పటికిఁ గొంత మొలకెత్తి యుండును. వాని నేఁటి పుటికలోఁ దెండు. ఎట్లో వండి వడ్డింతము” అనెను. సతి పల్కులను వినిన నాయనారు నశించిన ద్రవ్యము మరల లభించినటు లానందించి, యొక ప్రేఁప సజ్జఁ గైకొని పొలముదారిఁ బట్టెను.

వర్షము హోరుమని వీచు పెనుగాలితో సంతత ధారగ వర్షించుచున్న ఆ గాఢాంధతమస్సున దారి తెన్ను గన్పింప కుండెను. ప్రాణి జాలమునకు భయముఁగొల్పు నా కాళరాత్రి యందు తలపై బుట్టను బోర్లించుకొని, నడచిన దారి యగుట నెట్లో తడవుకొనుచు నాతఁడు పొలము దరి కేఁగెను. క్షేత్రము జలమయమై యుండెను. తాఁ జల్లిన గింజలు నీటిపైఁ దేలి యాడుటఁ గాంచి దోసిళ్లతో నెత్తి పుటికను నింపి, తలపై నిడి కొని యింటికి వేగముగ వచ్చెను.

భర్త రాకకై వాకిట నిలువఁబడి యెదురుసూచుచు నా వనిత యాతనిం గాంచి, సంతసముతోఁ బుటిక నందికొని లోని కేఁగెను. బురదతోఁ గలిసిన యా ధాన్యాంకురములను నీట పలుమాఱు గడిగి శుద్ధమొనర్చెను. భర్తను బిలిచి, “ప్రొయ్యిని రగుల్కొల్పుటకు కట్టెయలు లేవు. ఏమి సేయు దము” అనెను. వెంటనే నాయనారు ఱంపముఁ గైకొని

యింటి కప్పునంగల సారువకొయ్యలఁ గోసి తెచ్చెను. ఆ సాధ్వి యా కట్టియలతో మంటఁబెట్టి ధాన్యపు మొలకలను తడి యాఱు నట్లు వెచ్చఁజేసి దంచి, బియ్యమొనర్చి, యెసటఁబోసి వండి వార్చెను. మరల భర్తను బిలిచి, "యన్నమాయెను. వ్యంజనమో? కాయగూర లెవ్వియు లే"వనెను. నాయ నారు పెరటిలోని కేఁగి యచట మొలచియుండు నాకుల నాశా బంధముఁ గోసినటులఁ గోసి తెచ్చియిచ్చెను. ఆయమ వానిని వ్రేళ్లు చెత్త చెదారములు లేకుండ శుద్ధమొనర్చి వివిధ సాధ కము లొనర్చి యతిథిని భుజింపఁ బిలిచెను.

మారుఁడు నిద్రను నటించు నతిథికడ కేఁగి "భవసాగర మున మునింగిన దాసు నుద్ధరింప వచ్చిన యనఘా! వంట సిద్ధ మాయెను. భుజింప రం"డని ప్రార్థించెను. కాని యోగి పరుండిన స్థలమందలి దివ్యతేజము దిశలు వెలుఁగఁ గన్పించెను. నాయనారు నాతని భార్యయు, మిఱుమిట్లు గొల్పు నా తేజముఁ గాంచి నిశ్చేష్టులైరి. ఆ జ్యోతిర్మండలమధ్యమున అన్న పూర్ణాసహితుఁడైన విశ్వనాథుఁడు నాగాభరణభూషితుఁడై త్రిశూల ఖట్వాంగాద్యాయుధధారియై వ్యాఘ్రచర్మాంబర ధరుఁడై ప్రత్యక్షమాయెను. శివుఁడు మారుని గాంచి, "భక్తవరేణ్యా! లేదనక సర్వదా భక్తుల ఆఁకలిదప్పులఁ దీర్చి, యమర యశముఁ గాంచితివి. మెచ్చితి. నీవు భార్యా సమేతుఁడవై మన్నిలయమునకు రమ్ము. శంఖ పద్మాది నవ నిధుల కధినాథుఁడు నా సేవకుఁడగు కుబేరుఁడు నినుఁ గొల్చు

చుండ నిత్యాత్ముఁడవై సకల భోగముల ననుభవింపు"మని యనుగ్రహించి తిరోహితుఁడయ్యెను. శివానుగ్రహము నందిన మారుఁడు సతీ సమేతుఁడై కైలాసముఁ జేరి శివసన్నిధిని సుఖియై యుండెను.

"క్షుధార్తుల కన్నమిడువారును భగవత్కైంకర్య
మొనర్చినవా రగుదురు."

# 5. మెయ్పొరుళ్ నాయనారు

(సత్యార్థి)

"తిరుకోవలూరు" చేదినాటికిఁ బ్రధాన నగరము. అయ్యది దక్షిణ పినాకినీ పశ్చిమ తీరమునఁ గలదు. ఆ దేశమును మలాదవంశీయులు పాలించుచుండిరి. ఆ వంశీయులందఱు శివభక్తులు. వారు శివభక్తుల మనోభావ మెఱింగి, శుశ్రూష యొనర్చుచు, విఖ్యాతి నందియుండిరి. అట్టి సుప్రసిద్ధ రాజవంశమున నొక భుజబలాఢ్యుడు జన్మించి రాజ్యమును నీతితోఁ బాలించుచుండెను. అతఁడు శత్రు భయంకరుఁడై యనేక యుద్ధములందు విజయముఁ బడసి, మహావీరుఁడని ప్రసిద్ధి పడసియుండెను. వీరుఁడయ్యు ధర్మమార్గమును దప్పువాఁడు గాఁడు. అనృతమాడువాఁడు గాఁడు. శివభక్తుల వేషములు, వారి వస్తువులు శాశ్వత ద్రవ్యములని, భావించెడి వాఁడు. కావునఁ బ్రజలాతని "మెయ్పొరుళ్నాయనా"రని పిలుచుచుండిరి. అతఁడా దేశమందుఁగల చంద్రశేఖరు నాలయముల నన్నింటి నుద్ధరించి, నిత్యపూజలు పక్ష మాస వార్షికోత్సవములను వైభవోపేతముగ జరిపించుచు, నందులకై కోశాగారమందలి మూలద్రవ్యంబును గూడ వెచ్చించుచుండెను. అతఁడు భక్తజనసేవయే భవుని సేవయనియు, నద్దియే తనకు నిత్యము సాయపడునని భావించి చరించుచుండెను. తన రాజ్యమందలి ధనాదులు భక్తులకుఁ జెందిన

వని భావించి శివదాసు లెంద ఱేతెంచినను, వారికి ధనాదుల నొసంగి, తనుపుచుండెను.

మెయ్పొరుళు నృపతి పాలించు దేశమునకుఁ బ్రక్కల నుండు దేశమును "ముత్తునాథుఁ"డను రాజు పాలించు చుండెను. అతఁడు దురాశాపరుఁడు. దైవభక్తి శూన్యుఁడు. ద్రోహియునై యుండెను. నాయనారు భక్తిపరుఁడై రాజ్య పాలన మొనర్చుచుండ ముత్తునాథుఁ డాతనిపై శత్రుత్వము వహించెను. అతఁడు నాయనారుని రాజ్యమును గబళింప నెంచి, తన సైన్యమును కట్టుదిట్టము చేసికొనుచు, పెంపొందించు కొనుచుండెను. అతఁడు చతురంగబల సమేతుఁడై మెయ్పొ రుళుని రాజ్యముపై దండెత్తెను. నాయనారుఁడును శత్రువు నెదిరించి విజయముఁ గాంచెను. అపజయమొందిన ముత్తు నాథుఁడు పగఁ దీర్చికొన, నాతనిపై పలుమారులు దండెత్తెను. ఎన్నిసారులు నాయనారు నెదిరించినను ఓటమియే గాని జయ మాతఁడు గాంచలేదు. చివర కతని కవమానమే గల్గెను. యుద్ధ మొనర్చి నాయనారును జయింప వలనుగాదని యెంచి, కపటోపాయమున నాతనిఁ గడతేర్ప నిశ్చయించెను.

మెయ్పొరుళు నాయనారు విభూతిఁ దాల్చిన వాఁ డెవఁడు వచ్చినను గౌరవించి, సేవించునని యా శత్రువు చారులవలన విని, యాతనిని వంచనతో జయింపఁ దలఁచి, శివభక్తుని వేసమున శత్రునగరముఁ జొర నిశ్చయించి, నొసట భస్మత్రిపుండ్రములను దేహమంతట విభూతిని, శిరమున జడలను

దాల్చెను. తాటియాకుల పొత్తము నొకదానిని సిద్ధపఱచి, యందు లోఁతు లెఱుంగని విధమున నొక చుఱకత్తిని దాఁచెను. అంజనాద్రియందు నలఁతి దివ్వెవోలె యాతని మనంబున కపటము దాఁగియుండ బయల్వెడలి, తిరుకోవలూరున కాతఁడేతెంచెను. శివభక్తునివలె నాడుచుఁ బాడుచు నంతఃపుర ద్వారదేశమును సమీపించెను. ద్వారపాలు రాతనిఁ గాంచి యెవ్వఁడో శివభక్తుఁడని మ్రొక్కి, లోని కేఁగ ననుమతించిరి. తన్నెవ్వరు సంశయింపనందున నా రాజు సంతసించుచు, నచటి కక్ష్యాంతరములను వేగముగ దాఁటుచు లోని కేఁగెను. ఆ సమయమున నాయనారు భార్యాసమేతుఁడై శయనాగారమున సుఖనిద్ర నుండెను. నాయనారునకుఁ బ్రియ భృత్యుఁడు "తత్త"నువాఁడు శయనాగారముకడ కాపుండెను. ఆ భృత్యుఁ డచటి కేతెంచిన శివభక్తునిఁ గాంచి "దేవరా! రాజు నిద్రించుచున్నాఁడు. లోని కేఁగ నిది సమయము గాదు. ప్రభువులు మేల్కాంచిన పిదప, లోని కేఁగఁదగు"నని వినయమునఁ బల్కెను.

తత్తనుని మాటలను విని కపటవేషధారియగు ముత్తునాథుఁడు "నేను రాజునకు మోక్షసాధకమగు దివ్యబోధఁ గావింప వచ్చితి. నన్నడ్డకుము. ఇది శుభ సమయము" అని పల్కి భటుఁడు వారించుచున్నను లోని కేఁగెను. హంసతూలికాతల్పమున దేవీ సహితుఁడై నాయనారు శయనించుట దెలిసియు, వెనుకంజవేయక సమీపించెను. కోపాంధునకు

సముదాచారమెట్లు తెలియనగు! అతని కాలి సవ్వడి విని, రాణి లేచి, భర్తను మేల్కొల్పెను, నాయనారు మేల్కొని యకాలమందస్థానమున కేతెంచిన నా వంచకుని గాంచి, యాతని నిజముగఁ శివభక్తుఁడనియే భావించి, యంజలి బద్ధుఁడై మ్రొక్కి "స్వామీ! తమ రాకకుఁ గతంబేమి? దాసుఁడేమి సేయవలయు"నని వినమ్రుఁడై పల్కెను.

అంత నా వంచకుఁడు "ఓయీ! శివప్రోక్తమయిన ప్రాచీనాగమ శాస్త్రమొకటి నాకడఁ గలదు. అది యీ లోకమున నెపుడును ప్రచారము గానిది. దానిని నీకు బోధింప వచ్చితి" అనెను. మెయ్పొరుళు నాయనారుఁ "డింతకంటె భాగ్యమేమి గలదు! దయయుంచి యా యాగమ శాస్త్ర మందలి రహస్యార్థములఁ దెల్పి ననుఁ గృతార్థునిఁ జేయ ప్రార్థించుచున్నాఁడ" ననెను. అంత నా వంచకుఁడు "ఓయీ! ఇది పరమరహస్యము. అన్యు లెఱుంగరాదు. ఏకాంతమునఁ గాని నీకా యర్థములఁ దెల్పరాదు" అనెను. అట్టియెడ నాయనారు దేవివంక స్వాభిప్రాయ మెఱుకపడఁ జూచెను.

రాణియు భర్తృ భావము గ్రహించి పని వినెను. నాయనారా వంచకునకు నున్నతాసనమిడి, తానాతని పాద ములచెంత నాసీనుఁడయ్యెను. "ఇచట నేవారును లేరు. నాకుఁ దత్త్వార్థములఁ దెల్పుఁ"డనెను. ఆ వంచకుఁడు మడి సందున పొత్తమును దాఁచి, దానిని విప్పునటుల నటించి యందు గుప్తముఁ గావించిన చుఱకత్తిని చేఁబూని, తన్ను విశ్వసించి

వినయ వినమితోత్తమాంగుఁడగు నాయనారుని వీపున నిర్ద యుఁడై పొడిచెను.

దుశ్చింతతో నసమయమున నేతెంచిన యా వ్యక్తిని మొదటినుండియు సంశయించిన తత్తనుఁడాతని చర్యలను పసి కట్టువాఁడగుటఁ జేసి, హఠాత్తుగ లోనికి వచ్చి, ఖడ్గమును బెఱికి యాతని శిరము నఱుకబోయెను. కాని రక్తపు మడుఁగున మునింగి నేలఁబడి, పొరలాడు నాయనారు భృత్యునిఁ గాంచి, "తత్తా! యితఁ డన్యుఁడు గాఁడు. కాన కీడొనర్ప రాదు" అని చేఁజాపి యడ్డగించి మరల నేలపై నొఱగెను. తత్తనుఁడు రాజాజ్ఞను మీఱఁజాలక యెత్తిన కత్తిని దించి, క్రిందఁ బడు రాజునకుఁ దన హస్తము నాలంబమొనర్చి "మహారాజా! నన్నేమి సేయుమందురు?" అని గద్గగ స్వరముతోఁ బల్కెను. అంత నాయనారు హీనస్వరముతో "ఓయీ! పరమ మాహే శ్వరుఁడగు నీతఁడు మన నగరము దాఁటువఱకు నీవు రక్షింప వలయు. ఇతని నెవ్వ రడ్డగింపని రీతి తోడుగ నుండుము" అని కోరెను. అతఁ డట్లేయని సమ్మతిఁ దెల్పి, యా ద్రోహికి తోడై పోవసాగెను. అప్పటికే యా ఘోరకృత్య మెల్లె డలఁ బ్రాఁకెను. ఎవ్వఁడో దుష్టుఁడు భక్త వేషధారియై నాయ నారును చంపెనని విని, జను లాబాలగోపాలము సాయుధులై మార్గముల నన్నింటి నడ్డగించిరి. తత్తనుని వెంట రాజమార్గ మున నేఁగు నా దుష్టునిఁ గాంచి "వీఁడే మన రాజును పొడిచిన వాఁడు. చంపుదము. పొడువుఁడు పొడువుఁడని" వానిపైఁ బడిరి. అంతలో తత్తనుఁడు రాజు "ఇతని కేకీడు రానీయక

గమ్యస్థానముఁ జేర్పు''మని యాజ్ఞాపించిరి. కాన మీరు మీ దారిని బొండు అనఁగనే వారు రాజశాసనమును విని, యాగ్రహము నడఁచికొని తొలఁగిపోయిరి.

తత్తనుఁడా వంచకుని నగరము దాఁటించి, కొంతదూరమున నడవిలో సురక్షితమగు స్థలమును జేర్చి తా వేగముగ మఱలి యంతఃపురమునకు వచ్చెను. రాజు తత్తనుఁడు వచ్చువఱకుఁ బ్రాణముల నెట్లో ధరించియుండెను. ఆ ప్రియభృత్యుఁడు వచ్చి "మహారాజా! దేవరను తపోవేషమున జయించిన యాతని గమ్యస్థానమును చేర్చితిని'' అనెను. నాయనా రాతని మాటలను విని సంతసించి "తత్తా! నీవు చేసిన సేవ మహత్తరమైనది. ఇట్లు లోకంబున నేవారుఁ జేయఁజాలరు'' అనెను.

వెంటనే ప్రాణావసానకాల మాసన్నమాయెనని యెఱిఁగి, పుత్త్రుని భార్యను మంత్రులను బంధువులను పిలిపించి వారితో "భస్మము, భస్మధారులు మనకు సదారాధ్యులు. గాన త్ర్యంబకుని భస్మమహిమను లోకంబునఁ జాటుఁడు. భస్మమే మనకు నిధి'' అని పలికి మనంబున చిదంబరేశుని స్మరించుచుండెను. మెయ్పొరుళుఁ డెట్టి రూపమును ధ్యానించుచుండెనో యట్టి దివ్యమంగళరూపమున నాతని యెదుట నటరాజు ప్రత్యక్షమై యింద్రాదుల కలభ్యంబగు తన పాదసేవాభాగ్యము నాతనికిఁ బ్రసాదించెను. నాయనారు పరమేశ్వర కృపాపాత్రుఁడై కైలాసముఁ జేరి శివసేవా భాగ్యము నంది ధన్యుఁడయ్యెను.

"అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాఁడు ధన్యుఁడు.''

# 6. విరన్మిండ నాయనారు

(వీరమిండుఁడు)

సముద్ర తరంగ చుంబిత తీరప్రాంతము పర్వతమయము, నారికేళ వృక్షసంయుతమునగు చేరదేశము, పరశురామ తపోభూమియని ప్రసిద్ధికెక్కినది. పూర్వము జామదగ్న్యుఁడు ఇరువదియొక్క మారులు భూమిని చుట్టి, తన తండ్రిని చంపిన క్షత్రియులను నాశముసేసి, భారత భూమిని కైవస మొనర్చుకొనెను. స్వభుజబలముచే జయింపఁబడిన క్షత్రియ శోణితముతో పితృతర్పణము నొనర్చి, శాంతుఁడై యాగమొండొనర్చెను. యాగాంతమున నతఁడు భూమిని కశ్యపునకు ధారవోసెను. ఆనాఁటినుండి భూమి కాశ్యపి యని ప్రసిద్ధి వడసెను. దానమొసంగిన భూమియందు నివసింపరాదని పరశురాముఁడు వరుణునిఁ బ్రార్థించెను. వరుణుఁ డాతని కోరికను మన్నించి, యాశ్రమ నిర్మాణార్థమై కొంత స్థలమొసంగెను. అట్లు లభించిన స్థలమునందు కార్తవీర్యవంశనిర్మూలకుండు, శివుని మెప్పించి పరశువుఁ బొందిన రాముఁడు తపం బొనర్చెను. కాన నది పరశురామ క్షేత్రమనియు, చేరదేశమనియు, కేరళదేశమనియు, మలయాళమనియుఁ బ్రసిద్ధికెక్కెను. పరశురాముఁడచట తప మొనర్చుటచే నది వీర్యవంతమైనది. చేరదేశీయ సుందరవనితలు, శౌక్తిక మౌక్తికంబులను, గజదంత సముపాగత ముక్తాజాలంబులను,

చెఱకు, వెదుర్లనుండి పుట్టిన ముత్యములను ధరించి, రతీదేవినిగూడ పరిహసింతురు. అట్టి దేశమున "శెంగునూరు" (శోణాచలము) అను నగరమొండు గలదు. అన్నగరము బ్రాహ్మణ క్షత్రియాద్యులకు నివాసభూమి.

అందు కృషీవలుల కులమందు "విరన్మిండఁ"డను భక్తవరేణ్యుఁ డుండెను. అతఁడు శివపాదారవిందార్పిత చేతస్కుఁడై శివభక్తులకు దాసానుదాసుఁడై తత్సేవాది విధులఁ దప్ప అన్య విషయంబులందు మనంబుఁ జొఱనీయక, శివక్షేత్రములకు యాత్రలు గావించుచుండెను. అతఁ డే శివస్థలమున కేఁగినను తొలుత శివభక్తులకు వందనం బాచరించి, పిదప శివునకు ప్రణమిల్లుచుండును. భగవంతునికన్న భక్తులే యారాధ్యులై యుండిరి.

కేరళదేశమందలి శివక్షేత్రముల నన్నింటిని దర్శించి, శివభక్తులను సేవించి, పరత్ర పరమేశ్వరాలయములను దర్శింప కుతూహలుఁడై యా దేశమును వీడి, విరన్మిండఁడు తిరువారూరుఁ జేరి, యచట త్యాగేశుని సేవించుచు కొంతకాలముండెను. అతఁ డొకనాఁడు దేవాశ్రయ మండపమున భక్తులతోఁ జేరి, శివనామసంకీర్తన మొనర్చుచుండెను. అపుడు సుందరమూర్తి భక్తులఁ గాంచియు వారికి మ్రొక్కక యొకప్రక్కగ నొదిగిపోవుచుండెను. విరన్మిండఁ డాతనిఁ గాంచి "యీ సుందరుఁడు భక్తులఁ జూచియు నమస్కరింపక యేఁగుచున్నాఁడు. భక్తవిద్వేషియగు నితఁడు శివాపరాధి గాన

బహిష్కారార్హుఁడు. ఇట్టివానిని ప్రతిబంధముచే వశంవదునిఁ జేసికొనిన శివుఁడును బహిష్కృతుఁడే యగుచున్నాఁడు" అని తీవ్రముగఁ బల్కెను. మండపములో నాసీనులైయున్న యితర భక్తు లాతని ధైర్యమును, భక్తులయెడలఁ గల భక్తి తీవ్రతను గొనియాడిరి. విరన్మిండని పల్కులను సుందరుఁడు విని, యాతని దృఢభక్తికి సంతసించియు, వారికి వందన మాచరింపక యే యాలయపు టుత్తరద్వారమును సమీపించెను. అచట సుందరమూర్తికి శివుఁడు ప్రత్యక్షమాయెను. భక్తుల నవమానించిన సుందరునకు ప్రత్యక్షమయిన శివుని గాంచి, విరన్మిండఁడు కుపితుఁడై "యిక నెన్నటికిఁ దిరువారూరులో కాలిడను" అని తీవ్ర శపథ మొనర్చి, బయలుదేరి యా నగరికి నుత్తరమున నుండు "పుత్తూరు" అను నదియొద్దున కేఁగి, యచట నాకులతో పందిరిని నిర్మించుకొని నివసించుచు, భక్తసేవ యొనర్చుచుండెను. "శివభక్తు లెవరైనను తనకడ తిరువారూరు పేరెత్తిన వారి పాదములను పరశువుచే ఛేదింతు"నని ప్రతిన యొనర్చియుండెను. అతనివలని భీతిం జేసి భక్తు లానగరి పేరు నాతనికడ నుచ్చరింపకుండిరి.

ఇట్లుండ నొకనాఁడు త్యాగేశుఁడు శివభక్తుని వేషముతో నాతనికడకు వచ్చి, "నే నుండునది తిరువారూరు" అని నుడివెను. ఆ మాట వినుటతోడనే విరన్మిండఁ డాగ్రహోదగ్రుఁడై పరశువు చేఁబూని యా వచ్చినవాని పాదములను ఛేదింప నుంకించి, వెన్నాడెను. అపుఁడు భవుఁడు పరుగిడసాగెను. ఒకరిని

మించి యొకరు పరుగిడసాగిరి. వారు తిరువారూరు నెల్లను దాఁటిరి. అపుడు భక్తవేషధారియైన శివుఁడు "మన మిచటికే వచ్చితిమి" అనెను. తన ప్రతిజ్ఞ చెడెనని తలఁచిన విరన్మిండ నాయనారు చేతి గండ్రగొడ్డలితో తన పాదములనే ఛేదించుకొనెను. వెంటనే పరమశివుఁ డాతనియెదుటఁ బ్రత్యక్షమై యాతని దాస భక్తికి మెచ్చి మోక్షమొసంగెను. శివానుగ్రహముచే నాయనారు ప్రథమ గణనాయకుఁడై కైలాసమున సుఖంబుండె.

ఇప్పటికిని విరన్మిండ నాయనారు పందిరిలో నుండిన చోటును "ఆండి పందల్" అని పిలుచుచున్నారు. శివుఁడు "మన మిచటికే వచ్చితిమి" అని పల్కిన స్థలము నుత్తర తిరువారూరు అనియు, శివుఁడు సుందరునకు దర్శనమిచ్చిన స్థలమును దక్షిణ తిరువారూ రనియు ననుచున్నారు. (విరన్మిండని యాక్షేపణను వినిన సుందరమూర్తి దేవాశ్రయ మండపస్థిత భక్తబృందమునకు మ్రొక్కి "తిరుత్తొండత్తొహై" పాడెనను మఱియొక గాథ గలదు.)

"భగవత్సేవకంటె భక్తజనసేవయే మోక్షకారణము."

# 7. అమర్నీతి నాయనారు

కావేరీ నదీమతల్లి ప్రవహించు చోళదేశమందు "పళయా"రను ప్రాచీన నగరమొండు గలదు. అన్నగర వీధులు విశాలములు. అందు వివిధ లతాతరువులతో నిండిన పుష్పోద్యానము లెచటఁ గాంచినను కన్నులపండు వొనర్చు చుండును. అన్నగరి హర్మ్యము లాకసము నంటుచుండును. దేశ దేశాంతరములతో వాణిజ్యమొనర్చి కోట్లకు పడగలెత్తిన వర్తకులందు లెక్కకు మిక్కుటముగఁ గలరు. అందొక వైశ్య శిఖామణి "యమర్నీతి నాయనా"రనువాఁడు సువర్ణ రత్న ముక్తాఫలాదులను, వస్త్రముల నమ్ముచు విశేషముగ ధన మార్జించి, కుబేరుని తలఁదన్నువాఁడై యుండెను. ధనాతి శయముచే నవలిప్తుఁడు గాక శివభక్తుఁడై శివదాసుల నాహా రాదులతోఁ దృప్తిపఱచుచుండెను. అతఁడు భక్తుల కోరికల నెఱింగి, ధనాదులే గాక వస్త్రములను కౌపీనముల నొసంగి గారవించుచుండెను.

అనాదినిధనుఁడగు పరమశివుఁడుండు తిరునల్లూరులోఁ బ్రవర్తిల్లు నుత్సవములను దర్శింప, శివపదాబ్జ సేవారతులగు భక్తులు తండోపతండములుగ వచ్చుట సాజము. ఉత్సవ దర్శనమునకు వచ్చు భక్తుల సౌకర్యమునకై యా నగరము నందొక దివ్య మఠమును గట్టించి, యా వైశ్యశిఖామణి యన్న

దాన మొనర్చుచుండెను. ఉత్సవసమయములరి దాతఁడు బంధు మిత్రాదులతో నట నివసించుచు, భక్తులను స్వయముగ విచారించి వారికి సకలోపచారములఁ గావించుచుండెను. మర్గములపై కౌపీనార్థము వస్త్రములను నేయించి, శివదాసులకు నర్పించుట యతని నిత్యకృత్యమై యుండెను.

ఒకనాఁ డమర్నీతి కౌపీనాది దానములను చేయుటఁ గాంచి, శివుఁడు ముగ్ధుఁడై యాతని కరుణింపఁ దలంచెను. వెంటనే బ్రాహ్మణ బ్రహ్మచారి వేషము నాతఁడు ధరించెను. శిఖాయజ్ఞోపవీతధారియై కటియందు మౌంజిని తాల్చెను. అతని యుపవీతమున హరిణ చర్మఖండ మొకటి ప్రకాశించుచుండెను. దర్భ మొల్రతాటికి కౌపీనము బిగించి కట్టి మఱొక కౌపీనముతోఁగూడిన పలాశదండమును దక్షిణహస్తమునఁబట్టి, వామహస్తమున దర్భలను, భస్మపు సంచిని ధరించి, యచ్చపు వటువై నల్లూరులోని యమర్నీతి మఠమున కేతెంచెను.

దివ్య బ్రాహ్మ్య తేజముతో వచ్చు వటువుం గాంచిన యమర్నీతి యెదురేఁగి మ్రొక్కి "తాము నా మఠంబున కేతెంచు భాగ్యమున కేనేమి తపంబొనర్చితినో" యని పల్కెను. అంత నా వటువాతనిఁ గాంచి "నీవు ప్రియమార భక్తుల కన్నపానాదుల నొసంగి, వస్త్రములను కౌపీనముల నిచ్చి యుపచరించుట విని, నినుఁ గాంచవచ్చితిని" అనెను.

అమర్నీతి యతనిఁగాంచి "బ్రహ్మచర్యవ్రత దీక్షా పరతంత్రా! యీ మఠమున సదాచారసంపన్నులయి వేద

వేదాంగాదుల నెఱింగిన శ్రోత్రియులకుఁ దగినటుల వైదికులే పాక మొనర్తురు. తామిచట భుజించి నన్ను ధన్యునిఁ గావింప ప్రార్థింతు"నని పల్కెను. ఆ వటువాతని వేఁడుకోలున కంగీకరించి "నేను కావేరి కేఁగి స్నానాదులఁ దీర్చికొని వత్తును. వర్షము వచ్చునట్లున్నది. స్నానానంతరము ధరించుటకై యీ కౌపీనమును భద్రపఱుపుము. నే వచ్చి దీనిని ధరింప వలయు"నని పాలాశదండమునకుఁ గట్టినదాని నాతని కొసంగి నది కేఁగెను. నాయనా రట్లేయని దానిఁ దీసికొని యొక చోట భద్రపఱచెను.

కపట బ్రహ్మచారియగు శివుఁడు కావేరీ తీరమును సమీపించి, తా నమర్నీతి కొసంగిన కౌపీన మంతర్హితమగు నటులఁ దలఁచెను. స్నాన సంధ్యలఁ దీర్చికొని తడిసిన కౌపీనముతో నాతఁడు మఠమునకు వచ్చెను. నాయనారు షడ్రసోపేతముగ వంటకములను సిద్ధము సేయించి యుండెను. అతఁడు వటువుఁ గాంచి "ఆహారము సిద్ధమాయెను. భుజింప రండు" అని ప్రార్థించెను. ఆ కపట బ్రహ్మచారి భక్తపరాధీనుఁడగు నాయనారుఁ గాంచి "నా కౌపీన మార్ద్రమై యున్నది. నేను నీ కొసంగినదానిఁ దెచ్చి యిమ్ము. ధరించి వత్తు" ననెను. అత్తఁ డట్లే యని లోని కేఁగి చూడ నది గన్పింపలేదు. కౌపీన మేమాయెనా యని యాతఁడు వెదకి వెదకి వేసారెను. "అయ్యో! యాతని కౌపీన మిాయఁజాలనైతినే" యని చింతించి, తనకడనున్న నూత్న కౌపీనముఁ

గైకొని వచ్చి "స్వామీ! మీరు నాచే నొసంగినదానిని భద్ర పఱచితిని. కాని యది గన్పింపలేదు. దాని నపహరించు వారిట నెవరును లేరు. నా యింట నిట్లు ఎపుడును జరిగియుండ లేదు. నేనొక క్రొంగ్రొత్త కౌపీనముఁ దెచ్చితిని. ఇది యొక వస్త్రమునుండి చించి తెచ్చినది గాదు. మగ్గమున నేయించినది. తామెంత కాల మార్ద్ర కౌపీనమును ధరించి యుండఁగలరు! దీనిఁ దాల్పుఁడు. నా యవివేకమును మన్నింపుఁడు" అని ప్రార్థించెను.

అంత నా వటువు "ఓయీ! నీ చెప్పునది మేలుగ నున్నది. నేను దాఁచనిచ్చి చాలకాలము కాలేదు గదా! క్షణము ముందర యిచ్చిన దెటకేఁగును? నా గోఁచి నపహరించి వేఱొకదానిఁ గైకొమ్మనుట న్యాయమా! నీ వ్యాపారము లెస్సగ నున్న"దని చుఱచుఱ చూచెను. అంత నమర్నీతి చలించినవాఁడై కలతపడి యేమియు మాటాడఁ దోఁపనివాఁడై కొంతవడి యుండి "యీ యల్పుఁడు సేసిన దీనిని మన్నింపుఁడు. దాసుఁడు కావలయునని చేయలేదు. ఈ తప్పునకు మీరెట్టి శిక్ష విధించినను భరింప సిద్ధుఁడను. ఇందులకై పీతాంబరములఁ గాని రత్న కనకాదుల నిమ్మనిన నిత్తు. వానిఁ గైకొని కృప సేయుఁడు" అని పాదములపైఁ బడెను.

వాని మాటలకా బ్రహ్మచారి శాంతచిత్తుఁడైనట్లు నటించి, "ఓయీ! నీవిచ్చు ధనకనకరత్నాదులు నాకేల? వానితో నేనేమి సేయుదు? నా కౌపీనమునకు సరితూఁగు ద్రవ్యము నొసంగిన చాలును" అనెను. అమర్నీతి "అయ్యా!

పట్టు వస్త్రముల నిత్తుననినను వలదంటిరి. వీనికి కౌపీనమునకు సాటిదాని నిచ్చుట యెట్లో తెలియరాకున్నది" అనెను. అంత నతఁడు ఆ కౌపీనమునకు సరితూఁగునది నా దండము. దానికి సమముగ తూఁగుదాని నిమ్ము. అట్లు తూఁచి యిచ్చినఁ జాలును" అని పల్కెను.

అమర్నీతి యట్లే యని యొక పెద్ద త్రాసును తెప్పించి నిలిపి యొక తట్టయందాతని కౌపీనము నుంచి మఱొకదాని యందు తాను భక్తులకై నేయించిన కౌపీనము నుంచెను. అది సరితూఁగలేదు. అట్టివి తనకడనున్న వానినన్నింటిని తెచ్చి వైచెను. ముల్లు కదలలేదు. నూతన వస్త్రములఁ దెచ్చి వైచెను. త్రాసు ఇసుమంతయు చలింపలేదు. అతఁ డాశ్చర్యపడి, ధనమును బంగారమును, నవరత్నములను తెచ్చి పోసెను. బ్రహ్మచారి కౌపీన మది యెట్టిదియోగాని, సెట్టి ద్రవ్య రాశికది యించుకయు సరితూఁగలేదు. చివరకు శ్రేష్ఠి భార్య తాళి తప్ప నన్ని యాభరణములఁ దెప్పించి వైచెను. ససేమిరా! కదలలేదు. ఏమి చేయుటకుఁ దోఁపక మఠములోని పాత్రల నన్నింటినిఁ దెప్పించివైచి తూఁచెను. వాసుదేవునిఁ దూఁచిన సత్యవలె నాతఁడు నివ్వెఱపడెను. అది సాధారణపు గోఁచి గాదు. పరమశివుని కౌపీనము గదా! దానికి సరితూఁగు వస్తువు భక్తి తప్ప ముల్లోకముల వేఱేమి యుండును. ఆ దృశ్యముఁ గాంచువారంద ఱాశ్చర్యపడిరి. ఇఁక ముల్లోకములను పర్వత సాగరాదుల నుంచినను సాటిగావని తలంచిరి.

అమర్నీతి సిగ్గునఁ దలవంచికొని, యా బ్రహ్మచారికడ కేఁగి, "నా ద్రవ్యమంతయు నుంచితిని. ఇఁక మిగిలినది నేను నా భార్యాపుత్రులు. మా దేహాత్మల నర్పింప సమ్మతింపుఁడు" అని యాతని యంగీకారముఁ గోరి నిలిచెను. భక్తుని త్యాగబుద్ధిని లోకమునకుఁ దెల్పఁబూనిన శివుఁడాతని నట్లే చేయు"మనెను. అమర్నీతి యానందసాగరమున మునింగి, భార్యాపుత్రులఁ బిలిచి వారితో బ్రహ్మచారికి వందన మాచరించెను. యా త్రాసునకుఁ బ్రదక్షిణ మాచరించి, నమస్కరించి, "శివార్పణ"మ్మనుచు ముగ్గురును త్రాసు నెక్కిరి. అమర్నీతి "నేను త్రికరణశుద్ధిగ శివసేవకుఁడ నగుదునేని, భస్మధారణమే నా నిత్యవిధి యగునేని, యీ త్రాసు సరితూఁగు గాక" యనఁగనే యది యెట్టి మహిమయోగాని, రుక్మిణీదేవి తులసీదళ మహిమచేఁ గృష్ణుఁడు సరితూఁగినట్లా త్రాసు చివాలున లేచి సరిగ నిల్చెను.

పరమశివుఁడు దాల్చు కౌపీనమునకు, తఱుగని భక్తిఁగల అమర్నీతి దాసత్వము సరియయ్యెఁ గాన త్రాసు సరిగ నిల్చెను. ఆ దృశ్యముఁ గన్నులారఁ గాంచిన జనులా యమర్నీతిని వేనోళ్లఁ బొగడిరి. దేవతలు వారిపైఁ బుష్పవర్షముఁ గురిపించిరి. ఆ పుష్పవర్షమున బ్రహ్మచారి తిరోహితుఁడయ్యెను. అతని స్థానమున అర్ధనారీశ్వరుఁడు నందివాహనారూఢుఁడై యక్షిగోచరుఁడాయెను. త్రాసున నిల్చిన భార్యా పుత్ర సహి

తుఁడైన అమర్నీతి శివుని మనసార వినుతించి నమస్కరించెను. దయాలవాలుఁడగు శివుఁడు వారికి శివపదము నొసంగెను. ఆ త్రాసు దేవవిమానముగ మాఱి యా భక్తకుటుంబముతోఁ గైలాసమున కేఁగెను. వారు శివసన్నిధానమున శాశ్వతానందముఁ గాంచిరి.

"భగవంతునకు సరితూఁగఁగలది భక్తియేగాని
యన్యము లేదు."

# 8. ఎరిపత్త నాయనారు

(దారకుఁడు)

శీతశైలమువఱకుఁగల భూమినంతయు జయించిన పరాక్రమశాలియు వ్యాఘ్రధ్వజముఁగల కరికాళచోళుఁడు మొదలు అనపాయచోళుని వఱకుఁగల రాజులందఱు, పట్టాభిషిక్తులైన ప్రధాన నగరము "కరువ్వూరు." అయ్యది కొంగునాఁట విలసిల్లుచుండు. అన్నగరమందలి ప్రాకారములు మేఘమండలము నొరయుచుండును. అందలి మేడలపైని చంద్రశాలలు చంద్రుని కళంకమును క్షాళిత మొనర్చుచుండును. గృహాంగణములందు రత్నమాలికలు వ్రేలాడుచుండును. నీలాటిరేవులందు మత్తేభములు గ్రుంకులాడుచుండును. అప్పురి బాహ్యోద్యానములందు నెమిళ్లు నాట్యము సేయుచుండు. శుకపికాదు లనవరతము వృక్షాగ్రములఁ జేరి యింపుగఁ గూయుచుండు. అందు విహరించు యువతీమణుల నృత్యములు ప్రేక్షణీయములై గన్పించు. అపుడు వారి క్రొమ్ముడులపై భ్రమరములొనర్చు ఝుంకారములు నాట్యమునకుఁ దగిన గీతములా యన నుండు. భూదేవికిఁ దిలకాయమానమైన యన్నగరము అమరావతిని మించి, భోగభాగ్యములతోఁ దులఁదూఁగుచుండును. అట్టి యమ్మహానగరమున భక్తుల మనఃకమల నివాసుఁడగు, శివునకు సదా వాసమైన "తిరుఆనిల" మను నాలయమొండు గలదు.

శివదాసులకుఁ గల్గు కష్టములను నివారించుటయే తన విధిగ భావించుచు, వారి నారాధించుచుండు "ఎరిపత్త నాయనా"రను భక్తుఁడా నగరమున నివసించుచుండెను. అతఁడు శివభక్తుల యాపదలఁ దీర్చుటకు, నపరాధులను దండించుటకు నెల్లవేళల పరశువును, చేఁబూని, తిరుగాడుచుండును.

కరువూరులోనుండు "తిరుఆనిల" మందుండు పరమ శివుని సేవించు 'శివకామియాండారుఁ'డను వృద్ధబ్రాహ్మణ భక్తుఁడొకఁడు ప్రత్యహము పూవులంగోసి తెచ్చి మాలి కలఁగట్టి, శివున కర్పించువాఁడై యుండెను. అతఁ డరు ణోదయకాలముననే మేల్కాంచి, శివుని ధ్యానించుచు నది కేఁగి, స్నానమాచరించి, పంచాక్షరిని జపించి, వక్త్రమునకు నడ్డముగ వస్త్రము నాచ్ఛాదించి, పూఁదోఁటకేఁగును. అచట సూర్యోదయావసరమున వికసించుచుండు వాసనావాసితంబు లగు పూవులంగోసి పుటికను నింపికొని, దక్షిణహస్తమునఁ దాల్చి వామహస్తమున దండముఁబట్టి యాలయమున కేఁగును. అచట నా పూవులతో చక్కఁగ వివిధ మాలికలఁగట్టి, శివున కర్పించి, గృహమున కేఁగుచుండు. ఇది యా వృద్ధుని నిత్య కృత్యమై యుండెను.

ఇక్కడా కాలమునాఁటికి అనపాయచోళుని వంశీయుఁడు పూర్వుఁడునగు 'పుగళ్చోళనాయనా'రను రాజు రాజ్యము నేలుచుండెను. అతనికి 'పట్టవర్ధన'మను గజముండెను. ఒకా నొక శుక్లాష్టమినాఁడు, ఆధోరణు లా గజము నైంద్రావతికిఁ

గొంపోయి, పేరాడించి చక్కగ నలంకరించి, పురవీధి నడి పించుచు వచ్చుచుండిరి. హఠాత్తుగ దానికి మదమెక్కెను. దాని యట్టహాసముంగాంచి, జనులందఱు భీతిచే దిక్కులకుఁ బాఱిరి. గజమున. కిరువైపుల నీటియలవారును దానిపై నంకుశధారులు మువ్వురు మావటీండ్రు నుండిరి, అది వారి నెవ్వరిని లెక్కింపక, లొంగక దిక్కులు పిక్కటిల్ల, ఘీంకారము సేయుచు పరుగిడసాగెను.

అపుడు శివకామియాండారుఁడు తన దండమునకు పుటికఁ దగిలించికొని, యా దారిని ఆలయమున కేఁగుచుండెను. మత్తేభము తొండము సాచి, యా పూవులపుటిక నందికొని, విసరికొట్టెను. నేలఁబడిన పూవులఁ ద్రొక్కుచు నది యేఁగెను. శివకామియాండారుఁడా గజమును తన దండముచేఁ బ్రహరింపఁ దలచి, పరుగిడి, నేలజారి క్రిందపడెను. ముప్పిరిగొన్న కోపవేగమున నతఁడు హస్తములతో నేలఁదట్టి, లేచి నిల్చి "గజచర్మాంబరధారీ! కృత్తివాసా! శివా! చంద్రకళాధరా! గంగాధరా! నీ శిరము నలంకరింప నేను భక్తిఁదెచ్చు నీ పూవుల నీ మదగజమిట్లు సేసెఁగదా! నేనేమిసేయుదు? దీన జనావనా! ఆర్తార్తిహరా! మహాదేవా!" అని యాక్రోశింప సాగెను.

అపుడే యెచటినుండియో యదేమార్గమున వచ్చు, ఎరిపత్తుఁడా శివకామియాండారుని యార్తారావము విని సమీపించెను. శివార్థమై గొంపోవు పూవులను మత్తేభము ధ్వంస

మొనర్చెనని విని, యాతఁడాగ్రహోదగ్రుఁడయ్యెను. ఆతని కన్నులు చింతనిప్పులయ్యె. శరీరము వడఁకెను. భ్రుకుటిని ముడివెట్టి రుద్రుఁడై "ఈ గజము లెపుడును శివభక్తులకు శత్రువులే. ఈ పూవులను నేలఁజిమ్మి త్రొక్కిన ఈ గజమును, నేఁడు నా పరశువుచే ఖండించి, యమసదనమున కంపెదను" అని శివకామియాండారును సమీపించి, "స్వామీ! నీ మనంబును కష్టపఱచిన యా గజమెట్లేఁగెను" అని యడిగెను. అంత నతఁడు "శివసేవార్థమై నేఁ గొంపోవు పూవుల పుటికను చిందరవందరసేసి, యది యీ వీథిలో నిట్లుత్తరదిశఁబట్టి యేఁగెను" అనఁగ నతఁడు వరశువు నెత్తి "అది యిఁక నెట్లు జీవింపఁగలదు? చూచెదఁగాక" యని నుడువుచు, పరశువను నగ్నికిఁ దాను గాలియై వేగముగ నా మార్గముఁబట్టి పరుగిడెను. ఆలానముకడనుండు నా గజముఁగాంచి పంచాస్యమువలె లంఘించుచు, "నిది పూర్వము కృత్తివాసునిచే సంహరింపఁబడిన గజమువలె నున్నది. దేవేంద్రాదు లడ్డగించినను, దీనిని హతమొనర్పక విడువ"నని సోత్సాహుఁడై గర్జించుచు పైఁబడి, దాని తుండమును పరశువుచే ఖండించెను. అమ్మదగజము దిక్కులు ప్రతిధ్వనింప ఘీంకారము సేయుచు నాతని తాఁకెను. భక్త్యావేశమునుందేది నిలువఁగలదు! నాయనారును భయపడక, దానిపై నుఱికి, దానిని ఖండఖండములుగ నఱికి నేలఁ గూలఁద్రోసెను. సాగర తరంగ ఘోషము నధఃకరించునటుల నది రొదవెట్టుచు పర్వతమువలె నేలఁగూలెను.

మావటీంద్రుఁడు ముప్వురు నీటియలవారిరువురు తమ యేనుఁగు గూలుట కోర్వనివారై, యెరిపత్తనాయనారు నెదిరించిరి. గజమునే చంపినవానికి వారేమి లెక్క! నాయనారు వారిని పరశువుచేఁ బరశురాముఁడు కార్తవీర్యులఁబోలె చంపెను. ఆ ఘోర కృత్యముఁగాంచిన యితర గజరక్షకులు భీతిల్లి, నగరిలోనికిఁ బరువిడిరి. వారు మందారమాలాధారి యగు పుగళ్చోళుని యంతఃపురద్వారమును సమీపించి, యచటి ద్వారపాలకులతో "మన భద్రగజము, మావటీంద్రుఁడు మరణించిరి. రాజున కీ వార్త వేగముగ నెఱిగింపుఁ"డని పల్కిరి.

ద్వారపాలకులు వెంటనే లోని కేఁగి ప్రభువును గాంచి, సముదాచారము ననుసరించి మ్రొక్కి "శత్రుపరంతపా! మహారాజా! మన పట్టవర్ధనము నెవరో చంపిరట. ఎదిర్చిన మావటివారును మరణించిరఁట" అని వడఁకుచు విన్నవించిరి. అవ్వార్త వినుటతోడనే యా ఱేఁడు పర్వతాగ్రమునుండి యుఱుకు సింగమువోలె ఆసనమునుండి దుమికి, యట్లు చంపిన దెవరని యడుగకయే చరచర నడచివచ్చెను. రాజట్లు కోపావేశుఁడై యేఁగుటఁ గాంచి, మంత్రులు సేనాధిపతులు చలించి, యుద్ధోద్యమముతో నాతని వెన్నంటిరి. సైనికులు ధనుర్బాణములను, కత్తి కటారులను, ముసల ముద్గర తోమర కుంతాద్యనేకాయుధములఁ గైకొని నడచిరి. శంఖ భేరీ కాహళాదులు శ్రవణకుహరములను విదారించుచు మ్రోయసాగెను. క్షణములో వాహినులు బయల్వెడలెను. రాజునకు ముందు

శ్వేతాశ్వమును నిల్పిరి. తత్క్షణము ఆతఁడు దాని నధిరోహించి, రాజమార్గముఁ బట్టెను. ఆ సంరంభ మేలకో యని తెలియ కయే, చతుర్విధ సైన్యములాతని ననుగమించెను. రయమున బయలుదేరిన తురంగమ తరంగములతో మదనాగనక్రసంచ యములతో చటులసైనిక మత్స్యములతో చోళవాహిని, వేగముగ పురబాహ్యప్రదేశముఁ జేరెను. ప్రళయమారుత ఝుంఝూరావమువలె సైనిక కోలాహలములు మిన్నంటెను.

రాజు తన భద్రేభము పడియుండు స్థలముఁజేరి, నల్దిక్కులు కలయఁగాంచెను. ఎచటను విరోధి వర్గము కన్పింపదాయె. శివభక్త వేషధారి యొకఁడుమాత్రము దృష్టి గోచరుఁడాయెను. ఇతఁడు భక్తుఁడుగదా! ఇతఁడేల గజ మును చంపియుండునని తలఁచి, బిగ్గరగా "గజమును చంపిన వాఁడెవఁడని" గర్జించెను. గజరక్షకులు "మహారాజా! మన వర్ధనమును చంపినది శత్రురాజులుగారు. ఈ పరశుధారియే దానిని చంపెను" అని పల్కుచు నాయనారును చూపిరి. అంత నా రాజు "ఇట నిలిచియుండువాఁడు సద్గుణశ్రేష్ఠుఁడగు భగవద్భక్తుఁడుగదా! గజమెట్టి తప్పిద మొనర్పకున్న నితఁడేల దానిని చంపును. అది యెద్దియో భక్తున కపకార మొనర్చి యుండు"నని రాజు మనంబునఁ దలఁచెను. సైన్యమును దూర మునునుంచి, రాజు అశ్వము నవరోహించి, న్నాయనారును సమీపించి, "యీ మదగజము భక్తాగ్రేసరుల శరీరమున కెట్టి యపకృతిఁ గావింపకుండుట మా పూర్వజన్మ సుకృతము. వీరి

కింతటి కోపము రా నదియే యపకారమొనర్చెనో! హా కష్టము" అని తలంచుచు నిలువఁబడియె.

పుగళ్చోళుఁ డాప్తులను వదలి, యెరిపత్తనాయనారు పాదములకు నమస్కరించి "మా భద్రగజము దేవరకుఁ జేసిన యపచారమెద్దియో తెలియరాదయ్యె. అంతఃపురమున నెద్దియో దుర్వార్త వింటిని. అయ్యది యట్లుండనిండు. అది చేసిన తప్పిదమునకు మావటీండ్రు హతులైరి. ఈ ప్రతీకారము చాలునా! అనుగ్రహింపుఁడు" అని రాజు దోసిలి యొగ్గి నిలిచెను.

నాయనారుఁడా చోళునిఁగాంచి "రాజా! శివకామి యాండారు శివున కర్పింపఁదెచ్చు పూవుల పుటికను ఈ గజ మాకర్షించి, వెదచల్లి పాదములతోఁ ద్రొక్కెను. కాన దాని నంతమొందించితిని. గజమట్లు పూవులను విసరునపుడు చూచు చుండిన మావటివారు దానిని క్రమమార్గమునఁ బెట్టనందున వారును హతులైరి. ఇదియే యిచట జరిగినది" అనెను. అంత నా భూపశ్రేష్ఠుఁడు "స్వామీ! శివాపరాధము జరిగినది. దానికి మీరొనర్చిన ప్రతీకారము చాలదు. కాన నీ దాసుని శిరమునకు మీ మంగళకర పరశువునకు బలికాఁదగు నర్హత లేదు. కావున ఈ నా ఖడ్గముతో నన్నుఁ గడతేర్పుఁడు" అని తన యొఱలోని ఖడ్గముఁదీసి యాతనికిచ్చెను.

ఆ పుగళ్చోళుని భక్తి ధైర్యములను, ధర్మదృష్టినిఁ గాంచి, యెరిపత్తనుఁడు భయముచే వడఁకసాగెను. "అయ్యో!

చెడితిని. ఈ నృపునకింత యపార భక్తి గలదని తెలియనైతి. నేఁడీతని ధార్మిక హృదయము నెఱింగితి. నేనిపు డీతఁడొసంగు ఖడ్గముఁ గైకొననిచో నితఁడు దాని కెఱయగునేమో" అని చింతించి యాతఁడొసఁగిన కరవాలముఁ గైకొనెను. రాజాతనికి మ్రొక్కి, "నేఁడు నా జన్మము ధన్యమాయె. ఈతఁడిపుడు ననుఁ జంపి నా దోషములఁ దొలఁగించి మహోపకారమొనర్పనున్నాఁ"డని సంతసించెను. ఎరిపత్తనుఁడా మాటలను విని, భయకంపితుఁడయ్యెను. గజమును మావటివారిని చంపినందులకు వెతఁజెందక ఖడ్గము నొసంగి తన్ను చంపుమనుచున్నాఁడు. ఇట్టి భక్తవతంసున కపకార మొనర్చితిగదే. ఈ నా యకార్యమునకు నేనీ ఖడ్గమునకు బలియగుట మే"లని తలంచి తన కంఠము నుత్తరించుకొన నుంకించెను. అంతలో నా ఱేఁడా దృశ్యముఁగాంచి "మీరేల యిట్లు సేయఁబూనితిరి" అని వేగముగ నాతని చేతియందలి ఖడ్గమునుబట్టి నిలిపెను. వారిరువురు తమ కోర్కెలు నెఱవేఱనందులకు వగచిరి. వీరిలో మహానుభావుఁడెవఁడో యా శివునకే యెఱుక. ఒకరిని మించి యొకరు స్వాపరాధములఁ దలఁచి మరణింప సిద్ధులగుటఁ జేసి, యిరువురు మహాత్ములనియే యెన్నఁదగును.

భక్తావనుఁడగు శివుని కృపచే నపుడొక యశరీరవాణి "భక్తిమదగ్రేసరులారా! మీ పరమ మాహేశ్వరభక్తిని లోకములకుఁజాట మత్తేభము పూవుల వెదచల్లి త్రొక్కె" అని వీతెంచెను. వెంటనే మరణించిన గజము తద్రక్షకులును నిద్ర

నుండి లేచినట్లు జీవించిరి. ఆ దృశ్యముఁ గాంచిన ఎరిపత్త నాయనారు కంఠమునఁ బెట్టికొనిన ఖడ్గమును దిగవిడిచి, రాజును సమీపించి యాతని పాదములకు మ్రొక్కెను. ఆ భక్తుల మనోగతభావముల నెఱింగిన, దివౌకసులు వారిపైఁ బుష్పవర్షముఁ గురిసిరి. జనులు జయఘోషలు వెట్టిరి. వారిరువురు శివుని కృపారసవాక్కులు వీతెంచిన, దిక్కునకుఁ జేతులు జోడించి, నమస్కరించిరి. శివుని కృపచే వీధియందు చెదరిన పూవులన్నియు నైంద్రజాలకుని విద్యవలె పుటిక నిండినవి. యథారీతి పుటిక నిండిన పూవులఁగాంచి శివకామి యాండారు నిండారిన డెందముతో శివునకు మ్రొక్కెను. మావటీంద్రతో భద్రగజ మేతెంచి రాజుముందు నిలిచెను. అపుఁ డెరిపత్త నాయనారు "రాజా! నీవీ భద్రేభము నెక్కి యంతిపురికేఁగ ప్రార్థించుచున్నాఁడ" ననెను.

అంత నా భూపతి "మీ ప్రియమైన యానతిఁ దలఁదాల్తును" అని గజము నధిరోహించి, సైన్యములు వెంట నడువ, పరమశివుని మహిమ కాశ్చర్యపడుచు, నా భవానీపతిని ధ్యానించుచు, నంతఃపురమున కేఁగెను.

శివకామియాండారుఁడు మహానందమున పుష్పంబుల పుటికఁ గైకొని యాలయమున కేఁగెను. ఎరిపత్త నాయనారు "శివభక్తుల మహిమల నెఱుంగ నేరితర"మని, మది నెంచుచు గృహమున కేఁగి యానాఁటినుండి శివదాసులకు తన ధన ప్రాణ

ముల నర్పింప సిద్ధుఁడై కొంతకాలము గడిపెను. వృద్ధుఁడై తనువును త్యజించి, శివలోకముఁజేరి సాంబశివుని కృపచే శివ గణాధ్యక్షతవహించు భాగ్యము నందెను. నాయనారుని భక్తజనసేవ, వీరకృత్యంబులును, రాజు ఖడ్గమొసంగి తన్ను చంపుమని కోరుటయు, అనితర సాధారణకృత్యంబులై యాతనికి మోక్ష సాధకంబులయ్యె. అట్టి భక్తులకు పరమ పదమొసంగిన పరమేశ్వరుఁడే వారి మహిమలను వర్ణింపవల యును గాని యందులకు వేఱొకఁ డర్హుఁడగునా!

"శివభక్తాపకారమే శివద్రోహము."

# 9. ఏనాదినాథ నాయనారు

మహోన్నత హిమవచ్ఛృంగములపైఁ దమ వ్యాఘ్ర పతాకమును నాటి, విజయభేరిని బ్రమోగించినవారు చోళులు. తత్పాలిత చోళమండలమున పాడి పంటల కేకొఱంతయు లేదు. అట్టి దేశమందు "ఏయినసూరు" అను ప్రాచీన గ్రామమొండు గలదు. దాని నావరించి, పంటభూము లపారంబుగఁ గలవు. పుష్పోద్యానంబులును కన్నులకు విందగు చుండును. ఆ యూరియందు కర్షకవృత్తిచే జీవించు, గవండ్ల వారు తమ వృత్తులను విడువక సుఖముగ జీవించుచుండిరి. కల్లుగీయుటయే జీవనాధారముగల యొక గవండ్లకులమునఁబుట్టిన "ఏనాదినాథుఁడ"నువాఁడు శివభక్తుఁడై యుండెను. అతనికి భస్మధారణమందుఁ బ్రీతి మిక్కుటము. అతఁడు తమ వంశీయులవలెఁగాక, రాజులకు ఖడ్గచాలన విద్యను నేర్పు వాఁడై యుండెను. విద్యాబోధనచే లభించు ధనమును, శివ భక్తులకే వినియోగించెడివాఁడు. శత్రువులుగూడ పొగడు ధర్మ మార్గమున జీవించుచు, తమ కులమువారిలో శ్రేష్ఠుఁడై యుండెను. ఖడ్గచాలన విద్యలోని రహస్యములన్నియు నాతనికిఁ గరతలామలకములు.

అయ్యూర ఏనాదినాథునివలె ఖడ్గ విద్యాబోధకుఁడు మఱొకఁడుండెను. అతిశూరుఁడను నామముగల యాతఁడు కత్తి సామునందు నేర్పరి. అతఁడు తన్ను మించినవాఁడు

లేఁడని గర్వించియుండెను. అతఁడు ధనమార్జించుచున్నను అది యాయా దినమునకే చాలకుండెను. తన సాటివాఁడగు ఏనాదినాథున కతని వృత్తియందు ధనమధికముగ లభించు చుండుటఁగాంచి, యితండాతనిపై నసూయావహించెను. చితా భస్మసమానమగు చింత యాతనిఁ బీడింపసాగెను. పరోత్కర్షా సహిష్ణువయ్యెను. క్రమముగ నది వైరముగఁ బరిణమించెను. పరోత్కర్షాసహిష్ణుత యొక గొప్ప వ్యాధి. చండకిరణుని ముందు శీతమయూఖునివలె ఏనాదినాథునియెదుటఁ, దా నిర్వీర్యుఁడనైతినని చింతించి, యెట్లైని యాతని నెదిర్చి, పోరి తన యాధిక్యము లోకమునకుఁ దెల్ప నిశ్చయించెను. అతిశూరుఁ డొకనాఁడు బంధువులను వీరులగు మిత్రులను ఛాత్రులను వెంటనిడికొని, నాయనారు నింటికేఁగెను. అతని వాకిట నిలిచి, సింహముండు గుహకడఁజేరి శబ్దించు జంబుకమా యన నాతఁడు "ఖడ్గవిద్యానిపుణుండవగుచో, రణదుర్మదుఁడవగుచో, నాతోఁ బోరరమ్ము" అని కూయిడి రణమున కాహ్వానించెను. నాయనారాతని పిలుపును విని యుద్ధమున కాహ్వానించిన, వీరులు గాదనరాదని తలఁచుచు, ఖడ్గమును హస్తమునం దాల్చి, వెలికివచ్చి నిలిచెను. ఆ సందడిని వినిన నాయనారుని బంధువులు శిష్యులు వేగముగ వచ్చి, యాతనికి సాయముగ చుట్టు బలిసిరి.

అతిశూరుఁడు నాయనారుఁగాంచి, "మన ముభయులము నగరమున కావల విశాలప్రదేశమున వ్యూహము పన్ని

పోరుదము. "అందెవరు విజయ మందిన వారే యిక ఖడ్గవిద్యా చార్యులై వాసికెక్కంచవలయు" ననెను. నాయనారాతని యుద్ధాహ్వానమునకు సమ్మతిఁ దెలిపెను. అంతట వారిరువురు తమతమ బలగములతో నిర్ణీత ప్రదేశముఁజేరి వ్యూహముఁ బన్ని నిలిచిరి. ఉభయపక్షములవారు దలపడిరి.

ఖడ్గధారులు ఖడ్గధారులతో ధనుర్ధరులు ధానుష్కులతో బల్లెములవారు బల్లెములవారితోఁ దలపడి ప్రాణములను తృణము లుగఁదలఁచి పోరసాగిరి. యుద్ధభూమి యందంతయు రక్తము నదులై ప్రవహించెను. ఎచటఁగాంచిన హాహాకారములే. తెగిపడిన చేతులు కత్తులను విడువకుండెను. తల తెగిన మొండె ములు కొంతదూరమేఁగి పడుచుండెను. తెగిపడిన తలలు దొర్లుచుండెను. ఈటె పోట్లచే గుండెలు బయలుపడి చచ్చిన వారు, దంత సందష్టాధరోష్ఠులై యుండిరి. వీరుల గండపెండర ములు ఘల్లుఘల్లుమని, నినదించుచు, దొరలుచుండెను. కొందఱి యుదరములనుండి ప్రేగులు వెలికిరా, భయంకరముగఁ బడు చుండిరి. మృతుల మాంసాశనాసక్తిచే బారులు దీరిన పక్షి జాతంబులచే నాకసము నీరంధ్రింబయ్యె. ఇరువాగుల సైని కులు లెక్కకుమించి మృతిఁజెందిరి.

ఏనాదినాథుఁ డాదృశ్యముఁగాంచి వీరావేశ వివశుఁడై, చావఁగ మిగిలిన శత్రు సైన్యముపైఁబడి; నుఱుమాడఁ జొచ్చెను. అతని ఖడ్గము నాలుకలు చాచు మహావ్యాళము వలె, శత్రువుల ప్రాణవాయువులఁ గైకొనసాగెను. అతని

ధాటికాఁగలేక వీరులు పెక్కురు ఆతని కత్తి కెఱయైరి. చావక మిగిలినవారు జ్ఞాను లాశాపాశమును వీడునట్లా రణరంగమును వీడి, వెనుఁదిఱుగక పాఱిపోయిరి. అతిశూరుఁడు తనవారిని పురికొల్పి, సేనాదినాథు నెదిరించెను. దైవ ధర్మబలములు గల నాయనారు హరిణవ్రాతములోఁ జొచ్చిన మృగరాజువోలె వీరవిహార మొనర్చెను. అతిశూరుఁడిక పోరి లాభములేదని పిక్కబలము సూపి, గృహముఁ జేరెను. తనకుఁ గల్గిన పరాభవముఁ దలంచి, దుఃఖించుచు నానాఁటి రాత్రి నిదుర లేకయే గడపెను. కపటముచే నాయనారు నంత మొందింప నిశ్చయించెను.

అజ్ఞానాంధకారముఁ బటాపంచలు సేయుచు జ్ఞాన భాస్కరుఁ డుదయించెను. వెంటనే యతిశూరుఁడొక సేవకునిఁ బిలిచి, సైన్యములతోఁ బోరిన జయాపజయములు నిశ్చితములుగావు. మనమిరువురముఁ బ్రత్యేకముగఁ బోరాడ వలయు. కాన యూరి వెలుపలనున్న యిసుకతిన్నె కడకు రమ్ము" అని నాయనారునకు వార్తఁ బంపెను. శత్రువాహ్వానించిన ద్వంద్వ యుద్ధమునకు నాయనారు తన సమ్మతిఁ దెల్పి; కత్తిని డాలును హస్తములఁదాల్చి, నిశ్చిత స్థలమున కొంటరిగఁ బోయెను. బంధువుల కెఱింగింపకయే యుద్ధభూమిఁ జొచ్చిన నాయనారు, శత్రువురాక కెదురుచూచు చుండెను. భస్మ ధారులకెపుడు సేనాదినాథుఁడు గీడుసేయఁడని యెఱింగిన అతిశూరుఁడు, తానెన్నడు విభూతిఁ దాల్పనివాఁడయ్యు, నొసట

భస్మత్రిపుండ్రములఁ దీర్చిదిద్ది, ఖడ్గము చేఁబట్టి యెడమచేఁ దాల్చిన డాలును మోమున కడ్డముగఁ బెట్టికొని, రణరంగ మున కేతెంచెను.

ఆహారమునకుఁ దగిన మృగము వచ్చునంతకు వేచి యుండు మృగరాజువలె, నిలిచియుండు నాయనారును సమీ పించి, యతిశూరుఁ డాతనిపైఁ గత్తి విసరెను. నాయనా రాదెబ్బను తప్పించుకొని, సవ్యముగఁ దిరిగి తన ఖడ్గముతో నాతనిఁ గొట్టెను. ఖడ్గద్వయము ఖంగు ఖంగుమని మ్రోగ సాగెను. వెనుదీయక యిద్దోరులు తమ ఖడ్గ విద్యానై పుణ్యంబులఁ జూపుచు, సవ్య దక్షిణములఁ దాఁకుచు, సవ్య దక్షిణ పరిభ్రమణములతో చాలసేపు పోరిరి. నాయనారు సమయముఁజూచి, విద్యలోని మెలకువతో నొకపోటా యతి శూరునిఁ బొడిచెను. ఆ వీరుని ఖడ్గపుమొన తన్ను సమీ పించుటఁగాంచి, వంచకుఁడగు నతిశూరుఁడంతఁ దనుక తన మోమున కడ్డముగ నుంచిన డాలును ప్రక్కకు లాగెను. నాయనారునకు శత్రువు నుదుటనుండు భస్మత్రిపుండ్రములు కన్పించెను. "అయ్యో! చెడితిఁగదే" యని నాయనారు తన ఖడ్గమును వెనుకకు లాగెను. ఎన్నఁడు నీతఁడు భస్మ ధారిగాఁడే. నేఁ డితని నుదుట భస్మముఁ గాంచితిని. భస్మ ధారుల కేయపరాధ మొనర్పరాదుగదా" యని విభ్రాంత చేస్కుఁడై నిలువఁబడెను.

"భస్మధారి కాన నితఁడు శివభక్తుఁడేయగు; నేమి సేయ నగు" నని హస్తమందలి కత్తిని నేలఁ బడవేయఁ దలంచియు, నిరాయుధుని జంపెనను నింద యీతనికి రారాదని తలంచి, పోరువానివలె నిలిచెను. అంతలో పాతకియగు నా యతిశూరుఁడు తన పనిని ముగించెను. శత్రువు ఖడ్గమా నాయనారుని గుండెలో దూసికొనిపోవ నతఁడు నేలఁగూలెను.

భస్మధారులయెడ నాయనారునకుఁగల భక్తి విశ్వాసములఁ గాంచిన సోమశేఖరుఁడు చిదాకాశమార్గమున నిల్చి శత్రుఖడ్గముచే లోకపాశముల వీడిన ఏనాదినాథునిఁగాంచి "యిఁక నన్ను వీడని స్థితి నందెదవుగాక" యని పల్కి యదృశ్యుఁడై చిత్సభను జేరెను. ఏనాదినాథుఁడును కైలాసముఁ జేరి, శివసేవాభాగ్యమునంది యానందించెను. ఏనాదినాథుని భస్మప్రీతి నెట్లు వర్ణింపఁగలము!

"భస్మధారులు నహంతవ్యులు. విభూతియే భక్త విభూతి."

104B



కన్నప్ప శివునకుఁ గన్నిచ్చుట

# 10. కన్నప్ప నాయనారు

(తిన్నఁడు)

"మార్గావర్తిత పాదుకా, పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం, పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షితమాంస శేషకబలం, నవ్యోపహారాయతే
భక్తః కింనకరోత్యహో! వనచరో భక్తావతంసాయతే".
(శివానందలహరి.)

కమలాకర సంయుతము వివిధఫల పుష్పవనావృతము పచ్చని పైరుపంటలతోఁ గలకలలాడునది పొత్తపినాఁడు. శ్రీ కాళహస్తీశ్వర సన్నిధానముచే నయ్యది పవిత్రమైనది. ఆనాఁట 'ఉడుమూరు' అను ప్రాచీన గ్రామ మొండుగలదు. అయ్యది కన్నప్పకు జన్మస్థాన మగుట పుణ్యస్థల మాయెను. ఆ యూరు కిరాతుల కాటపట్టు, అది పర్వతములచేఁ జుట్టఁబడి, యరణ్యమధ్యమున నుండుటచే నితర జనులకు దురాసదమై యుండెను. ఆ యూరిచుట్టు ఏనుఁగుల దంతంబుల కంచెగలదు. మఱియు కొండఱాళ్లతో నిర్మింపఁబడిన ప్రాకారమొకటి యా యూరు నకు కోటగోడవలె నుండు.

అచట నివసించువారందఱు నాటవికులగు చెంచులు. వారు తమ వేఁటకుక్కలను వెలగచెట్లకుఁ గట్టియుంతురు. వేఁటకు నుపయోగించు వలల నచటి వృక్షములకు వ్రేలాడఁ

గట్టుదురు. ఆచట అడవిపందులు, పులులు, చిఱుతపులులు, ఎలుఁగుబంట్లు జింకలు పెంపుడు మృగములై తిరుగాడుచుండును. చెంచులు తమ గృహాంగణములందు కొండలపై నేఱితెచ్చిన, నివ్వరి ధాన్యమును బండలపై నెండఁబెట్టి, కావలి కాయు చుందురు. చెంచులబిడ్డలు పులిపిల్లలతో నేనుఁగు గున్నలతో, హరిణపోతములతో నాడుచుందురు. చెంచుల గూడెములం దెప్పుడును "నఱకు, చంపు" అను మాటలే మిక్కుటముగ వినిపించుచుండును. ఢమరుక ఢక్కా కాహళాదుల యులి వులే సదా యచట విననగును. పై శబ్దములను మీఱి సమీప మునునుండు కొండలనుండి స్రవించు సెలయేళ్ల ధ్వనులు దిక్కుల నావరించుచుండును. చెంచులు దేశాంతరములపైఁ బడి, యపహరించి తెచ్చిన పశ్వాదులు గుంపులు గుంపులుగ నచట గన్పించును. వ్యాఘ్ర గజాదుల యఱపులు పిడుగులువోలె శ్రవణకుహరములను విదారించుచుండును.

అచట నివసించు వేటకాండ్రగు చెంచులు కాటుక కొండలవలె నల్లని దేహచ్ఛాయఁగలిగి, దృఢగాత్రులై మూర్తీభవించిన వీరరసమో యన నుందురు. దయా దాక్షి ణ్యంబులు వారిచెంతఁ జేరవు. కొందఱు చర్మాంబరములను ధరింతురు. కొందఱు పాఱుటాకులను వస్త్రములుగఁ దాల్తురు. వారు విషాక్తబాణంబుల నెల్లవేళలఁ జేఁదాల్తురు.

చెంచెతలు విషాణలబ్ధ మౌక్తికంబులను, గజకుంభ సముపాగత ముక్తాజాలంబులను, వైణవంబులగు ముత్తి

యంబులను శుక్తి ముక్తాఫలంబులను ధరింతురు. మఱియు ననేక విధంబులగు పూసల చేరులను, కురువిందమాలికలను మెడనిండఁ దాల్తురు. పునుఁగు, కస్తూరి, జవ్వాది మొదలగు సువాసనా ద్రవ్యంబులచే నించిన ఘటంబులు, ప్రతిగృహమునఁ దమతమ వాసనల వెదచల్లుచు, వారి భాగ్యంబును దెల్పుచుండు.

కిరాతులు స్వకుల ధర్మమును వీడకయుందురు. మాంస సహితాన్నము, తేనియలే వారి కాహారము. భిల్లాంగనలు పంట పొలములకుఁ గాఁపుందురు. వారు మంచెలపై నెక్కి యఱచు చుఁ బక్షులఁ బాఱఁద్రోలుచుందురు. ఒడిసెల్లతో ఱాలు విసిరి, కొన్నింటిఁ గొట్టుదురు. శబరులు తేనియలఁ గ్రోలి, "భిల్లాంగ నల యధరమాధురీ మహిమకన్న నిందేమి రుచిగల"దని, మధువు సేవగింతురు. భిల్లవనితలు వెదురు విండ్ల గసిగోలలఁ దాల్చి, భర్తలతో నడవిలోఁ దిరుగాడుచుందురు.

ఇట్లు సకల సంపదభిరామంబగు నాయూరున కధీశ్వ రుండు భిల్లనాయకుఁడు "నాగుఁడు." అతఁడు ధనుర్విద్యలో నిపుణుఁడు. హింసాసక్తుఁడు. సకల ప్రాణి భయంకరుఁడు. భుజబలశాలియై మగసింగమునకు సాటియై యుండెను. అతనికి చెంచెతయైన గౌరివలె, తందె (తత్తె)యను భార్య యుండెను. ఆయమ పులిగోరుల దండను కురివింద మాలికలను, తలపై నెమిలి పింఛమును వివిధ పుష్పహారములను ధరించి యాఁడు సింగమాయన వెలయుచు, నాథునకుఁగూర్చు నెచ్చెలియై యుండెను.

ఆ కిరాత దంపతులు భిల్లులకుఁ మాననీయులై, చాల కాలము సంసార సుఖముల ననుభవించిరి. కాని వారికి పుత్రముఖ సందర్శన భాగ్యము గల్గదయ్యె. వారు పుత్రార్థమై సమీపమునఁ గొండలలో వెలసిన, సుబ్రహ్మణ్యస్వామిని పూజించుచు ప్రార్థించిరి. కుమారస్వామికి నుత్సవము సేయ సంకల్పించి, యూరు నలంకరింపఁ జేసిరి. వీధులం దంతట రత్న తోరణములను భ్రమర ఝుంకారయుతములగు కదంబ పుష్పమాలికలను, చూత పల్లవ మాలికలఁ గట్టించిరి. ఆవేశ దాసీలనఁబడు పూజారిణులచేఁ బూజలు సేయించిరి. అట్టి పూజల కాషడాననుఁడు సంతసించి, వారిని కటాక్షించెను.

కుమారకటాక్షముచే తందె గర్భవతి యయ్యెను. నాగుఁ డపరిమితానంద భరితుఁడై, దేవతలకు బలుల నొసంగెను. * తందెకు క్రమముగ భసితాంగశోభయో యన శరీరము పాండురమయ్యెను. శివాకృతితో నణుతరమైన యామె నడుము ఘనతరమయ్యెను. గర్భశ్రాంతయగు తందెకుఁ గోరికలు వొడమినవి. ఆమె సింహవ్యాఘ్రాది మృగములఁ జంపఁగోరును. కొండ చరియలలోని సెలయేటి సైకతస్థలినున్న శివుని దర్శింపఁగోరును. రుచియైన మాంసమును దొప్పలయందిడి, శివున కర్పింపఁగోరును. గర్భస్థ శిశువు గుణముల కనుగుణముగ, నీలోత్పలంబుల శివు నర్చింపఁ గోరును. క్రమముగ నిట్లామెకు నవమాసములు నిండెను.

సాగరము చంద్రుని గాంచినటుల నొక శుభముహూర్తమున నామె పుత్త్రునిఁ బ్రసవించెను. సంసార మోహపాశముఁ గోసినటుల దాదులా బిడ్డనికి బొడ్డుకోసిరి. పాపపంకిలమును ప్రక్షాళన మొనర్చినటుల నీళ్ళార్చిరి. శివభక్తిఁ దెల్పునటుల బూదిని మైనిండ నలఁదిరి. ఆంతరంగిక కల్మషహరంబైన చిత్సుధారసమువంటి యాముదమును కడుపునకుఁ బెట్టిరి. తండెకు కుమారుఁడు గల్గెనని విని కిరాతులానందించి యాడి పాడిరి. అపుడాకసమునుండి పుష్పవర్షము గురిసె. దేవ దుందుభులు మ్రోఁగెను.

అపుడు నల్లనికొండ నీలమేఘంబులఁ దాల్చినటుల నాగుఁడు కుమారు నెత్తికొని, శిరము మూర్కొనెను. భిల్లులే గాక లోకమంతయు మెచ్చు లక్షణంబులుగల కుమారుఁ గాంచి యాతఁడు మేరలేని సంతసంబందెను. తిన్నఁదనంబుల కాస్పదుండగు నా బిడ్డనికి తల్లిదండ్రులు తిన్నఁడని నామమిడిరి. (బలవంతుఁడుగాన తిన్నఁడని పేరుబెట్టినట్లు తమిళమునఁ గలదు). బిడ్డని సకలాభరణంబులచే నలంకరించి పల్లవమాలికలను వైచిరి. ఆటవిక దేవతలకు కాట్రాయి సామికి బలి పూజోపహారంబుల నర్పించిరి. ఇష్టదైవంబులకు నుత్సవంబులు సాగించి, యన్నదాన మొనర్చిరి.

*దినదినాభివృద్ధిఁ గాంచు నా బాలకుండు లోకము శివభక్తి రహితమైనదే యని పరిహసించునట్లు నవ్వసాగెను. మోహబంధము త్రెంచునట్లు పాదము లాడింప సాగెను.

సంసారమునకుఁ జగన్మోహము పెట్టునట్లు బోరగిలపడెను. క్రమముగఁ గూర్చుండి విశ్వనాథుని తత్త్వము వెదుకఁబోవువానివలె తప్పటడుగులిడెను.

ఇట్లు దినదినప్రవర్ధమానుఁడగు కుమారునకు తండ్రి పులిగోరుల దండలను, పందిముళ్ల దండను, కటియందు చిఱుగంటలతోఁగూడిన బంగరు మొలత్రాటిని, పాపటయందు రత్నాల రావిరేకును, పాదముల గజదంతపు టందెలలను అలకరించి యానందించుచుండెను,

ప్రత్యహము స్నానమాడించి, కురువింద మాలికలను నెమిలియీఁకల నలంకరించి, కాటుకఁబెట్టి, మొలకు తాయెతులఁగట్టి పంప నాతఁడు వీథిలో నితర శబర బాలకులఁ గూడి. యాడుచుండెను. తల్లిదండ్రులు సంతసించునటు లాబాలకుఁడు గంగాజలమువంటి లాలాజలముఁ గార్చుచు, ముద్దుబల్కులాడుచుండెను.

ఒకనాఁడు వ్యాఘ్రివదనంబున చేఁజొనిపి, క్రీడించు కుమారుని నాగుఁడు గాంచి, యాతని దౌష్ట్యము మాన్పదలచి, చిగురుటాకులతో బెదరించి, తఱుమ నతఁడు కన్నీరుఁగార్చుచు తండ్రి యొడిలోని కేఁగెను. ఆమె యాతని కన్నీరుతుడిచి, యెత్తి ముద్దాడెను. ఒక్కొక్కనాఁ డాతఁ డాటబండ్లను నడపును. వేఁటకుక్కలకుఁ గట్టిన త్రాళ్లను త్రెంపివేయును. ఆఁడుపిల్లలు మంటితోఁ గట్టుకొనిన, యాటయిండ్ల నాబాలుఁడు కాళ్లతోఁ ద్రొక్కి సంతసించును. ఇట్లు చిన్న తప్పుల

నొనర్చుచు. బాల్యమును గడుపుచుండెను. పిదప తోడి శబర బాలురఁగూడి, తోఁపులలోని కేఁగి, కుందునుగుమ్ములు, దాగుడుమూతలు, బిల్లంగోళ్లు, మొదలగు నాటలాడుచు క్రమముగ నతఁడై దేడుల ప్రాయమువాఁ డయ్యెను. అపు డాతఁడు భిల్లబాలురఁగూడి వనములకేఁగి, పులిపిల్లలను అడవి పందిపిల్లలను, హరిణశాబకములఁ బట్టి తెచ్చి, చెట్లకుఁ గట్టి సాగెను. ఇట్లాడియాడి, సాయంసమయమునకు నింటికిరా, దాది వానికి స్నానమాడించి, తెల్లావాల పాగవైచి, కడుపు నిండ బువ్వబెట్టి, నిద్రింపఁజేయును. క్రమముగ నాతఁడు విద్యాభ్యాస ప్రాయముఁ బడసెను.

నాగుఁడు కొమరున కస్త్రవిద్యాభ్యాసముఁ జేయింప నభిలషించి, ధనురాచార్యులఁ బిలిపించెను. విద్యాప్రారంభ మునకొక శుభదినమును నిర్ణయించెను. బంధువులకందఱ కాహ్వానములఁ బంపెను. ఆహూతులందఱు రత్నము లను, ముత్తియంబులను, బంగారమును, వ్యాఘ్రచర్మ ములను, గజదంతములను, నెమిలిపింఛములను, తేనియలను, వివిధ మాంసములను, కందమూల ఫలాదులను, కానుకలుగఁ గైకొని, యుడుమూరునకు వచ్చిరి. వచ్చినవారితో నాయూరి సుకవైచిన రాలనట్లుండెను. ఆ యుత్సవమునకుఁ గావలసిన పదార్థముల నన్నింటినిఁ జేకూర్చిరి.

శివకోదండమువంటి ధనువు నొకదాని నలంకరించిరి. బాలుని చేతికి పులి నరములతోడి కంకణముఁ గట్టిరి. అందఱు

బాలు నాశీర్వదించిరి. గడ్డిబియ్యముతోఁ వెదురుబియ్యముతోఁ నిర్వారిధాన్యపు బియ్యముతో నన్నంబులను వండిరి. వివిధ మాంసంబులను కాయగూరలను పక్వంబు లొనర్చిరి. కొందఱు గడ్డలపిండితో, తేనియలఁగలిపి భుజించిరి. కొందఱు మాంసాహారముఁ దినిరి. మఱికొందఱు మాంసమును తేనెలో నుంచి వండిన, నిసుళ్లపురుగుల మాంసంబును భుజించిరి. మధ్యాహ్నమువఱకుఁదిని, పిదప మద్యమును సేవించిరి. ఇట్లు వచ్చిన వారందఱు తృప్తి నంది చిగురుటాకుల దండలను పుష్పమాలికలను, రత్నములుఁ దాపిన నడుము పట్టాలను, బిగించి యొడలినిండ పూసలదండలను, దాల్చి యాధనువును చుట్టి నిలిచి, మేళతాళములతోఁ గొమ్ములనూఁదుచు, ఢంకాలను మ్రోఁగించుచు, తప్పెటలఁ దట్టుచు, ధనువునెత్తికొని, గ్రామమును ప్రదక్షిణీకరించుచు నుత్సవమొనర్చిరి. కొందఱు కురంజీ రాగముఁ బాడుచు నాట్యమొనర్చిరి. చెంచెతలు గొబ్బి తట్టుచు నడచిరి. శింగియాటల నాడిరి. ఇట్లా ధనురుత్సవ మాఱుదినములు సాగెను. ఏడవనాఁడు ముందుకంటె ద్విగుణీకృతముగ నుత్సవమును జరిపిరి.

మిట్ట మధ్యాహ్న సమయమున మంగళ వాద్యములు మ్రోఁగుచుండ, నాచార్యుఁ డాధనువును తిన్నని చేతికి నొసంగెను. ఆనాఁటినుండి తిన్నఁడు ధనుర్విద్యా పండితుఁడగు టయేఁగాక ఖడ్గము, శూలము, ఈఁటియ మొదలగు నాయుధ ప్రయోగములలోఁ గుశలుఁడయ్యెను. శుక్లపక్ష చంద్రుని

వలె వృద్ధినందుచు నాతఁడు పదునాఱేండ్ల ప్రాయమువాఁడయ్యెను. అపుడాతఁడు రూపెత్తిన పుణ్యరాశియో యన విలసిల్లు చుండెను.

నాగుఁడు వృద్ధుఁడయ్యెను. పూర్వమువలె నాతఁడు వేఁటకేఁగి, దుష్టమృగాదులఁజంపి, యాదేశమును జనులను రక్షింపఁ జాలనివాఁడయ్యె. ఒక దివసంబున భిల్లులాతనికడకు వచ్చి, "యడవిపందులు మా పైరుపంటలను నాశమొనర్చుచున్నవి. పులులు ఏనుఁగులు విచ్చలవిడిగఁ దిరుగుచు, పంటలకేగాక జనులకు భయముఁ గల్పించుచున్నవి. మా బాధలను తొలఁగింపుఁడు" అని వేఁడికొనిరి. వారిమాటల నాలించి నాగుఁడు, "నాకు ముదుసలితనము దాపురించినది. నే నింతకుముందువలె వేఁటాడఁజాలను. కాన ఇఁకమీఁద మీరు నా కుమారుఁడైన తిన్నని రాజుగఁ జేసికొని, జీవింపుఁడు" అని పల్కెను. వారు "దేవరా! ఇంతవఱకు మే మేకష్టముల నెఱుంగక జీవించితిమి. ఇఁక నీ పుత్త్రునిదండ సుఖంబుండఁ గలారము. కాన నీ పుత్త్రుని మాకుఁ బ్రభువుగ నొనర్పుఁడు" అని వేఁడిరి. అతఁడట్లేయని సమ్మతించి, కుమారునిఁ బిలువఁబంచెను. రాజగువాఁడు ముందు కన్నె వేఁటకుఁ బోవుట వారి కులాచారము. కాన నాగుఁడు పూజారిణిని బిలువఁబంపెను. వృద్ధురాలైన పూజారిణి యడుగులు తడఁబడ వచ్చెను. నాగుఁడామెను గాంచి "తల్లీ! తిన్నఁడు కన్నెవేఁటకుఁ బోవలయుఁ గావున నాతని శ్రేయంబునకై

యాటవిక దేవతం బూజింపుము" అని ప్రార్థించెను. అంత నామె "ఓయీ! నేను వచ్చునపుడు శుభశకునములం గంటిని. నీ పుత్త్రుఁడు తిన్నఁడు శుభంబులఁ బొంది శ్రేష్ఠుఁడగు"నని పల్కి, బలిపూజా ద్రవ్యంబులఁగొని వెడలిపోయెను.

తండ్రి పిలుపును విని తిన్నఁడు భిల్లబాలురు చుట్టి బలిసిరా, నేతెంచి తండ్రికి మ్రొక్కెను. తండ్రి యాతనిఁ బ్రేమతోఁ గౌఁగిలించి, వ్యాఘ్రాసనమునఁ గూర్చుండ నియమించి "కుమారా! నేను వృద్ధుఁడనైతిని. నాకు జవశక్తులుడిగినవి. కావున నీవిఁక మన కిరాతకులమునకు రాజవై విరోధులను జయించి, దుష్టమృగములను సంహరించి, నీ జాతీయులను రక్షించి దేశమున శాంతి భద్రతలఁ గాపాడుము" అని పల్కి, తన ఖడ్గమును మొలపట్టియ నాతని కొసంగెను. తిన్నఁడు తండ్రి పాదములకు మ్రొక్కి వానిఁ గైకొనెను. తండ్రి "నీవు నాకంటె మేలుగ ప్రజలను రక్షింతువుగాక. కులాచారము ననుసరించి, విలుకాండ్రగు వేఁటకాండ్రఁగూడి, కన్నె వేఁటకేఁగుము" అని కోరెను. తిన్నఁడు తండ్రి యనుమతి నంది వేఁటకు బయలుదేరెను.

ధనుర్బాణములఁ దాల్చిన శబరులు వేఁటకుక్కలను వేఁటకు అలవఱచిన యితర మృగంబులను వెంట నిడికొని, ముందుగ నేఁగిరి. కొందఱు బోయలు వలలను వీఁపులపై మోసికొనుచు, వారి ననుగమించిరి. సాగరముఁజేరు కాళిందివలె కొందఱు తప్పెటలఁ మ్రోఁగించుచు, కొమ్ములు నూదుచు కరములఁ దట్టుచు,

ఘోషించుచు, నడవిం దరిసిరి. కొం[redacted]రులను, ఉరిగోలలను బోనులను చిక్కంబులను చిగురుగండెలను ఒడిత్రాళ్లను తల ముళ్ల నుపయోగింప సిద్ధపడిరి. అంద అన్నిదిశలకుఁ బాఱి, యా యరణ్యమును చుట్టుముట్టిరి. వేగులు దట్టముగ నచటఁ గన్పించు గజ వరాహ హరిణముల పాదచిహ్నములఁ గాంచి, మృగములుండు తావుల నితరులకుఁ దెల్పసాగిరి. అపుడా మృగయులు ఆయాయి స్థలముల నావరించి నిలిచిరి. తిన్నఁ డితర ధానుష్కులతోడఁ గలిసి, వేఁటకుక్కలను విడిచెను. దాఁగియుండిన మృగములు వివిధ వాద్యధ్వనులకు భయపడి, తమతమ స్థానములను వీడి, దిక్కుదెలియక పాఱుచుండ, వానిని కిరాతులు శరాఘాతంబులఁ గూల్చిరి. వ్యాఘ్రములు భీరుహృదయ విదారకంబుగ గాండ్రించుచుఁ బైపడ, ఖడ్గాహతులఁ జేసి గూల్చిరి. గజంబులు దిగంతరాళంబులు బోరన ఘీంకరించుచు, పైఁబడ కుంతాది ప్రహారంబులఁ గూల్చిరి. వివృతాస్యంబులై పంచాస్యంబులు లంఘింప బాణపాతంబులఁ జేసి వానిని రూపుమాపిరి. కొన్ని మృగంబులు దిశలకుఁ బాఱి యచట పన్నిన వలలను ఛేదింపఁబోవ, వేఁటకుక్కలు కొన్నింటిని గఱచి, కొన్నింటిని మఱల లోనికిఁదఱుమ, నవి యెటుపోవ వలనుపడమి, దిక్కులు సూచుచు జనన మరణాదులకు హేతువులైన సుకృత దుష్కృత వాగురలలోఁ దగిలి, యందే పరిభ్రమించుచు, సన్మార్గముఁ జేరఁ గాంక్షించు మనంబును పంచేంద్రియములు తమ వశ్యము గావించుకొని, నిలుపు

నట్లు నిలిచియుండ, తాను మృగకిశోరములను, ఆఁడమేకము లను, గజకపోతంబులను, గర్భిణులను విడిచి, యితర మృగంబులఁ దమ కృపాణంబులకు బలి నొసంగిరి.

తిన్నండిట్లు సహచరులతో వేఁటాడుచుండ, కాఱు మొయిలువంటి దేహముఁగల్గి, పిడుగువలె శబ్దించుచు, వలను ఛేదించుకొని యొక యేకలంబు శరవేగంబునఁ బాఱుచుండెను. తిన్నఁడు దానిని వెన్నంటి తఱిమెను. నాణుఁడు కాడుఁడను నిరువురు మిత్రు లాతని ననుసరించిరి. వేఁటకుక్కలను వారు ప్రయోగించు బాణములను తప్పించుకొనుచు, నది సుదూరమేఁగెను. చిట్టచివరకది యొక కొండకోనలోనికేఁగి, యెటుఁబోవ మార్గముఁగానక యొక వృక్షచ్ఛాయయందలసి, నిలువఁబడ తిన్నఁడద్దానిని తన కత్తితో నఱుక, నది రెండు తుంటలై నేలఁబడెను. "ఇంతదూరము తఱుము నిది కట్టకడకు మనచేతఁ బడియె. మన యత్నము ఫలించెను. తిన్నని భుజబలపరాక్రమములకు లోఁబడక ఎట్లిది తప్పించుకొనును" అని నాణుఁడు పల్క కాడుఁడు అమితానందభరితుఁడై తిన్నని సమీపించి "తిన్నా! మనము చాల దూరము వచ్చితిమి. ధావనముచే నాఁకలి దహించుచున్నది. దీనిని కాల్చి మాంసంబుచే క్షుత్తార్చి, దప్పికఁ దీర్చికొని, తిరుగ మనవారిఁ జేరుదము" అనెను.

తిన్నఁడు వారి కోరిక కంగీకరించి "యిచట నీరమెట్లు దొరకును? ఎచటఁ గలదు?" అనెను. అంత నాణుఁడు "ఆ

కన్పించు దేవదారు వృక్షంబుల కావున పెద్దకొండదరి స్వర్ణముఖి ప్రవహించుచున్నది" అనఁగ, తిన్నఁడల్లని వరాహమును మోసికొనిరండని, యాజ్ఞ యిడి బయలు దేరెను.

యోజనార్ధమట్లు వారు పయనింప నెట్టయెదుట శ్రీ కాళహస్తీశ్వర నిలయంబగు పర్వతపు చరియలోనుండు సుందర నందనోద్యానము వారి దృష్టి గోచరంబయ్యెను. అపుడు తిన్నఁడా పర్వతపు టందమున కచ్చెరువునంది, "నాణా! యీ శైలము నెక్కుదము రమ్మ" అనెను. అపుడాతఁడు "నీ వచటి కేఁగిన నేత్రానందకరంబగు దృశ్యముఁ గాంచఁగలవు. ఆకసంబంటు నీ కొండపై శిఖరేశ్వరుఁడు గలఁడు. ఆ దేవరను మ్రొక్కివత్తము" అనెను. తిన్నఁడల్లెయని వానితోఁ బయన మయ్యెను. తిన్నఁడా కొండను సమీపించుచుండ నెద్దియో హృదయభారము తఱుగుచున్నట్లు విచిత్రానుభవంబందెను. "నా మనంబునఁ జెప్పరాని ప్రేమ పొంగి పొరలుచున్నది. ఘనంబు వేఱెద్దియో యాశను పొంది, వేగంబుగ ముందునకు లాగుచున్నది. శిఖరేశ్వరుఁ డెచటఁ గలఁడో! రండు రండు, వేగమ పోదము" అని వారిని పిలుచుచు స్వర్ణముఖీ నదీతీరముఁ జేరెను. చందనవృక్ష శాఖలను, ముక్తాప్రవాళంబులఁ గొని తెచ్చు నా నదీతీరమున నొక వృక్షచ్ఛాయయందా వరాహము నిడిరి. తిన్నఁడు కాడునితో "నీ విచట చెకుముకి ఱాయితో నిప్పును రగుల్కొల్పుము. మేము శిఖరాగ్రము నెక్కి

స్వామిని సేవించి, [redacted]డే వత్తుము'' అని చెప్పి 'నాణునితో బయలుదేరెను.

తిన్నఁడు స్వర్ణముఖిని దాఁటి పర్వతపాదమును సమీపించెను. అపుడు కర్మసాక్షి తీక్ష్ణకిరణుఁడు గగనమధ్యం బారోహించి యుండెను. పర్వతాగ్రమునుండి పంచముఖ దుందుభి నాదము వీతెంచెను. 'అదియేమి'యని తిన్నఁడడుగ నాణుఁ డది మధుకోశముల నావరించి సంచరించు భ్రమరీ ఝుంకార మనెను. జన్మాంతరకృత పుణ్యావాసనాజనిత భక్తిపార వశ్యంబునఁ బ్రేమకొనలుసాగ, నెమ్ములఁగూడ ద్రవింపఁజేయు నాశతో, తిన్నఁడా పర్వతంబును నాణుఁడను ప్రేమ దారిసూప నెక్కసాగెను. ఆత్మజ్ఞానేచ్ఛా క్రియాదులగు షట్త్రింశత్సోపానంబుల నెక్కి శక్త్యాత్మక శివరూపముఁ బొందు శివయోగివలె తిన్నఁడా పర్వతము నధిరోహించెను.

శ్రీ కాళహస్తీశ్వరుని దర్శించుటకుఁ బూర్వమే యా పరమశివుని కరుణాకటాక్ష మా తిన్ననిపైఁ బ్రసరించెను. "యమైవేష వృణుతే తేన లభ్యస్తంత మాత్మాన"మ్మని గదా, యుపనిషత్తుల ఘోషించుచున్నవి. జన్మాంతర ప్రాప్తము లైన మలమాయా కర్మాదు లాతని విడిచిపోయెను. అతఁడస దృశభక్త్యావిష్టుఁడయ్యెను. అట్టి యావేశమున నాతఁడా యనాదినిధనుఁడగు శిఖరేశ్వరుని దర్శింప వేగముగనేఁగి, యా స్వయంభూలింగము నాలింగనమొనర్చి, ముద్దిడి నిట్టూర్చెను. ఆనంద బాష్పములు చెక్కిళ్లపై జాలువాఱెను.

"దాసునకు నిచట నితఁడే లభించెను — ఇది యేమి యాశ్చర్యము" అని మనంబునఁ దలఁచుచు నా సర్వేశ్వరునకు నమస్కరించెను.

రూపెత్తిన భక్తియో యన నుండు తిన్నఁడా శివునిఁ గాంచి "అయ్యో! క్రూరభీకరజంతు జాలంబులు సంచరించు నీ యడవిలో తోఁడులేక వేఁటకానివలె నీ వొంటరిగ నుండఁ దగునా!" యనెను. చేత నుండు ధనుర్బాణములు క్రిందఁ బడుటయు గమనింపక, శివునిపై నుండు పుష్పంబులఁగాంచి, "యీతనిపై నీ పత్ర పుష్పంబులను ప్రేమతోఁ బెట్టినవా రెవరోగదే!" యనెను. ఆ మాటలను వినిన నాణుఁడు "అయ్యా! యిది నాకుఁ దెలియును. పూర్వ మొకసారి మీ తండ్రితో వేఁటాడుచు నిఁటకు వచ్చితిని. అపుడొక బ్రాహ్మణుఁ డీ శివుని జలముతో నభిషేకించి పత్రపుష్పాదులతోఁ బూజించి నైవేద్యమిడి, యెవ్వియో కొన్ని మాటలాడి పోవుటఁ జూచితి. నేఁడు నాతఁడే యిట్లు చేసియుండును. అని తోఁచుచున్నది." అని పల్కెను.

తిన్నఁడా సహచరుని మాటలనువిని, "శ్రీ కాళహస్తి నాథుఁడైన శివున కిట్టి పూజ సంతోషదాయకము" అని తలంచి తా నట్లు పూజింప నిశ్చయించెను. "ఈ పరమ శివుఁడిట నొంటరిగ నున్నాఁడు. ఇతనిని విడిచిపోరాదు. ఇతఁడు పల్కుటలేదు. ఆకలిగొని యున్నాఁడు. ఇతఁడు తినుటకై మాంసముఁ దెచ్చియిచ్చుటకు నేరులేరు. నేనే

యీతని విడిచిపోయి, మాంసముఁ దేవలయుఁగదా! ఎట్లీతని నొంటరిగ విడిచిపోఁగలను'' అని చింతించెను. ఎట్లైనను శివునకుఁ దినుటకు మాంసము కావలయుఁగదా!'' యని భావించి మాంసార్థమై యేఁగ కొన్ని యడుగులను పెట్టెను. ''అయ్యో! శివుఁ డొంటరిగ నున్నాఁడే''యని మఱలివచ్చును. ఎట్లు నిన్ను విడిచి పోదునని కౌఁగిలించును. పోకతీరదని కొంత దూరమేఁగి తిరిగి చూచును. పోఁజాలక కన్నీరునించును. ఆశతో చూచును. ధేనువును విడుచు వత్సమువలె నాక్రోశించును. ఎట్లో మనస్సును చిక్కఁబట్టి ''నేనేపోయి నీకు మాంసముఁ దెత్తును.'' అని దీనముగఁ బల్కును. ''నీకిఁట తోఁడెవ్వఁడును లేరే. నీ వేబంధువులతో నిఁటనున్నాఁడవు! ఎవరుఁ గన్పింపరే! నేఁ బోఁజాలను. పోవకున్న ఎట్లు? నీ వాఁకలితో నున్నాఁడవుగదా! నీ యాఁకలిని చూచుచు నే నెట్లూరకుండఁగలను! పోవక తప్పదు'' అని కన్నీరుఁ గార్చును. ''ఒకసారి పోయివత్తు''నని ధనుర్బాణంబులఁ గైకొన, మ్రొక్కి మాంసముఁ దెచ్చుటకై బయలుదేరెను.

విడువలేక విడువలేక వెనుదిరిగి చూచుచు, తిన్నఁడు కడుంగడు కష్టముతో కొండదిగి, నాణుఁడు వెన్నంటి రా స్వర్ణముఖిని దాఁటి, కాడుఁడుండు వృక్షముకడకు వచ్చెను. కాడుఁడెదురు వచ్చి తిన్ననికి మ్రొక్కి ''మీరు చెప్పినట్లు నిప్పు చేసియున్నాను. పంది యవయవములను చక్కఁగ ఛేదించి యుంచితిని. సరిచూచుకొనుఁడు. మనమింటికిఁ దిరిగిపోవఁదగు

కాలము సమీపించినది. ఇంతవఱకు మీరేల యాలసించితిరి?" అని యడిగెను. నాణుఁడు వానితో "నీ తిన్నఁడా కొండపైని శిఖరేశ్వరునిఁగాంచి, యుడుము పట్టఁబట్టి, వీడిరాజాలఁడయ్యె. ఇపుడా శివున కాహారార్థమై మాంసము గొంపోవ వచ్చినాఁడు. ఆ దేవరకు దాసుఁడయ్యెను. మన కులమున కీతఁడిఁక రాజగుట యసంభవము" అనెను. అంత కాడుఁడు "తిన్నా! ఇదేమి చేసితివి? నీవు శబరకులాధిపుఁడవుగావా!" అనెను. తిన్నఁడు వారి మాటలను వినిపించుకొనక మాఱువల్కక, వారి మోములనైన తేరిచూడక, యవ్వరాహపలల ఖండముల నినుపచువ్వఁ గ్రుచ్చి, లెస్సగ పక్వం బొనర్చెను. కాల్చి వ్రేల్చిన మాంసపు ముక్కలను నోటవేసికొని, రుచిమైన వానిని వేఱుగఁబెట్టి, యితరములను పాఱవైచెను. పిదప టేకియాకులఁదెచ్చి దొప్పలుగఁగుట్టి, వానియందా రుచ్యంబులగు పలల ఖండంబులఁ బెట్టుచుండెను. అపుడాతని సహచరు లొకరి నొకరుఁ గాంచి "వీని కా దేవుని దర్శించునప్పటికంటె మయిక మధికమైనది. నోటఁ బెట్టికొనిన మాంసముఁ దినక, వెడల గ్రక్కుచున్నాఁడు. ఇదేమి! ఇతఁడు తన యాఁకలిని గూర్చి చెప్పక, మనకుఁ దినుట కీయకున్నాఁడు. నోటఁబెట్టికొని వమన మొనర్చినవి తప్ప మిగిలిన మాంసమును పాఱవైచుచున్నాఁడు. ఇతనికి దైవావేశముఁ గల్గినది. ఈ యావేశముఁ దొలగించు మార్గములు మనకుఁ దెలియవు. ఉడుమూరున కేఁగి నాగున కెఱిఁగించి, పూజారిణినిఁ బిలిచికొని

వచ్చి, యీతని యావేశముఁ బోగొట్టవలయు. మనము వేఁటకాండ్రను గలిసికొందము” అని నిశ్చయించి వెడలి పోయిరి.

సహచరులు దన్ను వీడిపోవుటఁగూడ తిన్నఁడు గాంచ లేదు. దొప్పలనిండుగ మాంసము గైకొని, శివుఁ నభిషేకించు దలంపున స్వర్ణముఖీనదీ జలమును పుక్కిటనింపుకొని, వినిర్మల పత్ర పుష్పాదులఁగోసి, తన తలపై నిడికొని, యొకచేత ధనుర్బాణములను, వేరొండుచేత దొప్పలను దాల్చి, ‘శివు డాఁకలిమై నటమటించుచుండునే’యని తలంచుచు వేగముగ కొండ నెక్కిపోయెను. చంద్రశేఖరుని శిరమునఁగల పూజా పత్ర పుష్పాదులను తన చెప్పుకాలితోఁ దొలఁగించెను. హృద యమునిండి చోటుచాలక యుబికివచ్చు భక్తియా యన్న నటుల వదనమునందలి జలము నా లింగముపై నుమిసి యభి షేకించెను. తన సిగముడిఁ దుఱిమి తెచ్చిన పుష్పముల నా పశుపతి శిరముననిడి “సామీ! ఈ నంజుడు నారగింపుఁడు” అని పల్కెను.

పరమశివుఁ డూరకుండుటఁగాంచి, * తిన్నఁడు “ఇయ్యవి క్రొవ్వినవిగావా! కాలినవి గావా! రుచిగా లేవో! నీకుఁ జాలవా! ఏల తినరావు? నీకు వీనిని భుజించు నలవాటు లేదా! నీ కాఁకలియగుట లేదా! నా భక్తికొఱవడెనా! ఉపవాస ముండి వీనిఁ దెచ్చితిఁగదా! నాపై దోసమేమిగలదు. నే నే యపరాధము సేయలేదే! దయతో నీ కఱుకుట్టుల నార

గింపుము. ' నీవారగింపనిచో నాకీ జీవనమెందులకు? నీ పాదములపైఁబడి ప్రాణములను విడుతు'' అని యేడ్వసాగెను.* ఎంతకు శివుఁడు రానందున'' పరమేశా! నేను క్రొవ్విన మాంసమునేతి రుచిఁజూచి మధురాతిమధురంబులగు వానిఁ దెచ్చితి. కావున దేవర వీని నారగింపుఁడు.'' అని చెప్పి యారగింపఁ జేసెను. పిమ్మట తిన్నఁడిట్టి మాంసమీ దేవునకింకనుఁ గావలసియున్నది యని తలపోసెను. అంతలో సహస్కరుఁడు తన దీర్ఘకరంబులను మోడ్చి పశ్చిమాద్రియం దస్తమిమించెను.

సంజకెంజాయలు దిక్కుల నలముకొనెను. క్రమముగ నంధకార మావరించెను. దినము తెగుదల రాత్రియే తెంచె. అంత తిన్నఁడు ''క్రూర ఘాతుక మృగంబులు వచ్చి నా స్వామి నేమిచేయునో''యని తలంచి, ధనుర్బాణంబులఁ జేఁదాల్చి, ప్రేమ ప్రవాహము తలమునుకలుఁగా, శ్రీ కాళహస్తీశ్వరవాయు లింగంబు చెంత కాటుక కొండవలె నిశ్చలుఁడై నిలువఁబడి, యారాత్రియంతయు కావలి యుండెను.

ప్రభాతము వఱకు బ్రహ్మాదుల కలభ్యుండగు నిటలాక్షుని యెట్టయెదుట స్వాజ్ఞానాంధకారము నశించునటుల నిలువఁబడి భగవద్రక్షణ కార్య ధురంధరుఁడై గడిపెను. వైణవకముక్తాఫల సితకాంతులు, భోగిభోగాగ్రస్థిత రత్నదీప్తులు, జ్యోతిర్వ్యూహాంతర్గతాగ్ని ప్రభలు, జాజ్వల్యమాన బ్రాహ్మ్య తేజః పరివేష్టిత దేహులగు మహర్షుల దివ్య ప్రకాశము లా దేశ

మును పట్టపగలై వర్తిల్లుచుండ, శ్రీ కాళహస్తినాథుని నిలయంబున నంధకార మెట్లు వ్యాపించును? తిన్నని హృదయము నుండి యజ్ఞానము వీడునట్లుచటి తమస్సు తఱుగసాగెను. ప్రాగ్దిశయం దరుణకిరణములు పొడసూప పక్షులు తమతమ నీడంబులు వీడి, కిలకిలారావంబులు గావింపఁ దొడఁగె. ఆ ధ్వనులు శ్రవణగోచరంబులుఁగా, నతఁడు ప్రొద్దు వొడిచెనని గ్రహించి "ఇఁక నా స్వామికి నాహారంబు వెదకి తేవలయు గదా!"యని తలంచి, బయలుదేరెను. భక్తుఁడు భగవానునకు భోజ్యము సమకూర్చ వేఁటకు బయలుదేరుటఁ గాంచిన భాస్కరుఁ డాతనికి మార్గదర్శకుఁడై యేతెంచెనా యన నుదయాద్రిపైఁ గన్పించెను.

శ్రీ కాళహస్తినాథునిఁ బ్రత్యహము వేద విధ్యుక్తముగ నర్చించు విప్రుఁడు 'శివగోచరుఁడు.' అతఁడు శివప్రోక్తాగమంబు ననుసరించి బ్రహ్మ మంత్రములఁ బఠించుచు రుద్ర మంత్రంబులతో నభిషేకించి వివిధ పత్రపుష్పాదుల నా దేవ దేవునిం బూజించెడివాఁడు. యథాపూర్వ మా శివగోచరుఁడు పత్ర ప్రసూనములతో నాఁడచటి కేతెంచెను. సదాచార సంపన్నుఁడగు శివగోచరున కచట ఎఱచి యెమ్ములు దొప్పలు నేత్రగోచరంబులయ్యె. ఆ యపరిశుద్ధంబులఁ ద్రొక్కజాలక యతఁడు దాఁటుచు దుముకుచు లోనికేఁగెను. శివునిఁగాంచి "అయ్యో! ఇట్లిచట అపవిత్రంబొనర్చిన వా రెవరు? వేఁటకాండ్రే రేని యిట్లొనర్చియుందురా! దేవదేవా! మహాదేవా!

మీ రెట్లు చూచుచు నూరకుంటిరి? ఇయ్యది మీకు సహ్యం బయ్యెంగా! లోనికెట్లీ యెంగిలి మాంగెలపు దొప్పలు వచ్చినవి. నీ శరీరం బేటికి నీరువట్టులు గట్టె? ఈ యెంగిలి కెట్లోర్చితివి దేవా!'' యని కన్నీరుగార్చుచు గొంతవడి వెతం జెంది, మూర్ఛిల్లెను. గొంతవడికి లేచి, యచటి మాంసపు ఖండములను ఎముకలను చిమ్మివైచి, చెప్పుల ముద్రలను క్షాళితమొనర్చి, స్వర్ణముఖికి నేంగి, యఘమర్షణ స్నాన మాచరించి వచ్చెను. పరమశివున కేర్పడిన అపవిత్రతా నివారణమునకు ప్రాయ చిత్తాదులం గావించి, రుద్ర సూక్తంబులతోం దాం దెచ్చిన క్షీరంబుల నభిషేకించి, సహస్ర శివనామంబులం బత్ర పుష్పాదుల నర్పించి, శివశ్రీపాదంబులకుం బ్రణమిల్లెను. సహస్ర శీర్షాది వైదిక సూక్తంబులతో స్తుతించి మరలి యాశ్రమంబున కేంగెను.

పర్వతోపత్యకలందలి యరణ్యములలో మాంసాన్వేషణకు నేంగిన తిన్నం డొక క్రొవ్విన పందిని బాణప్రయోగంబునం జేసి చంపెను. హరిణంబు నొకదానిని బాణంబునకు గురిసేసెను. ఆ రెంటి నొక వృక్ష మూలమున దాంచి, కొంతదూర మేంగి వృక్ష శాఖలందు వ్రేలాడు తేనెపెరల దొరలం జేసి దొప్పలనిండ తేనియం దెచ్చెను. ఎండు కట్టెయల రగుల్కొల్పి బాణముతో క్రొవ్విన మాంసముం బెకలించి యా మంటలోం జక్కంగ పక్వముచేసి, నోటం బెట్టికొని, రుచిచూచి, రుచ్యంబులగు మాంస ఖండములను తాం దెచ్చిన తేనియయందు ముంచి

దొప్పలయందిడ[illegible]ను. యథాయపూర్వము సారసాది వివిధ పుష్పంబులను తలపై భద్రపఱచి, స్వర్ణముఖీ పావన జలమును పుక్కిటఁ దాల్చి వేగముగ జ్ఞానప్రసూనాంబికాధవునిఁ జేరెను.

తిన్నఁడు శివగోచరుఁడిడిన పత్ర • పుష్పాదులను తన చెప్పుల కాలితోఁ ద్రోసివైచి, ముందునాఁటివలెఁ బూజించి తాఁ దెచ్చిన ఎఱచి దొప్పలను ముందిడి "దేవా! నేఁడు నిన్నటి కంటె రుచ్యతరంబగు మాంసంబుఁ దెచ్చితి. ఇందు హరిణ మాంసముఁ గలిసియున్నది. దాసుఁడు రుచిచూచియే తెచ్చి యున్నాఁడు. నేఁడు తేనియఁగూడ చేర్చితి. కాన మధురాతి మధురంబై యుండు"నని పలుకుచు నివేదించెను. మఱల నా రాత్రియు నిద్రాహీనుఁడై కావలి యుండెను. ఉదయమున వేఁటకేఁగెను. అతఁడేఁగఁగ శివగోచరుఁడు వచ్చి, యాకసుమాలమునకు వగచి శుద్ధముచేసి, పూజించి యేఁగెను.

కాడ నాణులు నాగునికడకేఁగి, యాతని పుత్త్రునియుదంతమును దెల్పిరి. నాగుఁడు పుత్త్రునిఁ దలఁచి దుఃఖించి బాధపడెను. అతఁ డాహారముఁగూడ గైకొనక, వెంటనే పూజారిణిఁ బిలిపించి, యామెతో తిన్ననికడకు వచ్చెను. పరచింతలో నొడలు మఱచియుండు తిన్నని గృహంబునకు రమ్మని పరిపరి విధంబులఁ బిలిచెను. తిన్నఁడేమియుఁ బల్కఁడయ్యె. "ఓ తండ్రీ! నిన్నిచట డించిపో మనసెట్లు వచ్చు"నని నాగుఁడు వాపోయెను. ఎన్నియో రీతుల వాని మనంబు భేదింప యత్నించి వలను గామికి, విఫల మనోరథుఁడై పుత్త్రవియోగ వేదనాభ

రంబు భరింపఁజాలక, యెట్టకేలకు నాగుఁడు [illegible]లిపోయెను. రసగుళికాస్పర్శమున నినుము బంగారమగునటుల పుణ్యాపాప మలములు నశింప, పశుబోధరూప ప్రాణ, వాక్, జ్ఞానాత్మక శివబోధ రూపుఁడై భక్తిమయుఁడై సంచరించు తిన్నఁ డెన్నటి కిని మాయా ప్రపంచ సంచారుఁడగు నాగునకుఁ గట్టువడునా? సంసార బంధము లాతని బంధింపఁ జాలవు.

చతుర్దివసంబులు క్రమముగ తిన్నని పూజయు, శివ గోచరుని పూజయుఁ బ్రవర్తిల్లెను. అయిదవనాఁడు శివుని పూజింపవచ్చిన శివగోచరుఁడు పూజానంతరమున "ఈ రోఁతలు నీకిష్టమైనను గాకున్నను నా కాపాపాత్ముని జెప్ప వలయు. ఈ యనుచిత మొనర్చు వారినెఱుఁగ లేకున్నాను. నీ కరుణ నెఱింగి, దీనిని రూపుమాపవలయు" నని ప్రార్థించి పోయెను. ఆ రాత్రి మహాదేవుఁడు శివగోచరుని స్వప్నంబునఁ గన్పించి "విప్రదాసా! నా యాలయంబు నపవిత్ర మొనర్చినవానిని వేఁటకాఁడని తలంపకుము. అతని కృత్యంబులను వివరింతు, వినుము. అతఁడు నా ప్రియ భక్తుఁడు. అతని జ్ఞానంబంతయు నస్మజ్జిజ్ఞాసారూపమే. వాని చర్యలు నాకానందదాయకములు. నీవు భక్తితో నా శిర ముపై నుంచిన పూవులఁ ద్రోయ, నాతఁడు చెప్పుల కాలితోఁ దాఁకుట, సుబ్రహ్మణ్యుని కోమల పాదంబులు నాపైఁ బడుట కంటె నాకు ప్రియాతిప్రియంబని యెఱుంగుము. వాఁడు నాపై నుమిసిన నీరు భాగీరథీ జలముకంటె పావనమైనది.

బ్రహ్మేంద్రాదులు నాకర్పించు పూజా పుష్పంబులకన్న తిన్నఁడు ధరించి యిచ్చునవియే నాకు హృదయానందదాయకములు. వాఁడర్పించు పలలఖండంబులు వేదోక్తంబులగు యాగములందు యాజకులు నాకర్పించు ప్రథమ హవిర్భాగంబగు హవిస్సునకంటె యుత్తమోత్తమంబని తలంతు. తిన్నని ప్రియవాక్కులతో మహర్షుల స్తుతిమంత్రంబులు సాటిగావు. వాఁడు నాయందు చూపు భక్తి ప్రేమలను ఱేపు నీకు చూపెదను, నా వెనుక దాఁగియుండి కాంచఁగలవు. నీ మనఃక్లేశమును వీడుము" అని చెప్పి యంతర్హితుఁడాయెను.

వెంటనే శివగోచరుఁడు మేల్కని, తాఁ గనిన స్వప్నమునే చింతించుచునుండి, యెపుడుదయమగునా యని యెదురు సూచుచు, నుషఃకాలముననే స్వర్ణముఖి కేఁగి, స్నానాదులను నిర్వర్తించుకొని, పూజాద్రవ్యంబులఁ గైకొని, శిఖరాగ్రముఁ జేరి పూజించి శివలింగము వెనుక దాఁగియుండెను.

అది యాఱవనాఁడు. శివగోచరుని రాకకుఁ బూర్వమే తిన్నఁడు వేఁటకేఁగెను. పలలమును అభిషేక జలమును, పుష్పంబులను దెచ్చుచుండ దుశ్శకునములు పొడసూపెను. "ఈ శకునములు రక్త స్రావమును సూచించుచున్నవి. నేను లేనపుడు స్వామి కేమి యాపద గల్గెనోగదే!" యని దుఃఖించుచు వచ్చెను.

శ్రీ కాళహస్తినాథుడు తిన్నని భక్తిప్రపూర్ణహృదయమును శివగోచరున కెఱిగింపఁ దలంచెను. లింగమున త్రినేత్ర

యుక్తంబగు మోముఁ గన్పడఁజేసి, యంతట కుడికంట రక్తము జొట జొట స్రవింపఁ జేసెను. తిన్నఁడు దూరమునుండియే ముక్కంటి కంటిరక్తముఁ గాంచి, భయాక్రాంతుఁడై కంపించెను. అతనికిఁ దెలియకయే నోటినుండి యభిషేక జలము, కరములనుండి ధనుర్బాణములు, ఎఱచి దొప్పలు నేలఁబడెను. నిర్విణ్ణుఁడై యతఁడు మూర్ఛిల్లెను. ఎట్లో లేచి స్రవించు రక్తము నిలుపఁదలఁచి చేతఁ దుడిచెను. తుడువఁ దుడువ నది యధికమాయెను. ఏమిసేయుటకుఁ దోఁపక, యతఁడు నిటునటు పరుగిడెను. "నా స్వామి కిట్లపరాధము గావించినవారు వేటకాండ్రైనను, మృగాదులైనను, హతమార్తు"నని విల్లు దాల్చి, యెక్కిడి పరిసరములను వెదకెను. ఎవరుఁ గానమి మరలి వచ్చెను.

ధనుర్బాణంబుల నావలఁ బాఱవైచి, శివుని పాదములకు మ్రొక్కి, కౌఁగిలించుకొని "స్వామీ! ఎంత బాధయోగదా! పాపినైన నేను చూచుచుండ మీ కింత కష్టముగల్గె. నా ప్రాణనాథుఁడవగు నీ కీ బాధ రాఁగతంబేమి? దీనిఁబాప నాకు మందుమాకులు దెలియవు. ఏమిసేయుదు? నెందుఁబోదు? నాకు గతియేమి?" యని వావిడిచి విలపించెను. * అంతటఁ గిరాతులు గాయములకుఁగట్టు కొన్ని మందులు స్మరణకురా, కోక పొట్లం, బావిరిగొన నూఁది యొత్తెను. కరతలములు రాచి వేడిచేసి కాచెను. తంగేడాకు మెత్తెను. తెల్లదిండెన పువ్వు రసము పోసెను. కలువ పూవుల రసము పిడిచెను. తా విన్నవి

కన్నవి మందు లెన్నింటినో యుపయోగించి చూచెను. *కాని ముక్కంటి కంటినుండి కీలాలము వరదలై ప్రవహింప సాగెను. ఇఁక కంటికి కన్నే మందు. వేఱు మందు లేదని నిశ్చయించి యాలస్య మొనర్పక తిన్నఁడు ఆనందముతో బాణము వెఱికి తన కుడికంటి కోణమునఁ గ్రుచ్చి గ్రుడ్డుఁ బెకలించి, శివునికంట నమర్చెను. అంత శివునికన్ను మోహనమై గన్పింప, నాతఁ డానందాబ్ధిలో మునింగి, గంతులు వైచెను. ఉన్మత్తునివలె భుజములఁ దట్టుచు నాడసాగెను.

తిన్నని భక్తి నింకను వ్యక్తపఱుపఁ దలఁచి, యుమాపతి రెండవకంట శోణితముఁ జూపెను. తిన్నఁడద్దానిఁగాంచి "ఇఁక నాకు భయములేదు. నీ కృపచే నాకు మందు దెలిసినది. నాకు మఱొక కన్నుగలదు. దీన నీబాధఁ దీర్పఁగలను. మూఁడవ కంట కీలాలము దొరలినఁ బ్రాణమిత్తు"నని పల్కుచు గుర్తునకై నిటలాక్షుని యెడమ కంటిని చెప్పుగాలఁ దన్ని పట్టి, వాఁడియమ్మున తన రెండవ కనుగ్రుడ్డుఁ బెకలింప నుంకించెను. దయాసాగరుఁడద్దానిని సహించునా!

హిమగిరి తనయఁ గూడి బ్రహ్మాది సకలసురలు దేవర్షిగణంబు లిరుపార్శ్వంబులఁ గొలువ శివలింగాంతరము నుండి నాగభూషణుఁడు వెడలి, కన్నప్ప తీవ్రతకన్న ముందుగ తన శ్రీహస్తంబు చాచి, వాని హస్తంబుఁబట్టి, "కన్నప్పా! నిలువుము. భక్తాగ్రేసరా! నిలువుము. నిలు కన్నప్పా!" యని ముమ్మారు తన అమృత వాక్కుల నాదరించెను.

పుళిందాధీశుఁడగు కన్నప్ప తన కన్నుఁదానికి యర్పించు నపుడును, భక్తార్పిత పలలాశనుఁడగు శివుఁడు కన్నప్ప హస్తముఁబట్టి నిలుపునపుడును, శివలింగము వెనుకనుండి గాంచు శివగోచరుఁడు అద్భుతరస సాగరమున మునిఁగి, వెలికి వచ్చి భక్తావన దీక్షితుఁడగు నా మహాదేవునకు మ్రొక్కెను. వారిపై దేవతలు పారిజాత ప్రసూనంబులను వర్షించిరి. వేదఘోషంబులు చెలఁగెను. ఆనాఁటినుండి తిన్నఁడు కన్నప్ప యని ప్రసిద్ధిఁబడసెను. యుగ యుగాంతంబులు తపంబుసేయు యోగి వర్యులకుఁగూడ దురాసదుఁడగు శంకరుఁ డాఱు దినంబులకే తిన్ననిఁ గరుణించెను. కంటికి కంటినిచ్చిన తిన్నని హస్తమువట్టి కైలాసపతి "కన్నప్పా నీ విఁక నా వామభాగంబున నిల్తువుగాక" యని కరుణించి యతనితోఁ గైలాసముఁ జేరెను. శివగోచరుఁడును శివసాన్నిధ్యమంది సుఖించెను. దీనికంటె పొందఁదగిన భాగ్యమేమి గలదు,

"కులశ్రుత తపోవ్రతాదులు సద్భక్తిని మీరఁజాలవు."

"అనన్య చింతతో నిత్యాభియుక్తులగువారు భగవత్ప్రీతి పాత్రులగుదురు."

# 11. గుగ్గులుకలయ నాయనారు

చోళదేశమున 'తిరుక్కడవూరు' అను గ్రామము గలదు. మృకండుమహర్షి పుత్త్రుఁడైన మార్కండేయుని ప్రాణంబులఁ గైకొన నేతెంచిన యముని, పాదముచేఁ ద్రొక్కి శిక్షించిన కాలకంఠుడు లోకానుగ్రహార్థ మవతరించిన పుణ్యస్థలమే యాయూరు. వేదత్రయమును సాంగోపాంగముగ నభ్యసించిన విప్రవరుల కది నివాసస్థానము. వరిమళ్లచేఁ బరివేష్టింపఁబడిన యాయూరు కన్నులకు విందుఁ గొల్పుచుండును. పొలములలోని నీట వివిధ వర్ణ సరోజములు వికసింపనవి చిత్రవర్ణ భాసురములై శుక కంఠచ్ఛాయల నీనుచుండు. జీమూత వ్రాతంబుల నంటు పూగవనము లచట నగణ్యంబులై యుండుటఁజేసి, శాలిగోపిక లచటి వృక్షచ్ఛాయలఁ గూరుచుండి, మృదు మధురముగ గానముసేయుచు వినోదింతురు. ద్విజన్ముల యాగశాలలనుండి సామవేద గానములు శ్రావ్యంబులై వీతెంచుచుండును. అచటి కమలాకరములందు మహిషములు విహరించుచు తమ క్షీరములచే నా జలమును, సితవర్ణములుఁగావింప నటపఱుగిడు మీనంబుల తాకిడిచే పుండరీక షండంబులు చలించుచు క్షీరవాసనలను వెదచల్లుచుండును. సోమపీథుల యాగశాలలందలి హోమధూమములు నేలకుఁ దిగిన వారివాహములా! యన, నిరంతరంబులై యుండు.

ఇట్లభివృద్ధిఁ గాంచిన తిరుక్కడవూరను శివక్షేత్రమున "కలయనారుఁ"డను భక్తవతంసుఁ డుండెను. బ్రహ్మకులాలంకారుఁడగు నాతఁడు బాల్యము మొదలు శివపాదసేవకుఁడై, నియమ నిష్ఠాచారపరుఁడై, ప్రత్యహము అమృతఘటేశ్వరాలయమున కేఁగి, సువాసనా వాసితమైన గుగ్గిల ధూపము నొసంగి, మార్కండేయ ప్రాణప్రదుఁడగు శివుని సేవించెడి వాఁడు. కావున నచటి జనులంద ఱాతని "గుగ్గులుకలయ నారుఁ"డని పిలుచుచుండిరి.

అతఁడు తనకున్న యల్ప ద్రవ్యంబును ధూపపరికల్పనకై వెచ్చించి, దరిద్రుఁడాయెను. దారిద్ర్యబాధా పీడితుఁడయ్యుఁ దన నిత్య సేవను మఱువక, యెట్లో కొనసాగించు చుండెను. పేదఱిక మతిశయింప భక్తియుఁ నతిశయించెను. పిత్రీయమైన మడిమాన్యములను, దాసదాసీజనంబులను విక్రయించినను, పూఁట గడచుట కష్టసాధ్య మయ్యెను. గృహోపకరణములను సైతము విక్రయించెను. ఆశ్రిత బంధువులు భార్యాపుత్రాదులును కూడు లేక శ్రమఁజెందిరి. తిండికి గింజలు గూడ కఱవైనందున వారందఱు వాసరద్వయ ముపవసించిరి. అట్టి యవస్థను గాంచి, కలయనారుని సతి తనతాళిని దీసి భర్తచేనిడి "ఓ యయ్యా! పసిబిడ్డలు తిండిలేక యలమటిల్లుచున్నారు. దీనిం గొనిపోయి యంగడిలో నమ్మి ధాన్యముఁ గొనిరండు" అని దీనముగ వేడెను. అతఁడును చేయునది లేక యాతాళిని గైకొని విపణివీధి కేఁగుచుండెను. అపు

డొక వణిజుఁడు శిరముపై గుగ్గిలపు మూట నిడికొని, యెదురు వచ్చుటఁగాంచి, "యదియేమి" అనెను. వాఁడది ధూపార్థ ముపయోగించు తెల్ల గుగ్గిల మనెను. కలయనా రదిగాంచి పెన్నిధిఁగన్న పేదవలె సంతసించి, "నా భాగ్యమేమని యందు ? ఇయ్యది శివపూజా ద్రవ్యము. నేఁడిది లభించుటచే ధన్యుఁడ నైతిని. దీనిని విలిచి కొంపోవుదు" నని నిశ్చయించి, "ఓయీ! నేను నీకు బంగారమిత్తు. దీని నా కొసంగెదవా ?" యనెను. వాఁడెంత బంగార మీయఁగలవన నాయనారు "ఇదిగో"యని తన చేనున్న తాళినిచూపి, వాని కొసంగెను. వణిజుఁ డా తాళిని గైకొని యా గుగ్గిల మిచ్చి చనెను. గుగ్గిలము లభించుట తోడనే యాతఁడు సర్వమును మఱచి, శివార్పిత చిత్తుఁడై యాలయమునకుఁ బరుగిడి, దాని నాలయపు బొక్కసమున భద్రపఱచి, శివసేవావసరమును నిరీక్షించుచు ధ్యాన నిమగ్నుండయ్యెను.

రాత్రి యయ్యెను. కలయనారుని భార్య పతిరాకకై యెదురు సూచిచూచి, క్షుద్బాధ మిక్కుటముగాఁగ, బిడ్డలతో నట్లే మైమఱచి నిద్రించెను. అపుడు దయాంబుధియగు కైలాస పతి ప్రేరణచే కుబేరుఁడు వచ్చి, యా భక్తుని గృహంబును స్వర్ణ ధాన్యాదులతో సకల వస్తు జాతంబులతో నింపివైచెను. పరమశివుఁ డా గృహిణి స్వప్నమునఁ గన్పించి, "సాధ్వీ! దుఃఖింపకుము. సకల సంపదల నొసంగితి" ననెను. ఆమె నిద్రనుండి మేల్కాంచి చూడ, నిల్లంతయు స్వర్ణధాన్యాది

సకల సంపత్సమృద్ధమై యుండుటఁగాంచి యా దయాలవాలుని వేనోళ్ల స్తుతించెను. ఆపద్బాంధవుండైన శివుని మహిమ యింతింతనరాదు, ఆ వనితామతల్లి యింట భోజన పదార్థం బులవ్వారిగ నుండుటఁజేసి, భర్తకై యాహారము సిద్ధపఱుపఁ బాకశాలఁ బ్రవేశించెను. అట కాలకాలుఁడైన కాలకంఠుఁడు నాయనారుఁ గటాక్షించి యశరీరవాక్కుతో "ఓయీ! నీ వాఁకలిఁ గొనియున్నవాఁడవు. ఇంట నీ పత్ని క్షీరాన్నంబుతో నీకై వేచియున్నది. పొమ్ము." అని పల్కెను.

కలయనారుఁ డాదివ్యవాక్కును విని యానందించి, చేతులు జోడించి, మ్రొక్కి శివాజ్ఞను మీఱఁజాలక, గృహం బున కేఁగెను. ఇంట నడుగిడి స్వర్ణ ధాన్యరాసులఁ గాంచి, యాశ్చర్యచకితుఁడై "యివి యెట్లు వచ్చె? నని భార్య నడి గెను. ఆమె "యియ్యది పరమశివకృపావాల్లభ్య లభ్య" మనెను. అట్లని శివున కీ దాసునిపై ననుగ్రహ మపా రము" అని పల్కుచు, సాష్టాంగముగ నమస్కరించి, వేద వాక్కులతో నా పరమశివుని స్తుతించెను.

పిదప గృహిణి పాత్రలను శుద్ధమొనర్చి, భర్తను ఇతర భక్తులను బిడ్డల నాహ్వానించి, పరమేశ్వరు నర్చించి వారందఱికి మధురాహారంబుల నిడెను. వారందఱు భక్త పరాధీనుని, స్మరించుచుఁ దృప్తిగ భుజించి సుఖంబుండిరి. కలయనాయనా రానాఁటినుండియు భాగ్యోపేతుఁడయ్యు గర్వి తుఁడుగాక ప్రతిదినము శివసేవచేయుచు, శివభక్తులెంద

తే తెంచినను, శిష్టమృష్టాన్నంబులఁ దృప్తిపఱచుటయేగాక, వారి కోరికలఁ దీర్చుచు జీవించుచుండెను.

ఇట్లుండ నా దేశమందలి "తిరుప్పనందాళ్" శివ క్షేత్రమునందలి శివలింగ మొకప్రక్కకు వ్రాలియుండుటఁ గాంచిన యా దేశపు చోళ చక్రవర్తి యెట్లేని, యా భవలింగ మును చక్కగ లేవనెత్తి, పూజింప నిశ్చయించెను. ఆ రాజు కొందఱి సాయమున లింగమును లేవనెత్త యత్నించెను. కాని యది చలింపనందున తన గజములను సైన్యంబులను పిలి పించెను. శతాధికంబులైన సైనికులు ఏనుంగులు ఆ శివలింగమును తమ బలమునంతయు నుపయోగించి లాగునట్లుచేసెను. లాగ లేక ఏనుఁగులు సైన్యంబులు నేలఁబడి మూర్ఛిల్లెనే గాని లింగ మిసుమంతయైన చలింపనందున, నా చక్రవర్తి మనంబున వంతనందెను.

కలయనారా చక్రవర్తి దుఃఖమును కర్ణాకర్ణిగ విని, శివుని సేవింపఁదలఁచిన చక్రవర్తిని గాంచఁదలఁచి, తిరుకడవూరు శివుని దర్శించి, యనుజ్ఞ వేఁడి పయనమయ్యెను. త్రేతాగ్నుల నర్చించుచు వేదమార్గమును వీడని బ్రాహ్మణులుండు తిరుప్ప నందాళూరునకు వచ్చెను. అచటి శడయప్ప లింగమును చక్కఁగ నిల్పఁజాలక గజఘటలు మూర్ఛిల్లుటను విని, తాను వానివలె నా యత్నమునఁ గృశీభూతశరీరుఁడు గాఁదలంచి, తన కంఠమునకు శివలింగమున కొక పాశమును తగిల్చికొని, మహాదేవార్పితమనస్కుఁడై "శంభో సదాశివా" యని

లాగెను. భక్తి పాశమునకు శివుఁడు కట్టుపడకుండునా! కలయనారుని భక్తి స్థైర్యములకు మెచ్చి, శివలింగము చక్కనాయెను. దేవేంద్రాదులా దృశ్యముఁగాంచి, జయఘోషలతోఁ గల్పప్రసూనంబులను వర్షించి, విజయదుందుభులను మ్రోఁగించిరి. గ్రీష్మాతపంబుచే వాడిన వృక్షములు మేఘోదయమున సంతసించునట్లు, ఆ సైన్యములు గజములు సంతసమున చలించెను. చోళ చక్రవర్తి నాయనారుని పాదములపైఁబడి, "యథాస్థానస్థితుఁడగు శడయప్పరుని సేవించు భాగ్యమీ దాసునకుఁ గల్గఁజేసితిరి. భక్తాగ్రేసరులకుఁదప్ప నికార్యమేరికి సాధ్యమగును!" అని స్తుతించెను. రాజు శివలింగము నర్చించి, నిజనగరి కేఁగెను. నాయనారచటఁ గొంతకాలముండి సేవించి మరల స్వస్థలమున కేతెంచి, యిష్టదైవమునకు బంధురామోదకలిత ధూపంబులొసఁగుచు సేవించుచుండెను.

కొంతకాలమునకు తిరుజ్ఞానసంబంధమూర్తియు తిరునావుక్కరసును తిరుక్కడవూరునకు రా కలయనా రాపరమభక్తులకు నెదురేఁగి యాహ్వానించి, తన గృహంబునకుఁ దోడ్తెచ్చి, యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, రుచిరాన్నంబులచేఁ దృప్తిపఱచి వారి కరుణకుఁ బాత్రుఁడయ్యెను. ఇట్లాతఁడు బహుకాలము శివభక్తులను, శివుని సేవించుచు జీవించి, చివరకు శివసాయుజ్యమందెను.

"నియమముతోఁ బూజించువారు
నిటలాక్షుని కృపాపాత్రులగుట తథ్యము."

# 12. మానక్కంజార నాయనారు

చోళదేశమున మధురేక్షువనావృతమగు "కంజారూ" రను దివ్యక్షేత్రంబొండు గలదు. అయ్యది యర్ధనారీశ్వర ప్రీతిపాత్రంబై షడంగ వేదవిద్వచ్ఛిరోమణులకు నిలయంబై విలసిల్లుచుండు. బాలార్క-కరసంఫుల్ల పద్మకల్హారవాసితంబులగు సరస్సముద్రములచే నావరింపఁబడి, యున్మత్త మధుకరఝుంకారసంయుతంబులగు కుసుమాకరోద్యానంబులతో నాయూరు కలకలలాడుచుండును. ద్విజుల శతరుద్రీయపఠన నాదములతోఁ, గర్మకాండాసక్తులగువారి, వాద ప్రతివాదములతోనిండిన గృహంబులుఁగల్గి, యయ్యది భూమికి దిగిన స్వర్గధామమోయనన నుండును. అన్నగరోపకంఠమున పంటభూములందు వన్నెలుదేఱిన వెన్నులు, పూగీఫలములతోఁ జేరి వంగి, కొండవల్లవలెఁ గన్పించును. అందాకాశమునంటు ధ్వజపతాకలతోఁగూడిన రత్నాలసౌధములు పూర్ణ కలశంబులు గలవియై, నిత్యోత్సవంబులతో విలసిల్లుచుండును. వర్ణచతుష్టయముచే సేవింపఁబడు శివుఁడచటి భక్తుల కోరికలఁ దీర్చుచుండును.

ఇట్టి కంజారూరున కృషికకులమున పరంపరగ రాజులకు సేనాపతులుగనుండు వంశమున, "మానక్కంఝారుఁ"డను భక్తుఁడు జన్మించి, తన భక్తి విశేషముచేఁ బేరుగాంచి యుండెను. "అతఁడు శివభక్తుల యభీప్సితంబులఁ బూరింతు"

నని ప్రతిన యొనర్చి ప్రాణదానమునకైన వెనుదీయని వాఁడై ప్రసిద్ధికెక్కెను. శివభక్తుల సేవయే యాతని నిత్య వ్రతము. వినయసౌభాగ్యమాతని సొమ్ము. భాగ్యవంతుఁడగుట శివభక్త లెద్దిగోరినను నాస్తి యనక, యడుగుటకు ముందే వారి భావము నెఱింగి, తృప్తిపఱచుచుండువాఁడు.

చాలకాల మాతనికిఁ పుత్త్రముఖదర్శన భాగ్యము లభింప లేదు. పుత్త్రార్థమై యాతఁడు విశేషముగ శివు నర్చించెను. కొంతకాలమునకు శివుని కృపచే నంధునకు దృష్టివలె, నాతని కొక పుత్త్రిక జన్మించెను. ఆ దంపతులే గాక యా యూరి వారెల్లరును సంతసించిరి. నాయనారు శివభక్తులకు ననేక దానంబు లొసఁగె. శుక్లపక్ష చంద్రరేఖవలె నా బిడ క్రమాభివృద్ధినంది యాటలాడసాగెను. నిర్ధనుఁడు నిధిఁ గాంచినటుల తండ్రి యా బాలికను గాంచి యానందించెను. అబ్బాలిక తోడివారిఁగూడి క్రీడాగృహంబులను నిర్మించుచు, నందియలు ఘల్లుఘల్లుమన బంతియాటలు కుందును గుమ్మలాడుచుండ, తల్లిదండ్రులు సంతసమున నిర్నిమేషదృష్టితోఁ గాంచుచు నానందింపసాగిరి. వయస్సుతోఁబాటూ బాలిక కబరీభారము చంద్రునిపై మేఘమోయన విలసిల్లుచుండ, హింతాలస్తబకాకారంబగు నా నీల కుటిల జటాభారంబుఁగాంచి, జనులు విస్మితులగుచుండిరి. బాల్యావస్థ నతిక్రమించి యా బాలిక యవ్యాజ సుందరమగు తారుణ్యము నందెను. లావణ్య మతిశయించెను. ఆ పల్లవోష్ఠికి వివాహము గావింప తండ్రి తలంచెను. అవ్వార్త

నెఱింగిన కలికాముని నాయనారను శివభక్తుఁడాకన్యసౌంద ర్యాతిశయమునకు ముగ్ధుఁడై కన్యనడుగ, కులవృద్ధులను మానక్కంజారునికడకుఁ బంపెను. అతఁడా వృద్ధులను గారవించి, పూజించి వారి కోరిక కంగీకరించెను. వృద్ధులా శుభవార్తఁ దెల్ప కలికాముఁ డానందించెను. ఒకా నొక శుభదినమందు లగ్నమును నిశ్చయించి, బంధువులకు శుభలేఖల నంపిరి. పెండిలికి సకల సంభారములను సమ కూర్చిరి. కంజారూరును చక్కఁగ నలంకరించిరి. స్వర్ణ పాలికలలో నవధాన్యంబులఁ బోసి, పాలికా మహోత్సవమును జరిపిరి. ఉద్వాహమునకుఁ బూర్వదినంబున కలికాముఁ డలం కృతుఁడై, బంధు మిత్ర పరివృతుఁడై కంజారూరునకుఁ బయన మయ్యెను.

కలికాముఁడు వివాహాగారమునకు రాకముందొక పరమ మాహేశ్వరుఁ డాపాదమస్తకము భస్మావలిప్త దేహుఁడై కేశపాశమున వరాటీశత మలంకరించి, కర్ణద్వయమున శుద్ధ స్ఫటిక కుండలములు చలింప, నెమ్ముల మాలికలతో కపాల పాత్రను, పరశువు నుభయకరంబులఁ దాల్చి, శల్యాఖండ నిర్మిత జపమాలికఁబూని, వ్రతియై వివాహాగారంబున కేతెంచెను. భాగ్యవిశేషమోయన నేతెంచిన వ్రతి నెదుర్కొని, మానక్కం జారుఁడు మ్రొక్కి లోనికిఁ గొంపోయి యర్ఘ్యాదులఁ బూజించి, యాసనమిడి "తమరాకచే నా కుల జీవితములు ధన్యములై నవి. దాసున కేమి యాజ్ఞ?" యని యంజలి బద్ధుఁడై

యుండెను.. అక్కపట మునివరుఁ డాతనిఁగాంచి "మీయింట నెద్దియో శుభకార్యము సాగుచున్నట్లున్నదే! 'శుభానిసంతు' అనెను. నాయనా రాతని పాదములకుఁ బ్రణమిల్లి, లోనికేఁగి సకలాభరణ భూషితయై రతియోయనన నుండు పుత్త్రిని గొని వచ్చి, యా మహర్షికిఁ బ్రణమిల్లఁ జేసెను.

ముని యాతరుణీమణీ నీలకబరీ భారముఁ గాంచి "ఓయీ! మాహేశ్వరేచ్ఛాపూర్తి నీ వ్రతముగదా! మా కోరిక నెఱవేర్తువా?" యనెను. నాయనా రానందముతో "స్వామీ! మీ కోరిక యెద్దియేని నెఱవేర్తు"నన నా కపటవ్రతి "ఓయీ! యీనా పంచవటి యసంపూర్ణముగ నున్నది. ఇందులకై నీ యీ పుత్త్రిక కుటిలకేశంబుల నొసంగు" మనెను. నాయనా రా వార్త విని వినకముందే కరవాలమునఁ గుమారి కుంతలంబులఁగోసి, యాతని చేతఁ బెట్టెను. కబరీభారమును గ్రహించిన ప్రణవ స్వరూపుఁడగు నా యాదిమముని యంతర్హితుఁడై యుమా సహితుఁడై ప్రత్యక్షమాయెను. మానక్కంజారుఁ డాయాదిమ దంపతులఁగాంచి, సాష్టాంగ మొనర్చి స్తుతించెను. ఆనంద వరవశుఁడగు భక్తునిఁగాంచి, శివుఁడు "భక్తాగ్రేసరా! నీ భక్తిని లోకములఁ జాటితిని. నీవు ముల్లోకంబులఁ బేర్గాంచి సుఖింతు"వని కటాక్షించి యంతర్హితుఁ డయ్యెను.

కలికాముఁడు కల్యాణ గృహంబునకువచ్చి, జరిగిన వృత్తాంత మెఱింగి మనస్సున కందరాని యా విచిత్రచర్యకు సంతసించెను. పరమశివుని చర్య లనూహ్యములని భావించెను.

మనంబున శంకరుని స్తుతించెను. కాని ముండిత శిరస్కయగు కన్యను పెండ్లియాడుట యెట్లని కలఁతవడెను. "ఈ సంభవము వివాహానంతరము గల్గియుండిన నా జన్మము ధన్య మయ్యెడిది" అని తలంచెను. తన కా భాగ్యము లభింపమికి చింతించెను. అపుడా భక్తుని వేదన నెఱింగిన శివుఁడు "కలికామా! దుఃఖింపకుము. ఈ వధువు కేశంబులను మఱల నొసంగితిని. వివాహమాడి సుఖింపు"మని పల్కెను. వెంటనే వధువునకు యథాపూర్వము కచభారము గన్పింప నందఱద్భుతరసా విష్టులై మోదించిరి. మంగళతూర్య రవములతో వివాహము పూర్తియాయెను. కలికాముఁడు నూత్న వధువుతో తిరుమంగలముఁ జేరెను. బంధువు లానందించిరి.

"కేశపాశ దానముచే కాలపాశ ముక్తిఁ గాంచిన భక్తుఁడు వందనార్హుఁడుగదా."

# 13. అరివాట్టాయ నాయనారు

సంతత ప్రవాహినియగు కావేరినదీ జలములచే నభివృద్ధి నంది పైరు పంటలచే కన్నులకు విందగు, చోళదేశమున 'గణమంగళ'మను గ్రామము గలదు. అచట రక్తశాలి ధాన్యంబులతోఁ జెన్నొందు కేదారములందు కాంతంబులగు రక్త కమలములు మెండుగనుండును. అప్పొలములు శంఖ ముక్తాఫలంబుల కాకరంబులు. అచటి నారికేళ వనంబులు సూర్యాశ్వఖుర సంభిన్నములైన ఫలంబులనుండి మధుర రసం బులఁ గార్చుచుండు. అవిచ్ఛిన్ననదీ మాతృకలగు నాప్రదేశ ములు వివిధ లతాతరువులఁగూడి రమ్యాతి రమ్యంబులై, మహేంద్రోద్యానములఁ దలపింపఁజేయు. కేదారములందు కలుపుఁదీయు కర్షకులు అచటి పైరుతో వసించు తూండ్ల తోడి తామరలఁ బెఱికి హస్తములఁదాల్చ, పద్మనిధులఁజే పట్టిన దేవగణంబులా యన నుందురు. పుష్పించిన సరోవరం బులు పద్మనిధులై యుండును. శ్రమజీవులకు విద్వాంసులకు, వీరులకు, వణిక్ప్రముఖులకు, నాయూరు శుభావహంబై ప్రసిద్ధి కెక్కెను.

పాడిపంటలతోఁ దులదూఁగు గణమంగళమున నొక హాలిక వంశమున "తాయనారుఁ"డను శివభక్తాగ్రేసరుఁ డుండెను. అతనిది సంపన్న కుటుంబము. నాయనారుని

గృహంబున కనతిదూరంబున నొక శివాలయముగలదు. ప్రత్యహ మాతఁడు కేసరి బియ్యమును, ఆకుగూరలను, మామిడి వరుగులను, గొంపోయి బ్రాహ్మణార్చకులచే వండింపఁ జేసి, భగవన్నివేదితముఁ గావింపజేసి, శేషాన్నము నింటికిఁ గొంపోవువాఁడు. అతఁడన్వహము ప్రచ్ఛద పటహమున కీవలనుండి, తానొసంగు నాహారమును శివుఁ డారగింపనిచో, శంకులముచే తనకంఠము నుత్తరించు కొందునని ప్రతినఁ బట్టినవాఁడగుట శంకరుఁ డానివేదితాన్నమును భుజించుచుండెను. అతఁడు ముక్కంటి మామిడి వరుగులఁ గొఱికి తిను కఱకఱ శబ్దము వినవచ్చిననే యింటికి మఱలెడివాఁడు. ఇది యాతని నిత్యసేవ, నిత్యవ్రతమునై యుండెను.

ఇట్లు పదునాలేండ్లు గడచెను. భగవంతుఁడా భక్తునిఁ దీవ్ర పరీక్షలకు గుఱిసేయఁ దలఁచి. యాతని సంపదలను నశింపఁ జేసెను. ఏనుఁగు దినిన వెలగపండువలె హఠాత్తుగ నాతని సంపదలు ధనధాన్యము లన్నియు తఱిగిపోయెను. అట్లయ్యు నాయనారుఁడు తన నిత్యసేవకు భంగము రానివిధమున నెట్లో యాహార పదార్థములఁ బంపుచుండెను.

సకల సంపదలు నశింప తాయనారుఁడు పరులపొలములలో కోఁత మొదలగు కూలిపనుల కేఁగి, యాయా దినమున తన శ్రమకు ఫలముగ లభించు నెఱ్ఱ ధాన్యమును శివునకు, ఇతర ధాన్యమును గృహవ్యయమునకు నొసంగుచు కాలము గడుపు

చుండెను. గౌరీనాథుఁ డాభక్తు నింకను దీవ్రముగఁ బరీక్షింపఁ దలఁచి, యూయూర నెట్టివడ్లే పండునట్లు చేసెను. భర్తుఁడు తనకు వేతనముగ లభించు నా రక్తశాలి తండులములను భగవంతునకే యానందముతో నివేదించి యుపవసింప సాగెను. అట్లు ఎట్టి బియ్యమైనను లభించుట తన పుణ్యమనియే యతఁడు భావించెను.

తాయనారుని సతియు అటనట పెరడులలోని యాకులఁ గోసి తెచ్చి వండిపెట్ట నదియే యాహారంబుగ భుజించి, వారు కృశించిరి, అట్లయ్యు కూలిపనులఁ జేయుచు లభ్యమైన దానిని శివ నివేదనమునకుఁ గొంపోవుచు సంతసించుచుండెను. కొన్ని దినములకా యాకుకూరలును దుర్లములుగా జలమాత్ర పానముచే వారు జీవించుచుండిరి.

ఒకనాఁ డా దంపతులు యథాపూర్వము తండులము లను మామిడివరుగులను బుట్టలో నిడికొని, యాలయమునకుఁ బయనమైరి. అతని సతి పంచగవ్యములను మృణ్మయ పాత్ర లలోఁ గైకొని భర్తను వెన్నంటెను. ఉపవాస కృశీభూత శరీరుఁడగు నాయనారు బుట్టను తలపై నిడికొని పోవుచు, కాళ్లు తడబడ క్రిందఁబడెను. బుట్ట దొరలిపడ నందలి తండుల ములు చూతశలాటుకములన్నియు నేలపగుళ్లలోఁ బడెను. అతని భార్యకొక చేత పాత్రలుండుటఁ జేసి, నాథునకు మఱొక హస్తము నవలంబన మొసఁగి లేవనెత్తెను. తాయనారు చింతా క్రాంతుఁడై "ఇఁక నాలయమున కేఁగిన లాభమేమి? ఈ దినము

శివునకు నివేదించు భాగ్యము నాకు లేదు. శివా! నీవు నేఁడు మామిడివరుగులను భుజింపఁజాలవు. నేనిఁక ప్రాణములతో నుండి లాభమేమి?'' యని వాపోవుచు, తన లవిత్రముఁ దీసి కొని కంఠముపై నిడి, పునర్జన్మమును ఛేదించుకొనునటుల మెడ నుత్తరించుకొనఁ బూనెను.

వ్రతభంగభీతితో కంఠచ్ఛేదనమునకుఁ బూనిన యా పరమభక్తుని చర్య నాఁప, శివుఁ డా నేల పగులులోనుండి తన దివ్యహస్తముఁ జాపి యాతని చేతిని పట్టి నిలిపెను. మఱియు నా భూవివరములనుండి మామిడివరుగులను కొఱుకు పటపట శబ్దము వినిపించెను. వెంటనే తాయనారు కొడవలిని విడిచెను. చేతులు మోడ్చి మ్రొక్కెను. కంఠమునుండి స్రవించు రక్త మాఁగి గాయము కన్పింపదయ్యె. తాయనారు ''కృపా సాగరా! దాసుని మన్నించి నా దాస్యమునకు మెచ్చి, యీ భూ వివరమునుండియే నన్ననుగ్రహించి, నేఁ దెచ్చిన చూతవటకముల నాహరించి, నన్ను ధన్యుఁగావించితిరి. సదాశివా! నిన్నేమని నుతింపఁగలను! తనుమధ్య యగు నుమను వామ భాగంబునఁదాల్చిన అర్ధనారీశ్వరా! తేజోరూపా! నీ మహిమ లను నుతింప నేనెంతవాఁడను. భస్మోద్ధూళిత దేహా! పింగళ జటాధరా! హరహర శంభో మహాదేవ'' యని స్తుతించెను. హిమగిరి తనయతో గంగాధరుఁడా దంపతులయెదుట నచటనే ప్రత్యక్షమై చూతవటకములను గొఱుకుచు, సుందరవదనార విందుఁడై ''నీ సేవలు మన్మనః ప్రీతిదాయకంబులయ్యె. మీకు

సాయుజ్యమొసంగుచున్నాను. మాతో రండు" అని వారితో కైలాసంబున కేఁగె. అట నా దంపతు లాదిమ దంపతుల సేవా నిమగ్నులై నిరతిశయానంద మనుభవించిరి. అదిమొదలు గణమంగలము "తండులశ్రేణికాపుర"మని ప్రసిద్ధివడసెను.

యాగంబులు వేదాంతంబులు కలియుగమున భక్తిని మించఁజాలవు. కావున నిక్కాలమున నల్పధీమంతులయ్యు, మహాదేవునియం దచంచలభక్తి గలవారగుచో భవసాగరము నుండి ముక్తులై పునర్జన్మరాహిత్యము నందఁగలరు.

"వీరభక్తులకు ముక్తి సులభము."

(అరివాళ్ = కొడవలి. అరివాళ్ + తాయ అరివాట్టాయ).

# 14. ఆనాయ నాయనారు

మలనాఁడనునది చోళ దేశాంతర్భాగము. చంద్ర మండలంబంటు వివిధ లతాతరువులఁగూడిన వనంబులు, మేఘ మండలంబును ముద్దిడు పైరులానాఁట కవేరకన్యాపయస్సులచే సంపోషితంబులై యొప్పుచుండును. అచటి పుష్పారామంబు లందలి భ్రమరంబులు వనితల వేణీభరంబులందు, గండు మీనులు సరోవరంబులందు, మహిషంబులు శీతలవృక్ష చ్ఛాయలందు నిద్రించుచుండును. కదళీ షండంబుల నావరించి యుండు లతలఁ బ్రాఁకి, శంఖములు క్రముకవృక్షంబులఁ జేరి పుష్పంబులఁ బోలిన ముత్తియంబులను రాల్చును. మల్లియల మీఁది భ్రమరంబులు మధుమంతంబులగు నీలోత్పలంబులపై వ్రాలుచుండును. కానుగువృక్షములపై నుండి బకంబులు శాలి క్షేత్రములలోఁ దిరుగాడు మత్స్యంబుల నెత్తికొని పోవు చుండును. మహోన్నత వృక్షములు సూర్యాతపంబునడ్డ, పుడమి తిలతండులన్యాయమున నొప్పు. ఇట్లు భూదేవికి తిలకాయమానంబగు నానాఁట రమాదేవికి నివాసంబగు "తిరుమంగల"మను ప్రాచీన గ్రామము గలదు.

అందు యాదవ కులాలంకారుఁడగు "ఆనాయనారుఁ" డను శివభక్తుఁడు నివసించుచు, పరిశుద్ధంబు ప్రకాశవంతంబగు విభూతిని పరమశివున కర్పించుచు, గోకులంబును రక్షించు చుండెను. ఇందుశేఖరుని పాదసేవయే పరమావధిగఁగొని,

త్రికరణశుద్ధిగా బాల్యమాది శివధ్యానమున మునిఁగియుండెను. కులవృత్తిని ద్యజింపక యన్వహము గోకదంబమును, పచ్చిక బీళ్లకుఁ దోలుకొనిపోయి మేఁపుచుండువాఁడు. వ్యాఘ్రాది దుష్ట మృగభీతియు, రోగభీతియు లేనివిధంబున గోపరిపాలన మొనర్చుచుండెను. అతని పశుగణంబులు పచ్చని లేఁబచ్చిక మేసి పడియనీటిఁ ద్రావి బలిష్ఠంబులై, వత్సంబులతో నభివృద్ధి నందుచు, నపారక్షీరంబులఁ గురియుచుండెడివి. ఆ గోపవల్లభుఁ డాక్షీరంబులఁగొని ద్విజన్ములఁ దృప్తిపఱచుచుండెను. పగ లంతయు ధేనువులను మేఁపి, సాయం సమయముల నవ్వానిని గోష్ఠంబులకుఁ జేర్చి, పిదప పంచాక్షరిని జపించుచు, దైనిక కృత్యంబులందు నిమగ్నుఁడయ్యెడివాఁడు. తానట్లు నడచు కొనుటయేగాక గోపకులను సన్మార్గగాముల నొనర్చెను. ప్రతి దిన మా గోపబాలుఁడు గోగణంబులను పచ్చిక బీళ్లకునడపి, తా నొక వృక్షచ్ఛాయఁ జేరి, రాగ తాళలయ యుక్తంబుగ సప్త స్వరముల నాధారముగఁగొని, వంశీనాదమునఁ బంచాక్షరీ మంత్రమును గాన మొనర్చు నానందించు చుండెడివాడు. అతని సశాస్త్రీయ గానమునకు చరాచరములు మైమఱచుచుండెను.

ఆనాయనా రొకనాఁడు శిరంబున పుష్పదామంబుల నలంకరించికొని, కంఠమున సువాసనా వాసితంబులగు వివిధ ప్రసూనమాలికలఁ దాల్చి, చెవిలో రక్తాశోకముఁ జెక్కి, ఫాలం బున విభూతినిదాల్చి, నడుమునకు నారపట్టయు, దానిపై పట్టు వస్త్రమును బిగించి, పాదరక్షలఁ దొడిగి, యొకచేత

కట్టను, మఱొక దానఁ బిల్లనగ్రోవిని ధరించి, పశుగణంబులఁ దోలి కొని, యితర యాదవ బృందములతో నందనందనుఁడు బృందా వనమునుండి యమునాతీరమున కేఁగినట్లు పచ్చిక బీళ్ల కేఁగెను. అయ్యది మేఘాడంబర కాలమగుటఁ జేసి, చక్కఁగ పుష్పించిన యొక కర్ణికార వృక్షంబును గాంచెను. కొండగోఁగుఁ బూవులను జటాబంధమునఁ దాల్చిన శివుఁడో యననుండు నా వృక్షమాతని దృష్టిగోచరంబయ్యెను, అతని మనంబు సంతోష రసాక్రాంతం బగుటఁ జేసి, కొంతవడి నిశ్చేష్టితుఁడై నిలువ, నాతని హృదయ కుహరమునుండి భక్తిప్రవాహము కట్టలు ద్రెంచుకొని, వెల్లుబుక సాగెను. వెంటనే యాతఁడు వేణువు నధరోష్ఠంబునఁ జేర్చి, మెల్లగ తద్రంధ్రంబుల నంగుళంబుల నిల్పి, వినువారి హృదయంబులు ద్రవింప, గానముసేయ నారంభించెను. మొదట కురంజిని పిదప ముల్లైరాగంబును కొంతవడి నాలపించెను. పిదప 'పాలై'యనురాగ మందికొనెను. (దక్షిణదేశమున పూర్వము గాన మయిదు విధంబులుగ నుండెను. 1. కురంజి, 2. ముల్లై, 3. మరుదం, 4. నైదల్, 5. తాలై అనునవి. ఇయ్యవి కొండలు, వనములు, దేశములు, సముద్రతీరము, ఎడారి, అనుభాగములందు పాడఁబడు గానంబులని యెఱుంగవలయును.) అతఁడు తార మంద్రములుగ సంచాక్షరిని గాన మొనర్చెను. ఆయత్త, ఎడుపు, ఉద్దీత, సంచార, తాయములను పంచవిధ రాగాలాపనక్రమముల ననుసరించి, మంద్రమధ్యతారములను త్రిస్థాయులలో శాస్త్రక్రమము ననుస

రించి, గాన మొనర్చెను. బాణి, తాళము, ఎత్తు, గానము, నడల ననుసరించి ప్రయోగించు నాతనివంశీగానము మంద మంద ముగ దిశలందు వ్యాపించెను.

బృందావనాంత సంచారియగు జగదేకసుందరుని గానము వలె, నాతని సంగీతము వినిన గోగణంబులు మేఁతలను మఱచి, యాతని చుట్టుఁజేరెను. వత్సంబులు క్షీరములఁ ద్రావుటమాని, ధేనువులదండ నిలిచెను. సగము గొఱికిన దర్భాంకురములు నోటినుండిజాఱ, హరిణంబులు కదుపులుగట్టి నిలువఁబడెను. వృషభంబులు గగుర్పాటుతో నాతనిఁ బొదివి కొని నిలువంబడియుండె. నెమిళ్లు నృత్యంబులుమాని కంఠంబుల నెత్తి తదేకాగ్రచిత్తంబులై యుండె. పక్షిజాతంబులు మై మఱచెను. చుట్టుపట్టులఁగల యాదవులు, నాగులు, చెంచులు, తద్గానాకర్ణన కుతూహలులై స్వకృత్యంబులఁ ద్యజించి నిలిచి యుండిరి. ఆకసంబున దేవగంధర్వ కిన్నర కింపురుష విద్యాధరులు గుంపులుగ నిల్చిరి. శుకంబులకు ఫలాదుల నందించు దేవ కన్యక లా శుకంబులతోడనె వచ్చిరి. బాధక బాధితులు కష్టంబులు మఱచి యేకమైరి. ఆ గాన మాధుర్యమునకుఁ జొక్కి, నాగమయూరములు, హరిణవ్యాఘ్రములు, గజసింహములు తమతమ సహజ వైరంబులఁదక్కి నిలిచె. మారుతుఁడు మందమారుతుఁడయ్యెను. పర్ణంబులు నిష్కంపంబులాయె. సెలయేళ్లు నదించుటను మానెను. మేఘంబులు గర్జనంబులనాఁపెను. సముద్రము నిస్తరంగ మాయెను. ఇట్లా

గాన మాధుర్యమునకు చరాచరంబులు చిత్రార్పితా కృతు లట్లు నిశ్చలములయ్యెను. రోదసీకుహరము నావరించి, దిగంత ముల నిండిన నాయనారుని గానము, కనకసభలోని నటరాజేశ్వరుని శ్రవణగోచరము గాకయుండునా! నాట్య సంగీతముల కాదికారణుఁడైన నటరాజు గానాకర్షితుఁడై కృపాతరంగితాంతఃకరణుఁడై యా నాయనారుని ముందు ప్రత్యక్షమై "శివభక్తు లెల్లపుడు నీ వేణుగానము విని, యానందించునటుల నీవు మా సన్నిధానమున నుండుము." అని యనుగ్రహించెను. ఆ నాయనారట్లే వేణుగాన మొనర్చుచు దేవతల జయఘోషలతో శివుననుసరించి యేఁగి నటరాజేశ్వర పాద సన్నిధానముఁ జేరెను.

"భగవన్నామ సంకీర్తనంబు మోక్షైకసాధనంబు"
"సంగీతజ్ఞాన విహీనులకు మోక్షముగలదా!"

(త్యాగరాజు.)

# 15. మూర్తి నాయనారు

నిత్యము చంద్రచూడునకుఁ జందనాది ప్రదానము సేయువా రిహలోకసౌభాగ్యము నంది ముక్తులగుదురు.

అతిప్రాచీనము, భక్తిమదగ్రగణ్యులచే సర్వదా కీర్తనీయము, భాగ్యవంతులగు సుజనులచే నాక్రాంతమునగు పాండ్యదేశమున స్వచ్ఛశీతల మధురజలంబులతో తామ్రపర్ణి నది ప్రవహించుచుండును. తామ్రపర్ణీ మహోదధి సంగమస్థలమున "కోర్కై" యను రేవునుండి లభించు ముత్తియములే పాండ్యుల ధనము. శ్రీచందనవృక్షావృతంబగు "పొదిగ" పర్వతంబునుండి యేతెంచు మంద మారుతములా తామ్రపర్ణీ తరంగోద్ధూతములగు తుంపురలఁగూడి, యతిశీతలములై, తద్దేశీయుల కానందాహ్లాదములను గల్గించుచుండును. కమలాసనకు పీఠమోయన పాండ్య దేశమునకు "మధుర" ప్రధాన నగరమై విలసిల్లుచుండు.

ముత్తమిళమున కాకరమై తమిళ పండితులకు, తమిళ కవిసంఘముల కయ్యాది నిలయమై ప్రసిద్ధిఁగాంచియుండు. సంఘ కాలపు పండితులతో సర్వజ్ఞుఁడగు బాలేందుధరుఁడు సేరి సాహిత్య చర్చలలోఁ బాల్గొనిన దీనగరమందేగదా! అన్నగరము మీనాక్షీ సోమసుందరుల సాన్నిధ్యముచే విలసిల్లు. అందు. "తిరుఆలవాయి" యను మహోన్నతాలయము భక్తజనసేవ్యమై యొప్పుచుండును.

శివునకు రాజధాని యని యశము నార్జించిన మధురా నగరమున ధనికులగు వైశ్య కులంబు లొనర్చిన పుణ్యా ఫలమా యన "మూర్తియారు"డను శివభక్తుఁడుండెను. శ్రీ సదాశివ పాదకమలముల నాతఁడు బంధుమిత్రాదులకంటె నధికముగ భావించి సేవించెడివాఁడు. రూపెత్తిన భక్తియో యన నాతఁడు సోమసుందర సేవాపరాయణుఁడై యుండె. అతఁ డన్వహము మీనాక్షియాలమున కేఁగి సోమసుందరునకు చందనచర్చ చేయించుచు సేవించెడివాఁడు. నిర్విఘ్నముగ తన చందనసేవ సాగవలయునని ప్రార్థించి వచ్చుచుండెను.

అక్కాలమున భుజబలాఢ్యుఁడు మహావీరుఁడునగు నొక యాంధ్ర చక్రవర్తి సాగర సదృశంబగు చతురంగబలముతో పాండ్య దేశముపై దండెత్తి వచ్చి, పాండ్యరాజునోడించి, నిర్వక్ర పరాక్రమముతో మధురను ప్రవేశించి, పాండ్య సింహాసనమెక్కి పాలింపఁ దొడఁగెను. ఆనాఁటినుండి యాంధ్రుల కది ప్రధాన నగరమై యొప్పెను.

మధుర నాక్రమించిన తెలుఁగు రాజు శ్రమణుఁడగుటఁ జేసి శైవ సమయాచారములకు శత్రువై, విభూతి రుద్రాక్షలను దాల్చిన పరమ మాహేశ్వరుల ననేక రీతుల బాధింప సాగెను. శివపాద సేవారతుఁడగు "మూర్తియారు" ననేక బాధలకు గురిచేసెను. మూర్తినాయనారుఁ డా బాధలను లెక్కింపక, యథాపూర్వము తన సేవను నిర్వర్తించుచుండెను. నిశ్చితాత్ములగు భక్తుల మార్గము నడ్డఁజాలువా

రెవరు? రాజు మతము ననుసరింపక సోమసుందరుని పరదైవ ముగ భావించి, నిత్యము చందనసేవ సేయు నా భక్తునకు ప్రతి బంధము గల్పింప రాజు సంకల్పించెను.

రాజే యట్లుదలంపఁ జేసెడిదేమి? మధురా నగరి విపణి వీథులలోని చందన కాష్ఠములను తానేకొని, యా పణ్యా వీథికలను చందన విరహితములుగ నొనర్చెను. "శైవ సన్మార్గమున దేశముఁ బాలించు రాజు లేఁడయ్యె గాదే. ఈ దుష్టుఁ డెపుడు యమక్షయమున కేగునో తెలియరాదయ్యె." యని నాయనారు చింతింప సాగెను. నగరమం దెచ్చటను వాసనకైన నొక చందన కాష్ఠ ఖండము దొరకదయ్యె. తన సేవకు భంగము వాటిల్లునని యాతఁడు మితిలేని దుఃఖమునకుఁ బాలయ్యెను.

ఆనాఁడు శివసేవావసరము సమీపింప, దుఃఖముతో నాయనారు చొక్కలింగేశ్వరునాలయమున కేఁగెను. చందన కాష్ఠవిరహితమైన బండను గాంచి విలపించెను. ప్రొయ్యి, చేయి యుండిన గారె లెట్లు లభించును? అన్నటుల కేవల శిలా ఫలకమున్న నేమిలాభము? కాని మూర్తి నాయనారు ధైర్యము వహించి మాంసలంబైన మోఁచేతిఁగాంచి, "ఈ కూర్పరముండ భయమేమి? దీని ఱాత నఱుగఁదీసి, స్వామికీవేళ రక్తచందన చర్చఁ గావింతు" నని స్థిరచిత్తముతో శిలాఫలకముపై మోఁచేతి నిడి, అఱుగఁదీయసాగెను. రక్తము కాల్వలుగ గట్టెను. చర్మము, కండలు, నరములు తెగి, చివరకు నెముకయు నఱుగసాగెను.

శల్యములోని మజ్జయు స్రవించెను. మూర్తియాతఁ డెంత మాత్రము ఖేదపడక, తన యత్నము విరమింపఁడయ్యె. ఆ వీర కృత్యముఁ గాంచి ఖండేందుధరుఁడు "ఓయయ్యా! నీ నిజభక్తికి మెచ్చితిని. ఈ సాహసమును మానుము. నీకీకష్టముఁ దెచ్చి పెట్టిన రాజు నేఁడే నశించును. నీవే పాండ్య దేశమునకు రాజవగుదువు. నీ విట్లే చందనసేవ చేయుచు రాజ్యమును పాలించుచు ప్రజలను శైవ మార్గమున నడపుచు, పోషించుచు నంతమున మదీయ లోకముఁ జేరుము." అని కరుణించెను. నాయనా రాపరావాక్కులను విని యానందముతో తాఁ జేయు కార్యమును నిలిపి, కరములు శిరముపై గీలించి స్తుతించెను. రక్తసిక్తమగు నాతని హస్తమునందలి గాయ మదృశ్య మయ్యెను. శివగంధ మాతని యొడలి నిండుగ వీవఁదొడంగె.

జైనుఁడగు నా యాంధ్రభూపతి యా నిశియందే హఠాత్తుగ మరణించి, కాలకాలుని మహిమచే కాలుని పురి కేఁగెను. అతని సతీసుతులు బంధు మిత్రాదులు దుఃఖ సాగర మున మునింగి హాహాకారముల నొనర్చుచు విలపించిరి. దుష్టుల దౌష్ట్యము నడచుటకో యన వివస్వంతుఁ డుదయించెను. అంధ కారమడఁగినట్టు సజ్జనుల బాధలు నశించెను. దిశలు వెలిఁగినట్లు వారి హృదయ పంకజములు విప్పారెను. మంత్రి సామంతాదు లకు రాజు మరణవార్తఁ దెల్పుటకో యన కుక్కుటములు కూయఁ దొడఁగెను.

రాజు మృత కళేబరమునకు జైనమత విధులతో నంత్య సంస్కారముఁ గావించిరి. జైన సిద్ధాంత గ్రంథములు మండు నటు లాతని చితి క్షణమున భగ్గునమండి నీరయ్యెను. శ్రమణా చారములను, ప్రక్షాళన మొనర్చునటుల జనులు తామ్రపర్ణీ జలంబులందుఁ గ్రుంకులిడి గృహంబుల కేఁగిరి. అపుత్రకుఁడై మరణించిన తెలుఁగు రాజునకు వారసులు లేమిఁ జేసి, మంత్రులు సభఁగావించి యోచించిరి. దేశము సకల సంపత్సమృద్ధమయ్యు, రాజు లేనిదైనచో దీపవిరహిత గృహంబుంబోలె యగును. శాంతిభద్రత లా దేశమున నుండఁజాలవు. జీవరహితమగు దేహమువోలె నుండు రాజ్యమున రాజును నియమింప వెంటనే యుపాయముఁ దోఁపక కొంతవడి చింతించి వారొక నిశ్చయ మునకు వచ్చిరి. "భద్ర గజమునకుఁ గన్నులు మూసి, పట్టణమున విడిచిన నది యెవ్వారిఁ గొనివచ్చునో యాతఁడే యీ దేశ మేలును." అని నిశ్చయించి భద్రేభమును గొని వచ్చి, దాని కన్నులను వస్త్రాచ్ఛాదిత మొనర్చి, "నీవీ దేశముఁ బాలింపఁదగువానిఁ గొని రమ్ము." అని వదలిరి.

ఆ భద్రమాతంగము పురవీధులందు సంచరించుచు, చివరకు చొక్కలింగ నిలయమగు నాలవాయి గోపుర ద్వార మును సమీపించెను. మూర్తి నాయనారు శివునాజ్ఞఁ దలంచి "సాంబుని కృప యిట్టిదేయయిన, నే నీ రాజ్యముఁ బాలింప సంశయపడనేల?" యని ద్వారముకడ నిలిచెను. మత్తేభము నేలకు వంగి, మూర్తి నాయనారుని తొండముతో మెల్లగఁ

బట్టి, తనపై నెక్కించుకొనెను. గజారూఢుఁడైన నాయనారుఁ గాంచి, మంత్రి సామంతాదులు మ్రొక్కిరి. జనులు జయ జయ నినదము లొనర్చిరి. భేరీశంఖపటహకాహళాదుల నాదములు దిక్కులఁ బిక్కటిలఁ జేసెను. వందిమాగధ విజయ గానములతో నా గజము కొలువుకూటమున కేఁగి, నాయ నారును సమలంకృతమైన పట్టాభిషేక మండపముఁ జేర్చెను. పౌరవృద్ధులు మంత్రి సామంతాదులు సంప్రదాయానుసార ముగ నతనిని సింహాసనాసీనుం గావించిరి. పురోహితులు జాత వేదు నారాధించి, హోమములు గావించిరి. పంచ పల్లవ సహిత పూర్ణకుంభముల నంతట స్థాపించిరి. సకల నదీ నద సముద్ర జలములతో నింపిన యభిషేక ఘటంబులను పూజించిరి. అపుడు నాయనారు సభికులఁగాంచి "శ్రమణ మతమును వీడి, మీరంద ఱాదిశైవము నవలంబించుచో నే నీ రాజ్యముఁ బాలింతు" నని యుచ్చైస్స్వరంబునఁ బలికెను. జనులంద ఱాతని పల్కుల నాదరించి, తమ యంగీకారమును జయ ఘోషలతోఁ దెల్పిరి. మంత్రి సామంత పురోహితాది సకలని యోగి జనులు మూర్తియారునకు మ్రొక్కి "మీ యాజ్ఞలను హృదయ పూర్వకముగ నెఱవేర్తుము" అని ప్రతినఁ గైకొనిరి. అంత మూర్తియారు "అట్లగుచో నాకు విభూతియే యభిషేక ద్రవ్యము. రుద్రాక్షలే యాభరణంబులు. జటాభారమే కిరీట మగును. ఈ రత్నోదంచిత కిరీటముఁ దొలగింపుఁడు. ఇది నాయభీప్సితము" అనెను.

మూర్తియారుని పల్కులకు విద్యానిపుణులు, బుధులు, వృద్ధులును మెచ్చి యానందించిరి. రాజు కోరిక మేరకు సంభారములను గొనివచ్చి వేదఘోషములతో నాతని నభిషేకించిరి. మూర్తి నాయనారు పట్టాభిషేక మండపమునుండి బయల్వెడలి పోయి, యాలవాయి చొక్కలింగేశుని మనసార మ్రొక్కి సేవించెను. భగవద్విలాసము లనూహ్యములు, అగమ్యములు, భిక్షుకుఁడు రాజు, రాజు భిక్షుకుఁడగును. ఇదియే యెఱుంగరాని శివమాయ. ఆలయమునుండి యాతఁడు పురవీధుల నూరేఁగుచు సభాస్థలిఁ జేరి సింహాసనాసీనుఁడయ్యెను. సుందరీమణులు కరకంకణక్వాణములతో వింజామరలను వీచిరి. శ్వేతాతపత్రము మొదలగు రాజలాంఛనములన్నియు సమకూర్చిరి. కొంతవడి కొలువుచేసి, నియోగులను మన్నించి, శివభక్తుల నాదరించి, యా రాజు అంతఃపురమున కేఁగెను.

ఆనాఁటినుండి ప్రజలు మంత్రి సామంతాదులు నాయనారు నాజ్ఞలను శిరసావహించి, నడచుకొనుచుండిరి. జైన విధులన్నియు సమూలముగ నశించెను. శైవసమయాచారములు స్థిరపడి వృద్ధిఁగాంచెను. జన్మదుఃఖముఁ బోనడఁచు విభూతి రుద్రాక్ష జటాధారణములు ప్రజల వేషములుగాఁగ, మూర్తి నాయనారుని పాలనము సదాశివ పాలనమాయెను.

మూర్తి నాయనారు కాంతాకనకంబులపై నాశ వీడి, సన్న్యాసివలె జితేంద్రియుఁడై, యంతశ్శుద్ధితో శ్రమణాది

బాహ్యాశత్రువుల నణంచి, జటాకిరీటధారియై పాండ్యదేశమును పాలించుచు, ప్రజలపాలిటి కామధేనువయ్యెను. ఆతని పాలనమున జనులు దారిద్ర్య రోగాది దుఃఖరహితులై శివభక్తి పరులై యుండిరి. ఆ రాజట్లు శివభక్తిని లోకమున వ్యాపింపఁజేసి యంత్యకాలమున కాలకంఠుని దివ్య పాదారవిందములను ధ్యానించుచు శివలోకముఁ జేరెను.

"స్వధర్మము శుభావహము.
పరధర్మము భయావహము."

# 16. మురుగ నాయనారు

పరరాజన్య కిరీటస్థగితమణి కాంతులచే రంజితపాదపీఠి గల, చోళచక్రవర్తుల దేశము, కావేరీనదీజల సంపత్సమృద్ధం బగుటచే సకల సస్యసంపదలతో నభిరామంబై యుండు. అందు నందనవనావృతంబు, సరోవరయుతంబగు 'తిరుప్పుహలూ'రను దివ్యక్షేత్రము గలదు. అచట మాహేశ్వరులు దాల్చు విభూతి ప్రకాశమున రాత్రులు పగళ్ళై విలసిల్లు. పూఁదేనియలాను గండుతుమ్మెద లాభూతిప్రకాశముచే సిత వర్ణంబులై గన్పించుచు, ఝుంకారము లొనర్చుచు, కమల సరోవరంబులఁ దిరుగాడుచుండును. వాని ఝుంకృతులు మధురవార్తలతోఁగూడిన గానమువలె సకలలోకములను మూర్ఛిల్లఁజేయు. సరసీజంబులు గార్చు తేనియలు ఆనంద బాష్పంబులా యన నుండును. అచటి భక్తులు శివస్తుతి యను అమృతమును శ్రవణంబులను దొప్పలందు నింపి, మనసారఁ గ్రోలి వివశులగుచుందురు.

ఇట్టి మహిమతోఁగూడిన "తిరుప్పుహలూరు"లో మహీ ద్విజులకులమున "మురుగ నాయనారు" జన్మించెను. అతఁడు నాల్గు వేదములను షడంగ సహితముగ నధ్యయన మొనర్చెను. అతఁడు కర్మిష్ఠి. వేదాంతముల నెఱింగి జ్ఞానియై యుండెను. శివపూజాధురంధరుఁడై, సార్వకాలిక సర్వావస్థలందు శివ

ధ్యానముచే ద్రవీభూత చేతస్కుఁడై, భక్తాగ్రేసరుఁడని ప్రసిద్ధి వడసెను. అంతియగాక యాతఁడు శివునకు పుష్పోపహార కైంకర్య మొనర్చువాఁడై యుండెను.

మురుగనాయనారు అరుణోదయమున శివస్తుతులతో మేల్కాంచి నిత్య కృత్యములఁ దీర్చుకొని, నదికేఁగి శుద్ధ జలంబుల మజ్జన మాచరించి, భస్మముఁదాల్చి, సంధ్యావందన మొనర్చి, సైకతస్థలి గాయత్రిని జపించి, పంచబ్రహ్మ మంత్ర ములను స్మరించుచు నచటి యుద్యానవనమున కేఁగును. అందు విరియఁబూచిన భూవృక్ష జలాదులందలి వివిధ ప్రసూనములఁ గోసి పుటికయందిడి, చరణాదులు దగులని రీతి నెత్తికొని, శివాలయమున కేతెంచును. అట ప్రత్యేక స్థలమునఁ గూర్చుండి మాలికలను గట్టును. శివుని శిరోవేష్టనమునకుఁ దగినట్లును, కంఠహారములను, జాలెమాలికలను, తోమాలలు మొదలగు వాని కర్హములగునట్లును వివిధాలంకరణముల కనువులగు మాలి కల నందముగఁ గట్టి, వర్ధమానేశ్వరునకు సకాలమున నర్పిం చును. తానే స్వయముగ ధరింపఁజేసి హృదయము భక్తి ప్రపూర్ణము గాఁగ, పంచాక్షరిని ద్వాదశ సహస్ర సంఖ్యాక ముగ విడువక జపించును. ద్వంద్వాతీతుఁడగు మురుగ నాయ నారు స్వధర్మము నిట్లు విడువక చేయుచు వచ్చెను.

ఇట్లు చాలకాలము గతించెను. ఉమాదేవీ స్తన్య పాన మొనర్చిన తిరుజ్ఞానసంబంధమూర్తి, తిరునావుక్కరసుతోఁ గలిసి తీర్థాటన మొనర్చుచు నాయూరున కేతెంచెను. అప్ప

టికే యా భక్తవరుల యశము దిగంతవ్యాప్తమై యుండెను. అట్టి మహాభక్తులు తన గ్రామమ్మునకు వచ్చుచున్నారని విని మురుగనాయనా రానందించి వారికెదురేఁగెను. వారిని దోడ్తెచ్చి సదాచారానుసారము అర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, తన మఠమున వారికిఁదగు వసతులఁ గల్పించి సేవించెను. వారి నుపచరించుచు ననేక శివతత్త్వములఁ దెలిసికొనెను. వారేఁగినపిదప కొంత కాలము పరమశివ పాదార విందములను సేవించుచు, పుష్పోపహారసేవను దీక్షతో నడపుచుండెను. శివతత్త్వాభినివిష్టంబగు తిరుజ్ఞానసంబంధుని కల్యాణము జరుగనున్నదని యెఱింగి యచటికేఁగెను. అచట కల్యాణగుణ విశిష్టుఁడగు నుమాపతి మురుగనాయనారుని కటాక్షించి జ్యోతిర్మయుఁడై యనుగ్రహింప, నాతఁడా దివ్యజ్యోతిని బ్రవేశించి మాహేశ్వర దివ్య పాదచ్ఛాయలో పునరావృత్తి రహితమైన పదవి నందెను.

"నియమముతోడి పంచాక్షరీ మంత్రజపము ముక్తిదాయకము."

# 17. ఝుద్ర పశుపతి

*దురాసదంబగు బ్రాహ్మణజన్మ మందినను, సకల వేద శాస్త్రాదుల నభ్యసించినను రుద్రాధ్యాయ పరాఙ్ముఖులై దినములను వ్యర్థముగఁ గడుపుచుండుట శోచనీయము. వేద సార సూక్తములచే మహాదేవుని స్తుతించి, గర్భవాసక్లేశముఁ బోఁగొట్టుకొనఁ జాలక, "పునరపి జననం పునరపి మరణ"మ్మను వాక్యమును సార్థకపఱచువారు మాతృగర్భముఁ జెఱుపఁ బుట్టినవారనక తప్పదు. చేతులారంగ శివునిఁ బూజింపక నోరు నొవ్వంగ హరుని నామము నుడువక యుండువాని జన్మము నిరర్థకము. అనశనముచేఁ దృప్తిగలుగని విధమున ద్విజన్మునకు రుద్రాధ్యాయజప విరహితునకు నాత్మ తృప్తిగలుగ నేరదు.

అశ్వమేధము సోమయాగము, పౌండరీకము మొదలగు శత యాగములను విధ్యుక్తముగ నొనర్చి యవబృథస్నాన పూత దేహులైన యాజులు దేవప్రీణనపరులై చచ్చి స్వర్గ మున కేఁగినను "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి"యను వాక్య మును సార్థకపఱుతురే గాని పునర్భవ రహితమైన శాశ్వత ముక్తిం గాంచఁజాలరు. శతరుద్రీయ జపతత్పరుఁడు కైలాస ముఁజేరి, మరలిరాఁడు. "నమస్తే రుద్రమన్యవే"యని యారంభించి "తంవోజంభేదధామి"యని యంతమగు రుద్రా ధ్యాయమును ద్విజన్ముఁడు వేదప్రమాణ మంగీకరించి జపిం చినచో నర్కుఁడు తమస్సునుంబోలె మహా పాతకములను

నాశమొనర్చి విముక్తుఁడగును. లోకుల పాపంబుల నణఁప సమర్థుఁడగును. ప్రణవ సహిత రుద్రాధ్యాయ జపపరుల పాద రేణువులను శిరమునఁ దాల్చి, బ్రహ్మాదులును విముక్త పాపు లగుదురనుట యద్భుతోక్తిగాదు. సకల తేజంబులలో సౌర తేజమెట్లో సకల మంత్రములలో నీ రుద్రాధ్యాయ మట్లని యెఱుంగవలయు. సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములతో భస్మధారణ మొనర్చి శుచియై రుద్రాక్ష మాలాధారియై రుద్ర మంత్రములతో మహాదేవు నభిషేకించువాఁడు తమ పూర్వుల నుద్ధరించువాఁడై శివలోకమున సుఖియగును.*

సారవంతమైన చోళదేశమున "తిరుత్తలయూ"రను నొక యగ్రహారము గలదు. ఎట్టి కొఱఁతలులేక భాగ్యో పేతులై సదాచారములఁ బాటించుచు అతిథ్యభ్యాగతులను సేవించు విప్రకుటుంబములం దనేకములు గలవు. అచటి గృహస్థులందఱు నిత్యాగ్నిహోత్ర సంపన్నులు, త్రికాలము లందు గృహ్యాగ్ని నాధానమొనర్చి హవనము సేయుటచే నింద్రాది దేవతలు సంతుష్టులై, యా దేశమందు మూఁడు వానలఁ గురియఁ జేయుచుందురు. కావున ముక్కారు బండు చుండు. పాడి పంటలకే కొఱఁతయు లేనందున పేదఱికమున కచట తావులేదు. వారు నిత్యము శివుని పంచగవ్యములతో నభిషేకించుచు, ద్రోణ పుష్పములతో బిల్వ పత్రములతోఁ బూజింతురు. శివప్రోక్తాగమ మార్గములను మీఱక, ధర్మ నియమములను పాటించుచు, వారు సన్మార్గగాములై యుండిరి.

అట్టి తిరుత్తలయూరునందు "పశుపతి" యను బ్రాహ్మణోత్తముఁడుండెను. అతఁడు సదాచార సంపన్నుఁడేగాక శివపూజా తత్పరుఁడు. వేదవిధుల ననుసరించి, శివునర్చించువాఁడు. రుద్రసూక్తపారాయణ మాతని నిత్యకృత్యము. అతడు తన హృదయ కమలమున శివపాదములను స్థాపించుకొని ధ్యానించుచుండెను. ఒకనాఁ డాతఁడు రుద్రమంత్ర జపదీక్షనుబూని, యళికులారావంబగు సరోవరంబున, కంఠదఘ్నోదకములందు నిలిచి, హస్తములను శిరమునఁ జేర్చి మనంబున మహాదేవుని నిల్పి, రుద్రపారాయణ మొనర్పసాగెను. అట్లహర్నిశలు విరామములేక కొన్ని దినము లేకాగ్రచిత్తముతో జపించుచు, సరసీజాసనుఁడగు బ్రహ్మయో యన విలసిల్లెను.

రుద్రసూక్తమును జపించు పశుపతి తపస్సునకు పశుపాశ విమోచకుఁడగు పార్వతీపతి సంతసించి, ప్రత్యక్షమై యాతని వైదిక స్తుతికి నానందించి, కైలాసప్రాప్తి ననుగ్రహించెను. ఆ పాఱుఁడు కైలాసముఁజేరి యానందతాండవ నృత్యకరుఁడగు నటరాజ దివ్య పాదచ్ఛాయలో లయముఁ జెందెను. రుద్రసూక్తములచే భగవంతునిలో లీనుఁడైన పశువతి "రుద్ర పశువతి" యని ప్రసిద్ధిఁ బడసెను.

"రుద్రసూక్త జపతత్పరులు రుద్రప్రసాద మహితులై యా పరమాత్మయందు లయింతురు."

# 18. నంధనారు

(తిరునాళప్పోవార్)

సస్యశ్యామలంబగు చోళదేశమున మేల్కానాడను భాగంబున "ఆదనూరు" అను చిన్న గ్రామమొండు గలదు. అయ్యది శైవుల కావాస భూమి.

నదీ తీరమందలి బురదలో వసించు నెండ్రులు ప్రవాహ వేగమునకు నిలువజాలక, తీరమునకు బ్రాకి యచటి చెందా మరల నధివసించి, గ్రుడ్లు బెట్టుచుండును. మధుపూర్ణ కోశంబు లగు సరసీజములు చూపుమేర దూరము కన్నులకు విందగు చుండును. అచటి వృక్షము లాకాశము నంటియుండును. సరస్సులలోని చాలచేపలు, తీరస్థనారికేళ వృక్షంబులపైకి నెగిరి పడ, నయ్యవి సమూలంబు చలించుచుండును. తమ్మట్లు చుల కనగ జూచు మత్స్యంబులను శిక్షింప దలంచెనో యన, నా వృక్షంబులు వానిపై నారికేళ ఫలంబులను రాల్చును. పనస వృక్షములందు ఫలించిన ఫలములు ముదురబండుటచే పగిలి, మధుర రసమును స్రవింపజేయును. జలచరంబు లమ్మధుర రసాకర్షితంబులై యెగిరి పడుచుండును. ఇట్టి సరస్సులతో కేదార క్షేత్రములతో నిండిన యా యూరియందలి ప్రజలు, సుఖజీవనమును గడుపుచుండిరి.

ఆదనూరున కనతిదూరమున హరిజనవాడ గలదు. మంటి గోడలపై నారికేళ పత్రములతో, గడ్డితో గప్పిన

గుడిసె లందు శతాధికములు గలవు. అచటి వారందఱు గ్రామికులు. కర్షక వృత్తియే వారి జీవనాధారము. సొర తీగ లా గుడిసెలపై నల్లికొని యుండును. ఆ శాలలముందు తీక్ష్ణనఖములుఁ మృదుపాదములుగల కుక్కుటములు, తమతమ పిల్లలతోఁగూడి, సంచరించుచు 'కొక్కొరోకో'యని శబ్దించు చుండును. ముంగిళ్లలో నాడు బాలశునకంబుల నెత్తికొని, మేఘశ్యామల దేహులగు బాలకులు వానితోఁ గ్రీడించు చుందురు. అబ్బాలురు దాల్చిన ఇనుపగంటల ధ్వనులతో వారి కిలకిలారావము లాప్రాంతమున ప్రతిధ్వనించుచుండు. అచటి మాలెతలు తమ శిశువులను భుజములపై పరుండఁజేసికొని, నింబ వృక్షచ్ఛాయలలో జోకొట్టుచు నిద్రింపఁజేయుదురు. అచటి జనులు కుక్కుటములు అండముల నిడుటకు కుండలను, గున్న చెట్లక్రింద పాఁతియుంప, నవి యందండముల నిడి, పొదుగు చుండును. వారచటి చూతవృక్ష శాఖలకు తమ డమరుక ములను గట్టియుంతురు. గాలికిఁగదలు శాఖలు వానికిఁ దగు లుటచే నవి తమంత తామే శబ్దించుచుండును. చర్మములు వాఱులనఁబడు చర్మపు దారము లచట వ్రేలాడుచు, దుర్వాస నను వ్యాపింపఁజేయును, నది యంత్యజులవాడ యని తోఁపింపఁ జేయును. మహోన్నత నారికేళ వృక్షముల బొరియలలోఁ బరుండి శ్వానంబులు తమ శిశువులకుఁ బాలిచ్చుచు, సమీ పించువారి రాకను సహింపక, మొఱుఁగుచుండును. కోడి పుంజులు వృక్షాగ్రముల నెక్కి కూయుచు, గ్రామికులను

నిద్రనుండి మేల్కొల్పుచుండును. పగటివేళలం దచటి స్త్రీలు వడ్లను దంచుచు, పాడు దంపుడుపాటలు శ్రవణపేయములై యుండును. సరస్సులందలి పక్షుల శబ్దములు, గంగరేణి పూవుల నలంకరించుకొనిన మాలెతలు మధువునాని యొడలు దెలియక ప్రమోదించు తప్పెటల ధ్వను లేకమై వ్యాపింప, వారాడి పాడుచుందురు.

అట్టి గూడెములో నందనారను నొక భక్తుఁడు నివసించుచుండెను. పూర్వభవపుణ్యమో యన నాతఁ డెల్లవేళల శివధ్యానాసక్తుఁడై యుండెను. జాతి ధర్మములను వీడక, శివసేవసేయుచు, వెట్టి చాకిరికై వంశపరంపరాగతమైన మాన్యపు భూములను దున్ని, పైరుఁబెట్టి, లభించు పంటతో నాతఁడు జీవించుచుండెను. అతఁడు స్వధర్మము నెన్నఁడేని మఱచువాఁడు గాఁడు. ఆలయములలోని భేరీ మృదంగాదులకు, వలసిన చర్మములను వాఱుల నొసంగుచు, వీణియ, యాళమను వాద్య విశేషములకు నరములను సంగ్రహించి, యొసంగుచుండెను. మఱియు గోరోచనాది ద్రవ్యంబులను సమకూర్చుచుండెను. ఇట్లు తాఁ జేయఁదగు సేవసేయుచు, ఆదనూరు శివాలయ ప్రాకార బహిర్భాగమునకుఁ బ్రదక్షిణ మాచరించుచు, ప్రేమాతిశయమున నానంద తాండవమాడుచు, భక్తిపరుఁడై కాలముఁ గడపి, తనవాడకుఁ దిరిగి వచ్చుచుండును.

నందనా రొకనాఁడు తిరుప్పుంగూరులోనుండు శివలోకనాథుని, పాదకమలములను సేవించిరాఁ దలఁచెను. శివదర్శనా

సక్తి యతిశయింప నతఁడు ఆదనూరినుండి బయలుదేరి, పుంగూరుఁ జేరెను. అట నాలయగోపుర ద్వారముకడ నిలిచి శివమహిమను స్తుతించెను; కాని యాతని దృష్టి శివునిపైఁ బడకుండ, నంది యడ్డుపడుటఁగాంచి, దుఃఖించెను. పశుపతి యాతని మనోభావ మెఱిఁగి, కృపసూపఁదలచి నందిని "ప్రక్కకుఁ దొలఁగు"మని యాజ్ఞాపించెను. నంది యొక పార్శ్వమునకు నొఱగిపోవ, నందనారా భవలింగమును కన్నులారగాంచి, మ్రొక్కి స్తుతించెను, పిదప నాలయమునకు ప్రదక్షిణముగఁ బోవుచు పశ్చిమ భాగమున చిన్న పల్లముండుటఁ గాంచెను. వెంటనే దాని "నొక చెఱువుగ నేల త్రవ్వరా"దను భావమాతనికి నుదయింప దానిని త్రవ్వి, సుందరతటాకము గావించెను. అక్కార్యము నెఱవేర్చి శివలోకనాథుని కీర్తించుచు, నాదనూరున కేతెంచెను. స్వగ్రామముఁజేరి పూర్వమువలె స్వీయధర్మములను నెఱవేర్చుచు, నట శివు నారాధించుచుండెను.

నందనారట్లు శివుని సేవించుచు, శివధ్యానమున నొడలు మఱచి, సరుగుడు చెట్టువలె నిలఁబడుచుండెను. కొంతకాలమట్లు గడవ నాతఁడు చిదంబర మహిమను విని, నటరాజు నటనమాడిన కనకసభను గాంచ కుతూహలియయ్యెను. నానాఁటికి శివస్థల దర్శనాభిలాష యధికముగా, నతఁడు సమీపస్థ శివక్షేత్రములకు నేఁగి, మ్రొక్కి వచ్చుచుండెను. కాని చిదంబర దర్శనాసక్తి యాతనిఁ బీడింప, రేలను నిద్రలేకయే గడుప

సాగెను. పగట "నేఁడు చిదంబరమున కేఁగ వలనుగాదు. తేపేఁగెదను. నా జాతికి నా క్షేత్రము చొఁరరానిది. ఇదియు శివాజ్ఞయే. ఏమిసేయుదు?"నని విచారించి, "నటరాజ దర్శనము సాధ్యముగాదు. నేఁ బోఁజాల"నని యా యత్న మును వీడుచుండును. మరల కుతూహలము తలముక్కలు గాఁగ "రేపు బోవుదును" అనును. ఒక్కొక్కదిన మట్లే రేపు రేపు, అని తలంచుటచే నాతనిని "తిరునాళై పోవార్" అని జనులు పిలువసాగిరి.

ఎంత కాలమిట్లు గడపుట యని, శివవిరహమును భరిం పనివాఁడై జన్మబంధమును వీడుటకై, చిదంబరమునకు నెట్లేని యేఁగ నిశ్చయించెను. చిత్తము శివుని వీడఁజాలమి నాతనికి స్వకృత్యములందేగాక యన్నాదులందిచ్ఛ నశించెను. ఒకా నొక యరుణోదయమున నాతఁడు దృఢసంకల్పముతో చిదంబర మునకు బయలుదేరి, యతివేగముతో పంట పొలములను క్రముకవనములను దాఁటి, నారికేళపు తోఁపుల నధిగమించి పోవసాగెను. అపుడాతనికిఁ బ్రపంచమే శివమయముగఁ గన్పించుచుండెను. సుదూరము ప్రయాణించి, చిదంబరపు టెల్ల నాతఁడు సమీపించెను. మహోన్నత ప్రాకార గోపు రంబులతోడి యా దివ్య క్షేత్రము, దృగ్గోచరమగుటతోడనే, యాతఁడు సాష్టాంగ మాచరించెను. లేచి యాలయ దర్శనో త్సుకుఁడై ముందున కేఁగెను. అచటి యాగకుండములనుండి యెతెంచు హోమధూమములను, వేదధ్వనులను, వినుట

తోడనే, యాతనికి జాతిస్మరణము గలిగెను. "అయ్యో! అంత్యజుఁడనగు నాకిది దుర్గమము గదా! ప్రవేశానర్హుఁడను గదా!" యని భయపడి నిలిచెను. "ఈ నగరి ప్రహరిని దాఁటి లోనికేఁగిన, మూఁడువేల బ్రాహ్మణ కుటుంబములు గలవని వింటినిగదా! వారి నియతాచారములకు విరుద్ధముగ నేఁ బ్రవేశింపరాదు. ఇఁక లోనికేఁగుట కష్టము. నాకేమి గతి?" యని చింతించి, చేతులు జోడించి మ్రొక్కెను. పరమశివుని యందలి ప్రేమ పొంగి కట్టలు తెగి ప్రవహింపసాగెను. తరింప రాని సాగరమువలె, తన జాతి స్మరణముచే నేమియు సేయఁ జాలక దుఃఖించెను, కన్నీరు మున్నీరయ్యెను. ఆ భక్తశిఖా మణి మనోబాధ నెవరు వర్ణింపఁగలరు? "ఉమాపతియే నాకు గతి" యని చిదంబరపు టెల్లను వలగొనుచు, పగలు గడపి, రాత్రియుఁ దిరిగి, సొక్కి, సోలి "చిత్సభలో నానందతాండవ మాడు నా తండ్రి నెట్లు గాంచఁగలను" అని వాపోవుచు నడువఁజాలక నేలపైఁ బరుండి, భక్త్యావేశమున నిద్రించెను.

"కష్టముల కాలవాలమగు నీ జన్మమే శివదర్శన భాగ్యమునకుఁ బ్రతిబంధకమాయె" నని దుఃఖించుచు, నిద్రించు నా పరమభక్తుని భావమును సర్వోపగతుఁడగు జగదీశుఁ డెఱుఁగకుండునా! అట్లెన్నటికిని జరుగదు. * "రావే యీశ్వర కావవే వరద, సంరక్షింపు భద్రాత్మకా" యని కూయిడిన గజేంద్రుని రక్షింప సతికిఁ జెప్పక పాఱివచ్చిన భక్తపాలకుని సర్వేశ్వరుని చిత్తము భక్తులపాలిటి కల్పద్రుమమే

గదా!. *యముని కాలపాశంబులఁ జిక్కువడి, "శంభో మహాదేవా!" యనిన మార్కండేయుని యార్తధ్వనిని విని వినక ముందే, యార్తత్రాణపరాయణుఁడగు సదాశివుఁ డేతెంచి కాలాంతకుఁడై యాతని గాపాడుటయేగాక దీర్ఘాయువు నొసంగలేదే! కామారి యని ప్రసిద్ధిఁబడసియు, నా పుష్ప బాణు ననుగ్రహింపలేదే! బాణాసురునకు మిత్రుఁడై తోడ్పడఁడే! హాలాహలంబు లోకములను దహింప బ్రహ్మేంద్రాది మరుద్గణంబులు, హాహాకారంబులు గావింప, తనంతఁ దావచ్చి యద్దానిని మ్రింగి, లోకరక్షణమొనర్చిన కాలకంఠునకు ఆర్తార్తిహరణ దీక్షితునకు, భక్తావనము తప్పని సరియగుఁ గదా!

మైమఱచి నిద్రించు ప్రియభక్తుని మనోభావమెఱింగిన, నటరాజాతని భయముఁ బాఱఁద్రోలఁదలఁచి, యాతని స్వప్నమునఁ జిఱునగవుతోఁ గన్పడి, "యీ జన్మ దోషము నశించునటుల అగ్నిప్రవేశమొనర్చి, శుద్ధశ్రోత్రియులఁగూడి, నన్ను దర్శింపఁగలవు" అని పల్కెను. అట్లే చిదంబరవాసులైన మూఁడువేల దీక్షితుల స్వప్నమునందుఁ గన్పించి, "నా భక్తుఁడొకఁడు పురిబాహ్యదేశమున మద్దర్శనాకాంక్షియై పడి యున్నాఁడు. ఆతనికి మీరు జాతవేదుని సిద్ధపఱుపుఁడు" అని చెప్పి కనకసభను చేరెను.

నటరాజు నాజ్ఞ వినిన చిదంబరవాసులైన దీక్షిత బ్రాహ్మణులందఱు మేల్కాంచి, కనకసభాద్వారముకడ గుమి

గూడిరి. ఒండొరులు తమ తమ స్వప్న వృత్తాంతములను దెల్పికొని, పశుపతి యాజ్ఞను నిర్వహింప నిశ్చయించిరి. దయాలవాలుఁడగు నటరాజు పాదకమలములకుఁ బ్రణమిల్లి, యా శివాజ్ఞను నెఱవేర్పఁబూని, నగరి వెలుపలనుండు భక్త వతంసుని కడకేఁగిరి. గాఢనిద్రలో నుండు నా భక్తుని లేపి, "శివభక్తాగ్రేసరా! కైలాసనాథుఁడు నీ కగ్నిని సిద్ధపఱుప నాజ్ఞ యిడెను. అట్లే సిద్ధమొనర్చితిమి" అని పల్కిరి. నందనారు వారి సుధామధురవాక్కులను విని వారి పాదములకు మ్రొక్కి, "నే నిపుడు ధన్యుఁడనైతి"నని పల్కెను.

దక్షిణద్వార సమీపమున వేదవిదులు నిర్మించిన అగ్ని కుండమున జాతవేదుఁడు ప్రజ్వరిల్లుచుండఁ గాంచి, నందనారా యగ్నిదేవుని వలగొని, నమస్కరించి, నటరాజ శ్రీపాదము లను మనంబున నిడికొని, "హరహర మహాదేవ శంభో పాహి మాంపాహి" యనుచు నందు బ్రవేశించెను. వెంటనే యసత్య రూపమగు నాతని మాయాదేహము నశించెను. వక్షమున యజ్ఞోపవీతము, శిరమున జటాబంధముగల పుణ్యర్షి యై, కమలమునుండి వచ్చు కమలాసనునివలె, నగ్నినుండి యుత్థితుఁడై వచ్చెను. అపు డాతనిపై దేవర్షులు సుమ వర్షముఁ గురిసిరి. దేవదుందుభులు మ్రోఁగెను. ఆదృశ్యము గాంచిన నా వేదవిదు లాతనికి మ్రొక్కిరి. ఇతర శివభక్తు లాతనికి సాష్టాంగ మొనర్చిరి.

దీక్షితులందఱు వెంటనడువ, వైదిక ఋషియైన నంద నారు కనకసభలో తాండవమాడు పరమశివుని పాదములకు మ్రొక్క, వేగముగ నడచుచు నగరిఁజొచ్చి, యాలయపు దక్షిణ గోపుర ద్వారముఁగాంచి, యానందసాగర నిమగ్నుఁడై శివదర్శనాకాంక్ష మితిమీఱ, కనక సభాంగణముఁ జేరెను. అటుపిమ్మట నందనారు నెవరుఁ గాంచలేదు. అట నందనారుఁ గానక యందఱాశ్చర్య చకితులైరి. తన్నుఁజేరిన నందనారుని కర్మదోషముఁబాపి, తనలో లీనమొనర్చుకొని, యానంద స్థానము ననుగ్రహించి శివుఁడు తన భక్తపాలక బిరుదమును సార్థక పఱచుకొనెను.

"జాతి కర్మలు మోక్ష ప్రతిబంధకములు గావు."

# 19. తిరుక్కురుప్పతొండ నాయనారు

సకలజీవులకు మాతృదేవియగు నుమాదేవి శివాగమ విధుల ననుసరించి, తపమొనర్చి పరమశివు నాలింగన సౌఖ్యము నందిన పవిత్రస్థలము తొండమండలము. అందు మహోన్నత ప్రాకారములతోడి నగరములు పెక్కులు గలవు. నగర వాసులు నీతి నియతాచారములఁ దప్పక యనుసరింతురు. సప్త వింశతి కృషికులొక వైశ్యునకొనర్చిన వాగ్దానమునకై యగ్నిం బ్రవేశించి, సత్యాత్ములని ప్రసిద్ధిఁగాంచిన "పళయనూరు" అనునది యందొక గ్రామము.

ఒకానొక వైశ్యశిఖామణి భార్య పిశాచియై యుండెను. ఆమె వికారరూపముతో భర్తను భయపఱచుచుండెను. భీతి గ్రస్తుఁడైన శ్రేష్ఠి, పళయనూరున కేతెంచి, గ్రామికులకుఁ దన బాధను తెల్ప, వారు "నీ భార్య పిశాచి గాదు. సామాన్య వనితయే. నీవామెతోఁ గాపురము సేయుచుండుము. నీకెద్ది యేని బాధ గల్గిన సాయమొనర్ప మేమున్నారము" అని చెప్పి పంపిరి. ఆనాఁటి రాత్రియే యా పిశాచి సెట్టిని జంపి భక్షించెను. ఆ వార్త వినిన కాఁపు "లయ్యో! మన మాతనిఁ గాపాడ లేమైతి" మని యందఱు అగ్నికాహుతి యైరఁట. అట్టి సత్యాత్ములుండిన పళయనూరు తొండమండల మున కలంకారము. తొండమండల వాసులు చేరదేశముతో సంబంధ బాంధవ్యములు గల్గియుండిరి. ద్వాత్రింశద్ధర్మ

ప్రవర్తకురాలై శివునర్చించుచు, నుమాదేవి నివసించిన కాంచీపుర మీ మండల మహా నగరములలో నొకటియై ప్రసిద్ధిఁబడసి యుండును.

దేశవర్ణనము :—

ఉపత్యక, ఆరణ్యక, కేదార, సాముద్రిక, మరు, ప్రదేశములతో తొండమండలము పంచధా విభక్తమై యుండును. పర్వతములనుండి మాణిక్యములఁదెచ్చు సెలయేళ్లచట విరివిగఁ గలవు. ఆరణ్యక ప్రాంతములందు భ్రమరములు, కొంగ్రొత్త పూఁదేనియలఁద్రావి, మత్తిల్లి ఝుంకారము లొనర్చుచుండును. కేదార క్షేత్రములందు కట్టలు తెగునటుల గండుమీ లెగిరిపడుచుండును. బెస్తల కాంతలు సముద్రతీరములందు ముత్తెముల పులుగడిగి, యెండ బెట్టుచుందురు. ఉపత్యకలందు చెంచులు వరిని నాటుచు రమ్యమగఁ బాటలు పాడుచుందురు. ఆరణ్యక భూములందు జింకలు పశువులతోఁ జేరి, మేయుచుండును. పంట పొలముల లోని చిఱు చేఁపలను పక్షులు కాళ్లతోఁ బట్టి, తన్నుకొని పోయి తినుచుండును. బెస్తలు ముండ్ల చేఁపలను దైవ భావముతోఁ జూచి, యుత్సవము లొనర్చుచుందురు. వారివాహములు పర్వతాగ్రములపై వర్షింపఁ గొండగోఁగుఁ బూవులు బంగారపు పొడివంటి పుష్పరజమును రాల్చుచుండును. కాలువలలో వచ్చు ముత్తెములను బాలకులు త్రోసి, కేదార క్షేత్రములకుఁ

జేర్చుచుందురు. మొగలి తోఁపులతో నిండిన రేవులందోడలు ఏనుఁగులఁదెచ్చి, దించుచుండుట యచట పరిపాటి. ఉపత్యక లందలి గ్రామీణులు తేనియలఁ గలిపిన పిండిని, భుజింతురు. అరణ్య దేశవాసులు పాలతోఁజేర్చి వండిన నివ్వరి యన్నమును తిందురు. కేదార ప్రాంతవాసులు వరిబియ్యపు టన్నముతో నేతిని, చెఱకు రసమును వివిధ మధుర ఫలములను చేర్చి యాహారింతురు. పర్వతప్రాంత నివాసినులగు బాలికల పుష్పాలంకృత కేశపాశంబులఁ జేరి, తుమ్మెదలు కురంజి రాగముఁ బాడుచుండును. వనకన్యకలు మొల్లముల్ల మొదలగు పుష్పంబులఁ దాల్చి, చూడఁ జక్కగ నుందురు. చిలుకలు కేదారతీరములందలి మద్దిచెట్ల నావాసములగఁ జేసికొని, మధుర కూజితముల నొనర్చుచుండును. సముద్ర తీరములందలి మొగలి పూవుల పుప్పొడి యాకాశమున నిండి, స్వర్ణరజో భ్రాంతినిఁ గల్పించుచుండును.

మహావిష్ణువుచే సేవలు గొనిన సాంబశివుఁడు ఉపత్యక ప్రాంతమగు శ్రీ కాళహస్తిలో నిత్య నివాసియై లోకంబులను రక్షించుచుండును. దేవమాతలు కిరాతులతోఁ జేరి మ్రొక్క "తిరువిడశూరు" అను పవిత్రస్థల మీ మండలమునఁ గలదు. బోమెతలు దేవతా స్త్రీలఁ గూడి స్నానమాడు సెలయేళ్లు గల "తిరుక్కలిక్కుండ్రము" తొండమండలపుటుపత్యక క్షేత్రములలో మేటియై విలసిల్లు. అచటి యుపత్యకలకు మరు భూములకు మధ్యదేశమున లోకమాతయగు దుర్గాదేవ్యాలయ

యుండుగలదు. మహా విష్ణువు ఆటవికులతోఁ జేరి సర్వదా పత్ర పుష్పాదులఁ దెచ్చి పూజించు పరమశివుఁడుండు "తిరుముల్లైవాయిల్" అను దివ్య క్షేత్ర మీ మండలమునకు శిరోభూషణమై విరాజిల్లుచుండును.

గంగాదేవియే శివు నభిషేకింపఁ దలంపుఁగొని యావిర్భవించిన "తిరువ్వూరు" ఇచ్చోటనే గలదు.

ఆరణ్యక ప్రాంతముల కావల నుండు కేదార భూములందనేక నదీనదములు ప్రవహించుచు, క్షేత్రములకు జీవనప్రదములై విలసిల్లుచుండును. వసిష్ఠ భగవానుని కామధేను పుత్త్రికయగు శబల, నందికొండలలోఁ గార్చిన పాలు పాలారై యిచట ప్రవహించుచుండు. పాలారు ప్రవాహమునఁ బడి వచ్చు, చందనకాష్ఠము లాప్రాంతవాసులకు వంటకట్టియ లగుచుండును. పసిపాపలు తమ మృదుహస్తములతోఁ దాఁకగనే స్తన్యములఁ గార్చు మాతృదేవివలె, గ్రీష్మకాలమున కృషీవలు లా నదియందు కొంచెము ద్రవ్వఁగనే, నీరూరి కాలువలై ప్రవహించును. ఆ జలప్రవాహము శబ్దించుచు పల్లపు నేలలకు వేగముగఁబోయి చేరుచుండును. ఆ నీరు పొలములలో నిండగనే సేద్యకాండ్రు, గనిమలఁ ద్రెంచి నీటిని వదలుచుందురు. అచ్చటివారి సంతసమునకు మేరయే యుండదు. పొలములందు నాగళ్లతో దున్ను మహిషములధ్వని, నారునాటువారి యింపగు దేశీయ గీతధ్వని, కుప్పల నూర్చువారి పాటల నినాదము, ఏకమై దిగంతములకుఁ బ్రాఁకుచుండును.

చొఱచేఁపలు కాలువల కడ్డముగఁ బరుండి నీటి నడ్డగించు నాన కట్టలై యుండును. పల్లపు భూములందు గండుమీలొక దానిపై నొకటి పరుండి, గనిమకట్టలాయన నుండును. వరాల చేఁపలు కాలువలలో చిన్న కాలువలకై యొనర్చిన రంధ్రముల కడ్డు చెక్కలవలె పరుండి, నీటినాఁప కాఁపులు దిక్కు తెలియక పరుగిడుచుందురు, శంఖపుఁ బురువులు గర్భములఁ దాల్చినవియై శ్రమాపనోదనమునకు చెందామర పూవులలో నిద్రించును. అపుడవి పరివేషముతోఁ గూడిన పూర్ణచంద్రునివలెఁ గన్పించును. ఏపుగఁ బెరిగిన వరిప్రక్క చెఱకు, వాని పార్శ్వమున క్రముక వృక్షములు, వానిచెంత నారికేళ, కదళీ పనస చూతాది వృక్ష పంక్తులు, ఆ దేశమునకొక వింత శోభను గూర్చుచుండును. సారవంతములగు భూములు గల గ్రామములు ఆ దేశమున లెక్కకు మిక్కుటములు. గ్రామీణులతిథి పూజాధురంధరులు. సదాచార సంపన్నులు. యాగక్రియా కరణ దక్షులగు శ్రోత్రియ గృహస్థు లచట పెక్కురుందురు.

"తిరువల్లము" అను క్షేత్రమున అగ్నిపాదుఁడను రక్కసునకుఁ గృపసూపిన శివుఁడు సాటిలేని "తిరుమాల్పూరు" నందు ఆర్తార్తిహరుఁడై యుండును. గజాసురాంతకుఁడగు శివుఁడుండు "తిరుప్పాసూరు" అను దివ్యక్షేత్రము తొండమండలమునకు తలలోని మానికమే.

కేదార క్షేత్రముల నానుకొని, సముద్రతీర ప్రాంతము గలదు. అచట నుత్తర దక్షిణములుగ నుప్పునీటి కాల్వలు ప్రవహించుచుండును. అచటి యిసుక దిబ్బపై బెస్తలు గుడిసెలలో నివసించుచు వలల నల్లుకొనుచుందురు. బెస్తల కాంతలు తంగెడు పూవుల నలంకరించుకొని, యుప్పుకయ్యలలో నుప్పును దీయుచుందురు. కొంద ఱొకవైపు ముత్తెములం గొలిచి, కుప్పలు వోయుచు వర్తకులతో బేరములాడుచుందురు. వారు ముత్తియంబులను, పగడములను, ఎండు చేపల నమ్ముటలో నేర్పును చూపుదురు. వారు సాయం సమయములందు మంచినీటి బావుల కేఁగి, స్నానమాడి, పొన్న పూవుల నలంకరించుకొని, మఱలి వచ్చుచుందురు. బెస్తలు సముద్రపునీట మునింగి తెచ్చిన శంఖములను ప్రోవులువెట్టి, యమ్ముచుందురు. మొగలి చెట్లలోని పుప్పొడితోఁగూడిన పూవులు, తుమ్మెద బాటసారులకు చలిదిమూటలై యొప్పు చుండును. తీరమున విహరించు హంసలు అచటి పూఁదీగెల పుప్పొడియు వ్యాపించి, సన్నని తెల్లని యిసుకయోయనఁ దోఁపింపఁ జేయును. అట్టి తీరమున "తిరుఒత్తియూరు" "తిరుమైలాపూరు" "తిరువాన్మియూరు" అను దివ్య క్షేత్రములు గలవు.

సముద్రతీరమందలి పగడపు లతాగ్రములు పర్వతములలోని చందన వృక్షశాఖలతో మైత్రి యొనర్చుటచే రెండు నేకమైనట్లుండును. అట్టిచోట "మహాబలిపుర" మను క్షేత్రము

గలదు. కేదారములలోని మత్స్యము లుపత్యకలకును, అందలి హరిణములు పొలములకును రాకపోకలు సల్పుచుండును. అరణ్యములలోని కుందేళ్లు శిఖరాగ్రముల నెక్క, మేఘములు కేదారములలోని గడ్డి వాములపై నెక్కి, యాడుచుండును. బెస్తలు శంఖములను ముత్తెములను మత్స్యములను, గ్రామములకుఁ గొంపోయి, విక్రయించి వానికి బదులు గోరువంకలను కోళ్లను గొని తెచ్చుకొందురు. యదుకాంతల నడల ననుసరించు హంసలు కార్మిక స్త్రీల దేహచ్ఛాయఁబోలు మయూరము లొండొంటిఁ గూడి యాడుచుండు. అలలచే గట్టునకుఁ ద్రోయఁబడు ముత్యములు, క్రముక వృక్షములు రాల్చు పూవులఁగూడి యైక్యత నొందును. తొండమండలవాసులు జాతి ధర్మములను వీడక కష్టముల నెఱుంగక, సుఖవంతులై యుందురు.

అట్టి మండలమున కలంకారమై జనస్తుత్యమై నగరరాజమై, విలసిల్లునది కాంచీపురవరము. సకల ప్రాణికోటుల శ్రేయమును ధర్మాభివృద్ధి నొందించుచు శివునిఁ బూజించిన యుమాదేవి కా నగర మాటపట్టు.

వెండికొండయనఁ జెల్లు కైలాసమునఁ గొలువు తీరిన కరుణాసాగరుఁడగు శివుని కడకు, లోకరక్షణశీలయగు పార్వతి యేతెంచి, యాగమ రహస్యములఁ దెల్ప వేఁడెను. "సత్యపూజయే నాకుఁ బ్రీతి" యని కైలాసపతి నుడివెను. తపస్వినులలో నగ్రేసరయగు నా యుమాదేవి నిత్యపూజలచే మహే

శ్వరుని దృప్తిపఱుప నిశ్చయించెను. దేవీమనోభావం బెఱిఁగిన గణనాథుఁడు చిఱునగవుతో "నీ మనోభీష్టంబెద్ది?" యనెను. అందుల కార్య "నాథా! ఆగమోక్తవిధానమున మిమ్ముఁ బూజింప, నా హృదయమునఁ గోరికలు కొనలు సాగుచున్నవి. అయ్యది సాగునట్లనుగ్రహింప వేఁడెద" ననెను. అంత నా మహాదేవుఁడు "పార్వతీ! దక్షిణ దిశ యొనర్చిన తపఃఫలమా యన నుండు, కాంచీపురి నా కభీష్టమైనది. నన్నుఁ బూజింప మద్భక్తులు అచటఁ జేరుచుందురు. అన్నగరిలో నామ్ర వృక్ష మొండుగలదు. అదియే నా నివసించు స్థలము. నీ వచటికేఁగి నన్నారాధింపుము." అనిపల్కు నాదేవి సంతస ముతోఁ జెలులు వెంటరా, వివిధ పూజాద్రవ్యములఁగొని కాంచీ నగరి కేఁగెను. ఆమె రాక యెఱిఁగిన పద్మనాభుఁడను సర్పరా జెదురేఁగి నమస్కరించి "లోకమాతా! దాసుని యావాసము నధివసించి, ధన్యుంగావింప ప్రార్థించెద" నన నా దేవి వాని కోరికను మన్నించి, యాతని బిలద్వారము నావాసముఁ జేసి కొనెను.

పిదప నుమాదేవి యీశునిఁగాంచ, కుతూహలముతో తపము సేయఁబూనెను. ఈశానుఁ డామె తపంబునకు మెచ్చి, లింగరూపమున నామ్ర వృక్షముక్రింద ప్రత్యక్షముగా నా దేవి చేతులు జోడించి స్తుతించెను.

అచటి యేకామ్రలింగమును పార్వతి యథావిధి పూజింప నారంభించెను. ప్రత్యూషః కాలమున నుమాదేవి

కమలిని అనిందిత యను చెలులతో నంబికావనమున కేఁగి, పుష్పాచయ మొనర్చును. పిదప కంపానదీ జలమున స్నాన మాడి, చందన ధూపదీపాదులను సిద్ధమొనర్చుకొని వచ్చి, నాథు నర్చించును.

ఇట్లామె భక్తితో భవునర్చించుచుండ హృదయానంద మందిన శివుఁడామెను కటాక్షింపఁ దలఁచి యొక లీలాప్రవృత్తిఁ దన మదిని సంకల్పించెను. వెంటనే సప్తసాగరము లొకటియై నటుల కంపానదిలో జలము లోకభయంకరముగ నుప్పొంగెను. తన నిత్య స్నానవిధి కాప్రవాహ మంతరాయముఁ గల్పింప, దేవి తన మృదుహస్తమున దాని నాఁప యత్నించి, విఫల మనోరథ యయ్యెను. ప్రవాహము కాంచీనగరమును ముంచు చుండ, దేవి భీతిగ్రస్తయై యేకామ్రనాథుని కడకుఁ బరుగిడి వచ్చి, యా దేవదేవుని లింగమున తన కంకణస్తనాది చిహ్నము లేర్పడు నటుల గట్టిగ నాలింగన మొనర్చెను. ప్రియురాలి హఠాదాలింగనము ప్రియున కానందదాయకము గదా! వెంటనే పులకాంకురిత దేహుఁడై దేవికి నెదుట ప్రత్యక్షముగాఁగ, ఆ యాదిమ దంపతులను సకలలోకవాసులు మనంబు ద్రవింప స్తుతించిరి. కంపానదీ ప్రవాహము మెఱపు మెఱసినట్లు క్షణములోఁ దఱిగిపోయెను. యథార్థలాభ మనుభవించిన యేకామ్రనాథుని దేహమున, పార్వతీ కంకణ చిహ్నములు, స్తన చిహ్నములు శాశ్వతములై నిలిచెను.

మహాదేవ్యాలింగనముచే నేర్పడిన కోమల స్తన కర కంకణ ముద్రాస్థానములఁ దాల్చి కల్యాణ వేషమున నిల్చిన శివుఁడు "దేవీ! నీవభిలషించు వరముల నొసంగుదు" నన "నాథా! నా పూజావిధి నిరంతరాయముగ సాగునటుల దయ సేయుఁడు" అని దేవి నమస్కరించెను. అంత నా శంకరుఁడు "నాకు నీవొనర్చు పూజ యెప్పుడు నంతము చెందదు." అన నా దేవి "ఈ క్షేత్రమున ధర్మ మభివృద్ధిఁ గాంచునటులను, శివాపరాధ మొకటితప్ప యిచటి జనులు ఏదోష మొనర్చినను, నా తపః ఫలముగ వారు పాపరహితులై ముక్తులగునటులఁ గటాక్షింప వలయును" అని ప్రార్థించెను. శివుడట్లేయని యనుగ్రహించి, యిహపరసుఖ సాధక సూచకముగ ద్రోణ ద్వయధాన్యము నా దేవికి నొసంగెను.

ఏకామ్రనాథు నానందపఱచు వేషముతో కామాక్షీ దేవి నిత్యమా దేవుని బూజించుచు, గృహస్థుల పాలిటి కల్ప ద్రుమమై ద్వాత్రింశద్ధర్మములఁ బెంపొందించుచు, కామ కోటలో ప్రత్యక్షమైయుండు. కామాక్షీ నిత్యనివాసస్థలమగు కామకోటలో సంవత్సరమున కొకసారి ముప్విధముల నీలి పూవులఁబూచు నొక వృక్షరాజ ముండును. కోటకావల "ఉలహాణి" తీర్థము స్నానమాడువారి పాప పంకిలమును క్షాళిత మొనర్ప సమర్థమై యుండును. భూలోకమునుండి మోక్షలోకముఁజేరఁ గోరువారికి, నిచ్చెనవలె నుండు కామ కోటపై సూర్యచంద్రుల కిరణప్రసారము సూటిగ ప్రసరింపక

రొుక పార్శ్వమున వ్యాపించుట గాననగు. కాంచీపుర రక్షక యగు కాళి "తిరుప్పెరుంపేయర్ ఇరుక్కై" అను ఆలయమున వసించి, ప్రళయాదులనుండి యా నగరముఁ గాపాడుచుండును. అచట ఉదయాస్తమయ కాలములందు ఆలయపు నీడ వ్యాపింపక దానికే యంటియుండుట గాంచనగును. కాంచీపురి యందు కాంచి వృక్షములు మెండు. దేవర్షులు సిద్ధినందుటకై పూజించిన యాలయము లానగరిలో పరసహస్రంబులు గలవు. అచట కుందేళ్లు మత్తేభంబులఁ దఱుమ శక్తిగలవి. అచట మరణ ధర్మమే యెఱుంగని స్థానములు, ఇష్టసిద్ధి తీర్థములు, సర్వతీర్థాద్యనేక పుణ్యతీర్థములు గలవు. ఒక తూఁడున మూఁడు పూవులఁ బూచు పొన్నామర కొలనందు గలదు. పశ్చిమ వాహినియగు కాంచి నదిలో పగటిలో కలువలు రాత్రి తామరలు వికసించును. కామకోట యెల్లలో పాటలి వృక్ష చ్ఛాయను తనలో నిముడ్చుకొను నొకబావియు, త్రాగిన వారిని చంపు నీరుగల ఒక కొలను, లోఁజొచ్చినవారిని క్రోఁతు లుగ మార్చు నొక బిలము, స్నానమొనర్చినవారి వానర రూపముఁ బోకార్చు నొక గుంటయు, దేవతలతో మైత్రిఁ గల్పించు నొక గుహయుఁ గలవు. ఆ కామకోటను నెల్ల వేళలందు నేకదంతుఁడు శూలపాణి, భైరవుఁడు, షడాననుఁడు కావలి గాయుచుందురు. శివయోగ సాధకులు వసించు పేఁటలందు లెక్కకుమిాఱి గలవు. చండాయుధము చేఁ దాల్చి యయ్యనా రానగరిని రక్షించుచుండును. మహర్షులు యోగులు

చేరి, కొలుచు యోగపీఠము కామాక్షియుండు భోగపీఠము, రాత్రులను పగళ్లుగ నొనర్చు దివ్యవనము, స్పర్శమాత్రమున దేనినైన బంగారము చేయఁజాలు చింతామణియు నచట గలవు.

చింతమేదనుఁడను కిరాతుఁడు కామకోటను గాంచి చోళ చక్రవర్తికిఁ దెలుప, కరికాళచోళుఁ డచటి యరణ్యములను రూపుమాపి, విశాలమగు పట్టణమును, నిర్మింపఁ జేసెను. దాని చుట్టు ప్రహరిగట్టి యగడితను త్రవ్వించెను. అచటి జనులకు సకల వసతులను కల్పించెను. భూదేవికి కాంచివంటి కంచిలో సజ్జనుల హృదయములవలె కోట ద్వారములు విశాలములు. అన్నగరి వీధులు విపణి వీధులు, విశాలములై నిత్యోత్సవములతో విరాజిల్లుచుండును. మేఘమండలముఁదాఁకు సౌధములనుండి వ్రేలాడు ముత్తెపు సరులు గంగ, భూమికి దిగుచున్నదా యన నుండును. చంద్రశాలలపై నిపతాకలు మేఘమండలముతో మేలమాడుచుండును. సౌధాగ్రభాగములందుఁ గ్రీడించు యువతుల బంగారు బంతులు, తెగిన ఆభరణములు, వీధిలోఁ బడుచుండు నాదృశ్యము బంగరు వాన కురియుచున్నదా! యన నుండును.

వీధులందు వేదవిదుల గృహంబులు, క్షత్రియ వైశ్యాదుల సౌధము లిరుపార్శ్వములఁ గ్రిక్కిరిసి యుండును. దేవి యొసంగిన ద్రోణద్వయ ధాన్యమును కాఁపులు విత్తి, కోటి గుణితముగ ఫలితమునంది, ధర్మ తత్పరులై యతిథ్యభ్యాగత

సేవాతత్పరులై సుఖించుచుందురు. జనులు జాతిధర్మములఁ దప్పక గృహస్థాశ్రమ సుఖంబుల ననుభవింతురు. అందలి మార్గములు నిత్యోత్సవ నిత్య కల్యాణములతో రాజిల్లు చుండును. ఆలయములందు వేదఘోషలు శివస్తుతులే, విని పించుచుండును. కాంచీ నగర వాసులకు భయశ్రమదుః ఖాదులు లేవు. శ్రమయనునది గజగమనల కటీప్రదేశములకే, చలనము మేడలపైని పతాకలకే, పోలుట ఏనుఁగులకే, భయము వన్యఫలములకే, గాని జనులకు లేదు. సకల భువనము లందలి శ్రేష్ఠద్రవ్యము లీ కాంచీనగరమందే నిక్షిప్తము లాయెనా! యనఁ గన్పించును.

అట్టి నగరరాజంబగు కాంచీనగరమం దొకభాగమున శివభక్తుఁడగు చాకలియొకఁడు నివసించుచుండెను. అతని పూర్వులందఱును శివభక్తులే. అతఁడు త్రికరణంబులచే శివు నారాధించుచు, భక్తుల కోరికల నెఱుంగఁ జాలినవాఁడగుట "తిరుక్కురిప్పుతొండఁ"డని ప్రఖ్యాతిఁ బడసెను. అతఁడు కాంచీనగరమందలి చాకలివారికిఁ బెద్దయై, భక్తుల మాసిన వస్త్రముల నుచితముగ నుదికి యిచ్చుచు, వస్త్రమలినము నేగాక, జన్మమలాదులను తొలఁగింప సమర్థుఁడయి యుండెను.

శివుఁ డాభక్తుని భక్తజనసేవ నెఱింగి, వానిఁ గరుణింపఁ దలఁపుఁగొనెను. ముదుసలులకు దంతవీణావాదక్రమము నేర్పు టకో యన శీతకాలము వచ్చెను. అపుడు పరమశివుఁడొక బక్కచిక్కినవానివలె మాసిన బట్టలు దాల్చి, చలికి వడఁ

కుచు, ముకుందునకు నందరాని పాదకమలములను భూమిపై మోఁపుచు, నాయనారు బట్టల నుదుకు రేవువెంటఁ బోవు చుండెను. ఎవఁడో శివభక్తాగ్రేసరుఁ డేఁగుచున్నాఁడని యా చాకలి తలంచి, సమీపించెను. వినయముతో మ్రొక్కి, "అయ్యా! మీ దేహము కృశించి యున్నదేమి! మీరు ధరించిన వస్త్రము మాసియున్నది. దానిని దాసుఁడు క్షణ ములో నుదికి శుభ్రమొనర్చి తేఁగలఁడు" అనెను. అంత నా శివయోగి "ఓయీ! ఈ నా వస్త్ర మింతకన్న మలినము గాదు. నా కుండునది యిది యొకటియె. శీతబాధయు మిక్కుటముగ నున్నది. సూర్యాస్తమయమునకు ముందే దీని నుదికి యెండఁబెట్టి, యిత్తువేని గైకొనుము" అనెను. "అయ్యా! మీరు చెప్పిన గడువేల? ఒక గడియలోనే తెచ్చి యిత్తు"నన యోగి "సకాలములో నీవీయకున్న నా శరీర మును బాధించినవాఁడ వగుదువు" అని పలికి యా వస్త్రము నొసంగెను.

చాకలి యా వస్త్రముఁ గైకొని యావిరిఁబెట్టి యుదుకసాగెను. అంతలో శివుని మాయచే మేఘములు రోదసి నావరించి, కారుక్రమ్మి కుండపోఁతగ వర్షించెను. నాయ నారు యోగితోఁ జెప్పిన మాట యసత్యమగునని వగవ సాగెను. వర్షము నిలిచిన వస్త్రము నెండబెట్టి యీయవచ్చు నని తలంచెను. కాని వాన తగ్గునటుల గన్పింపలేదు. రవి యస్తంగతుఁడు కాఁజొచ్చెను. వాఁడా యోగికడ కేఁగి, "నేను

మాట తప్పితిని" అని నుడువుచు మూర్ఛిల్లెను. కొంతవడికా చాకలి తెలివినంది, "వర్షమూ విడువకున్నది. సాయంసమయము అతిక్రమించి, పగవానివలె రాత్రి యేతెంచినది. వర్షపాతమునకు ముందే మీ వస్త్రము నింటికిఁ గొంపోయి యెండ వేసి యుండిన, నా మాట నిల్చియుండెడిది. మందబుద్ధినైతిని. ఇమ్మహర్షి వస్త్రవిహీనుఁడై చలికి వడఁకుచున్నాఁడు" అని దుఃఖించెను. యోగి పాదములపైఁబడి "క్షమింపుఁ"డని ప్రార్థించెను. "ఇఁక చేయఁదగినది యొక్కటియ" యని తలఁచెను. పరుగిడుచుఁ బోయి తలను చాకిబండకుఁ గొట్టి మరణింప నిశ్చయించెను. అట్టి మనోనిశ్చయముతో పరుగిడెను. కాని యాతని శిరము బండను తాఁకుటకుఁ బూర్వమే, యుమాదేవి కంకణపు చిహ్నములుగల హస్తము వెడలివచ్చి, నాయనారుని తల నాఁపెను. వర్షమాఁగెను. కర్ణికార కుసుమ మాలికలం దాల్చి, యుమాసహితుఁడై మహాదేవుఁడు ప్రత్యక్షమాయెను. నాయనారు పులకితగాత్రుఁడై శివునకు సాష్టాంగమాచరించి, స్తుతించెను. పరమశివుఁడా భక్తునకు కైలాసావాసము ననుగ్రహించి తిరోహితుఁడయ్యెను. దాసుఁడు కైలాసపతి పాదారవిందములఁ జేరి సుఖించెను.

"సత్యదీక్షతోఁ గూడిన సేవ శివప్రీతి పాత్రమగును."

# 20. చండేశ్వర నాయనారు

సంతత ప్రవాహినియగు కావేరీనదీ జలములచే సమృద్ధమై, పాడిపంటల కిరవైన చోళదేశమున "శేంగనల్లూ"రను ప్రాచీన నగరమొండు మన్నియారు తీరమునఁ గలదు. అయ్యది మందాకినీ తీరమందలి యమరావతిని తల దన్ని, క్రౌంచదారణుఁడు వేలాయుధ ధారియునైన కుమారస్వామి శూరసంహారమున నిశ్చలుఁడై నిలిచినటుల యశఃకలితమై యొప్పుచుండును. అందు భస్మధారులు, నిత్యాగ్నిహోత్ర తత్పరులు వేదవిదులైన ద్విజు లతీంద్రియులై శివపూజాధురంధరులై నివసించుచుందురు. నక్షత్రములు నిశాకరునివలె, శిష్యవ్రాతములు గురునిఁ బరివేష్టించి వేదాదుల నభ్యసించుచుందురు. అట్టి గురు శిష్యుల కావాసంబులగు మఠము లానగరమందు లెక్కకు మించిగలవు. అందలి యాగశాలలలోని హోమధూమము లాకసమున కంటుచు ద్విజుల కర్మాసక్తిని వేవితములఁ జాటుచుండును. ధేనువు లూధస్సులనుండి క్షీరములను స్రవింపఁజేయుచు వీధులందు నడయాడుచు, నానగర రాజమునకు వింతశోభను చేకూర్చుచుండు. అచటి విప్రబాలురు గుర్వర్థము సమిధాహరణార్థము గ్రుమ్మరుచు, వేదాభ్యాసము నొనర్చుచుందురు. నదిలో స్నానమాడి యుదికిన చీరలను, జలపూర్ణ ఘటంబులను దాల్చి గృహముల కేతెంచు శోత్రియకాంతలమరావతిలో సంచరించు దేవర్షి కాంతలను మించియుందురు.

యాగము లొనర్చి పయనించు సోమయాజుల రథచక్రధ్వనులు, తమతమ హవిర్భాగంబులఁగొని స్వర్గమున కేఁగు దేవతల విమానధ్వనులు నేకమై రోదోంతరంబుఁ బ్రతిధ్వనింపఁజేయు చుండును.

ఆ నగరము నావరించియుండు కేదార క్షేత్రములు వికసిత సరోజములై ధాన్యలక్ష్మీ వాసస్థానములై యొప్పాడు చుండు. అచటి కుల్యలందు మత్స్యములు నిరాతంకములై సుఖనిద్రఁ గాంచుచుండును. క్రముకవనములు, కదళీషండం బులు, మార్గముల కిరువైపుల నేత్ర పర్వంబులగుచుండును. మల్లియలు, మొల్లలు విరియఁబూచి, పండు వెన్నెల లాయన తోఁపింపఁ జేయును. ఆ సౌభాగ్య గరిమను వర్ణింప మాటలు చాలవు.

చిదంబరమందలి కనకసభను స్వర్ణమయ మొనర్చిన "అనపాయచోళు"ని పూర్వులు పట్టాభిషిక్తులైన నగరరాజ ములలో నిది యొకటి. సంగీతమునకు రాగము, పాలకు రుచి, కన్నులకు తేజము, సద్భావమునకు పంచాక్షరి, ఆకాశంబునకు వర్షము, వేదమునకు శైవమువలె, నా నగరము భూదేవికి తిలకమై ప్రకాశించుచుండును.

అన్నగరమున కాశ్యపుఁడు "ఎచ్చదత్తనుఁడు" అను విప్రశిఖామణి యుండెను. కులీనయు పతివ్రతయునగు నాతని సతి యతిథిసేవా నిరతయై గృహస్థాశ్రమధర్మ నిర్వ హణమునందు భర్తకుఁ జేదోడువాఁదోడై యుండెను. ఆయమ

సదాశివ సేవాసక్త చిత్తమైయుండ పూర్వపుణ్య తపః ఫలమా యన గర్భవతి యాయెను. ఆమె గర్భశుక్తి ముక్తా ఫలంబై సత్యశైవ మార్గమునకు వన్నియందెచ్చు పుత్ర రత్నంబగు "విచారశర్మ" యనువాఁడు జనించెను. సిత పక్ష సుధాకరుని చందంబున నా బాలుఁడు దినదిన ప్రవర్ధ మానుఁడై యయిదవయేఁట, గురువుల నాశ్రయించి విద్యల నభ్యసించెను. పూవులందు దాఁగిన వాసనవలె ప్రాక్తనజన్మ విద్య లాబాలునియందు పరిమళించెను.

తల్లిదండ్రు లాబాలుని యేడవయేఁట నుపనీతుఁ గావించిరి. వెంటనే యా ద్విజన్ముఁడు గురువుల నాశ్రయించి వేదము నధ్యయనము చేసెను. ఆచార్యు లాబాలుని యసాధారణ మేధాశక్తికి, ధారణాశక్తికి నబ్బురపడసాగిరి. అనతి కాలములో నాబాలుఁడు పరమార్థము చిత్సభలో నానందతాండవకరుఁడగు నటరాజ పాదద్వంద్వ మని గ్రహించెను. పరమశివుఁడే పరమాత్మయను సత్యము నెఱింగి, యా బాలుఁడు సదా మనంబును శివునిపై నుంచి యా భక్తా వనుని సేవను మఱువకుండెను. క్రమముగ నాతని మనంబు శివమయ మాయెను.

ఒకనాఁడా విచారశర్మ యితర వైదిక విప్రబాలురఁ గూడి, వీధిలోఁ బోవుచుండ పచ్చిక బయళ్లమేయఁబోవు నాల మంద యొకటి వారి కెదురాయెను. అందొక గోవు తన్న దలించిన కాఁపరిని కొమ్ములతోఁ బొడువఁబోయెను. అపుడా

గొల్లవాఁ డాగోవును బడియతో చావ మోఁదెను. జాలిగుండె గల విచారశర్మ యాదృశ్యముం గాంచి, పరుగిడి గోవు నెదుట నిలువఁబడి వానిని చుఱచుఱఁజూచి, "ఓరీ! ప్రాణికోటులలో గోవు లుత్తమములు. గోదేహమున సర్వదేవతలు, సర్వ తీర్థములు మహర్షి సంఘములు గలవు. సర్వలోకమయ మైన దాని సర్వాంగములు పూజ్యములు. "గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ" యని బ్రహ్మర్షులు వక్కాణుదురు. శివునకు ద్రవ్యంబుల నొసఁగున దీ గోవే గదా! పరమశివుడు అహర్నిశము దేహమున ధరించు విభూతికి నిదియే గదా కారణము. శంక రుని వాహనమగు నందివంశమునకుఁ జెందినది గదా యీ గోవు; దీనిఁగొట్ట నీచేతు లెట్లాడినవి?" యని గద్దించెను. గోసంరక్షణ మొక పుణ్యకార్యమనియు, శివప్రీతి పాత్రమనియు నాతని మనంబునందోఁప, యాదవునిం గాంచి "నేఁటినుండి నీ వీ పశుగణమును మేపవలదు. నేనే వీనిని బీళ్లకుఁ దోలికొని పోయి పాలించెదను. నీ వింటికిఁ బొమ్ము" అనెను. ఆ బాలుని మాట కా గొల్లవాఁడు నివ్వెఱపడి మ్రొక్కి "అయ్యా! నా తప్పిదమును క్షమింపుఁడు. నేను క్రూరాత్ముఁడను. మీరే వీనిని పాలింప నర్హులు" అని పల్కి పోయెను. వెంటనే విచారశర్మ వైదికుల యనుమతిఁ బొంది, యెండిన పొలముపై తొలకరి చినుకులు పడినటుల వికసిత ముఖారవిందుఁడై గో సంరక్షణ భారమును వహించెను.

బ్రహ్మచారి విచారశర్మ కసగోలను త్రాళ్లను గైకొని, యాలమందను పచ్చిక బీళ్లకుఁ దోలికొని పోవుచుండెను. బీళ్లయందు పచ్చిక కొఱవడిన దుర్గమమైన తావుల కేఁగి, కసవుఁదెచ్చి, వానిని పోషింపసాగెను. గుంటలకు నీలాటి రేవులకు వానిని దోలికొని పోయి, నీటిని త్రావఁజేయుచుండెను. క్రూర మృగబాధ గలుగని విధమున రక్షించుచుండెను. ఆతపము తీవ్రముగనున్న వేళలందు ఆలమందను వృక్షచ్ఛాయలఁ జేర్చి కాపాడుచుండెను. పాలు పిదుకు వేళలకు ధేనువులను అయ్యాయి గృహంబులకుఁ జేర్చుచుండెను. మన్నియారు తీరమందేపుగఁ బెరిగిన ముల్లతీఁగలుఁగల తోఁపులందు మేఁపి, సమిధలను, అరణిని చేఁబట్టి, రాత్రి యేఁగుదెంచుటకు మునుపే వాని నిండ్లకుఁ దోలికొని వచ్చుట యాతనికి సాజము. ఇవ్విధంబున దినములు గడపుచుండెను. విచారశర్మ కాపుదలలో నయ్యవి చియ్యఁబట్టి లెస్సగ వృద్ధిఁగాంచెను. ముందు కంటె నా ధేనువులు క్షీరమెక్కుడుగ నొసంగసాగినవి. వాని గో సంరక్షణకు పౌరు లత్యానందభరితులై ప్రశంసింప సాగిరి.

గోకదంబక మాతని పాలనమం దత్యంతము సుఖించెను. ఇండ్లకడ వత్సములను వీడి యేతెంచుటచే వ్యసనాక్రాంతములయ్యు, నవి విచారశర్మను గాంచఁగనే యా విచారము వీడి, యాతని కడకేఁగి, నిలువంబడి, తల్లిని గాంచిన శిశువులవలె సంతసముతో నంభారవములు గావించెడివి. ఒడలు మఱచి యపారంబుగ క్షీరంబుల నిచ్చెడివి. అట్లు ధారాపాతముగ

స్రవించు క్షీరములఁగాంచి, విచారశర్మ యయ్యవి పరమేశ్వరు నభిషేకింప నుపయుక్తము లగునని తలంచెను. వెంటనే శివ పూజాసక్తి యాతనిఁ ద్వరపఱుప, నదీతీరమందలి సైకత స్థలిలో నేపుగఁ బెఱిగి పత్ర ఫలాదులతోఁ గూడిన యొక అత్తి చెట్టును సమీపించి, యిసుకతో చక్కని శివలింగమును నిర్మించెను. భవలింగముచుట్టు నొక యాలయమును గోపుర ప్రాకారాదులను సైకతముతోఁ గట్టెను. సమీపస్థ వృక్షా దులనుండి పత్రపుష్పాదులఁగోసి తెచ్చెను. పిదప పట్టణమున కేఁగి, క్రొంగ్రొత్త కుండలఁ గొన్నింటిఁదెచ్చి, యొక్కొక్క యావుకడ కేఁగి, మడియందలి యొక స్తనమును మాత్రమే తాఁకి, యందుండి కాఱు క్షీరంబులఁ గుండలు నింపి, తాఁగట్టిన యాల యముఁ జేర్చుచుండెను. జన్మాంతర సంస్కారముచే నుద్భ వించిన శివభక్త్యతిశయముతో శివు నా లింగమందు నా వాహనమొనర్చి, క్షీరములతో నభిషేకించుచుండెను. భక్త్యా విష్టుఁడగు విచారశర్మ భవార్చనకు ద్రవ్యాంతరములను సమ కూర్చి, యాయాసపడక, తన నిశ్చలప్రేమనే ద్రవ్యముగఁగూర్చి యర్చించి, నమస్కరించి, స్తుతించి సంతసించుచుండెను, అతని శివపూజకు ఘటంబులకొలంది క్షీరముల నిచ్చు ధేనువులు గృహంబులకేఁగి, యథాపూర్వము కొఱంతలేక గృహస్థుల కును క్షీరముల నిచ్చుచుండినవి; కాన వారు సంశయగ్రస్తులు గాకుండిరి.

ఇవ్విధంబున విచారశర్మ యన్వహము సహజముగ శివ పూజ నొక యాటగ భావించి చేయుచుండెడివాఁడు. ఒకనాఁ డొక బాటసారి యాతని క్షీరాభిషేకమును గాంచి, సత్య మెఱుంగనివాఁడై య్యూరిలోనికి వచ్చి, గృహస్థులఁ గాంచి, "యయ్యలారా! నదీతీరమున నొక బాలుఁడు ఆల పాలను బిదికి, వ్యర్థముగ నిసుకలోఁ బోసి యాడుకొనుచున్నాఁడు" అని పలికెను. ఆ పాంథుని మాటలను వినిన వైదిక గృహ స్థులు "వీఁడు పశువులను మేఁప నెఱుంగఁడు, బాగుగ మేఁపుదు నని చెప్పి మనల మోసగించి, పాలఁ బిదికి మంటిపాలొనర్చి యాడుకొనుచున్నాఁడు. వాని తండ్రికి నీ దుష్కార్య మెఱుఁ గింత"మని నిశ్చయించిరి. వారిచే నాహూతుఁడై యెచ్చదత్త నుఁడు గృహస్థులకడ కేతెంచెను.

శ్రోత్రియు లాగ్రహోదగ్రులై యచ్చదత్తుని కాంచి, "నీ సుతుఁడు పశువులను ప్రేమతోఁ జూచు వానివలెఁ బల్కి, మందను మన్నియారు తీరమునకు నడిపి, వాని పాలను పిండి, యిసుమునఁ బోసి యాడుకొనుచున్నాఁడు. ఇది యాటయా! ఘోరా!" యని గద్దించిరి. యచ్చదత్తనుఁడా మాటలకు భయపడి, "సోదరులారా! నా సుతుఁ డిట్టికార్యముఁ జేయు చున్నాఁడని నేనెఱుంగను. గతమును విస్మరించి మన్నిం పుఁడు. ఇఁక నిట్టి దుష్కృత్యము సాగకుండ చూతును. అట్టిది మరల సంభవించిన నద్దానికి నేను బాధ్యుఁడ నగు దును" అని పల్కి వారి నాశ్వసించి, యనుమతి నంది, గృహ

మున కేఁగి, స్నాన సంధ్యాదులఁ దీర్చికొని, పుత్త్రుని యవిచార కృత్యముఁ దలఁచి దుఃఖించెను. సుతునితో నా విషయముఁ బ్రస్తావింపక, స్వయముగ బ్రత్యక్షముగ నాతని దుశ్చర్య నెఱుంగఁ దలఁచి, యా రాత్రి నెట్లో గడపెను.

మఱునాఁడు విచారశర్మ యథారీతి పశువులను నదీతీరమునకుఁ దోలుకొని పోయెను. తండ్రి యాతనికిఁ దెలియని రీతి రహస్యముగ వెన్నంటెను. వాఁడామందను తీరమున మేఁపుటకుఁ దోలెను. అపుడాతని తండ్రి యచటి వృక్షములలో నొకదాని నెక్కి "పుత్త్రుఁ డేమిచేయునో" యని నిరీక్షించుచుండెను.

ఆ వటువు నదిలో స్నానమాడి, యథాపూర్వము ఆలయాదులను నిర్మించి సైకత లింగముఁ బ్రతిష్ఠించి, పత్ర పుష్పాదులఁ దెచ్చి, ధేనువులకడ కేఁగి క్షీరములను ఘటంబుల నింపి తెచ్చెను. పూజా ద్రవ్యంబులను పార్శ్వమున నిడికొని, శైవాగమ విధి ననుసరించి పూజింపఁ దొడఁగెను. సత్య భక్తితో శంకరు నావహించి, మధుర క్షీరప్రపూర్ణ ఘటంబుల నెత్తి ప్రీతితో నభిషేకించెను.

యచ్చదత్తనుఁ డాతని కృత్యములను వృక్షశాఖయందాసీనుఁడై గాంచెను. విచారశర్మ సత్యభక్తిని లోకంబునఁ జాటఁబూనిన శంకరుని కరుణచే నా యచ్చదత్తనుని జ్ఞానము నశించెను. విచారశూన్యుఁ డగుటఁ జేసి యాతని యాగ్రహము మితిమీఱెను. వెంటనే యాతఁడా వృక్షముదిగి, వేగముగ

పరుగిడిపోయి, యొక కాష్ఠముంగైకొని కొమరుని వీపుపై మోఁదెను. కోపముతోఁ దిట్టుచుఁ బలుమాఱులు గొట్టెను. విచారశర్మ మనంబు పశుపతియందు సంలగ్నమై యుండుటచే నా దెబ్బల నాతఁడెఱుంగఁడయ్యెను. మోఁదులువడియు భవార్చనమును వీడకుండుటఁగాంచి తండ్రి మఱింత కోపించి విడువక కొట్టసాగెను. జ్ఞానవిహీనుఁడైన యచ్చదత్తనుఁడు కోపము దిగ మ్రింగలేక కాలితో నా క్షీరభాండముఁ దన్నెను. "అభిషేక ఘటము నట్లు వ్రయ్యలుసేసి నేలపాలొనర్చి, యకార్యమొనర్చిన వారెవరా" యని తిరిగి చూచి, తన తండ్రియే యా పని చేసెనని తెలిసికొనెను. శివాపరాధి యెవఁడైనను శిక్షార్హుండేయని తలఁచి, యాతని పాదములను ఛేదింపఁ దలంపుఁ గొని, ప్రక్కనుండు కాష్ఠమును కుఠారముగఁ దలంచి యెత్తెను. అది నిజముగ గొడ్డలియాయెను. వెంటనే దానిఁగొని తండ్రి పాదద్వయము నొక్క వ్రేటునఁ దెగవ్రేసెను. మొదలు నఱికిన తరువువలె నాతఁడు నేలఁగూలి, విలవిల తన్నుకొని మరణించెను. అట్లా బాలుఁడు తన నిత్యపూజకుఁ గల్గిన విఘ్నముఁ బాపికొని మరల పూజలో నిమగ్నుఁడై నిత్యానంద మనుభవించుచుండెను.

నిశ్చలభక్తి ప్రపూర్ణుఁడగు నా బాలుని పూజకు సంతసించిన గౌరీనాథుఁడు వృషభవాహనారూఢుఁడై ప్రమథగణ సేవ్యమానుఁడై ప్రత్యక్షమాయెను. భక్తావన దీక్షితుని గౌరీనాథుని గాంచి, విచారశర్మ కరములు జోడించి, స్తుతించి యా దేవదేవుని పాదపద్మములపైఁ బడి మ్రొక్కెను. మహా

దేవుఁడు తన శ్రీహస్తమున నా బాలుని లేవనెత్తి, "కుమారా! నాకై కన్నతండ్రి పాదములను నఱికి యతనిం జంపితివి. కాన ఇఁక నీకు నేనే తండ్రిని." అని కరుణించి యా బాలుని వక్షము నకు హత్తికొని, శిరమును మూర్కొని సంతసించెను. పరమశివుని హస్తస్పర్శచే బాలుని మాయామయ శరీరము శివమయమై యుప్పొంగెను. బ్రహ్మాదులచే వినుతింపఁబడు నా పశుపతియం దాతని చిత్తము లీనమాయెను.

లోకరక్షకుఁడగు శంకరుఁడు విచారశర్మను భక్తగణా ధ్యక్షుఁడగునటుల అనుగ్రహించెను. తా ధరించు వస్త్రాభర ణంబులఁ దాల్చి, తాననుభవించు సుఖములకు సర్హుఁడై, చండేశ్వరపదవి నందునటుల వరమిచ్చి, తా ధరించిన కర్ణికార పుష్పహారము నాతని కంఠమునవైచి సంతసించెను. లోకా లోకవాసు లాదృశ్యముఁగాంచి, "నీలకంఠ, గంగాధర, శంభో" యని యుద్ఘోషించిరి. దేవదుందుభులు శబ్దించెను. దేవతలు సుమవర్షమును గురియించిరి. ప్రమథు లాడిరి. విచార శర్మ శైవమునకు రక్షకుండై భవుని శ్రీపాదంబులకు మ్రొక్కి చండేశ్వరపదవి నందెను.

లోకమెఱుంగ శివాపరాధ మొనర్చి, శివదాసునిచే నఱుకఁబడిన యచ్చదత్తనుఁడును శివుని కరుణకుఁ బాత్రుఁడై బంధుజాలముతో కైలాసముఁ జేరెను. విచారశర్మ భక్తిచే శివునకుఁ బుత్త్రుఁడై విలసిల్లెను.

"భక్తుల చర్య యెట్టిదైనను దుష్టముగాక తపోధికం బుగ గణింపఁబడును."



200 B



తిరునావుక్కరసు

# 21. తిరునావుక్కరసు

## (వాగీశుఁడు—అప్పరు)

మునైప్పాడు అను దక్షిణదేశమందలి యొక భాగము మిక్కిలి సారవంతమైనది. అందలి భూమికి ధూళిదోషము తప్ప వేఱు దోసఁగులేదు. ఆ దేశము బహుజనాక్రాంతము. నగరములందలి భవనములు సుధాధవళితములై యాకసము నంటుచుండును. అందు ప్రవహించు పెన్నానది వైణవంబులగు ముత్తియంబుల రాసులను, సౌరభ భరితంబులైన పుష్పజాలంబులను సర్వదా గొని తెచ్చుచుండును. అన్నదీమతల్లికి నుభయ పార్శ్వంబుల వరాల చేఁపలతో నిండిన కాలువలు పంట భూముల కాధారములై సాగుచుండును. అచట మధురంబులగు చెఱకులతో నిండిన తోఁటలు చూడ ముచ్చటగ నుండును. పంట పొలములందు వెన్నులనీనిన రక్త ధాన్యంబులు కుంకుమ పఱచిన నేలయో యన నుండును. క్రముక వనంబు లసంఖ్యాకములు, విరియఁ బూచిన ఎఱ్ఱ కలువలతో నిండిన తటాకంబులు దేశమందంతటఁ గలవు. గృహస్థులు అతిథ్యభ్యాగత సేవాతత్పరులు; అచటి సౌధములందు అగరు ధూపములు వాతాయన రంధ్రంబులనుండి యేతెంచి తెరువరులకు ఘ్రాణతర్పణ మొనర్చుచుండును.

అరఁటి గొలలు తొండములతోఁ గూడిన యేనుఁగుల మోములఁబోలియు, వరికంకులు అశ్వముఖములవలెను, పెద్ద

యెంద్రులు రథంబుల విధంబునను, కర్షకుల యఱపులు సైనికుల యార్భాటంబుల తెఱంగునను నెల్లెడల పోరునకై నిల్చిన చతు రంగసైన్యమా యన నచటి క్షేత్రములుండును. ఆభరణభారము భరింపఁజాలక యవనతలైన కృశాంగులవలె, పుష్ప ఫలాదు లచే వంగిన క్రముక వృక్షములు పినాకినీనదిపై వ్రాలి యుండును.

సూర్యాతపమును భరింపఁజాలనివై మహిషంబులు తటాకంబులలోఁ బొరలాడుచుండ, నందలి వరాల చేఁపలు వాని మడులకుం దగులఁగనే యయ్యవి క్షీరములను గార్చు చుండును. అచటి యుద్యానవనంబులు వసుంధరా దేవికి హస్తా భరణములా యన నుండును. అవ్వనజాలంబులపై భూదేవీ సౌందర్యగరిమను గాంచవచ్చునా యన రేవెలుఁగు వెలుఁగు చుండును. పంట పొలములలోని వరికుప్పలపై, మేడలపై మయూరములు, మేఘజాలంబులు సమముగ తిరుగాడు చుండును. లోకమున శైవ మార్గమును వ్యాపింపఁజేయ, సుందరమూర్తియు, తిరునావుక్కరసు నవతరించిన భాగ్యము నందిన దేశమే యయ్యది. దాని మహిమ నా దేవగురువు నైతము వర్ణింపఁజాలఁడు.

సకల సౌభాగ్యభాగ్యోపేతంబగు నా దేశమందు సార్వ కాలిక సుభిక్షంబులగు గ్రామములు పరస్సహస్రంబులు గలవు. అట్టివానిలో శివభక్తాగ్రేసరులతో నిండిన యూరు "తిరువా రూరు." శైవ సమయాచారము లచటనుండియే దిగ్దేశ

వ్యాప్తము లాయె నన నతిశయోక్తిగాదు. అందలి గ్రామిక స్త్రీల కటీభాగములనుండి, మేఖలలు ధ్వనితో దిగజాఱునేగాని, వారి శీలము గాదు. సౌధములనుండి క్రిందఁబడునది కళ్ళ్మల జలమేగాని, వాని సుధామరీచికలు గావు. గృహంబులతో నతిశయించి యభివృద్ధిఁగాంచునది ధర్మమేగాని, చార్వాక కుటుంబములు గావు. అట్టి కుటుంబములలో వెల్లాలజాతియందు 'కురుక్కెయ్యారువంశము' శీలమునకు పుట్టినిల్లై భాగ్యవంతమై పెంపొందుచుండెను.

దిగంత యశోవిశ్రాంతమైన కురుక్కెయ్యారు వంశమున ఆర్తబంధురక్షణపరుఁడు, అతిథిసేవానిరతుఁడు, సకల సద్గుణ రాశియునగు "పుగళనారుఁడ"ను వాఁడుండెను. మధుర భావయగు "మాదిని" యాతని గృహిణి. ఆ దంపతులకు పద్మమందు లక్ష్మివలె "తిలకవతి" యను పుత్త్రిక జన్మించెను. పిదప కొన్ని వత్సరంబులకు వారికి శాస్త్రపారంగతుఁడు, అజ్ఞానతమోహరభాస్కరుఁడు, తపోమార్గమునకు వన్నె దెచ్చు వాఁడగు "మరుళ్‌నీక్కియారు"డను పుత్త్రుఁ డుదయించెను. తల్లిదండ్రులా బాలునకు యథావిధి జాతకర్మాదుల నొనర్చిరి.

యుక్తవయస్సున నా బాలునకు తండ్రి చౌలకర్మను జరిపించెను. విద్యాభ్యాస ప్రాయము రా, నా కుమారున కతఁ డక్షరాభ్యాసముఁ గావించెను. ఆ బాలుఁడు తల్లిదండ్రుల కే గాక గురువునకును సంతసము నొడగూర్చుచు, జన్మాంతర సంస్కారవాసనా విశేషముచే సకలశాస్త్రముల ననతికాలమున

నేర్చెను. సితపక్ష చంద్రరేఖవలె నాతని జ్ఞానము దినదినాభి వృద్ధి నందెను.

తిలకవతీ కల్యాణము:—

మరుళ్ నీక్కియారు విద్య నభ్యసించుచుండ నాతని సోదరి యౌవనవతి యాయెను. అపుడామె వయస్సు ద్వాదశ వర్షములు. ఆనాటి యాచారము ననుసరించి యది వివాహయోగ్య ప్రాయమగుట పుగళునా రామె కుద్వాహ యత్నము చేయసాగెను. కలిప్పహయారను నాతఁడా కన్యను వివాహమాడఁ గోరి, కులవృద్ధుల నామె తండ్రి కడకంపెను. వరుఁడు వెల్లాల జాతివాఁడు, శివభక్తుఁడగుటచే నాతని కోరిక యాదరణీయమై యుండెను. కలిప్పహయారు యుద్ధనిపుణుఁడు; గాన ఆదేశపు రాజునకు సేనానియై ప్రసిద్ధివహించి యుండెను. వరుఁడు నవ యువకుఁడగు సుందరుఁడని యెఱింగి పుగళనారుఁడు తిలకవతి నిచ్చుట కంగీకరించి, కన్యావరణమునకు వచ్చిన పెద్దలకు తన సమ్మతిఁ దెల్పెను.

ఇట్లొకవైపు పెండ్లిమాటలు జరుగుచుండ, నౌత్తరాహులు తమిళ దేశముపై దండెత్తిరి. ప్రభువు నాజ్ఞను విని కలిప్పహయారుఁడు సైన్యంబులఁగొని కతిపయ దినంబులు పయనించి శత్రువులఁ దాఁకెను. ఉభయ సైన్యంబులకు పోరు ఘోరముగ సాగుచుండెను. ఇట పుగళునారు వ్యాధిపీడితుఁడై మరణించెను. సతీమతల్లి యగు నాతనిభార్య మాదని

పుత్త్రాదులను తృణప్రాయంబుగ భావించి పతితో సహగమన మొనర్చెను. మాతాపితృవిహీనులైన తిలకవతీ మరుళు నీక్కియారులు దుఃఖసాగరమున మునింగిరి. బంధువులు వారి నోదార్చి, పితృ కర్మలను పూర్తి గావింపఁ జేసిరి. రాజు నానతిచే పోరున కేఁగిన కలిప్పహయారు శత్రుబాణహతుఁడై రణభూమి యందే మరణించి వీర స్వర్గముఁ జేరెను.

కలిప్పహయారు శత్రునిహతుఁడై వీర స్వర్గముఁ జేరె నని తిలకవతి యెఱింగి, "నా తల్లిదండ్రులు నన్నా వీరునకీయ నిశ్చయించిరి. కాన నే నాతని దాననే. నా జీవముల నాతనితోఁ జేర్చుట మేలు" అని తలంచెను. సోదరి ప్రాణ త్యాగమును మరుళునీక్కియారు విని యాయమ పాదముల పైఁబడి దుఃఖించుచు, "తల్లిదండ్రులు మరణించిరి. ఈ దాసుఁడు నిన్నే మాతృదేవతగ భావించి జీవింప నిశ్చయించి యుండ, నన్నువీడి నీవును లోకాంతరమేఁగిన నాకు దిక్కేది? నేనును ప్రాణముల వీడి నిన్ననుసరింతును." అని నమస్కరించెను. తిలకవతి సోదరుని దీనవాక్కులను విని జాలిఁగొని ప్రేమ పాశ ములను త్రెంపఁజాలక, తాను మరణించిన, తమ్ముని బ్రతుకు సంశయాస్పద మగునని తన ప్రాణత్యాగ సాహసకార్యము నుండి విముఖురాలయ్యెను. తమ్మునకై జీవింప నిశ్చయించెను. వెంటనే తన యాభరణములఁ దీసివైచి యోగిని వేషముఁ దాల్చి, జీవులయెడ దయఁజూపుచు నింటియందే యుండి, తపో మార్గము నవలంబించెను.

మరుళునీక్కియారు శ్రమణుఁడగుట :—

పిదప మరుళునీక్కియారు దుఃఖమును వీడి సోదరితో వసించుచు క్రమముగ యౌవనము నందెను. అపుడాతనికి లోక మనిత్యమని తోఁచెను. కాన అతఁడు కుటుంబ ద్రవ్యమును వెచ్చించి, మఠములను, ధర్మశాలలను, చలిపందిరులను గట్టించి, యా ధర్మములు చిరస్థాయు లగునటుల భూదానము లొనర్చెను. అతిథులను తృప్తిపఱచుచు, కవిపండితులను సమ్మానించెను. ఇట్టి సత్కార్యములచే నాతనియశము నలుగడల నిండెను. జీవిత మశాశ్వతమని యెఱింగి యాతఁడు సర్వసంగ పరిత్యాగి యాయెను. సమయ సన్మార్గముల నెఱుంగు జ్ఞానమును మహేశ్వరుఁడు కరుణింపనందున. అహింసావ్రతమును ముఖ్యధర్మముగఁ గొనిన శ్రమణమతమే శ్రేష్ఠమని భావించి దాని ననుసరించెను.

ధర్మసేనుఁడని విఖ్యాతుఁడగుట :—

మరుళునీక్కియారు పాటలీపుత్రమున కేఁగి, యచట ప్రసిద్ధివడసిన జైనమఠముఁ బ్రవేశించెను. జైనాచార్యులు భవబంధ విమోచనమునకు జైనమతమే తగినదని బోధించిరి. సత్యమార్గముఁ గనుకొనుటకు జైనుఁడగుటయే శ్రేయమని, అదియే తత్త్వము నిరూపింప సమర్థమని తెల్పి, వారి శాస్త్రగ్రంథముల నాతనికి బోధించిరి. నిర్మల మనస్సుతో వానిఁబఠించి, యందాతఁడు పండితుఁడాయెను. వాని ప్రతిభకు జైనులు

సంతసించి యాచార్య పదవి నొసఁగి "ధర్మసేనుఁడు" అని పిలువఁ జొచ్చిరి. ధర్మసేనుఁడు జైనశాస్త్ర వాదములఁజేసి బౌద్ధుల నోడించి విజయముఁగాంచి జైనాచార్యులలో ప్రధానుఁ డయ్యెను.

సోదరుఁడు జైనాచార్యుఁడుగఁ బ్రసిద్ధినందుచుండు కాలమున తిలకవతి తపస్సుచే శివుని కరుణను పొంద యత్నించుచుండెను. ఆమె సోదరవాత్సల్యపాశమును ద్రెంపి పరమ మాహేశ్వరియయి, గడలినదికి నుత్తరతీరమందలి "తిరువదిహ" మను క్షేత్రముఁజేరి, తిరువీర స్థానేశ్వరుని దర్శించెను. అచట నిత్యము శివభక్తచిహ్నములఁ దాల్చి, యాయమ శివపరి చర్యకుఁ బూనెను.

తిలకవతి యుషఃకాలమున మేల్కాంచి, యాలయ ప్రాంగణమును చిమ్మి శుద్ధముచేసి, గోమయముతో నలికి చక్కఁగ ముగ్గులు పెట్టును. పిమ్మట పూఁదోటకేఁగి పూవులఁ గోసి, వివిధ మాలికలను గట్టి శివున కర్పించును. ఇట్లాయమ తదేకాగ్ర చిత్తమై సేవించుచుండినను, మనంబున తీఱని బాధ పీడింపఁ జొచ్చెను. "నా సోదరుఁడు జన్మాంతర పాప ఫలముచే జైనుఁడయ్యెనే" అను చింతయే యామెను మిక్కుటముగ బాధించెను. తపశ్శాలినియైన తిలకవతి యహరహము లోకైకనాథుఁడగు వీరస్థానేశ్వరునకు మ్రొక్కి "దేవర నన్ను దాసురాలినిగ గ్రహించి కృపజూపఁదలఁచుచో, పరసమయ గర్తములోఁబడిన నా సోదరు నుద్ధరింపుఁడు" అని

ప్రార్థింపసాగెను. జైనవ్రతినని చాఁపలు కట్టుకొనుచు, శిరోజ ములను హస్తముతోఁ బెఱికికొని ముండితుఁడగుట, నిలిచియే భుజించుట మొదలగు జైనాచారముల నాశ్రయించిన సోద రుని సత్యమార్గమునకుఁ ద్రిప్పుఁడు" అని మనసార కోరు నా భక్తురాలి స్వప్నమున నొకనాఁడు వీరస్థానేశ్వరుఁడు గన్పడి, "మనోదుఃఖమును త్యజింపుము. నీ సోదరుఁడు గత జన్మమున నన్నుగాంచఁగోరి తపంబొనర్చెను. అపుడాతఁ డొనర్చిన యల్పదోషఫలముగ జైనుఁడయ్యెను. వానికి శూలవ్యాధినిఁ గల్పించి నా దాసునిగఁ జేయుదును" అని కటాక్షించెను.

జన్మాంతర కృతపాపఫల మనుభవించు మరుళునీక్కి- యారును మరల శివదాసునిగ ననుగ్రహించుటకునై యా మహాదేవుఁ డాతని కుక్షియందు శూలవ్యాధిని కల్పించెను. రాజు తలచిన దెబ్బలకు కొఱఁతయా యనునటుల చంద్రశేఖరుని యిచ్ఛామాత్రమున నగ్నివలె శూల యాతని దహింపఁ జొచ్చెను. బడబాగ్ని, కాలకూటము, వజ్రాఘాత మొకటియై యేతెంచినట్లాధర్మసేనుని కుక్షిఁ జేరిన శూల శూలముతోఁ బొడిచి నట్లాతని బాధించెను.

ధర్మసేనుఁడు నిష్కారణముగ వచ్చిన శూలబాధను భరింపఁజాలక జైనమతమున నొకగదిలో మైమఱచి నేలఁబడి పొరలాడుచుండెను. తానేర్చిన జైనమంత్రబలముచే వ్యాధిని నివారించుకొనఁ జూచెను. మంత్రపఠనముచే నది తీవ్రరూపముఁ దాల్చెనేగాని, యిసుమంతయైన తఱుగలేదు. సర్పవిషము

తలకెక్కినటు లాతఁడు నురుఁగులు గ్రక్కుచు మూర్ఛిల్లెను. జైను లాతనిఁగాంచి "వీఁడీ బాధతో ప్రాణములు విడుచునట్లున్నాఁడు. ఏమిచేయుదము" అని విచారించిరి. చివరకు జైనాచార్యులు జలకుండికలోని జలమును హస్తముల గ్రహించి యభిమంత్రించి యాతనిపైఁ జల్లిరి. నోట నా జలమును కొంత పోసి త్రాగించిరి. మయూర పింఛములతో నాతని శరీరమును మాటిమాటికిఁ దడవిరి. కాని నిప్పులలోఁ బొరలించినటుల ధర్మసేనుఁ డధికముగ బాధఁ జెందెను. ఇఁక మన మంత్రతంత్రములు ఫలింపవని తలఁచి జైను లాతనిని విడిచిపోయిరి.

క్షణక్షణమునకు వ్యాధి తీవ్రరూపముఁ దాల్చుచుండ ధర్మసేనునకు సోదరి తలంపునకు వచ్చెను. వెంటనే తన వంటవానిని పిలిచి వానిని తన సోదరికడ కేఁగి తాననుభవించు యమయాతనఁ దెల్పి రమ్మని కోరెను. వాఁడు మనోవేగమున తిరువదిహకు వచ్చి, తిలకవతి యాలయోద్యానవనమున నుండునని యెఱింగి పుష్పవాటికను ప్రవేశించి యా దాసురాలిని గాంచి మ్రొక్కి "అమ్మా! నేను నీ తమ్ముఁడు పంప వచ్చితిని. నీ సోదరుఁ డిపుడు శూల వ్యాధిచే పీడింపఁబడి మరణశయ్య నున్నాఁడు. మరణాంతమైన యా బాధను గాంచి జైను లాతని చే విడిచిరి. ఈ విషయము మీ కెఱిఁగించి జీవించు మార్గమడిగి తెలిసికొని యా రేయియే మరలి రమ్మని "పంపెను. కరుణించి వచ్చి సోదరుని మృత్యువు

కోఁటలనుండి కాపాడు''మని ప్రార్థించెను. అంత నామె "అసన్మార్గగాములుండు జైన మతమునకు నే రాఁజాలనని చెప్పుము'' అని పల్కెను. వాఁడు వెంటనే మరలిపోయి తిలకవతీ తిరస్కారమును ధర్మసేనునకు నివేదించెను.

ధర్మసేనుఁడు తిలకవతి మాటవిని క్లేశపడి, "యిఁక నీ యవస్థలో నేనేమి చేయుదు'' నని మూర్ఛిల్లెను. అపు డాతనిపై శివుని కరుణాకటాక్షము ప్రసరించుటచే "ఈ నీచ జైనమతముచే నశింపని యీ వ్యాధి బాధను తొలగింపుమని సోదరి చరణములనే శరణమొందెద'' నని తలంచెను. అట్టి యాలోచన కల్గగనే యాతని బాధ కొంత యుపశమించి నట్లుండెను. వెంటనే తాను ధరించియుండిన చాఁపను, జల కుండికను, నెమలి పింఛముఁ బాఱవైచి, సోదరి కడకేఁగ నిశ్చ యించెను. అసత్యాంధకారమును వీడి, సత్యమార్గమను వెలుఁగును పొందుటకుఁ దగినట్లాతఁడు శ్వేత వస్త్రమును ధరించెను. ఒక సేవకుని సాయముతో నా రాత్రి బయలుదేఱి తిలకవతిఁజేరి యామె పాదములకు సాష్టాంగ మొనర్చి "వంశ ప్రతిష్ఠను కాపాడిన సోదరీ! శూలవ్యాధి కల్పించిన బాధను భరింపఁజాలక నినుఁ జేరితిని. మతాంతరోన్మాదముఁ బో నడచి, సన్మార్గముఁ జూపి కాపాడుము'' అని వేఁడెను.

తిలకవతి తన పాదములపైఁబడి దుఃఖించు సోదరునిఁ గాంచి, శివుని వాక్యములఁదలఁచి, చేతులు జోడించి, "దుష్ట మైన పరలక్ష్యమను పెనురొంపిలోఁ దెలియక దిగఁబడితివి.

అనేక బాధల ననుభవించితివి. లెమ్ము'' అనెను. అతఁడా వ్యాధి బాధతో నెట్లో లేచి మ్రొక్క నామె "నీకీ బాధ గలుగుట కా విశ్వనాథుఁడే కారణము. అనన్య చింతతో నా మహాదేవుని పాదముల నాశ్రయింపుము'' అతఁడా యుప దేశమున కంగీకరించి నమస్కరించెను. అంత తిలకవతి "తమ్ముఁడా! తిరువీరస్థానముఁ బ్రవేశింప యోగ్యతఁ గలిగించెద'' నని పంచాక్షరి నుపదేశించి సకల పాప పరిహారకమగు భస్మము నొసఁగెను. అతఁడది మహా భాగ్యమని గ్రహించి, యొడలినిండఁ బూసికొనెను. ఇంతలో నాతని యజ్ఞానాంధ కారముఁ దొలఁగింప నేతెంచెనా యన నినుఁడు తూర్పు కొండపైఁ బొడసూపెను.

తిలకవతి స్త్రీయధర్మము నెఱవేర్ప చీఁపురును గోమయముఁ జేఁదాల్చి, నీటికుండను గైకొని యాలయమున కేఁగెను. తమ్ముఁడు అక్క ననుసరించిపోయి యాలయమునకు ప్రదక్షిణ మాచరించి సాష్టాంగముగ మ్రొక్కెను. జకదేక రక్షకుని దయావిశేషముచే నాతని మనంబున దేవదేవునకు తమిళ పద్య మాలిక నర్పింప బుద్ధి యుదయించెను. వెంటనే యాతఁడు,

"యమునివలె బాధించు నీ శూలను నీవు నశింపఁజేయవైతివి.
నేను దుష్కార్యంబుల జేసినటుల నెఱుంగను.
రాత్రింబవళ్లు ఎల్లవేళల నిన్ను విడువక నమస్కరింతును.
నా కుక్షింజేరి పిడిచి పిండి బాధించుచున్నదీ వ్యాధి;
మహేశా! నేనీ బాధను సహింప లేకున్నాఁడను.
తిరువదిహాలోఁ బ్రత్యక్షమైయుండు వీర స్థానేశ్వరా! శివా!''

అను భావముఁగల "కూట్రాయినవార్ విలక్కి అహలీర్" అను పద్యమెత్తి భక్తిభావముతో నిండిన కవిత సెప్పి శివసన్నిధానమున నతఁ డాత్మార్పణము గావించెను. అట్లే ఆశువుగ పది పద్యములను "పదిహ"మను పేరఁ బాడెను. (ఇఁక పది పద్యములకు పదిహమని గ్రహింపవలయును.) ఆ పదిహము ముగియఁగనే యాతని శూల మాయమయ్యెను. పరమశివుని కరుణకుఁ బాత్రుఁడై యతఁడు జ్ఞానమూర్ఛ నంది భవ కృపానందసాగరమున మునింగెను. మేను గగుర్పొడిచెను. ఆనంద బాష్పములు వరదలాయెను. పరసమయాచార కూపమునఁబడి దురంతదుఃఖములఁ గాంచిన నే నీ శూల యుపశమించున ట్లేమి సేయఁగలవాఁడను. ఈ సదాశివుని కృప నెట్లు కీర్తింపఁగలను" అని పల్కుచు నతఁ డాశ్చర్య. రస నిమగ్నుఁడై దీర్ఘకాల మట్లే నిలువఁబడి యుండెను.

మత్కరుణచే సెందమిళమున మధుర వాక్కులతో నిండిన పదిహముఁబాడి స్తుతించిన నీవిఁక "తిరునావుక్కరసు" అను నామముతో సమస్త లోకములందుఁ గీర్తింపఁబడుదువు. గాక "యని యొక దివ్య వాక్కు ఆకాశమున వీతెంచెను.. తిరునావుక్కరసు ఆ దివ్యవాణిని విని "చాలకాలము పాప పంకిలమునఁ బడిన నన్ను పునర్జీవితునిగ జేసిన మహేశ్వరుని దయ నిఁక పద్యములఁ గీర్తింతును" అని పల్కి మ్రొక్కెను. "ధర్మసేనుఁడు శివభక్తుఁడై తిరునావుక్కరసు అగుటచే లోకములు జీవించెను." అని శివభక్తులు కొనియాడిరి. తిరువదిహ

వాసులు జైనుఁడు శివదాసుఁడగుటకు సంతసించి మంగళ వాద్యములను ప్రయోగించుచు నుత్సవ మొనర్చిరి. ఆనాఁటినుండి నావుక్కరసు త్రికరణములతో శివసేవ సేయసాగెను. అతని మేన శివచిహ్నములగు రుద్రాక్షలు విభూతియుఁ బ్రకాశించెను. స్వీయ కవితాధారతో శివుని నుతించుటయే యాతని నిత్యవ్రత మాయెను. సోదరి తిలకవతివలెఁ దానును శివుని సేవింపఁగోరి, దోఁకుడుపాఱఁ జేఁబూని, యాలయములందలి గడ్డి గాదములను దోఁకి శుద్ధము చేయుచు వచ్చెను. తన యిచ్ఛాపూర్తిఁ జేసి తమ్ముని యుద్ధరించెనని తిలకవతి శివదీక్షాపరురాలై వినుతు లొనర్చెను.

జైనుల పన్నుగడ :—

వాగీశుఁడు జైన సమయాచారములను త్యజించి శివ దీక్షితుఁ డగుటకుఁ బాటలీపుత్రవాసులైన జైను లాగ్రహిం చిరి. వారి విచారమున కంతము లేదాయెను. "ధర్మసేనుని శూలబాధను మనము నివారింపఁ జాలమైతిమి. ఆబాధ నశించు టకు శైవమే కారణమాయెను. ఇద్దాన మన మతమునకు వినాశకాల మాసన్నమాయెను. మన మతమునుండి పర మతములను ఖండించి, జైనమత స్థాపనాచార్యుఁడే యిట్లగుచో నిఁక మనగతియేమి?" అని సిగ్గునఁ దలలు వ్రాల్చిరి. "అధిపుఁ డీవిషయ మెఱింగిన మనలఁ గోపించి తాశైవుండగును. మన జీవన గౌరవములు మంటిపాలగును. అంతియగాక మనల

నాతఁడు దేశభ్రష్టులఁ గావించును. మన ప్రాణములకే ముప్పు వాటిలఁగలదు. ఇఁక చేయునదేమి" యని చింతించి చివరకు వారు వంచనచే ధర్మసేనుని తుదముట్టింప నిశ్చయించిరి. "ధర్మసేనుని సోదరి తిలకవతి శివభక్తాగ్రగణ్య. కావున నితఁడు కపటముగ మనలోఁజేరి, మన రహస్యములనేగాక మంత్ర తంత్ర రహస్యముల నన్నింటిని నేర్చికొని, యసత్యపు వ్యాధిని నటించి, యవ్యాధి మన మంత్రాదులచే తఱుఁగ లేదని పల్కి, మోసగించి శైవమునఁ జేరెను. జైనమతావధులను మీఱి మతదూషణమునకే యొడిఁగట్టెను." అని ప్రభువునకు నివేదింతము అని కూడ బల్కికొనిరి.

జైనుల మొఱ :—

శ్రమణ సన్న్యాసులందఱు ముందుగ మనమే రాజునకు నివేదింతమని యంధతమస్సువలె పయనమయి రాజు నంతఃపుర ద్వార దేశముఁజేరి లోనికి తమ రాకఁ జెప్పిపుచ్చిరి. భూపు ననుమతినంది సభామంటపముఁ బ్రవేశించిరి. నరపాలుఁడు వారికి మ్రొక్కి "మీకెద్దియేని యాపదగల్గెనా? మీ మోములు చిన్నవోయిన వేల?" అని ప్రశ్నించెను. వారు "పల్లవ మహారాజా! మా కందఱకుఁ బ్రధానాచార్యుఁడుగ నుండిన ధర్మసేనుఁడు కపట శూలవ్యాధిని నటించి, యేఁగి జటాధారులకు దాసుఁడయి మన మతమునే దూషించుచున్నాఁడు." అని తమ నిశ్చితార్థమును తు, చ, తప్పక విన్నవించిరి. అంత నా

పల్లవుఁడు. "ఏమీ! వ్యాధి సంభవించెనని యసత్యమాడి, మతమునే విడిచెనా! గురూత్తములారా! దీని కేమి చేయఁ దగును?" అనెను. హింసాకృత్యమును నిరసించు నా జైనులు "తన మూల సిద్ధాంతమును మంటఁగలిపి, హింసాపరుఁడై, మన మతమును వీడి యజ్ఞానియైన ధర్మసేనుని దుఃఖముల పాలొనరింపుఁడు" అని యీషణ్మాత్రము భయములేక పల్కిరి. వారి మాటలను విని కరుణా శాస్త్రమును మఱచిన పల్లవుఁడు మంత్రులవైపు చూచి, "ధర్మభ్రష్టుఁడగు ధర్మసేనుని బంధించి తెండు. ధనమున కాశపడక లంచములు గ్రహింపక వాని నెట్లని పట్టి తేవలయును" అని యాజ్ఞ యిడెను.

మంత్రులు నావుక్కరసును గొని తెచ్చుట:—

మంత్రులు రాజు నాజ్ఞను తలఁదాల్చి భటులను వెంటఁ గొని తిరువదిహామును చేరిరి. వారు తిరునావుక్కరసును గాంచి "ధర్మసేనా! భూపాలుఁడు నిన్ను వెంటఁ గొనిరమ్మని శాసించెను. బయలుదేఱు"మనిరి. వాగీశుఁడు వారింగాంచి, "నే నెవరికిని దాసుఁడఁ గాను. అంతకునకును భయపడను. నరకము వ్యాధులును నన్ను బాధింపఁజాలవు. శంకరునకుఁ దప్ప నే నెవరికిని మ్రొక్కువాఁడఁ గాను. సర్వకాల సర్వావస్థలయందు నాకు సంతసమే గాని వెతలు లేవు. ఎవ్వారికిని లొంగని పరమేశ్వరునకు లొంగి దాసుఁడనై యున్నాఁడను. పరదాస్య చింత నాకు లేదు. శివుని పాదపద్మములనే యాశ్ర

యించితి" అను నర్థముగల "నామార్కుం కుడియల్లోం" అను తిరుపదిహామును పాడి, మీకు లొంగువాఁడగాను. శివునకు దాసుండనై యున్నాఁడను" అని యెదిర్చి పల్కెను. అంత వారాతని పాదకమలములపైఁ బడి, "మీ రిట్లు పల్కిన మా యుద్యోగము లూడిపోవును. కరుణింపుఁ"డని ప్రార్థించి, వెంటఁ గొంపోయిరి. "శంకరుఁడే నాకు దిక్కు" అని తలంచుచు నావుక్కరసు వారి ననుసరించి యేఁగి పల్లవ రాజును గాంచెను.

నావుక్కరసుని సున్నపు రాశిలోఁ ద్రోయుట:—

పల్లవరాజు చిఱుచాఁపలను కటియందు ధరించిన జైనులఁ గాంచి, "వీని కేమి శిక్ష విధింపవలయునో చెప్పుఁడు" అనగనే, యా మూఢులు భయ మిసుమంతయు లేక "వీనిని సున్నపు గదిలో త్రోయుఁ"డనిరి. రాజట్లు సేయ నాజ్ఞ యిడెను. వెంటనే రక్షకభటు లాతనిఁ గొంపోయి, విరియబోసిన సున్నపు గదిలోనికిఁ ద్రోసి, కవాటము బంధించి కావలి కాయుచుండిరి.

నావుక్కరసు చిదంబరములోని కనకసభా తాండవ నృత్యకరుని నటరాజేశ్వరుని శ్రీపాదచ్ఛాయను స్మరించుచు లోనికేఁగెను. సదాశివ నామోచ్చారణదక్షులకు సంతాపము లేలగల్గు? నిను నమ్మినవారికి నాశము లేదుగదా!" యని స్తుతింపసాగెను. ప్రలయాగ్నివలె నత్యుష్ణ భూయిష్ఠమగు నచ్చోటు శివుని కరుణచే మలయమారుతముతోడి వసంతమా యన, శీతల జలపూరిత తటాకమా యనఁ దోఁచెను. శీత

మయూఖుని వెన్నెలలో వీణాధ్వనియా యన నా భక్తున కచట నానందము గల్గెను. అప్పుడతఁడు "నీ పాదచ్ఛాయలో నిట్టి సుఖము గల్గె (మాసిల్ వీణయుం మాలై మదియముం వీశుం తెన్ఱ్రిలుం......") అను పదిహాము పాడి స్తుతించి సంతసించుచుండ నేడు దివసంబులు కడ చనెను. ఎనిమిదవ నాఁడు రాజు జైనులఁ బిలిచి సున్నపు గదిని తెఱచి చూడుఁ డన వినీలమేఘమో యన నుండు గదిని తెఱచి చూడ, శివానందసాగరమగ్నుఁడై నటరాజ శ్రీపాదపద్మములందలి సుధా మధుపానముచే మత్తిల్లి, సుఖార్ణవమునఁ దేలియాడు మనంబుతో నెట్టి కొఱంతయు లేక సజీవుఁడై యుండు నా భక్తాగ్రేసరుని గాంచి, "వీఁడు కొంచెమైనను బాధఁజెందక యున్నాఁ డిదేమి యాశ్చర్యము" అని తలంచిరి.

పాలలో విషముఁ గలిపి యిచ్చుట:—

జైనులు రాజుంగాంచి, "నావుక్కరసు జీవించుటలో నాశ్చర్యము లేదు. ఇతఁడు మన శాస్త్రములఁ జదివి నేర్చిన మంత్రశక్తితో జీవించియున్నాఁడు. వీనికిఁ దీవ్రతర దండన మొసఁగినఁగాని చావఁడు. కాలకూట విషము నొసంగఁదగు" ననిరి. జైనమత మదోన్మత్తుఁడగు నా ప్రభువు "అట్లే చేయుఁ"డ ననెను. కర్కశహృదయులగు నా దురాత్ములు విషమును పాలలోఁగలిపి త్రాగుమని భక్తవతంసుని ముందు పెట్టిరి. కంఠే కాలుని భక్తులకు విషము అమృతము నొక్కటియె. కాల

కంఠుఁడు విషము నమృత మొనర్చెఁగదా! యనుచు వాగీశుఁడు ఆ క్షీరములను గుటగుటఁ ద్రాగెను. అద్దాన నాతనియం దే వికారము గానరాదయ్యె. పూర్వము క్షీరాబ్ధిమథనావసర మునఁబుట్టి సకలలోకములకు భయంకరమై దేవాదులఁ జీకాకు పఱచుచు విజృంభించిన కాలకూటముఁ జేపట్టి "భయపడ కుఁడు" అని దేవతల కభయమిచ్చి మ్రింగిన భూతేశున కది యమృతమాయెనన, భక్తున కా యల్పవిషము అమృతమే యగుటలో నాశ్చర్య మేమిగలదు? (పొడియార్కుం తిరు మేని......అడియార్కు నంజు అముదం ఆవదుదాం అద్భు దమో.) శరీరమున నిండ భస్మముఁ దాల్చిన శివునకు విష మమృతమైనచో, నిహలోక ప్రాణి జాలంబులెఱుంగరాని పశు పతి దాసులకు విషము అమృతమగుట అద్భుతము కాదు.

ఏనుఁగుచేఁ ద్రొక్కించుట:—

విషముం ద్రాగియు సజీవుఁడై యుండు నాతనిఁ గాంచి, జైనులు "ఇతనికి విషముఁగూడ యమృతమైనది. వీఁడింక జీవించిన మన కంత్యకాలము దాఁపురించినట్లే" యని భీతి గ్రస్తులై వసుధాధిపునిఁ గాంచి "విషమిచ్చినను వీఁడు మన శాస్త్రములనుండి గ్రహించిన మంత్ర రహస్యములచేఁ జావ కున్నాఁడు. వీని నిట్లు జీవములతో వదలిన మా ప్రాణములకు మీ రాజ్యమునకుఁ గీడు గల్గును" అన రాజు వీనిఁ జంపు నుపాయ మెద్ది?" అని వారినే యడిగెను. వారు "మీ మదపుటేనుఁగు

నీతనిపై నడిపి, చంపుట యుక్త''మనిరి. అతఁడట్లే ''యాలా నమునుండి గజముఁ దెచ్చి చంపింపుఁ''డని యాజ్ఞాపించెను.

భటులు పర్వతమువంటి మత్తేభమును వాగీశునిపై విడిచిరి. అది దిక్కులు పిక్కటిల ఘీంకారము సేయుచు, గజశాలలను గూలఁద్రోసి, మార్గమునఁగల సౌధములను, ప్రహరులను కాలఁదన్ని, విరియఁజేయుచు, కాలిగొలుసులను త్రెంపి కొని పాదఘాతములచే భూమిని దద్దరిల్లఁజేయుచు, మహావాతముచే మండు కాలాంతాగ్నివలె విజృంభించుచు పరుగిడెను. మావటీంద్రు దానిని నావుక్కరసుపై నుఱికించిరి. అక్కరి తొండమును వీఁచుచు నాభక్తునిపైఁబడెను. ''తెల్లని విభూతిని చందన తిలకముఁ దాల్చిన శివా! వీరస్థానేశ్వరా! నేను నీ బంధువును గదా! కాన గజాసురాంతకుఁడవగు నీదయచే దీనికి నే భీతిల్లను'' అని తమిళ పదిహముతో నా భక్తుఁడు స్తుతించెను. (వెణ్ చందనచ్చాందు......)

అమ్మదకరీంద్రము నావుక్కరసునకుఁ బ్రదక్షిణ మాచరించి వ్రాలి మ్రొక్కి, వెనుఁదిరిగిపోవుచుండ మావటీంద్రుఁడంకుశముతోఁ బొడిచి యాతనిఁద్రొక్కి చంపుమని సైగఁజేసిరి. అది లొంగక వారిని తొండముతోఁబట్టి, నేలఁబడవైచి త్రొక్కి చంపెను. అచట గుమిగూడియుండిన శ్రమణులఁగాంచి యది వారిని తఱిమెను. దిక్కులకుఁ బాఱినవారిని వదలక బాధించెను. కొందఱిని పాదములతోఁ ద్రొక్కుచు, మఱికొందఱిని తొండమునఁ బట్టి విసరివైచుచు, దంతములతోఁ గ్రుమ్మి చీల్చుచు

చీకాకుపఱచెను. మందరము సాగరముంబోలె నయ్యది యా నగరమును కలంచి వైచెను.

సాగరమునం ద్రోయుట :—

చావంగ మిగిలిన జైనులు, మతిమాలినవారై, యేమి చేయుటకును దోంపక తేని పాదములపైంబడి యేడ్వంజొచ్చిరి. మహేంద్రపల్లవుండు వారింగాంచి, "యింక వాని నెట్లు శిక్షింపం దగును" అనెను. వారు "ప్రభూ! వాండు మంత్రశక్తితో గజమునేలొంగం దీసికొనెను. మమ్ము బాధించెను. అగ్ని నశించిన ధూమమూఱు నట్లాతండు మరణించిననే గాని మీా యపకీర్తి తొలంగదు. కావున వాని నొక పెనుబండకుంగట్టి, సముద్ర మధ్యమునం ద్రోయవలయు" ననిరి. వెంటనే రాజు భటులం బిలిచి "మన మత విరోధియైన ధర్మసేనుని జాగరూకతతోం గొంపోయి, సముద్రమునం ద్రోసిరండు." అని యాజ్ఞాపించెను. హింసాకృత్యమును సొంతముగం జూడంగోరి జైనులు భటుల ననుసరించిరి. నావుక్కరసు నిశ్చింతుండై సంతసమునం బోయెను. రాజు నానతిని ననుసరించి భటులాతని నొక బండకుం జేర్చికట్టి, పడవపైం గొంపోయి, సాగర మధ్యమునంద్రోసి వచ్చి రాజున కవ్వార్త నెఱింగించిరి.

ఱాయి పడవ యగుట :—

సత్యసేవా ధురంధరుండగు నావుక్కరసు సాగరమునం బడియు, "ఏమియైననేమి? దాసునకు జగత్పతియే గతి.

స్మరింతు ''నని ధృఢచిత్తముతో (''శొట్రుణై వేదియర్ శోది వానవర్...నట్రుణై యావరు నిమశ్శివాయమే'') వేదముల నెఱింగిన శివా! జ్యోతిస్స్వరూపుఁడైన దేవుని బంగరు పాద ములను స్మరించి ప్రెుక్క ఱాతితోఁగట్టి సముద్రమునఁ ద్రోసి నను, సాయమై యుండునది 'నమశ్శివాయ'యను పంచాక్షరియే గదా!'' అను పాటలో బ్రహ్మాదులచేఁ గీర్తింపఁబడు పంచా క్షరిని నావుక్కరసు స్మరింపఁగనే యా ఱాయి తెప్పవలెఁ దేలెను. అతని దేహమున బంధించిన త్రాళ్లు తెగిపోయెను. అప్పరా బండపై నెక్కెను. పాప పుణ్యములను పాశములను మమత యను ఱాతితోఁ జేర్చికట్టి జన్మాంతరమను సాగరమున దేహినిత్రోయ, తీరమెక్కించునది పంచాక్షరియేగదా! అట్టి పంచాక్షరి యప్పరును తీరముఁ జేర్చుటలో నాశ్చర్య మేమి గలదు.? సముద్రరాజు వరుణుఁడు అప్పరును తరంగ హస్త ములతో నెత్తికొని పోవుట కాతఁ డెట్టి తపము చేసెనో! శిల పల్లకిగా దానిపై నాసీనుఁడైన యప్పరును వరుణుఁడు మోసి తెచ్చి, తిరుప్పాదిర్ పులియూరు (కడలూరు) తీరముఁ జేర్చెను.

నావుక్కరసు దరిఁజేరుట నెఱిఁగిన శివభక్తులు వచ్చి యాతనిఁ గాంచి ''శంభో శంకర''యని ఘోషించిరి. వాగీ శుఁడు వారితో నచటి శివాలయమునకేఁగి భక్తితో శివుని సేవించి, ''కన్న తల్లివి తండ్రివియై దాసున కెదురుసూడని సాయము గావించితివి. శివా.'' (ఈన్డ్రాళుమాయి యనక్కు మెందయు మాయి...) అని స్తుతించెను. అచట కొన్ని దివ

సంబులుండి పిదప "తిరుమాణిక్కుళి" "తిరుత్తినై నగరము" నందలి శివునకు మ్రొక్కి గడిలి నదిని దాఁటి, మరల తిరువ దిహామును చేరెను.

తిరువదిహా ప్రజల సుస్వాగతము:—

క్రూరులగు జైనులు పెట్టిన నానా హింసలనుండి తప్పించుకొని, సాగరముఁ దరించి వచ్చిన నా తమిళ రాజకవిని ప్రజలు గాంచిరి. నగరవాసు లుత్సాహముతో గృహముల నలంకరించి వీధులందు తోరణములను, క్రముక కదళీవృక్షములను స్థాపించి యలంకరించిరి. గృహాంగణములందు పుష్పమాలికలతో, తోరణములు గట్టిరి. రాజమార్గములను చందనోదక సిక్తములఁ గావించిరి. బంగరుపొడిని పూవులను పేలాలను చల్లిరి. మంగళవాద్యములు సప్తస్వరములను దిక్కుల నింపుచుండ, పౌరులు పురమునకు వెలుపల వాగీశునకు స్వాగత మొసంగిరి. స్వచ్ఛ విభూతితోఁ బ్రకాశించు దేహము, రుద్రాక్ష మాలికలను దాల్చిన వేషము, సదాశివాసక్తమైన మనంబు, భక్తి ప్రేమలచే నానందబాష్పములను రాల్చు కనుఁగవ, మధుర గీతముల నాశువుగఁ జెప్పు వాక్కుగల వాగీశుఁడు పౌరులతో తిరువదిహామునుఁ బ్రవేశించెను.

శిరమునఁ గరములు గీలించి కరుణామూర్తియై వచ్చు నా భక్తునిఁ గాంచి పౌరులు "ఇట్టి భక్తాగ్రేసరుని శ్రమణులు క్రూరులై బాధించిరి గదా" యని కన్నీరు మున్నీరుగఁ

గార్చి, యాతని పాదములపైఁబడి మ్రొక్కిరి. నగరవాసులు చుట్టి బలిసి రా వాగీశుఁ డాలయముఁ బ్రవేశించి, సాష్టాంగ మాచరించి, "అక్కాలమున భక్తి విరహితుఁడనైన నే నిట్టి శివుని నల్పునిగ భావించితినే" యని పద్యములతో స్తుతించెను. అచట కొన్ని దినంబు లుండి గడ్డి గాదములఁ దోఁకుచు తన సహజ సేవను చేయుచుండెను.

శ్రమణుల బోధచే పాపకార్యముల నొనర్చుచు వచ్చిన మహేంద్రవర్మ జన్మాంతరకృతంబగు నల్ప పుణ్యవశముచే పూర్వభవ పాశ దుఃఖములను వీడి, తిరువదిహామునకు వచ్చి, వాగీశుని పాదములకు మ్రొక్కెను. మహాదేవుని శ్రీపాదముల నాశ్రయించెను. మతివిహీనుఁడై జైన బోధలను వినిన పల్లవుఁడు వాని యసత్యతను గుర్తించి శివసత్యము నెఱింగి, జైనమఠములను గృహములను పడఁగొట్టించి తిరువదిహాములో గుణేశ్వరాలయమును గట్టించి శైవుఁడై విఖ్యాతిఁ బడసెను.

తమిళభాషా చక్రవర్తి యగు నావుక్కరసు వివిధ శివ క్షేత్రములకుఁ బోయి, స్వీయ కవితచే స్తుతింప నాశపడెను. తిరువెణ్ణైనల్లూరు, తిరుకోవలూరులను దర్శించి శివుని పద్యములతో స్తుతించి తిరుపెణ్ణాకడమును చేరెను.

ముద్రా ధారణము :—

వాగీశుఁడు మేఘముల నంటు మేడలు గల్గి, వేదపఠన పాఠన చణులగు వైదికులుండు నాయూరునకేఁగి, "తిరు

త్తూంగానై మాడ కోయిల ''లో నుండు భవునింగాంచి, ''శ్రమణ సంపర్కము గల్గిన యీ శరీరముతో నే జీవింపఁ జాలను, నీ ముద్రల నీ శరీరమునకుఁ దగిల్చి పవిత్రత నాపాదించి నిల్పుము. నాథా '' అను పద్యమాలికలతో శివుని నుతించెను. శంభుని కరుణచేఁ బరులకుఁ దెలియని రీతి నొక శివగణాధ్యక్షుఁ డేతెంచి యా భక్తుని భుజములపై వృషభ శూల చిహ్న ములను ముద్రించిపోయెను. నావుక్కరసా సంభవమున కత్యం తము ముదితుఁ డయ్యెను. స్మరణ మాత్రమున నట్లనుగ్ర హించిన పరమేశ్వరుని కరుణఁదలఁచి, యానంద బాష్పములు గాఱ ''నీ దయచే బ్రతికితి ''నని సాష్టాంగ మొనర్చెను. పిదప నచట గడ్డిగాదములను దోఁకుచు కొన్ని దివసంబులు గడిపెను.

చిదంబరయాత్ర :—

పిదప తిరునావుక్కరసు 'అరుత్తురై', వృద్ధాచలము, మొదలగు దివ్యక్షేత్రముల కేఁగి మ్రొక్కి తమిళ పద్యమాలి కల నర్పించి, తూర్పు దిక్కుగ నీవానదీతీరమునఁ బయనించెను. పైరు పంటలతో పచ్చనగు భూములను, తోఁపులను దాఁటి, చిదంపురపు టెల్లను గాంచి భక్త్యావేశముతో భూమిపై వ్రాలి, వందనముఁ గావించెను. అచటి కోయిలలు ''జన్మాంతరదుఃఖ ములఁ గల్గించు మార్గములను వీడుఁడు '' అని కూయుచుండెను. చిలుకలు గోరువంకలు నావుక్కరసుని పాదములఁగాంచి ''యిది యతిశయము'' అని పల్కి యెదురువచ్చి, ''హర హర మహాదేవ శంభో'' యని పలుక సాగెను. అతఁడు

చతుర్వేద పారంగతులగు బ్రాహ్మణులకు నిత్యావాసమగు చిరంబరపు రాజమార్గమును దాటి, యెత్తైన ప్రాకారమును సమీపించి, పశ్చిమ గోపుర ద్వారముఁ జేరెను.

నటరాజ సందర్శనము :—

శివభక్తులందఱు వాగీశునకు మ్రొక్కి స్వాగత మొసంగిరి. వేదశాస్త్రములందు వ్యుత్పన్నులగు మూఁడువేల బ్రాహ్మణుల కావాసమై శివమయమై యుండు తిరువీధిని నావుక్కరసు ప్రవేశించెను. వేదఘోషములతో స్తుతివాక్యధ్వనులతో నిండిన యేడంతస్థుల గోపురమునకు మ్రొక్కి యాతఁడు లోనికేఁగెను. స్వర్ణచ్ఛాయలఁగూడి సుందరాతిసుందరమగు నాలయమునకుఁ బ్రదక్షిణమొనర్చి, భక్త్యతిశయమున పులకాంకురిత దేహుఁడై వాగీశుఁ డాలయముఁ జొచ్చి, యానందము ననుభవించెను. శిరమునఁ గరములు జోడించి, యానందబాష్పములు దొరలుచుండఁ జతుష్కరణములు నిశ్చలముగాఁ గొంతవడి నిలిచెను. పిదప నాతఁ డెన్నిమాఱులు సాష్టాంగ నమస్కారములు చేసెనో చెప్ప శక్యముగాదు. ఆతని భక్తిని వర్ణింప నెవ్వారి తరమగును? నటరాజు "ఎపుడు వచ్చితివి?" యని యడిగిన జాడ గన్పింప "కాలకంధరా! నిన్నెట్లు పాడఁగలను" అని యారంభించు తిరువృత్త ఛందమున పది పద్యములతో స్తుతించెను. ప్రత్యహము అచటి గడ్డి గాదములను దోఁకి శుద్ధము చేయుచుండెను. ఒకనాఁడు

"నిరంతరాన్నదాన మహిమఁగాంచిన చిదంబర క్షేత్రమా!" యను 'కురుందొొహై' పాటి పాడెను.

పిదప తిరుకేళము, తిరుకలిపాలము మొదలగు శివక్షేత్రములకేఁగి గీతములతో స్తుతించి మరల చిదంబరమునకు వచ్చుచు, "సప్తధామదమును స్రవించు గజమును చంపి చర్మము నొలిచి, ధరించిన కృత్తివాసా! తాండవనృత్యకరా! నిను వీడి నే నల్పకాలమైనను జీవింపఁజాల" నని గానము చేయుచు నగరముఁ బ్రవేశించెను. ఆలయము సొచ్చి, "ధ్యానగమ్యా! అగమ్యగోచరా! చంద్రశేఖరా!" అని మొదలిడు పదిహమును పాడెను. ప్రత్యహ మిటుల చిదంబరవాసు లానందించునటుల పదిహములచే శివునిఁ గీర్తించుచు శాద్వలనివారణ సేవఁ జేయుచుండెను.

జ్ఞానసంబంధునిఁ గాంచ శీర్గాళి కేఁగుట:—

వాగీశుఁడు చిదంబరములో నటరాజును సేవించుచుండ, "శివుని కరుణచే నుమాదేవి జ్ఞానామృత మిశ్రితమగు తన స్తన్యములతో నొసంగిన క్షీరములఁ గ్రోలి, యితఁడే నా స్వామియని, చూపి స్వరరాగ సుధారసముతో నిండిన తమిళ పద్యములను గానమొనర్చిన "తిరుజ్ఞానసంబంధుని మహిమలను భక్తులు పొగడుచు, నతఁడు శీర్గాళికి విజయము చేసి యున్నాఁ"డని చెప్పగ వినెను. ఆ భక్త శిఖామణి పాదకమలములను దర్శించి, మ్రొక్కి ధన్యుఁడు కాఁగోరెను.

వెంటనే కనకసభలోని నటరాజును దర్శించి, మ్రొక్కి యను మతినంది బయలుదేరి, చిదంబరపు వీథిఁ బొరలుచు ప్రదక్షిణ మాచరించి, "తిరునారయూరు"న కేఁగి, నతియు నుతియు నొనర్చి భక్తులు తన్నుఁ గొలిచిరా శీర్గాళిని సమీపించెను.

ధూర్జటి శూలవ్యాధినిఁ గల్పించి, తనకు దాసునిగ గ్రహించిన వాగీశుఁడు వచ్చుచున్నాఁడని విని, జ్ఞానసంబంధుఁడు భక్తులతోఁ గదలి, నగరి బాహ్యప్రదేశమున నాతనికి స్వాగత మిచ్చెను. నావుక్కరసు భక్తగోష్ఠిలోఁ జొచ్చి, జ్ఞానసంబంధుని పాదములపై వ్రాలి సాష్టాంగముగ నమస్కరించెను. జ్ఞానసంబంధుఁ డాతనిఁ గరములఁబట్టి లేవనెత్తి మ్రొక్కి "అప్పరే" అని పిలిచెను. అతఁడు "దాసుఁడితఁడే" యనెను. వారి మనంబులు ప్రేమార్ద్రములయ్యెను. భక్తావతంసుల నొకచోఁ గాంచఁగల్గితిమి గదా యని శివదాసులందఱు ఆనందించిరి. వారి శివాత్మీయ మంత గొప్పది. భక్తుల హరహర శబ్దములతో దిక్కులు మార్మ్రోగెను.

భక్తద్వయము సంధించిన దృశ్యమును కొందఱు కరుణా ప్రేమసాగరము లేకమైనట్లున్నదనిరి. ఇంకఁ గొందఱు వారి కల యిక శైవమార్గమును పొందిన రెండు పుణ్యనేత్రముల చేరికవలె నున్నదనిరి. మఱికొందఱు శివుని కరుణయు, నుమాదేవి కరుణయు నేకమైనదనిరి. ఇట్లందఱ అన్నివిధములఁ దలంచుచుండ, జ్ఞానమయుఁడైన జ్ఞానసంబంధుఁడు రాజైన వాగీశుఁడు తిరుత్తోణి యప్పరుండు నాలయమును సమీపించిరి.

భ్రమరీ ఝుంకారములతో నిండిన యుద్యానవనావృతం బగు శీర్గాళి గోపురమునకు మ్రొక్కి వారిరువు రాలయము సొచ్చిరి. దేవలోకమే మ్రొక్కుచున్నదా యన నాకస మంటుచుండు విమానరాజమును చుట్టివచ్చి నమస్కరించిరి. అపుడు జ్ఞానసంబంధుఁ డప్పరును గాంచి, "అప్పరే! నీ మధురవాక్కులతో నిప్పరమేశ్వరుని స్తుతింపుము" అనెను. వెంటనే వాగీశుఁడు "లోకము నావరించియుండు విశ్వనాథా" యను చరణమెత్తి పది పద్యములఁ జెప్పి స్తుతించెను. వారు పిదప పెరియనాయికను దర్శించి జ్ఞానసంబంధుఁడుండిన మఠమున కేఁగి మజ్జన భోజనాదుల నొనర్చిరి. ప్రాఁత బంధువులఁబలె వారిరువురు ప్రేమతో మైత్రితో సంభాషించుకొనుచు చాలకాల మట గడపిరి. ఒకనాఁడు వాగీశుఁడు "నాకీ చోళదేశ క్షేత్రములను దర్శింప నాశ యొడముచున్నది. మీ రంగీకరించిన నేఁగెద"నన, జ్ఞానసంబంధుఁ "డట్లే" యని యాతని వెంట "తిరుకోళక్కా" యను క్షేత్రమున కేఁగి సదాశివునకు మ్రొక్కి మరల శీర్గాళికి వచ్చెను.

శివస్థల యాత్ర :—

అప్పరు జ్ఞానసంబంధు ననుమతినంది, సదాశివా వాసంబు లగు "కరుప్పు అరియలూరు, పుంగూరు, నీడూరు, కురుక్కై వీరట్టం, నిన్ఱియూరు, ననిపల్లి," మొదలగు శివక్షేత్రముల కేఁగి మ్రొక్కి పదిహామాలికల నర్పించెను. పిదప కావేరీ నద్యుభయ తీరములందు సుప్రతిష్ఠితములైన "శెంబొన్పల్లి,

తిరుమైలాడుదురి, తిరుత్తి, కేళ్విక్కుడి, ఎదిర్గోళ్ పాడి, కొడిగ" అను దివ్యక్షేత్రములను దర్శించి, ఆడుదురై క్షేత్రముఁ జొచ్చి, "ఆవడుదురై పరమశివునిఁ జేరి బ్రతికితి" నని యారంభించు పద్యములను, తొండహ, కురుందొహ, నేరిశై, తిరుచ్ఛందాది వృత్తములతో కవిత సెప్పి స్తుతించి పూజించెను. అచట కొన్ని దివసంబులుండి గడ్డి గాదములను దోఁకి సేవించెను. పిదప "తిరువిశైమరుదూరు, తిరునాగేశ్వరము, పళయూరు లను సేవించెను. తిరుముట్రత్తు ఆలయమున కేఁగి యుమాపతిని సేవించి "యముఁడు వచ్చి నన్నుఁ గొంపోవుటకు ముందు నీ పాదపద్మములను నా శిరముపై నిడి కృప సూపుము" అను భావము వ్యక్తీకరించు పద్యములతో స్తుతించెను. అపుడు "నీవు తిరునల్లూరునకు రమ్ము" అను దివ్యవాణిని విని యయ్యాది పీఠెంచిన దిశకు మ్రొక్కి సంతోషసాగరమున మునింగి నల్లూరునకుఁ బయనమాయెను.

పాదదీక్ష :—

సజ్జనాగ్రణియగు వాగీశుఁడు తిరునల్లూరుఁ బ్రవేశించి, మహాదేవునిముందు సాగిలపడెను. అపుడా దేవుఁడు "నీ యిచ్చఁ దీర్తు"నని శిరముపై తన శ్రీ పాదమునుంచి కృపఁజూపెను. వెంటనే వాగీశుఁడు లేచి "భక్తునకు శంకరుఁడు మేలుచేసెఁగా" యని యారంభించి శ్రీ పాదము అను మకుటముతో పది హముఁ గీర్తించి మ్రొక్కి పెన్నిధిఁ బొందిన దరిద్రునివలె

సంతసించెను. పిదప నచట కొన్ని దినములు శౌద్వాల నిర్మా లన సేవఁ జేసెను.

అప్పాదియడిగళుని గృహముఁ జేరుట :—

నల్లూరునం దీశ్వరుని కృపాపాత్రుఁడైన వాగీశుఁడు, తిరుప్పళనమున కేఁగి, యటనుండి అప్పాదియడిగళుఁడను భక్త డుండు తింగళూరుఁ జేరెను. అప్పాది వైదికాగ్రేసరుఁడు. ధార్మికుఁడు. అతఁడు నావుక్కరసు పేర బావులు, చెఱువులు త్రవ్వించెను. చలిపందిరుల నేర్పఱచెను. తన పుత్త్రుల కందఱకు నావుక్కరసు పేరునే పెట్టెను. వాగీశుఁడు తనపేర నన్ని ధర్మ ముల నా విప్రుండొనర్చుటను విని, యాతనిఁ గాంచ తద్గృ హంబున కేఁగెను.

వాగీశుని రాక విని యప్పాది సతీసుతులతో బంధు వులతో నెదురువచ్చి మ్రొక్కి, "తన గృహంబున కేతెంచి, భుజించి తన్ను పావనుం జేయు"డని ప్రార్థించెను. వాగీశుఁ డాతని కోరికను మన్నించెను.

అప్పాది జ్యేష్ఠపుత్త్ర మరణము :—

నావుక్కరసునకు భక్తుఁడగు అప్పాది, యాతని రాకకు పూర్వమే వివిధ భక్ష్య భోజ్యములను పాకమొనర్ప నేర్పఱచి యుండెను. అతఁడు తన జ్యేష్ఠ పుత్త్రుడగు జ్యేష్ఠ తిరునావుక్కరసుఁ బిలిచి, తోఁటకేఁగి లేఁత యరఁటియాకుఁ గోసి తెమ్మని చెప్పి యుండెను. ఆ బాలుఁడు భోజనసమయ మాసన్నమాయెనని

వేగము పోయి, యాకును కోయుచుండ నొక సర్పమాతని పాదముపైఁ గాటువేసెను. సర్పసందష్టుఁడయ్యు నాతఁడద్దానిని లెక్కించక వేగముగ పరుగిడి యాకుఁ దెచ్చెను. అంతలో విషము తలకెక్క తల్లిచే నా యాకు నిడి, పాముకఱచెనని చెప్ప కయే మూర్ఛిల్లి నురుగులు గ్రక్కుచు నేలపైఁబడి ప్రాణములు విడిచెను. తల్లితండ్రు లా భయంకర దుఃఖదృశ్యము గాంచి, "అయ్యో! చెడితిమిగదా! ఇతని మరణవార్త నావుక్కరసు చెవింబడిన భుజింపఁడు గదా!" యని తలఁచి బాలుని మరణ మేరికిఁ దెలియకుండ తత్కళేబర మొక్కయెడ సంగుప్తముఁ గావించిరి.

బాలుఁడు సజీవుఁడగుట:—

పిదప వారు మోములందెట్టి వికారముఁ దోఁపనీయక, యేమియు జరుగని రీతి వాగీశుని కడకేఁగి "దేవా! సర్వము సిద్ధము. భుజింప రం"డని ప్రార్థించిరి. శివుని కరుణచే వాగీశుని మనంబున సంచలన మేర్పడెను. అందువలన నాతఁడు జరిగిన ద్దానిని గ్రహించెను. వారు పుత్త్ర దుఃఖమును సైతము లెక్కిం పక శవమును దాఁచినందుల కాశ్చర్యపడి, వారి భక్తిశ్రద్ధలను మనంబునఁ గొనియాడి, దయావంతుఁడై "బాలుని శవము నాలయమునకుఁ గొనిరండు" అని పల్కి శివునికడకేఁగి, "దేవా! నాగాభరణా! కాలకంఠా! మృత్యుంజయా! దాసుల దుఃఖముఁ దీర్ప రావా! కరుణింపవా!" యని పది పద్యములతో స్తుతించెను. బాలుఁడు విషరహితుఁడై నిద్రనుండి

లేచినట్లు సజీవుఁడై మేల్కాంచెను. అప్పూది పుత్త్రుఁడు బ్రతు కుటకు సంతసింపక, వాగీశుని భోజనకాలము దాఁటెనే యని దుఃఖించెను. ఆ పాఱుని మానసిక వేదనను గ్రహించిన వాగీశుఁడు వారి గృహంబున కేఁగి శివారాధన మొనర్చి భుజించెను.

అట కొన్నిదినములుండి, అప్పూదిని వెంటనిడికొని తిరుప్పళనమున కేఁగి యచటి శివునకు పద్యమాలికల నర్పించి, ప్రతి పద్యము చివర "శివుని పాదములను పొందఁదగిన శీలము గలవాఁడీయప్పూది"యని యోజించి చెప్పెను. అటనుండి తింగళూరునకు మఱలి వచ్చి కొంతకాలముఁ గడిపి, కావేరీ తీరము ననుసరించిపోయి తిరునల్లూరును చేరెను. అటనుండి పయనమై తిరుపళనూరు, నరయూరు, వాంచియము, పెరు వేలూరు మొదలగు శివక్షేత్రములను దర్శించుచు తిరువా రూరును చేరెను.

తిరువారూరునందలి భక్తులు జైనవిజేతయగు అప్పరు వచ్చుచున్నాఁడని విని, సంతసమున గృహములను వీథుల నలంకరించి, స్వాగతమొసంగిరి. వాగీశుఁడు వారికి మ్రొక్కి "వల్మీకనాథుని దాసులకు దాసుఁడనగు భాగ్య మీనాఁటికి లభించినది" అని పాడుచు వారితో నాలయమున కేఁగి, మూల స్థానేశ్వరునకుఁ బ్రదక్షిణ మాచరించి, దేవాశ్రయ మండపముఁ జేరెను. త్యాగేశునకు చేతులు జోడించి "ఫలములుండ కాయలుగోయు చోరుఁడనైతి" నని యారంభించు పద్య

మాలిక నర్పించెను. ప్రతిదినము షట్కాల పూజావసరము లందు శివుని దర్శించుచు మధుర వాక్కులతోఁ గీర్తించు చుండెను. ఒకనాఁడు శివభక్తాగ్రేసరుఁడు నమినంది అరనరి "ఆలయములో జలముతో దివ్వియలను వెలిగించి సేవించిన మహిమను" పద్యములం దిమిడ్చి, తిరువృత్తమునఁ బాడెను. పిదప వాగీశుఁడు తిరువలినము, కీళ్ వేలూరులను దర్శించి వచ్చి తిరువారూరున జరుగు ఆర్ద్రోత్సవముఁగాంచి యానందభరితుఁడై పుహలూరుఁ జేరెను. అపుఁడచట క్షేత్ర దర్శన కుతూహలియై వచ్చి జ్ఞానసంబంధుఁడు మురుగ నాయనారుని మఠమున నున్నాఁడని విని యచటకుఁ బోవు చుండ సంబంధుఁ డెదురువచ్చి "అప్పా! తిరువారూరులో నీవు గాంచిన మహిమను తెల్పుము" అన నతఁ డామహిమ నేమని వర్ణింపఁగలనని పల్కి "ముక్తా విమానము, బంగరుమణిపింజామ రంబులు. . ." అని ప్రారంభించి, యార్ద్రా మహోత్సవ దర్శన మును దశశ్లోకిఁగఁ జెప్పి స్తుతించెను. సంబంధుఁ డాపద్య ములనువిని, "తిరువారూరును దర్శించివచ్చి నీతో నుండెద" నని పలికి పోయెను. అప్పరు పుహలూరిలోని కేఁగి యాలయము ప్రవేశించి, విశ్వనాథునకు మ్రొక్కి స్తుతించి సేవించుచుండెను. అటనుండి నల్లూరూరు, శాత్తమంగ మొదలగు క్షేత్రముల కేఁగి మరలి పుహలూరు చేరెను.

భక్త బాంధవ్యము :—

జ్ఞానసంబంధుఁడు తిరువారూరు త్యాగేశుని సేవించి యనతి కాలములో పుహలూరు చేరెను. అప్పరాతని కెదురువోయి

తో డెత్తెను. ఒకనాఁడు ధార్మికాగ్రణియగు చిఱుతొండ నయనారు, తిరునీలనక్క నయనారు లచటికి వచ్చిరి. వారి రాక నెఱింగి యనేక భక్తులును వచ్చిరి. భక్తు లందఱు మురుగ నయనారు మఠముఁజేరి శివధ్యానార్చనాదులందు నిమగ్నులై స్నేహభావముతో సంతుష్టులై యుండిరి. శివసేవా భాగ్యము వారి సొంతమై యుండెను. శివతత్త్వ రహస్యములను వారు వ్యాఖ్యానించుచుండిరి. అక్కాలమున అప్పరు జ్ఞానసంబంధులు తమ కవితతో భక్తులను సంతసపఱచిరి. వారందఱు శివానంద సాగరమున నోలలాడుచుండిరి. అది సర్వజ్ఞుని కొలువుకూటమా యన నుండెను.

వారిరువురు భక్తులఁ గలిసి కొంత కాలముఁ గడపి, పుహలూరును వదలి యితర శివక్షేత్రములను సేవింపఁ దలఁచిరి. చిరుత్తొండ, మురుగ, నీలనక్క నయనారులు వారి యనుమతి నంది స్వగ్రామములకు నేఁగిరి. జ్ఞానసంబంధ వాగీశులు తిరు అంబరును దర్శించి తిరుక్కడవూరు చేరిరి. అచట యముని శిక్షించి మార్కండేయునిఁ గాపాడిన శివుని స్తుతించి, గుగ్గులు కలయనారుని మఠమున నివసించిరి. గుగ్గులుకలయనారుఁ డీ భక్తశిఖామణులకు నాహారాదుల నొసంగి యుపచరించెను. అటనుండి బయలుదేరి వారు కడయూరు, మనాయము, తిరు ఆక్కూరు, తోఁతోన్ప్రిమాడము, అను క్షేత్రములను దర్శించి, తిరువీళిమిళల క్షేత్రముఁ జేరిరి.

వాగీశ జ్ఞానసంబంధుల రాక వినిన వైదికులు వారికి స్వాగత మీయ, పురిని తోరణములతో నలంకరించి, క్రముక కదళీ వృక్షతతులను మార్గముల కిరువైపుల నిల్పి, పూర్ణకుంభ ములతో నెదురేఁగి, మ్రొక్కి స్వాగత మిచ్చిరి. వారా శ్రోత్రియులకు వందన మాచరించి, దేవవిమానముతో వెలుంగు నాలయము చొచ్చి, ప్రదక్షిణ నమస్కారముల నొనర్చి, "తిరువీళిమిళలోని పరమేశ్వరుని చేరనివాఁడు నరకమున కేఁగు"నని గానమొనర్చిరి. అచ్చోట వారు వసించు కాలమున వర్షాభావ మేర్పడెను. కావేరి జలశూన్య యయ్యెను. దేశమున పాడిపంటలకు కఱవాయెను. ప్రజలు అన్నము లేక కృశించిరి. క్షామ దేవత విలయ తాండవ మాడసాగెను.

జీవులు తపించు నక్కాలమున నొకనాఁడు నీలగళుఁడు అప్పరు జ్ఞానసంబంధుల స్వప్నమునఁ గన్పించి "యీ కాటక మున మిమ్ము సేవించు భక్తులను పోషించుటకై మీకుఁ బడికా సిచ్చెదను" అని యనుగ్రహించెను. మఱునాఁటి నుండియు నాలయమునకుఁ దూర్పుపీఠమున సంబంధునకును, పశ్చిమ పీఠమున అప్పరునకు దినమున నొక్క బంగరుకాసు లభించు చుండెను. వారిరువు రా కాసుల నమ్మి యాహార వస్తువులఁ గొని తెచ్చి వంట వండించి "భక్తులు వచ్చి భుజింపుఁడ"ని చాటించి యెంద ఱేతెంచినను లేదనక రేయింబవళ్లాహార మిడుచుండిరి.

ఉమ యొసంగిన జ్ఞానక్షీరములఁ గ్రోలిన సంబంధునకు లభించు కాసు మేలిమి బంగారము గాకుండెను. హస్తముల దోఁసుడుపాఱ ధరించి దేహశ్రమ సేయుచు శివుని సేవించు నప్పరునకు మేలిమి కాసు లభించుచుండెను. భక్తద్వయము మఠములందు భక్తులకు మృష్టాన్నము లభించుచుండెను. వారు సంతసముతో నా కరుణాకృత్యమును పొగడసాగిరి. క్రమముగ కఱవు తొలఁగెను. మేఘములు వర్షించెను. భూమి చల్లపడెను. ఆహార ధాన్యములు విరివిగఁ బండెను. దేశము సుభిక్షమాయెను.

లోకమునకు క్షేమము నొడఁగూర్చిన వాగీశ సంబంధులు మిళలినాథునిఁ బద్యములతో స్తుతించి, యనుమతి నంది బయల్వెడలి తిరుమంజియమును గాంచి, వేదారణ్యమున కేఁగిరి.

ఆలయ కవాటములఁ దెఱపించుట :—

వారిరువురు నచటి శివాలయమునకు బ్రదక్షిణించి ద్వారః ప్రదేశముఁ జేరిరి. కవాటము బంధితమై యుండఁ గాంచి, 'తలుపులేల మూయఁబడి యున్నవి?' యని యడుగ నచటి జనులు "పూర్వము వేదము లీ యాదిభగవానునిఁ గొలిచి తలుపులు మూసిపోయినవి. వీనిఁ దెఱువఁగల భక్తులొకరును రానందున భక్తులు వేఱొకద్వారము నేర్పఱచికొని పూజించుచున్నారు" అనిరి. అంత సంబంధుఁడు "అప్పా! మనమీ ద్వారము నుండియే ప్రవేశింతము. నీవు నీ కవితాశక్తితో కవాటమును

వివృతము ధావింపుము'' అనెను. అప్పరు వెంటనే "ఉమార్ధ దేహా! పరమేశా! వేదారణ్యావాసా! ఈ నేత్రంబుల నిను గాంచ కవాటబంధముఁ దొలఁగించి, కరుణించు దేవా! అని పాడెను. కాని తలుపులు విడివడలేదు. వెంటనే "దాక్షిణ్యము లేకున్నాఁడవే'' అని మఱియొక పద్యముఁ జెప్పగనే తలుపులు తమంత తామే తెఱచుకొనెను.

వారా యద్భుతమున కాశ్చర్యచకితులై సాష్టాంగ మొనర్చిరి. దేవతలు విజయ దుందుభిని మ్రోఁగించిరి. వేద ఘోషములు చెలంగెను. భక్తులానందపరవశులైరి. అంత వారిరువు రా ద్వారమునుండి లోనికేఁగి, శివుని సేవించి స్తుతించి వచ్చిరి. అప్పరు సంబంధుని గాంచి, "స్వామీ! ఈ తలుపులు తెఱచుకొనుచు, మూసికొనుచుండునట్లు మీరు శివుని ప్రార్థింపుఁడు'' అని కోరెను. సంబంధుఁ డాతని కోరికను మన్నించి, యొక పద్యముఁ జెప్పెను. వెంటనే తలుపులు మూసికొనెను. ఇరువురు శివకరుణాపాత్రులే యని భక్తులందఱు మ్రొక్కిరి. ఆనాఁటినుండి యా తలుపులు తెఱచుటకు మూయుటకు సాధ్యము లాయెను. జనుల యానందమునకు మేర లేకుండెను. వారిరువు రచట కొంతకాలముఁ గడపఁ దలఁచిరి.

కాని యప్పరు "సంబంధుని యొక పద్యముతో తలుపులు సంవృతములైనవి. నేను పది పద్యములు సెప్పఁగ నవి విడివడినవి. శివుని మనోభావ మెట్టిదియో యెఱుఁగరాకున్నది'' అని దుఃఖించుచు నా రేయి యొక మూలఁ బడి

యుండ శివుఁడు స్వప్నమునఁ దోఁచి "మేము తిరువాయి మూరులో నుందుము. నన్ను వెన్నంటి యటకు రమ్ము" అని కరుణించెను. వెంటనే అప్పరు "నేనుండు స్థలమును వెదకికొని వచ్చి గుర్తులు సెప్పి రమ్మనెఁగా!" అను పద్యము సెప్పి బయలుదేరి, వేగముగ పోవసాగ కలలోఁ గన్పడిన మూర్తి దారి సూపుచుండెను. అమృతము చేతనుండఁ దిన లేనివానివలె స్వామిని వెన్నంటుచున్నను ప్రత్యక్షముగఁ జూడఁజాలమి నాతఁడు వెతఁజెందెను. వేగముగ శివుని సమీపింప నడచినను ఆతఁడు సుదూరమగుచు నాలయముఁ జొచ్చి యదృశ్యుఁడాయెను. వాగీశుఁ డాలయములోని కేఁగెను.

సంబంధుఁడు, నావుక్కరసు తిరువాయిమూరున కేఁగెనని విని, యచటికి వచ్చెను. అప్పరు పరమశివుఁడు కన్పడమికి దుఃఖించి "సంబంధుఁడు తలుపును తెఱవఁజేయుమన నే పాడ కరుణఁ జూపితివి. ఇపుడు దోషినగు నాకుఁ గన్పడక దేవర యదృశ్యుఁడగుట యుక్తమా! ఒక పద్యముతో కవాటమును మూయించిన జ్ఞానసంబంధుఁ డిటకు వచ్చియున్నాఁడు. ఆతనికిని దర్శన మీయకుండు టెట్లు?" అనెను. అంత పశుపతి సంబంధునకు మాత్రమే గన్పడెను. అతఁడా దేవదేవునిఁ గాంచి నతియొనర్చి యప్పరునకుఁ జూపెను. అతఁ డా దివ్యదృశ్యముఁ గాంచి మ్రొక్కి పద్యమాలిక నర్పించెను. శివుఁడా పద్యమాలికను గ్రహించి తిరోహితుఁడాయెను. వారటఁ గొంత కాలము గడపి వేదారణ్యమునకుఁ దిరిగి వచ్చిరి.

సంబంధుఁడు పాండ్యదేశ మేఁగుట :—

చోళరాజ పుత్త్రికయు పాండ్యుని పట్టమహిషియు నగు పాండ్యమహాదేవి, మంత్రియగు కులచ్చిరై నాయనారును పంపిన దూతలు సంబంధునిఁ గాంచ వేదారణ్యమునకు వచ్చిరి. వారు సంబంధుని దర్శించి మ్రొక్క నతఁడు యోగక్షేమములను విచారించెను. వారు "దేవా! దేవర పాదసేవకులమగు మాకు కష్టములేల గల్గు! శైవమును మెచ్చక పాపులైయుండు జైనుల క్రూరకృత్యములు మితిమీఱుటచే బాధలు గల్గుచున్నవి" అని విన్నవించిరి. సంబంధుఁడు "పాండ్యదేశమున కేఁగి జైనమతమును నాశమొనర్చి యాది శైవమునుఁ బ్రకాశింపఁజేయవలయు. విభూతియే నాకు సాయము" అని నిశ్చయించెను.

సంబంధుని నిశ్చయము వినిన అప్పరు "రోష క్రోధములచే శరీరముఁ బెంచికొని పాపాత్ములైన జైనులు వంచన సేయుటయందు నిపుణులు. వారు నాకొనర్చినవి చాలఁ గలవు. కావున దేవర పాండ్యదేశమున కేఁగుట నాకు సమ్మతము గాదు" అనెను. "భస్మమే విభూతి యని భక్తితో ధరించు మంగయక్కరశిని కులచ్చిరయారును, చూడవలెనని నాకు బుద్ధి యొదమినది. అచటి శ్రమణుల దుశ్చేష్టల నడంచి శైవమును విస్తరింపఁజేసెద. నీ యాన, నీవచటికి రావలదు. జైనుల క్రూర కపటకృత్యములను నాశమొనర్తు"నని స్థిర చిత్తముతో సంబంధుఁడు వక్కాను. అప్పరాతని నిశ్చయ

మును మాన్పఁజాలనివాఁడయ్యెను. శివజ్ఞానశ్రేష్ఠుఁడగు జ్ఞాన సంబంధుఁడు వాగీశుని వదలి పాండ్యదేశమున కేఁగెను.

జైనులను శిక్షింపఁజేయుట :—

అప్పరు వేదారణ్యమునఁ గొన్నిదినములుండి పిదప తిరు నాగపట్టణము మొదలగు క్షేత్రములకేఁగి సేవించి కావేరీ తీరమునంటి ప్రయాణము చేసెను. దేవికి పశురూపమున దర్శన మిచ్చిన తిరు ఆవడుత్తురలోని పరమశివుని దర్శించి మ్రొక్కెను. "సంబంధుని పద్యములకు మెచ్చి, సహస్ర సువర్ణముల నొసఁగిన సోమశేఖరా!" యని స్తుతించి, పళయూరున కేఁగి వడవళి యాలయమును దర్శించెను. ఆ స్థలవాసులు "అయ్యా! ఇచటి లింగమును జైనులు దాఁచిరి. ఇది అసత్య దేవవిమానము" అనిరి. ఆ మాటలకు అప్పరు కలతవడెను. అంత నతఁడా యసత్య విమానమున కనతిదూరమున నిలిచి, శివపాదములను ధ్యానించి, "దేవదేవా! మహాదేవా! జైనుల కపటకృత్యమును పిలుకుమార్చి, దేవర రూపముఁ గన్పింపఁజేసి కరుణింపుడు. మీరూపముఁ గాంచక దాసుఁడిక నడుగిడఁడు." అని మ్రొక్కి యన్నాహారాదులం గైకొనక నిలువఁబడెను. అపు డుమాపతి యప్పరును కరుణించి, చోళరాజు స్వప్నమునఁ గన్పించి, "జ్ఞాన విహీనులు జైనులు నన్నుదాఁచి, యాలయమును మఱుగుఁ జేసిరి. నావుక్కరసు నన్నుఁగాంచ నిరాహారుఁడై యున్నాఁడు. శ్రమణులను హతముసేసి నాకాలయము నిర్మింపుము. వేగ రమ్ము" అని పలికి తానుండుచోటునకు గుర్తులు తెల్పెను.

వెంటనే చోళరాజు మేల్కని, మంత్రులకా విషయ మెఱిగించి, వారితో బయలుదేఱి శివుఁడు సెప్పిన గుర్తులను బట్టి, శివలింగ మును దాఁచిన స్థలముఁ గన్గొని జైనుల దుశ్చర్యలను నిందించి యప్పరుం గాంచి వందన మొనర్చెను. జైనమఠములను విధ్వంస మొనర్చి యందుండు శ్రమణ సన్న్యాసులను మట్టుపెట్టెను. వడదళిలో యథాపూర్వము శివునిఁ బ్రతిష్ఠింపఁజేసి యర్చించి, నిత్య ధూపదీప నైవేద్యములు శాశ్వతముగ జరుగునట్లు భూదాన మొనర్చెను. అప్పరు ఆలయములోనికేఁగి "శిరోజ ములను హస్తముతో నూడఁబెఱికికొను జైనుల దుష్కృ త్యముచే శివుఁడు గానఁడాయెఁగా! విశ్వేశ్వరునిఁ దాఁచ సాధ్యమా! నదీతరంగములచే నాలింగితుఁడగు వడదళీశ్వరునిఁ గాంచి జీవించితి"నని పదిహాము సెప్పి సేవించెను. అచటి గడ్డి గాదములను దోఁకి సేవించుచు కొన్ని దినములు గడపెను.

తిరుపైంగిలి కేఁగుట :—

పిదప తిరువాణైక్కాను చేరి సాలీఁడునకు రాజపదవి నొసఁగిన శివుని పాదములకు మ్రొక్కి స్తుతించెను. పిదప ఎఱింబయూరు కొండను, తిరుచిరాపల్లి కొండను, తిరుకర్కాం కొండలను దర్శించి, తిరుప్పరాయితర శివునిఁజేరి మ్రొక్కి తిరుపైంగిలికి పయన మయ్యెను. దారిలో నప్పరున కాఁకలి దప్పు లధికమాయెను. అతఁడు నిశ్చలమనస్కుఁడై శివుని యందు చిత్తముంచి నడకసాగించెను. దాసుని క్షుత్పిపాసలను దీర్ప శివుఁడు నావుక్కరసు మార్గమున నుద్యానవనములను

సరోవరముల నిచ్ఛామాత్రమునఁ గల్పించెను. భక్తునకు సాయ పడఁదలఁచి, యార్తత్రాణపరాయణుఁడు విభూతి రుద్రాక్షలఁ దాల్చి, బ్రాహ్మణ వేషమున అన్నపుమూటఁ జేఁబట్టి మార్గ మున నిలిచి, యప్పరునిఁగాంచి, "ఓయీ? నీవు మార్గా యాసమునఁ బడలియున్నాఁడవు. నాకడ చలిదియన్నము గలదు. భుజింపుము. ఈ గుంటలోని నీటిఁద్రావి, విశ్రమించి పొమ్ము" అని పలికెను. అతఁడు ప్రేమతో నొసఁగిన యాహా రముఁ గైకొని "ఇదియు శివుని కరుణయే" యని భుజించి తీయని జలములఁ గ్రోలి, శీతలతరుచ్ఛాయయందు విశ్రమించెను.

వేషధారి "నేను పైంగిలికి పోవుచున్నాఁడను. నీవును వత్తువా!" యని యాతనితో బయలుదేఱి యా యూరిఁ జేరఁగనే యదృశ్యుఁడాయెను. అప్పరు "ఈ దాసు నొక ప్రాణిగఁ దలఁచుట యాతని కరుణాకృత్యమే..." యని స్తుతించి యచట కొన్నిదినంబులుండి సేవించి, యీశునాలయముఁ జొచ్చి మ్రొక్కి, యచటి శివదాసుల భక్తిభావమున కానందించెను. భక్తుల పాలిట సుధానిధియు హాలాహల భోక్తయు నగు అణ్ణా మలుని సేవించుచు నట కొన్ని దినములు గడపెను.

తొండమండల క్షేత్ర దర్శనము :—

పిదప అప్పరు గిరులను, నదీనదములను, ఆమ్రవన ములను దాఁటి, తొండమండలములోని తిరువొత్తుర యను క్షేత్రముఁగాంచి యచటి పార్వతీధవుని మ్రొక్కి స్తుతించి

శాద్వలనివారణసేవఁ జేసి, యుమాపరిరంభణముచేఁ బులకితుఁ డైన యేకామ్రనాథుఁడుండు కాంచీపురిఁ బ్రవేశించెను. వాగీశుఁడేతెంచుచున్నాఁడని వినిన పౌరుల ముఖకమలములు ఉద్యద్భాస్కరునిఁ గాంచిన కమలములయ్యెను. వారు నగరము నలంకరించి యటనట పందిరులనువైచి, కదళీవృక్షస్తంభముల నిలిపి, వృషభధ్వజముల నెత్తిరి. భక్తున కెదురేఁగి మ్రొక్కిరి. వాగీశుఁడు వారికి ప్రత్యభివాదన మొనర్చి పురింజొచ్చి యేకామ్రాలయ గోపురముఁ గాంచి భూమిపై వ్రాలి మ్రొక్కెను. లోనికింజొచ్చి యుమాసహితు నేకామ్రనాథుని సేవించెను. భక్త్యావేశముచే మనము ద్రవింప "వంచకులకుఁ గరుణఁజూపిన శివా! సదాశివా..." యను పదిహముఁ బాడెను. పిదప కాంచీపురిలోఁ గొంతకాలము శాద్వలనివారణసేవ చేసి, తిరుకచ్చియూరు, మేల్మాయిలు, తిరుమాపేరు అను శివక్షేత్రములను సేవించి తిరుక్కలికుండ్రమును దర్శించి మ్రొక్కి, పద్యమాలికల నర్పించి, సముద్రతీరమునఁ బయనించి, తిరువాన్మియూరును దర్శించి వివిధ వనావృతమైన మైలాపూరుఁజేరి కపాలీశ్వరునకు మ్రొక్కి స్తుతించి తిరు ఒట్రియూరుఁ (తిరువత్తియూరుఁ) జేరెను. అచట భక్తులు హృదయపూర్వకముగ నొసంగిన స్వాగతమునకు సంతసించి మహాదేవుని సన్నిధికేఁగి, "భ్రమరీఝుంకారయుతమగు చెందామరఁబోలిన పాదకమలములుఁగల లోకనాథా" యని పాడి సేవించుచు కొన్నిదినంబులట గడపెను. పిదప తిరుప్పాశూరుఁజేరి, త్రిపురాంతకుని

స్తుతించి యటనుండి పయనమై పళయనూరు, తిరువాలంగాడు లను దర్శించి, తిరుత్తొండత్తొహ వృత్తములతో నుతించి, తిరుక్కాడిక్కరను సేవించి యుత్తరదిశగఁ బయనమై స్వర్ణ ముఖీ నదీమతల్లిని గాంచెను.

శ్రీ కాళహస్తిని దర్శించుట :—

వాగీశుఁడు స్వర్ణముఖియందుఁ గ్రుంకులిడి, జ్ఞానప్రసూ నాంబికాధవుని స్మరించుచుఁ గొండనెక్కి యాలయమునకుఁ బ్రదక్షిణ మాచరించి, వేదమయుఁడగు పరమేశ్వరునకు మ్రొక్కి, యానంద పరవశుఁడై తిరుత్తొండత్తొహ వృత్తమునఁ గీర్తించెను. ఆ దయామయుని యనుమతినంది యుత్తరముగఁ బయనించి, యరణ్యములను పర్వతముల నధిగమించి శ్రీ మల్లికార్జున నిలయమగు శ్రీశైలక్షేత్రముఁ గాంచెను. మహర్షులచే, సిద్ధులచే, శివజ్ఞానులచేఁ బ్రత్యహము సేవింపఁ బడు భ్రమరాంబా మల్లికార్జునులకు మ్రొక్కి పదిహములతో స్తుతించెను. కైలాస దర్శనాకాంక్షియై వాగీశుఁడు భక్తులతోఁ గలిసి యాంధ్ర కర్ణాటకములను గడచి, నదీ పర్వతములతోఁ గూడిన మాళవ వంగ మధ్యదేశముల నధిగమించి, దివ్య గంగా వృతంబగు పవిత్ర వారణాసీ దివ్యక్షేత్రముంజేరి యన్నపూర్ణా విశ్వనాథులను సేవించెను. భాగీరథిలో స్నానమాడి, మణి కర్ణికాది ఘట్టములను డుంఠివినాయకుని సేవించెను. వెన్నంటి వచ్చిన భక్తుల నాయ విముక్తక్షేత్రమున నుండ నియమించి,

గంగాతీరము ననుసరించిపోయి శిలలతో నిండిన హిమాలయో పత్యకలను చేరెను.

మనుజుల కగమ్యము శిలాదులతో భయంకరమగు నరణ్యముఁజొచ్చి కందమూల ఫలాదులఁ దినుచు పయనించి, పిదప నిరాహారుఁడై కైలాసముఁగాంచ గుతూహలముతో నిలువక శ్రమఁజెందక పోవసాగెను. నిశలందు ఘోరవ్యాఘ్రాదు లాతనిం గాంచియు చూడనట్లే దూరముగ పోవుచుండెను. మహా నాగములు పడగలనెత్తి మణిదీపములతో నాతనికి మార్గదర్శకము లయ్యెను. పిదప నాతఁడొక యెడారిలోఁ బయనించెను. మధ్యాహ్నపు మార్తాండుని మండుటెండచే భూమి పగుళ్లువారి నాగ లోక మార్గమా యన నుండెను. ఆ పగుళ్లనుండి యుష్ణ మగ్గి మంటలవలె నెగయుచుండెను. ఆ ప్రదేశమున నేఁగు అప్పరు పాదముల చర్మమఱిగి, మాంసము బయల్పడ నడువఁజాలక కైలాస దర్శనాభిలాషను వీడలేక, హస్తద్వయముతోఁ బ్రాఁకి పోవుచుండెను. హస్తములందలి మాంసము నశింప నెమ్ములు బయల్పడెను.

అట్లయ్యు నాతఁడు వెనుదివియక, ధూమసంతతులా యన నుండు నల్లఱాళ్ల గులకపై పొరలుచు పోవుచుండెను. ఱొమ్ముతోఁ బ్రాఁక నందలి చర్మమాంసములు నశించి గూడు టెముకలు బయల్పడెను. శరీర మిట్లు నశించుచున్నను కైలాస పతిఁ గాంచఁ గుతూహలియై పొరలుచుఁ బోవుచుండ బాహ్యాంగ ములుఁగూడ శల్యావశిష్టములుగా ముందున కేఁగ లేక నిలిచెను.

శంకరుఁడు మునివేషముతో నప్పరును సంధించుట :—

"అప్పరు కొంతకాలము భూలోకమున నుండి మధుర కవితతో స్తుతించుచు, లోకమున శివభక్తిని వ్యాపింపఁజేయ వలయు"ననియు, అతని కపుడే కైలాసప్రాప్తి గల్గించరాదనియు తలంచిన కైలాసనాథుఁడు మునివేషమున నాతనికడకు వచ్చెను. అప్పరునిస్థితిఁ గాంచి దయార్ద్రహృదయుఁడై సరోవరము నొకదానిఁ గల్పించి, "ఓయీ! అంగములుసెడ నీ కఠినశిలా తలమున నిట్లు పయనింపఁ గారణమేమి?" యని ప్రశ్నించెను. కటియందు చెట్లపట్టలు, వక్షమున జన్నిదము, శిరమున భస్మావలేపముతో నెదుట నిలిచిన యమ్మహర్షినిగాంచి యప్పరు "మునివర్యా! ఉత్తర కైలాసమున సదావాసియగు నుమాపతిని దర్శించి మ్రొక్కఁ దలంపుగలిగి వచ్చితిని" అని పల్కెను. అంత నా వేషధారి "భూలోకవాసులకుఁ గైలాసము సులభగమ్యము గాదు. దేవేంద్రాదులుకే యది యలభ్యము. ఏలవచ్చితివి? మరలుట మేలు" అన నావుక్కరసు ఆతఁడే కైలాసపతి యని యెఱుంగలేక "అయ్యా! నన్ను దాసునిగఁ గైకొనిన మహేశునిఁ గాంచక దుర్భావముతో నెట్లు మరలి పోఁగలను. పోవంజాల" ననెను. అంత ముని యంతర్హితుఁడై యశరీరవాక్కుతో "యశోవంతుఁడా! వాగీశా! లెమ్ము" అనెను. వెంటనే వాగీశుని దేహము యథాపూర్వమాయెను. "అయ్యా! దేవాదిదేవా! మీ కైలాసావాస రూపమ్ముఁ జూపి ధన్యునిఁ జేయరే" యన "ఓయీ! నీవీ

కొలనిలో మునింగిన తిరువైయూరును చేరఁగలవు. అట నా రూపముఁ గాంతువు" అని యాజ్ఞాపింప ప్రహృష్టచిత్తుఁడై వాగీశుఁడు మ్రొక్కి, "ఆకసమున వేరైయుండు నిన్ను నుతింతు..." అని పదిహాము పాడి, పంచాక్షరిని జపించుచు నా నిర్మల జలములందు మునిఁగెను. శివుని మహిమ యెట్టిదియో గదా! అప్పరు తిరువారూరు కొలనిలో నుండెను. తీర మెక్కి శివ మహిమాతిశయమునకు సంతసించుచు, నాలయమునకుఁ జనఁ జొచ్చెను. మార్గమున సకల చరాచరంబులు పార్వతీ పరమేశ్వరులవలె జంటలుగఁ గూడి, యానందించు దృశ్యముఁ గాంచి, "సత్యం శివమైన" సదాశివుఁడు సకల జీవాంతర్యామి" యను తత్త్వముఁ దెలిసికొని మ్రొక్కి పంచనదీశ్వరాలయముఁ జేరెను.

అప్పరునకా యాలయము కైలాసమువలెఁ గన్పించెను. దాని చుట్టు చేరి విష్ణు బ్రహ్మేంద్రాదులు మహేశునిఁ గీర్తించుచున్నట్లు గన్పించిరి. వేదస్తుతులు దేవగంధర్వ సిద్ధ విద్యాధరుల గానములు విననయ్యెను. రంభాదుల నాట్యములు గననయ్యెను. గంగాది పుణ్యతీర్థములు శివగణనాథులు మృదంగాది వాద్యములతో శివునిఁ గొల్చుట నేత్రశ్రోత్రపర్వము లయ్యెను. మహేశునకు నితరులకు మధ్యనుండు నంది కన్పించెను. మరకత ధ్వజముతోఁ గూడిన పగడపు కొండయా యన వెండి కొండపై నుమాదేవిఁగూడిన కృత్తివాసుఁడు వాగీశునకు దర్శనమిచ్చెను.

వాగీశుఁడిట్లు కైలాసముఁ గాంచి, శివానంద సాగరమును చక్షుః పాత్రఁ గ్రోలి, శిరమునఁ గరములు గీలించి, పులకాంకిత దేహుఁడై మ్రొక్కి, యానంద బాష్పములను విడుచుచు నానందతాండవ మొనర్చెను. అగణ్యంబులగు పద్యములతో వినుతించెను. వెంటనే యా దృశ్య మగోచర మయ్యెను. తిరువయ్యారు ఆలయము మాత్రమే దృష్టి గోచరముగాఁ దాఁ గాంచిన కైలాసదృశ్యమును వివిధరీతుల వర్ణించెను. అచట తృణములను తొలఁగించుచుఁ గొంతకాల ముండి, పిదప తిరుమిళపాడి, తిరుపూందురుత్తి యను క్షేత్రములఁ గాంచి "మన జీవిత మతని పాద సేవకే" యను మకుటముఁగల పద్యములతో వినుతించి యట నొక సుందరమఠమును నిర్మింపఁజేసెను.

జ్ఞానసంబంధుని మూఁడవసారి దర్శించుట :—

అపుడు జ్ఞానసంబంధుఁడు పాండ్యదేశమున శిలాకఠిన హృదయులగు జైనులను వాదమున నోడించి, వారి యసత్య ప్రచారమును నాశమొనర్చి, పాండ్యరాజు గూనిని చక్కఁబఱచి, యతనికి శివజ్ఞానబోధఁజేసి, విభూతి మహిమఁ దెల్పి, చోళదేశమునకు వచ్చెను. అప్పరు పూందురుత్తిలో నుండుట విని యచటి కేతెంచెను. అప్ప రాతని రాక విని భక్తులతో నేఁగి మ్రొక్కి స్వాగత మొసఁగెను. పిదప లోకానందకరుఁడగు సంబంధుని ముత్యాలపల్లకిని మోయఁదలఁచి వేషమును మార్చి బోయీలలో నొకఁడై యొక కొమ్మును భుజముపైఁ దాల్చి

మోసెను. అతఁడు పల్లకిని మోయుట నెవరును గుర్తించరైరి. మెల్లఁగ పల్లకి పూందురుత్తిని సమీపించెను. జ్ఞానసంబంధుఁడు శిబికయందుండియే "అప్పరేఁడీ! ఎటనున్నాఁ"డని యడిగెను, ఆమాట విని అప్పరు సంతసముతో "నీ పాద కమలములను మోయు భాగ్యశాలినై యిటనే యున్నాఁడ"నని పలికెను. ఆ మాటకు సంబంధుఁడు చకిత హృదయుఁడై వెంటనే పల్లకి నుండి దుమికి, అప్పరునకు వందన మాచరింప వచ్చెను. అప్ప రాతఁడు మ్రొక్కుటకు ముందే నమస్కరించెను. భక్తులంద ఱాశ్చర్య పరవశులై "హరహర శంకర మహాదేవా" యని ఘోషించిరి. అంతవా రిరువురు నాలయమున కేఁగి మహా దేవుని సేవించి నిజనివాసంబుల కరిగిరి.

జ్ఞానసంబంధుఁడు పాండ్యదేశమున జైనుల నోడించుట, రాజుగూనిఁ జక్కఁబఱచుట చెప్పఁగా విని అప్పరు సంత సించెను. మంగయక్కరశి శివభక్తిని, కులచ్చిర నాయ నారుని మహిమాతిశయమును సంబంధుఁడు వర్ణింప అప్పరా భక్తులఁ గాంచఁ గుతూహలియై పాండ్యదేశమేఁగ దలంచి, యాతని యనుమతి నంది మ్రొక్కి బయలుదేఱెను.

మధురాపురీ దర్శనము :—

వాగీశుఁ డచటినుండి దక్షిణముగ నేఁగి "తిరుప్పుత్తూరు శివునకు మ్రొక్కి, మహోన్నత ప్రాకారావృతమగు మధు రను చేరెను, పురాతన కాలమునుండియు విద్వత్కవులకు

నిలయమైనదియు, తమిళ కవిసంఘమునఁ జేరి తమిళభాషలో పరిశోధనలు సల్పిన సుందరేశు నాలయముచేఁ బ్రసిద్ధిగాంచిన యా నగరరాజమును వర్ణింప నేరితరము! అతఁడాలయమునకు ప్రదక్షిణ మొనరించి లోనికేఁగి చొక్కలింగేశునిఁ (సుందరేశుని) గాంచి, యానంద ప్రవాహము పెల్లివిరియ, "స్వయం ప్రకాశా! సుందరేశా!" యని మొదలిడి యనేక గేయములఁ బాడి ప్రస్తుతించెను. అప్పరురాక విని మంగయక్కరశి, కులచ్చిర నయనారును వచ్చి మ్రొక్కి, తమ యాతిథ్యమును స్వీకరింప వేఁడిరి. అతఁడు వల్లెయని యచట కొన్నిదినములు గడపెను. నాయికా నాయక భావముతో "అహప్పొరుళ్" అను కావ్యమును లోకమునకుం బ్రసాదించిన సుందరేశుని నేర్పై, తాండవాది వృత్తములతో స్తుతించి యాలయమందలి గడ్డిగాదములను శుద్ధమొనర్చుచు నానందించెను.

పిదప అప్పరు మధురను వీడి, తిరుప్పూవనమును చేరి, "త్రిశూలధారీ! పరమేశా" యను తాండవ వృత్తమున శివుని స్తుతించి, అటనుండి లంకేశుఁడైన రావణుని దశకంఠలుం ఠన మొనర్చినందునఁ గలిగిన బ్రహ్మహత్యాదోష నివారణార్థమై శ్రీ రామచంద్రుఁడు ప్రతిష్ఠించిన రామలింగేశుని మ్రొక్క దలఁచి రామేశ్వరమున కేఁగెను. అచట మహేశునకుఁ బద్య మాలికల నర్పించి, తిరునల్వేలి, తిరుకానప్పేరు, మొదలగు శివక్షేత్రములను సేవించి తిరుప్పుహలూరునకు వచ్చెను. వాగీశుని యాశారాహిత్యమును లోకమునకుఁ జాటఁదలఁచి

శివుఁడాతఁడు గడ్డిని దోఁకి, శిలాశకములఁదీసి పాఱవేయునపుఁ డా త్రాళ్లతో బంగారము నవరత్నము లుండునట్లొనర్చెను. వాగీశుఁ డా స్వర్ణరత్నాదులను శిలాఖండములను సమముగఁ దలంచి హస్తమున స్పృశింపక, దోఁకుడు పాఱతో నెత్తి ప్రక్కలో నుండు గుంటలోఁ బాఱవైచెను. ఆశారహితులకు శిలలు బంగారము నొకటియెగదా! ఇట్టి భగవత్పరీక్షలో నెగ్గి యప్పరు నిరాశాపరుఁడై సేవించుచుండెను. నిస్పృహులగు భక్తులకు మన్ను పొన్ను నొక్కటియ.

పూంపుహలూరు శంకరుఁడు వాగీశుని శుద్ధసన్న్యాసము నింకను బహిరంగపఱుపఁ దలఁచి రంభాది దేవకాంతల నాహ్వానించెను. వారు మెఱపుఁ దీఁగలో యన స్వర్గమునుండి వచ్చిరి. అప్పరు దోఁకుచుండు చోటుఁజేరి యా యరుణ బింబాధరోష్ఠలు దివ్యగానమొనర్చుచు క్రీఁగంటి చూపులవలె మధుర దీర్ఘంబులగు రాగములఁ బాడిరి. పారిజాతపు చిగుళ్ల వంటి పాదవిన్యాసముల నృత్యములాడిరి. లలితకోమల హస్త పద్మ చాలనములను గండుమీనులవంటి కంటిమెలపుల విలాస వీక్షణములను బ్రసరింపఁ జేయుచు స్వర్ణ కేతనములాడుచున్నవా యన నృత్యలాస్యము లొనర్చిరి. వారాడి పాడి పూవులఁ జల్లుచు, నాలింగన మొనర్చు వారివలె నప్పరును సమీపించుచు జడలు వీడ, నడుములల్లాడ, పరుగిడుచు, మన్మథుని దూతలా యన వివిధ కామోద్రేకచర్యల నొనర్చిరి. వాగీశుఁడు వారి హావభావ విలాసములకుఁ గొంచెమైనఁ జలింపక, శివార్పిత చిత్త

వృత్తితో తన సేవలో నిమగ్నుఁడై యుండి, వారిఁగాంచి "ఇచట మీకు నావలన నెఱవేరఁదగు కార్య మేమిగలదు? నేను శివదాసుఁడను. మీరు వ్యర్థముఁగ శ్రమఁజెందకుఁడు. మాయఁగెలిచితి" అను పల్లవితో నారంభమగు పదిహామును పాడెను.

రంభాదు లాతని చిత్తమును చిత్తజుని వశముఁగావింపఁ జాలనివారై సిగ్గుఁజెంది, యాతనికి మ్రొక్కి స్వర్గమున కేఁగిరి. "ఇనుఁప క్రచ్చడాలు దాల్చు మునిముచ్చులు తామరస నేత్ర లింఢ్ల బందాలగుదురు గాని వాగీశుఁడట్లగునా!" యని జను లాతనిని స్తుతించిరి. అప్పరు శివుని కరుణఁగాంచు కాలము సమీపించుచున్నదని యెఱిఁగి యచటనే సేవించుచుండెను.

"తాఁజేరఁదగినవి శివుని పాదకమలములే. ఇఁక వేఱేమి తలంతు. శివ పాదపద్మములనే ధ్యానింతు. కన్నులు లేవు. తాండవ నృత్యకరుఁడగు నటరాజునందెల పాదవర్ణనముగాక మఱేమి గావలయు. ఈ దేహమున నవద్వారముల నుంచితివి. ఈ శ్వాసరంధ్రములు మూసికొని పోవునపుడు నాకేమి తెలియును. పుణ్యాత్మా! నీ పాదముల కడకు వచ్చుచున్నాను. శివా! నా మనంబు నిను వినా యన్య మెఱుఁగదు. నా యత్నము తడఁబడుచున్నది. ద్వంద్వమును ఆశలను బంపి పరీక్షించితివి. లంకేశుని రథమును కైలాసముపై సాగకుండఁ జేసితివి. వానిని కాలఁ ద్రొక్కితివి. నీ మహిమ నెన్నఁదరమా! సదా శివా! నీ పాదములఁ జేరుచున్నాఁడ." అను తాండవ వృత్త

మును పాడి, శివానంద సాగరమున మునిఁగి యొకానొక చైత్ర మాసమున శతభిషా నక్షత్రమందు శివపాద పద్మముల లీనుఁడయ్యెను. అపుడు దేవదుందుభులు మ్రోఁగినవి. పుష్ప వర్షము గురిసెను. జీవులు సంతోష సాగరమున నోలలాడెను.

"స్వధర్మ నిర్వహణమున మరణమైనను శ్రేష్ఠమే. పరధర్మము భయావహము."

"వాగీశాయ శివదాసాయ తే నమః"

# 22. కులచ్చిర నాయనారు

ప్రాచీన కాలమునుండియుఁ బ్రఖ్యాతి వహించిన పాండ్య దేశమున "మణమేల్కుడి" యను గ్రామమొండు గలదు. అయ్యూరు సారవంతములగు శాలిక్షేత్రముల కాటపట్టు. కదళీ పనసామ్రక్రముకవనము లందనేకములు గలవు. అందు పాఁడి పంటల కేకొఱంతయు లేదు. అందలి జనులు గృహస్థ ధర్మమును చక్కఁగ నిర్వహించుచు సుఖంబుండిరి. అట్టి గ్రామ మందు కులచ్చిర నాయనారుఁడను నొక భక్తుఁడుండెను. సుందర మూర్తి కీర్తించిన తిరుత్తొండత్తొహైలో "పెరునంబి" యని చెప్పఁబడిన వాఁడే యీ శివభక్తుఁడు. ఇతఁడు భక్తజనపాద సేవయే ముక్తిమార్గమని యెఱింగి, వారిని సేవించుచుండు వాఁడు. ప్రత్యహ మాతఁడు భక్తుల నర్చించి, యన్నమిడి వారితో శివసంభాషణ మొనర్చుచు, సంతసించెడివాఁడు.

తన్నుఁగాంచు భక్తు లేజాతివారైనను, ఎట్టివారైనను శైవ మార్గానుయాయులయి యున్నఁ జాలును వారిని పూజ్యార్హు లని యెంచి మ్రొక్కి తదభీప్సితము నెఱవేర్చుచుండెను. భక్తు లేవేళ వచ్చినను లేదనక యన్నదాన మొనర్చుచుండెను.

కులచ్చిరయారు సకల విద్యా పారంగతుఁడు, రాజనీతి విశారదుఁడు. పంచాక్షరీ జపపరాయణుఁడగు నితఁడు పాండ్య భూపతియగు (నెడుమారన్) కుబ్జపాండ్యునకు ప్రధానమంత్రియై శత్రుజన భయంకరుఁడై ప్రజారంజకుఁడై యుండెను. రాజ నీతిని తు, చ, తప్పకుండ నడపుచు, పన్నులను క్రమముఁగ రాఁబట్టుచు, రాజభక్తిపరుఁడై యుద్యోగమును నిర్వహించు చుండెను, కుబ్జపాండ్యుని పట్టమహిషి మంగయక్కరశి శివభక్తురాలగుట నితఁడామెకు దాసుఁడై యంతఃపురమందును పేర్గాంచెను. శీర్గాళి భక్తప్రభువగు జ్ఞానసంబంధుఁడు పాండ్య దేశములోని జైనులను వాదమున నోడించి, శైవముఁ బ్రోది సేయ నితఁడాభక్తాగ్రగణ్యుని పాదములను శిరముపైఁదాల్చి యాతని యాజ్ఞలను జవదాఁటక నీచశ్రమణులను శూల ముల నెక్కించి చంపెను. శ్రమణమత వినాశమునకుఁ దోడ్పడి శైవమును దశదిశలందు వ్యాపింపఁజేసిన కులచ్చిర యారు వంద్యుఁడుగదా!

"దైవదూషకులతోడి విరోధము, దైవారాధకుల తోడి మైత్రి జ్ఞానులకు స్వభావసిద్ధము."

# 23. పెరుమిళలి కురుంబ నాయనారు

నేటి పుదుక్కోటకు ననతిదూరమునఁ బూర్వము "పెరుమిళలి" యను గ్రామముండెను. అచట మామిడి తోఁపులు, పనసక్రముక వనములు మెండు. అందలి జనులు సనాతనాచారపరులు. వారు విభూతిని ధరించి సన్మార్గగాములై శివసేవాసక్తులై యుందురు. అందొక పాలెగాండ్ర కుటుంబమున "కురుంబనార"ను భక్తుఁడుండెను. వానిది కురునీల మన్నరు వంశము. అతఁడు సంపత్సమేతుఁడు గనుక భక్తులకు నన్నమిడుటయేఁగాక ధనాదు లొసఁగుచుండెను. అర్ధనారీశ్వరుని దివ్య చరణారవిందములందుఁ దఱుఁగని భక్తిఁగలవాఁడై యుండెను. ఈతఁడు సుందరమూర్తి పాద కమలములను సేవించువాఁడై యుండె. ఆతని సేవయే ముక్తిహేతువని త్రికరణశుద్ధిగ గురువని సేవించి మ్రొక్కుచుండెను. సుందరుని బోధల ననుసరించుచు నాతని నామమునే స్మరించుచు, నణిమాది సిద్ధులఁ బడసినను, పంచాక్షరీ మంత్రమును విడువక జపించుచుండెను.

ఒకనాఁడు సుందరుఁడు కొడుంగొళూరునకు రా నితఁడాతనిని సేవించి మ్రొక్కెను. "సుందరుఁడు శివుని దయచే మఱునాఁడు కైలాసమేఁగఁగలఁ"డని తన యోగశక్తిచే కురుంబనారెఱింగెను. "సుందరుఁడు కైలాసమేఁగిన పాపలేని కన్నువలె నా బ్రతుకు నిరర్థకము. నేఁడే యోగముచే శివుని పాద

ములఁ జేరుదు"నని నిశ్చయించెను. వెంటనే యోగము నాశ్రయించెను. బ్రహ్మరంధ్రముఁ జీల్చికొని యాతని యాత్మ కైలాసముఁ జేరెను. గురువు రాకకు ముందే శిష్యుఁడు కైలాసమున కేఁగి యాతనికి స్వాగతమిచ్చుటకు వెడలుటయందలి పరమార్థ మాతనికే తెలియును. ఆ గురు శిష్య భావము సర్వజ్ఞునకే యెఱుక.

"గురుస్సాక్షాత్ పరబ్రహ్మ."

# 24. కారైక్కాలమ్మయారు

చోళదేశమున కలంకారమైనది కారైక్కాలు నగరము. అయ్యది సముద్రతీరము నంటియుండు. సాగరతరంగములు త్రోసిన శంఖములుఁగల కాల్వ లానగరముఁ జుట్టియుండును. అన్నగరియందు, ధర్మమార్గానుయాయులు సత్యపరిపాలనా ధురంధరులగు వైశ్యులు లెక్కకు మించి కోట్లకుఁ బడగలెత్తినవారుఁ గలరు. వారికి ధనదత్తుఁడు నాయకుఁడు. అతనికిఁ బూర్వజన్మ పుణ్యఫలమా యన సౌందర్యరాశియైన పునీతవతి యను పుత్రిక సాగరునకు లక్ష్మివోలె నుండెను.

పునీతవతి బాల్యమాది శివదాసియై పెరుగుచుండెను. ఆ బాలిక శివాలయమును శివపూజలను గాంచినంతనే శివాధీన మనస్కయై మైమఱచెడిది. శివార్పిత చిత్తయగు నా

బాలిక క్రమముగఁ బెరిఁగి యౌవనవతి యాయెను. వయస్సుతోఁబాటామె యందము లోకమోహనమై అభివృద్ధి నందెను. తండ్రి కుబేరసంపదఁ గలవాఁడగుటఁ జేసి యామె యలంకరణములకుఁ గొదువ లేకుండెను. ఆ శృంగారవతి నవరత్నాభరణభూషితయై జిలుఁగు వలువలు దాల్చి, తల్లిదండ్రులకేగాక బంధువులకును మోదము గల్గించుచు, రతీదేవిని పరిహసించు రూపసంపదతో గృహలక్ష్మియై యుండెను. అందముతోఁబాటు శివభక్తియు మిన్నందుచుండెను. ఆట పాటలందు శివకథలేగాని యామె యన్య మెఱుంగదు. తమ గృహంబునకు వచ్చు భక్తుల నామె వినయవిధేయతలతోఁ బూజించును. సకల శుభలక్షణ యుక్తయగు నాముగుద యహర్నిశలు శివస్తోత్రములను వినుచుం బాడుచు నానందించుచుండెను.

ధనదత్తుని వంశమువలె ప్రాచీనమైన వైశ్య వంశము మఱొకటి యా నగరమందుండెను. అందు నిధిదత్తుఁడను వైశ్యశిఖామణి దిగంతయశోవిశాలుఁడై వసించుచుండెను. అతనికి పరమదత్తుఁడను పుత్త్రుఁడు గలఁడు. నిధిదత్తుఁడు పునీతవతి రూప గుణాదులను విని, యామె తనకు దగినకోడలని తలఁచి, కన్య నడుగ కులవృద్ధులను ధనదత్తునికడ కంపెను. వారు ధనదత్తునిఁగాంచి కన్య నడిగిరి. ధనదత్తుఁడు నిధిదత్తుని వంశము, గోత్రముఁ బూర్వుల చరిత్రమును విని పుత్త్రిక నీయ నంగీకరించెను. పెండ్లి పెద్ద లా విషయమును నిధిపతి కెఱింగించిరి. ఆతఁడు "తన వంశము పావనమయ్యె"నని తలంచి బంధుమిత్రా

దులఁ బిలిచి, మహాపూర్తికుల రావించి శుభ ముహూర్తమును నిశ్చయించి ధనదత్తునకుఁ దెల్పెను. ముహూర్త దినమునఁ గొమరు నలంకరింపఁజేసి మంగళ వాద్యములతో బంధుమిత్రా దులతో నుత్సవముగఁ గన్యాగృహమున కేఁగెను. ధనదత్తుఁడు వారిని వివాహాగారముఁ జేర్చి, వేదవిధి ననుసరించి పునీతవతిని పరమదత్తున కొసంగెను. ఆనాఁటి ధనదానములకు నాటపాట లకు విందులకు పౌరు లానందించిరి. సీతారాముల కల్యాణ మట్లది శోభావహ మాయెను.

వివాహానంతరము ధనదత్తుఁడు తన యేకైక పుత్త్రికను వీడలేక యల్లుని నిల్లడ యుంచుకొనెను. అల్లునకుఁ గూఁతునకు నొక ప్రత్యేక భవనముఁ గట్టించి సకల సంపదల నొసఁగెను. పరమదత్తుఁడు పునీతవతిఁగూడి సకలభోగముల ననుభవించుచు, తనజాతి ధర్మమును వీడక వ్యాపారము చేయుచుండెను. లక్షల కొలఁది ధనమార్జించెను. పునీతవతి భర్తయం దనురాగము గలదై సేవించుటయేగాక శివభక్తులను పూజించుచుండెను. సాంసారిక ధర్మముల నామె నిర్వర్తించుచున్నను, మనంబును సర్వదా పరమశివునియందు లగ్నమొనర్చి శివధ్యానము నే మఱకయుండెను. తామరపాకుపై నీటిబిందువువలె సాంసారిక మోహములఁ జిక్కక శివాధీన మనస్కయై యుండెను.

పునీతవతీ పరమదత్తులు సుఖముగఁ గాపురము సేయు చుండు నాకాలమున నొకనాఁడొకఁడు వ్యాపారార్థమై వచ్చి, రెండు మామిడిపండ్లను పరమదత్తున కొసఁగెను. అకాల సము

పాగత ఫలద్వయము నాతఁడు పునీతవతికిఁ బంపెను, ఆమెయు వానిని భద్రపఱచెను. అపుడొక శివభక్తుఁ డాఁకట నకనకఁ బడుచు వచ్చి యన్నమడిగెను. ఆమె వాని బుభుక్ష నెఱిఁగి యాహ్వానించి, పీఁటవైచి, ప్రక్షాళిత పాదుని భక్తునిఁ గూర్చుండఁ జేసి, అరఁటియాకుఁ బఱచి యన్నము వడ్డించెను. అప్పటికి నన్నమునకై వ్యంజనములు సిద్ధము గానందున భర్తపంపిన చూతఫల మొకటి యిడ నాతఁడు కడుపార భుజించి దీవించి పోయెను.

పిదప పరమదత్తుఁడు మధ్యాహ్న భోజనమునకై వచ్చి స్నానమొనర్చి భుజింప నుపవిష్టుఁడుగా, నామె యన్నము నిడెను. మిగిలిన మామిడిపండును బెట్టెను. అతఁడాఫలముఁ దిని దాని మాధుర్యమునకు మెచ్చి, "మఱొక ఫలమునుఁ బంపితిఁ గదా! దానిని తెమ్ము" అనెను. ఆ సతి తెత్తునని యేఁగి కింకర్తవ్యతా విమూఢురాలై హృదయము సంచలింప నిశ్చేష్ట యయ్యెను. దశసహస్ర శిష్యపరివృతుఁడై వచ్చిన దుర్వాసుని తృప్తిఁబఱుప సాయపడిన దెవరు? ఆపద్బాంధవుఁడు శివుఁడుతప్ప నాకిక దిక్కెవరు? అని "పరమశివా! దీనురాలిని గాపాడుము" అని మొఱయిడెను. వెంటనే మామిడిపండొకటి యామె హస్తమునఁ బడెను. శంకరుఁడు భక్తవశంకరుఁడు గాఁడే! ఆయమ యానంద భరితురాలై మానరక్షకుఁడైన సర్వేశునకు వందనం బాచరించి యా పండుఁదెచ్చి భర్త కొసంగెను. అతఁ డద్దాని నాహరించి "యియ్యది మధురాతి మధురంబు. మొదటి దానివలె లేదు. నేఁబంపిన ఫలము గాదు.

ఇది ముల్లోకములం దలభ్యము. ఎట్లిది నీకు లభించె?'' నని ప్రశ్నించెను. ఏమి బదులాడుటకు వలనుపడమి "ముందున కేఁగిన నూయి వెనుక కేఁగిన గోయిగఁ బరిణమించెను. శివుని కరుణాతిశయమును చెప్పను రాదు. చెప్పకుండ నుండనురాదు. "సత్యము నెట్లు దాఁచఁగలను అని తలఁచి "శంకరుని కరుణచే లభ్య మాయె'' నని నడచిన వృత్తాంత మంతయు భర్తకుఁ దెల్పెను. సుశీల పునీతవతి యసత్య మెట్లాడఁగలదు?

"శివుఁడే దీనిని నీ కొసఁగుట తథ్యమగుచో, నాతని వేఁడి మఱొక ఫలముఁ దెమ్ము చూత''మని యాతఁడు వల్కెను. ఆ సతి యా స్థలమును వీడి లోకేశుని స్మరించి "భక్తపాలకా! దాసురాలి కిపుడు మఱొక పండు నీయనిచో నా మాట సత్యదూరమని నాథుఁడు భావించును. దాసుల పాలిటి కల్ప వృక్షమా! కరుణింపుము'' అని ప్రార్థింప, యథాపూర్వము ఒక ఫల మామె హస్తమునఁ గోచరించెను. దాని నామె భర్త కొసఁగెను. అతఁ డాశ్చర్యముతో దానిని గాంచుచుండ యది యగోచరమాయెను. అట్లగుట కాతఁడు భీతిఁజెందెను. "ఇది మనుష్య స్త్రీ గాదు. దేవవనిత. దీనితోఁ బొత్తు తగదు. దీనిని త్యజించుట మేలు'' అని భావించి యా నాఁటినుండి యామెను పరిత్యజించెను.

అతఁడు పునీతవతి కంటఁ బడకుండ నెందేని యేఁగఁదలఁచి, "పరదేశముల కేఁగి వ్యాపార మొనర్చి వత్తు''నని పలికి సరకులను నావల కెక్కించి పయనమాయెను. ద్వీపాంతరముల కేఁగి వర్త

కముచే నపారధన మార్జించెను. కొంతకాలమున కాతఁడాధన ముతో మరలి వచ్చి పాండ్యదేశముఁ బ్రవేశించెను. ఒక రేవు పట్టణమున వ్యాపార మొనర్చుచు ధనికుఁడని కీర్తిఁగాంచెను. ధనికుఁడై యొంటరిగనుండ నేల యని యొక వైశ్యుని కూఁతుఁ బెండ్లియాడెను. తా మున్నొక వనితను వివాహమాడి యామెకు ద్రోహ మొనర్చెనను విషయ మేరికిం దెలియని విధమున సంసార యాత్ర సాగించు చుండెను. ఇట్లుండఁ గొంతకాలమున కాతనికి స్త్రీ శిశు వుదయించెను. తన మొదటి భార్య దేవజాతిస్త్రీ. వందనార్హ. ఆమె పేరీ బిడ కిడిన యామెను పూజించి నట్లగునని, యాతఁడా శిశువునకు పునీతవతి యని నామ మిడెను.

పరమదత్తుఁడట ద్వితీయ కళత్రముతో సుఖించుచుండ నిట కారైక్కాలునందు పునీతవతి భర్త మరలి రానందులకు విషణ్ణచిత్తయై సతీధర్మము ననుసరించి భగవత్సేవతోఁ గాలముఁ బుచ్చుచుండెను. అన్యాయ మెంతకాలము దాఁగును? పరమ దత్తుఁడు పాండ్యనగరమున నుండుట క్రమముఁగ కారైక్కాలు నందు వ్యాపించెను. ఆమె బంధువులందలి సత్యాసత్యముల నెఱుంగఁగోరి వార్తాహరులఁ బంపిరి. వారు వచ్చి యది సత్యమని తెల్ప, వారందఱు క్లేశపడిరి. పునీతవతిని భర్త కడకుఁ జేర్చుట యుచిత మని వారామెను పల్లకి నెక్కించి దాస దాసీలతో పర్వతములను నదులను గ్రామసీమలను దాఁటి పాండ్యనగరమును సమీపించిరి. పునీతవతి రాక పరమదత్తు

నను నశనిపాతమువలెఁ దోఁచెను. వాఁడు భార్యను బిడ్డను వెంట నిడికొని వచ్చి యామెకు మ్రొక్కి "యమ్మా! నేను నీ దయచే జీవించియున్నాఁడను. నాకుఁ బుట్టిన యీ బిడకు నీ పేరే పెట్టితిని. కరుణింపు"మని పల్కి సాష్టాంగ నమస్కార మొనర్చెను. అట్లాతఁడు మ్రొక్కుటఁ గాంచిన పునీతవతి భయముతో బంధువుల వెనుక కేఁగెను. అంత వారు "ఓయీ! యేలేని భార్యకు మ్రొక్కుదురా? ఇది దురాగత" మనిరి. పరమదత్తుఁడు వారితో "ఆర్యులారా! ఈమె మానవ వనిత గాదు. దేవతా స్త్రీ యని యెఱింగి వేరొక తెను వివాహ మాడి, యీ శిశువుఁ గంటిని. వందనార్హయగు నీమెకు మ్రొక్కితి. ఇందు దోసమేమి గలదు" అనెను.

పునీతవతి వాని మాటలను విని, "ఇఁక నాకు గత్యం తరమేమి? పశుపతీ! నీవే నాకు దిక్కు. రెంటికిఁ జెడిన దాననైతి. ఈ వైశ్యుఁడిట్లు నిశ్చయించెను. ఈతనికై యీ దేహము నింతకాలముఁ గాపాడితిని. ఇఁక నిది యెవరికి? దేవా! భూతగణముల రూపము నా కొసంగుము. దాసు రాలిని మన్నింపుము" అని ప్రార్థించెను. వెంటనే యామె సుందర శరీరమందలి మాంసము నశించెను. ఎముకలు మిగి లెను. దేవ మానవ స్తుత్యార్హమగు భూతరూపము నామె పొందెను. ఆ వింత కాశ్చర్యమునంది దేవతలు పూవుల వానఁ గురియించిరి. శివభూతగణములు నాట్యమాడెను. అట్టి భూతరూపముఁ గాంచి బంధువులు భయపడి పాఱిపోయిరి.

తాను భూతగణములలో నొకతె నైతినని యామె సంతసించి "అద్భుత తిరువందాది" అను శతశ్లోకములుగల దివ్య ప్రబంధమును చెప్పి గానమొనర్చెను. మఱియు శంకరుని దివ్య మహిమలఁ దెల్పు "తిరు ఇరట్టై మణిమాల" అను గ్రంథమును రచించి స్తుతించెను. కవయిత్రియు, దివ్య జ్ఞానవతియునైన కారైక్కాలమ్మయారు కైలాసముఁ గాంచఁదలఁచి బయలుదేఱెను. ఆమె యాశతో శివునిఁ బ్రార్థించి పొందిన భూతరూపముతో నేఁగుచుండ, జనులు భూతము భూతమని యఱచుచు భీతితోఁ బఱుగిడుచుండిరి. జనుల మాటలను విని యామె "సత్యమెఱుంగని యీ మూఢు లేమి తలంచిన నేమి! నేనేరూపముతో నున్న వీరికేమి? శివుఁడు నన్నెఱింగినఁ జాలు" అని తలంచుచు నుత్తరదిశ కేఁగెను. మనోవేగమున ననేక దేశముల నతిక్రమించి యుమాపతికి నావాసమగు కైలాస ప్రాంత భూమిఁ జేరెను. ఈ పవిత్ర భూమియందు కాళ్లతో నడచి, యపవిత్ర మొనర్పరాదని యామె శిరముతోఁ బ్రాఁకసాగెను.

పునీతవతి భూమిని శిరముతో నతిక్రమించి వచ్చుటఁ గాంచి, యుమాదేవి నాథునితో "నాథా! శిరముతో నడచి వచ్చు నీ యస్థి పంజరము భక్తి యెట్టిది?" యని యడిగెను. శివుఁడు "ఈ వచ్చు వనిత మనలఁ గాపాడు తల్లి. ఆమె నన్నుఁ బ్రార్థించి భూతరూపముఁ బొందినది" అని చెప్పునంతలో నమ్మయారు శివసాన్నిధ్యమునకు వచ్చెను.

వెంటనే యుమాపతి "తల్లీ!" యని పిలిచెను. ఆమె "అప్పా" యని యా మహేశుని పాదపద్మములపైఁ బడి మ్రొక్కి లేచెను. శివుఁడు "అమ్మా! నీకేవరముఁ గావలయు?" ననెను. ఆమె "సర్వకాల సర్వావస్థలయందు నీయందు నిశ్చల భక్తి గావలయు. పునర్జన్మము లేకుండఁ జేయుము. నీవు నటనము సేయునపుడు నేఁ బాడుచు నీ పాద పద్మముల నీడలో నుండునట్లు వరమిమ్ము" అని ప్రార్థించెను, కృత్తివాసుఁ డామె కోర్కెఁ దీర్పఁగోరి "తిరువాలంగాడులో నేను నటింప నీవు గాంచి యానందముతోఁ బాడుదువుగాక" యని యనుగ్రహించెను.

అట్లనుగృహీతయై యామె వెంటనే తిరువాలంగాడునకు వచ్చి చేరెను. యాలయమున కేఁగి యాకాశమంటుచు నానంద తాండవమాడు శివస్వరూపముఁ గాంచి, "కొంగై తిరంగి" అని యారంభించు తిరుపదిహామును పాడి మ్రొక్కెను. తల్లీ యని యుమాపతిచేఁ బిలువంబడి యా నటరాజేశ్వరుని నృత్యముఁ గాంచి స్తుతించి యాతని యుద్ధృత పాదకమల యుగళమున లీనమై శాశ్వతానందము నందెను.

"శివునిఁ గీర్తించువారు శివపాదములనే పొందుదురు."

# 25. అప్పూది అడిగళ్ నాయనారు

చోళదేశమున "తింగళూ"రను నొక గ్రామము గలదు. అందు అప్పూదియడిగళుఁడను నొక బ్రాహ్మణ భక్తుఁడుండెను. అతఁడు సదాచారసంపన్నుఁ డగుటయేఁ గాక శివారాధన తత్పరుఁడు. వేదవేదాంగముల నభ్యసించి, చంద్రశేఖరుని దివ్య కరుణాతిశయము నందెను. అతఁడు మహిమోపేతుఁడై దిగంతములఁ దన దివ్య కవితా స్రవంతిచే నింపిన తిరునావుక్కరసు మహిమలను విని యాతనిం గాంచకయే యమ్మహాత్ముని యప్పూది మనసార గురువుగ నంగీకరించెను. వాగీశుని సేవయే శివసేవ యని విశ్వసించెను. కామ క్రోధములను స్తేయాసత్యములను దరిఁ జేరనీయక యనింద్య గుణగణ్యుఁడై యతఁడు గృహస్థ ధర్మములను నిర్వర్తించుచుండెను. తన పుత్త్రులకేగాక పశ్వాదులకును తిరునావుక్కరసు నామమిడి పిలిచి యానందించెడివాఁడు. అతఁడు నిర్మింపఁజేసిన ప్రపాదులకు, బాటలకు చెఱువులకు నావుక్కరసు నామమునే యుంచి యయ్యాయి స్థలములలోని శిలాఫలకములందుఁ జెక్కించి స్థాపించెను. గురుభక్తియం దీతని కేకలవ్యుఁడును సాటిగాఁడనుట యతిశయోక్తిగాదు.

ఇవ్విధంబున వాగీశుని పేర నప్పూది ధర్మకార్యముల నొనర్చు కాలమున తిరునావుక్కరసు క్షేత్ర సందర్శనాభిలా

పిదియై యేఁగుచు, తింగళూరున కనతిదూరమున• మార్గమునఁ బోవుచుండెను. అయ్యది వేసవికాలము. మండుటెండలోఁ బయనించు పథికుల శ్రమఁదీఱ నప్పూది నిర్మించిన పానీయశాల యొకటి సజ్జన హృదయమువలె నతిశీతలమై తరుచ్ఛాయా సమన్వితమై యొప్పుచుండఁ గాంచి, విశ్రామార్థ మచటికి నావుక్కరసు వచ్చెను. దయావంతుల మనంబువలె జనుల కాశ్రయమిచ్చి, యాతప బాధలను నివారించు నాచలిపందిరి లోని శీతల మారుతములచే హాయిని పొంది, వాగీశుఁడచటి హిమజలములఁగ్రోలి "నావుక్కరసు చలిపందిరి"యని వ్రాసి యుండుటఁ జూచి యాతాయాత జనంబులఁగాంచి "దీనికీ పేరిడిన వారెవ"రని ప్రశ్నించెను. వారు "దీనిని యప్పూది యడిగళుఁడను ధర్మాత్ముఁడు స్థాపించెను. అతఁడనేక ధర్మ శాలలను తటాకములను, మఠములను నిర్మించి యీపేరునే పెట్టియున్నాఁ"డనిరి. ఈ యప్పూదిని నే మున్నెఱుంగను. అతఁడు నన్నెఱుఁగడు. ఇట్లాతఁడు నాపేర ధర్మముల నొన ర్చుటలోని భావమేమి?" అని తలఁచి, "యాతఁ డెచ్చోటఁ గలఁ"డని యడిగెను. వారదిగో కన్పడు తింగళూరునఁ గలఁడు. ఇపుడే గృహంబున కేఁగెను" అని పల్కిరి.

ఆశ్చర్యరసమగ్నుఁడైన వాగీశుఁడు వెంటనే బయలు దేరి, యాతని గృహాంగణముఁ జేరెను. శివదాసుఁ డొకఁడు వాకిట నున్నాఁడని వినిఁ యప్పూది సరభసగమనమున వచ్చెను. అప్పూది మ్రొక్కుటకు ముందే వాగీశుఁ డాతనికి నమస్క

రించెను. అప్పూదియు నాతనికి ప్రత్యభివందన మాచరించి, "దయామయా! మీరాకచే నా జన్మము సఫలమాయెను. గతజన్మమున నే నెట్టి తపం బొనర్చితినో! నా గృహము పవిత్ర మయినది. భవాదృశుల దర్శన భాగ్యము లభించుటరుదు" అని పల్కెను. వాగీశుఁడు "అయ్యా నేను తిరుపళనమును సేవించి వచ్చుచు మార్గమున మీరు స్థాపించిన చలిపందిరిని గాంచి మీ ధర్మములను విని మిముఁ గాంచ కుతూహలుఁడనై వచ్చితి. సంశయ మొకటి పీడించుచున్నది. అచట నీపేరును వ్రాయించక మఱొకరి పేరేల వ్రాయించితివి" అనెను.

అంత నప్పూది "బాగుగఁ బల్కితిరి. క్రూరాత్ములగు జైనుల నోడించి పల్లవరాజును శివభక్తునిఁ గావించిన వారి పేరుగాక వేఱొకరి పేరెట్లిడుదును? ఎవని నామమును స్మరించిన జనులు సుఖులగుదురో యట్టి తిరునావుక్కరసు నామమునే నేను లిఖింపఁజేసితి. ఆపేరెందులకని నే విన నీవు కఠినముగఁ బల్కితివి. ఱాతిని తెప్పగఁ జేసికొని తీర మెక్కిన వాగీశుని పేరు వినని వారీ లోకమున నెవరున్నారు? శివవేషధారివయ్యు నిట్లడిగితివి. నీవెచటివాఁడవు? ఎవ్వండవు?" వని చుఱచుఱఁ జూచుచుఁ బల్కెను. అంత అప్పరు "పరసమయము నాశ్రయింప వ్యాధినిఁ గల్పించి, శివుఁడెవ్వానిని దాసునిఁగా గ్రహించె నట్టి యల్పజ్ఞాని నగు దాసుఁడ నేనే" యనెను.

ఆ మాటను వినినతోడనే యప్పూది కన్నులనుండి యానంద బాష్పములు రాల పులకిత దేహుఁడై . చేతులు

జోడించి, మాటలు తడఁబడ భూమిపైఁబడి సాష్టాంగముగ నమస్కరించెను. నావుక్కరొ సాతని హస్తములఁబట్టి లేవనెత్తి కౌఁగలించెను. 'వెదుకఁబోయిన తీఁగ కాళ్లకుఁ దగిలినటుల' పేదకు పెన్నిధి దొఱకినటుల సంతసించి. తానెవ్వానిఁగాంచ నిన్ని దినంబు లువిళ్లూరుచుండెనో యా మహాత్ముఁడు నావుక్కరసు తలవని తలంపుగ నట్లు సాన్నిధ్య మొసఁగుటచే నప్పాది మైమఱచి యాతని ముందానందతాండవ మాడెను. ఏమి సేయుటకు మాటలాడుటకుఁ దోఁచనివాఁడై సంభ్రమించెను. వెంటనే లోనికేఁగి భార్యా పుత్త్రులం బిలిచి, నావుక్కరసు వచ్చె నని చెప్పి వారందఱిని మ్రొక్కింపఁజేసెను. పిదప వాగీశుని గృహంబులోనికిఁ గొంపోయి యర్ఘ్యమిచ్చి పాదములఁగడిగి తజ్జలమును శిరమునఁ దాల్చెను. ఆసన మిడి విధితో నర్చించి విభూతి నంది తనయింట భుజియింపఁ బ్రార్థించెను. అతఁడంగీకరించెను. అప్పాది గృహిణి శాకపాకంబులను సిద్ధపఱచి భర్తకెఱిఁగించెను. అతఁడు తన జ్యేష్ఠ పుత్త్రుఁడగు తిరునావుక్కరసునిఁ బిలిచి, తోఁటకేఁగి లేఁత యరఁటిఁ యాకును గోసి తెమ్మనెను.

''వాగీశుని సేవలో నాకీ యల్పావకాశము లంభించె''నని సంతసించుచు నా బాలుఁడు, తోఁటకేఁగి, యప్పుడే విరిసిన యాకునుఁ గోయఁబోవ నొక త్రాచాతని చేతినిఁ బెనవేసికొని కాటువేసెను. ''విషాగ్ని జ్వాలల నుమియు నా సర్పమును విదిల్చి, విషము తలకెక్కుటకు ముందె దీనిని తల్లికొసఁగెద''నని

తలఁచి, యాతఁడు మైకము గ్రమ్ముచున్నను వేగముగ పరుగిడి వచ్చి దానిని తల్లిచేతనుంచి యేమియుఁ జెప్పక మూర్ఛిలి క్రిందఁబడెను. నోట నురుగులు గ్రమ్మ నిశ్చేతనుఁ డయ్యెను. విషవేగముచే శరీరము నలుపెక్కెను. తలిదండ్రు లాబాలుని హస్తమునుండి రక్తముఁ గాఱుటయు, నోట నురుగులు గ్రమ్ముటయుఁ గాంచి, యాతఁ డురగదష్టుఁడై మరణించెనని గ్రహించిరి. పుత్త్ర మరణమునకు వారు కొంచెమైనను దుఃఖింపక "వాగీశుని భోజనమున కాటంకముఁ గల్గెనే"యని దుర పిల్లిరి. వెంటనే వారా బాలుని కళేబరమును చాపలోఁ జుట్టి యొకమూల దాఁచి, యేమియు జరుగనట్లే నావుక్కరసుఁ జేరి "స్వామీ! భుజింప దయసేయుఁడు" అని ప్రార్థించిరి. అతఁడు పాదప్రక్షాళన మొనర్చి, యాసన మందాసీనుఁడై వారికి విభూతి నిచ్చి, "భస్మముఁ గైకొనఁ బుత్త్రులఁ బిలువుఁ"డ నెను. పుత్త్రులందఱు రా, మీ జ్యేష్ఠుఁడేఁడీ "యనెను, అప్పూది అతఁడిపుడు రాఁజాలఁడు. మీరు భుజింపుఁ" డనెను. అవ్వార్తతో నావుక్కరసు మనంబు చలించెను. ఆతఁడు "నీ మాట నాకు సంశయముఁ గల్గించుచున్నది. అతఁడేమి చేసె? ఎటకేఁగె? నిజముఁ దెల్పుము" అన నప్పూది భయముతో వడఁకుచు "మహాత్ముల భోజనమున కాటంకము గల్గెఁగా! చెప్పకుండిన నసత్యదోషము గల్గును" అని వడఁకుచు తన పుత్త్రునకుఁ గల్గిన యాపద నెఱిఁగించెను.

ఆ విషాన వృత్తాంతమును విని వాగీశుఁడు "ఇట్లో నర్చువా రీ లోకమునఁ గలరా! మీకు మీరే సాటి. మృత పుత్త్రుని దేహము నాలయమునకుఁ గొనిరండు" అని పల్కి ముందుగ నాలయమున కేఁగెను. వారు బాలునిఁ గొనిరాఁ గాంచి పరమేశ్వరుని "ఒన్ఱుకొలాం" అని యారంభమగు పద్యములతో స్తుతించెను. వెంటనే మృత్యుంజయుని కరుణచే బాలుని దేహము విషరహితముగా, నిద్రనుండి మేల్కొను నట్లా బాలుఁడు లేచి, వాగీశునకు మ్రొక్కెను. అతఁడా బాలునకు విభూతి నొసఁగి యాశీర్వదించెను. అందఱు నానందించిరి. కాని యా దంపతులు వాగీశునకు సకాలమున నాహారమిడఁజాలమైతిమని చింతించిరి.

వాగీశుఁడు వారితో గృహంబున కేఁగెను. అప్పూది గోమయముచే స్థలశుద్ధి యొనర్చి, ముగ్గులిడి యరఁటియాకుఁ గోసినవైపు కుడిప్రక్క నుండునట్లు వైచి, జలముఁ బ్రోక్షించెను. వడ్డన సాగెను. వాగీశుఁడు "నీవు నీ కొమరులతో వచ్చి నా సహపంక్తి భుజింపు"మన నట్లే యని వారు ఆసీనులుగా 'నమృతమ'స్తని వారందఱు భుజించిరి. పిదప వాగీశుఁడా గృహంబునఁ గొంతకాలముండి వారిని సంతసపఱచెను.

పిదప వాగీశుఁడు తిరుప్పళనమునకుఁ బోయి కంఠేకాలునకు మ్రొక్కి "శొన్మాలై" యను గీతముఁ బాడి, యంతమున అప్పూది యడిగళుని సేవా మహిమను నుతించుచు కవిత

సెప్పెను. వాగీశుని పొగడ్త నందిన అప్పూది అడిగళుఁడు సదా యా భక్తునే తలంచుచు శివసేవాసక్తుఁడై జీవించి, చివఱకు చిదంబర నటరాజేశ్వరు పాదపద్మచ్ఛాయం జేరి శాశ్వతానందము నందెను.

"భక్తజనసేవయే భగవత్సేవ."

# 26. తిరునీలనక్క నాయనారు

కవేరకన్యచేఁ బవిత్రమైన చోళదేశమున కలంకారమైనది శాత్తమంగళము. అయ్యది పాడిపంటలకుఁ బ్రసిద్ధమైనది. వేదవిదులగు విప్రులందు శతాధికముగఁ గలరు. చెందామరలతో నిండిన సరోవరములందు స్నాన మాడు వనితామణులతో రాజహంసలుఁ జేరి వారి కంకణధ్వనులంబోలి శబ్దించుచుండును. బ్రహ్మచారులు పఠించు వేదములను విని పికశారిక లవ్వానిఁ దమ బిడ్డలకు నేర్పుచుండును. భస్మత్రిపుండ్రధారులైన బ్రాహ్మణుల గృహంబులందు త్రేతాగ్నులు వేదత్రయము వలెఁ బ్రకాశించుచుండును. అయ్యగ్నిత్రయముతోఁ దమ పాతివ్రత్యాగ్నిఁ జేర్చిరా యన నచటి సతీమతల్లులు విలసిల్లుచుందురు.

అందు తిరునీలనక్కరను శ్రోత్రియ భక్తుఁడు స్తుత్యార్హుఁడై నెగడుచుండెను. అతఁడు సనాతనాచారములతోఁ

బాటు శివసేవావిధిని నియమముగ నొనర్చుచుండెను. శివ భక్తులను సంతసపఱచుటయే వేదభావమని యాతఁడు మాహేశ్వరులఁ బూజించుచు నన్నాదులచేఁ దృప్తిపఱచుచుండెను.

ఒకానొక యార్ద్రా నక్షత్రమున అయవందీశ్వరునిఁ బూజింపఁ దలఁచి, గృహిణి పూజాద్రవ్యంబులఁ గొని వెంటరా నాలయముఁ జొచ్చి, మ్రొక్కి యథావిధిఁ బూజించి పంచాక్షరిని జపించుచుండెను.

అపుడు విషపు సాలీఁడొకటి శివలింగముపైఁ బడెను. దానిఁ గాంచిన నీలనక్కరుని భార్య "అయ్యో! యీ పుర్వు శివునేమి బాధించునో" యని తలఁచి, పసిబిడ్డపై సాలీఁడు పడఁ గాంచిన తల్లి దాని నూఁదివేయునట్లా యమ నోటితో దాని నూఁదెను. అపుడామె నోటినుండి లాలాజల మా లింగముపైఁ బడెను. ఉమ్మి నీరు శివునిపైఁ బడుటఁ గాంచిన నీలనక్కరా యపచారమునకు దురపిల్లి, కన్నులు మూసికొని "ఓసీ! బుద్ధి విహీనురాలా! యేమి చేసితివి? శివునిపై నుమియుటకుఁ గత మేమి?" యనెను. అందులకామె చలింపక "విషపు సాలీఁ డొకటి శివునిపైఁ బడ నోటితో నూఁది పాఱఁద్రోలితి" ననెను.

ఆయమ భవునిపైఁ జూపిన మాతృవాత్సల్యము నెఱుఁగఁ జాలనివాఁడై యతఁడు తన సేవావిధి నిట్లు చెఱచినదని దుఃఖించెను. "ఓసీ! సాలీఁడును మార్గాంతరమునఁ దొలఁగఁజేయక యుమ్మినీరు పడు నట్లూఁది యపచార మొనర్చి దోషివైతివి. నిన్ను బరిత్యజించితి" నని యాతఁడు పల్కెను.

అపుడు భానుఁ డస్తంగతుఁడాయెను. నీలనక్కరు పూజను ముగించి యింటికేఁగెను. అతని భార్య పరిత్యక్త గావున గృహమునకుఁ బోవక భీతిగ్రస్తయై యాలయమందే యుండెను. ఆనాఁటి రాత్రి యయవందీశ్వరుఁడు నీలనక్కరుని స్వప్నమునఁ దోఁచి, "ఓయీ! నీ భార్య యూఁదిన భాగము తప్ప, మిగిలిన నా దేహము పురువు ప్రాఁకుటచే నుబ్బియున్నది. చూడుము" అని పల్కెను. అతఁడు భయముతో లేచి మ్రొక్కి శివుని దయ కాశ్చర్యపడి తన చర్యకుఁ జింతించెను. అరుణోదయమున నాలయమునకుఁ బరుగిడి పోయి, యామె నిర్దోషి గాన గారవించి గృహంబునకుఁ దోడ్తెచ్చెను.

అక్కాలమున జ్ఞానసంబంధుని మహిమాతిశయములను లోకులు స్తుతింప విని, యా భక్తాగ్రేసరు నెప్పుడు గాంతునా యని తలంచుచుండెను. జ్ఞానసంబంధుఁడు తిరునీలకంఠ యాల్పాణుఁడు నాతని భార్యయు వెంటరా, తీర్థయాత్రలఁ జేయుచు శాత్తమంగలమున కేతెంచుచున్నాఁడని విని, యూరి నలంకరింపఁజేసి బంధువులతో నెదురేఁగి తోడ్తెచ్చి పూజించి యాతిథ్య మొసఁగెను. సంబంధుఁడు వెంటవచ్చిన భక్తవరులతో నాతని యింట భుజించెను. భాస్కరుఁడు పశ్చిమాంభోనిధిలోఁ గ్రుంకెను. శీతమయూఖుఁడు తన చల్లని కిరణములతో లోకము నానందపఱచెను. అపుడు సంబంధుఁడు నీలనక్కరునిఁ బిలిచి "యీ రేయి నీవు యాల్పాణునకు నాతని భార్యకు నీ యింట శయనాది వసతులఁ గల్పింపు" మనెను.

ఆ మాటల కాతఁడు సంతసించి నట్టింట నగ్న్యారాధన వేదిక సమీపమున వారికి శయనాది వసతులను గల్పించెను. వారా యగ్నులకడఁ జేరఁగనే యవి మునుపటికన్న మిక్కిలిగ జ్వలింపఁ జొచ్చెను. యాల్వాణ దంపతులచట నా రేయిఁ గడపిరి. సంబంధుఁడుదయమున యయవందీశ్వరునకు మ్రొక్కి, స్తుతించి యితర క్షేత్ర దర్శనమునకు బయలుదేఱి పోయెను.

తన్ను వెన్నంటు నీలనక్కరు నాపి సంబంధుఁ డేఁగెను. నీలనక్క రాతని యాజ్ఞను మీఱఁజాలక యతిథ్యభ్యాగతులఁ బూజించుచునుండెను. కొంత కాలమునకు తిరునల్లూరులో జ్ఞానసంబంధుని కల్యాణ మహోత్సవము జరుగునని విని యట కేఁగి, సంబంధునితో దివ్య తేజంబునఁ బ్రవేశించి శివ సాయుజ్యము నందెను.

"భక్తులతోఁ జేరిక జన్మ దుఃఖముఁ దొలఁగించును"

## 27. నమినందియడిగళ్ నాయనారు

చోళచక్రవర్తులచేఁ బాలింపఁబడు పొన్నిన దేశమున "ఏమప్పేరూరు" అను నొక గ్రామముఁ గలదు. ఆ గ్రామముఁ జుట్టి కేదార క్షేత్రములు నందనోద్యానములు పెక్కులు గలవు. అందలి వీథులు నిత్యోత్సవములతో నలరారుచుండును. పచ్చని పైరులలో నంధకారముఁ దాఁగియుండును. క్రమముకో

ద్యానములందు భ్రమరములు ఝుంకారము సేయుచుండు. రక్తాంభోజములతో నిండిన శాలిక్షేత్రములు సైకతస్థలి యాగ కుండములందు జ్వలించు నగ్నులా యన నుండును. ఆ గ్రామ టికయందు సదా వేదధ్వనులు విననగు.

అందు విభూతి మహిమ నెఱింగిన వైదిక బ్రాహ్మణ కులమున నమినందియను నొక భక్తవతంసుఁ డుండెను. అతఁ డాబాల్యము భవుని భజించుచుండువాఁడు. అతఁడు సచ్ఛీ లుఁడు. భస్మాభ్యక్త దేహుఁడగు నాతనిఁ గాంచి జనులు పరమశివుఁడే భూమియం దవతరించెనా యని తలంచెడివారు. ప్రత్యహ మాతఁడు తనయూరినుండి తిరువారూరునకుఁ బోయి భవానీపతి నర్చించి వచ్చుచుండెను.

ఒకనాఁడు నమినంది వల్మీకనాథుని సేవించుచు మార్గ మున నున్న అరినెరి యాలయముఁ జొచ్చి, సేవించి యమ్మహా దేవునకు దీపార్చన సేయ సంకల్పించెను. అపుడే గభస్తిబింబ మస్తమించుటఁగాంచి, స్వగ్రామమునకేఁగి ఘృతముఁదెచ్చి దీపములను వెలిగించుటకు సమయము లేదని తలంచి సమీప గృహమునకుఁబోయి యాలయమున దీపములను వెలిఁగింప నేతి నొసంగెదరా''యని వేఁడెను. అయ్యది దుష్టాత్ములగు జైనుల కావాసమని యాతఁ డెఱుఁగఁడు. జైను లాతనిఁ గాంచి, ''హస్తంబున జ్వలన జ్వాలలఁ దాల్చిన నీ దేవునకు దీప మేల? యని పరిహాసించిరి. ఇట నేయిలేదు. నీటం గొంపోయి వెలిఁగించు''మని గేలిచేసిరి.

జైనుల దురుక్తుల కాతఁడు వెతఁజెందెను, ఆలయమునకుఁ బోయి శివునిముందు సాగిలబడి దుఃఖించెను. అపుడు "నమినందీ! విచారింపకుము. ఈ పార్శ్వమున గోచరించు కొలనినీటిం బోసి వెలిఁగింపుము" అను దివ్యవాణి వినిపించెను. ఆ వాక్కు శివుని కరుణయే యని, తలంచి పోయి గుంటనీటిం దెచ్చి ప్రమిదెలలోఁ బోసి వత్తులు వైచి వెలిఁగించెను. శివుని కరుణాతిశయముచే నీరు తైలముగా దీపములు దేదీప్యమానములై వెలింగెను. నమినంది సంతసముతో నాలయమందంతట సహస్రాధిక దీపములను వెలిఁగింప నయ్యది పట్టపగలా యనునుండెను.

నీటితో వెలిఁగింపు మని పరిహసించిన జైనుల కన్నులు మిఱుమిట్లుగొన వారి యెదుట నా నీటితో వెలిఁగించిన నమినంది మహిమ లోకమంతయు వ్యాపించెను. జైనులు లజ్జచేఁ దలలు వ్రాల్చిరి. అతఁడా రేయియంతయు నాఱిపోవు ప్రమిదెలలో నీటినిబోసి వెలిఁగించుచుండెను. మఱునాఁడు నట్లే వెలిఁగించి సేవించెను. ఇట్లు అనేక దినములు గడచెను.

నమినంది నీటితో దీపములను వెలిఁగించు కాలమున దండియడిగళుఁడను నొక పరమ మాహేశ్వరుఁడు జైనులను వాదమున నోడించి పాఱఁద్రోలెను. తిరువారూరు భక్తుల మహిమ దిక్కులఁ నిండెను. చోళ చక్రవర్తి నమినంది మహిమను విని, తిరువారూరునకు వచ్చి దేవుని నిత్య నైవేద్యాదులకు ధనధాన్యాదుల నొసంగి యా ధర్మము శాశ్వతముఁగ

జరుగుటకు భూముల నిచ్చి యన్వీక్షణకు నమినందినిఁ బ్రార్థించెను. అతఁ డంగీకరించి వీథీవిటంకస్వామి యుత్సవములను, ఉత్తర ఫల్గున్యుత్సవములను జరిపించుచు త్యాగేశుని సేవలకే లోపము గల్గని విధమ్మునఁ జూచుచుండెను.

తిరుమణలియందు ఫల్గున్యుత్సవము జరుగుచున్నదని విని, నమినంది యటకేఁగెను. ఆ యుత్సవమున జాతిభేదముఁ బరిగణింపక జనులందఱు వచ్చి త్యాగేశుని సేవింతురు. నమినందియు స్వామిని సేవించి గ్రామమునకు వచ్చి యింటిలోనికిఁ బోవక వాకిట తిన్నెపైఁ బరుండెను. అతని భార్య వచ్చి "లోనికి రండు. శివపూజను చేసి భుజింపుడు" అనెను. "అతఁడు నేను తిరుమణలి యుత్సవమునకుఁ బోయి మైల పడితిని. నాకచట ననేక జాతులవారి సంపర్కము గల్గినది. శుద్ధ జలముఁ దెమ్ము. స్నానమాడి లోనికి వత్తు"ననెను. ఆయమ జలాహరణార్థమై లోనికేఁగెను. శ్రమవలననో శివుని కరుణవలననో యాతనికిఁ గునుకువట్టెను. స్వప్నమున వల్మీకనాథుఁడు గన్పించి, "ఓయీ! జ్ఞానులు వైదికులుండు తిరువారూరులో జన్మించిన వారందఱు నాగణములే. వారిలో నుత్తమాధమ జాతుల నెంచకుము" అని పల్కెను. భయముతో నాతఁడు లేచి స్నానమొనర్చకయే లోనికేఁగి శివపూజావిధిని నిర్వర్తించి యా రేయి గడిపి, యుదయముననే తిరువారూరునకుఁ బోయెను. అచటి జనులందఱు శివస్వరూపములతో శివగణంబులవలెఁ గన్పించిరి. అపుడాతఁడు వారికి మ్రొక్కెను.

కొంతవడికి వారందఱు సామాన్య జనులుగఁ గన్పించిరి. నమినంది త్యాగేశుఁ జేరి "దాసుని తప్పు మన్నింపు మని ప్రార్థించి యచటనే నివసింప సాగెను. వాగీశుఁ డితనిని తన పద్యములలో నమినంది భక్తులలో నొఱపిడి బంగార "మని కీర్తించి యున్నాఁడు. అట్టి మహిమాతిశయముఁ గాంచిన నమినంది శివుని సేవించుచు శివపాదారవింద దివ్యకాంతిలో లీనమాయెను.

"భక్తులలో జాతిభేదముఁ పాటింపరాదు."

## 28. తిరుజ్ఞానసంబంధమూర్తి

వైదిక శైవమును లోకమునఁ బ్రకాశింపఁ జేసినవాఁడు, బాలుఁడై యుమామహేశులఁ గాంచి యేడ్చి, జ్ఞాన క్షీరములఁ గ్రోలినవాఁడు, శీర్గాళిలో నవతరించినవాఁడగు జ్ఞానసంబంధుని పదసరోజములను శిరమునఁ దాల్చి యా శివభక్తాగ్రేసరుని దివ్య గాథను వచింతు.

శైవసమయ మార్గముఁ బెంపొందించిన చోళ చక్రవర్తుల దేశమందు కావేరీనదీ ప్రాంతమున "తిరుక్కళుమల" మను ప్రాచీన నగర మొండు గలదు. అందలి ప్రాకారములు మేఘములఁ దాఁకుచుండును. సాగర తరంగము లాప్రాకా

రము నంటుటచే నేర్పడిన చారలు మందర పర్వతమునకుఁ జుట్టిన వాసుకివలె గన్పించును. రవి యొక్కండయ్యు సాగరమున ననేక బింబములుగఁ గన్పించురీతి నచటి కొలంకులందు చెందామరలు విలసిల్లుచుండును. అచటి హోమ కుండంబుల నుండి వెల్వడు ధూమము రాత్రియో యన నుండ, వైదికులు దాల్చిన విభూతి ప్రకాశము మధ్యాహ్న భ్రాంతిఁ గల్పించు చుండు. కేదార క్షేత్రములందు వికసించిన చెందామరలు యోగాగ్నులవలె నుండు. తీరములందలి చూతవృక్ష శాఖ లందలి ఫలములు ముదురఁ బండి పగులుటచే స్రవించు మధుర రసము అగ్నులవలెఁ బ్రకాశించు చెందామరలపైఁ బడుట, వృక్షములను శాఖాదర్వులచే హోమము లొనర్చుచున్నవా యన నుండు. పుష్పాడి గాలికి నెగసి, భ్రమరములను కన్నీరు కార్చునట్లు చేసి పాడించుట శ్రోత్రియ బాలురకుఁ దండ్రులు సామవేదము బోధించుటను స్ఫురింపఁజేయును. అందలి వనితామణులు అరుంధతిని మించిన పతివ్రతలు. అందాకాశమునంటు భవనములు లెక్కకు మించియుండు. పొలముల నీటి కాల్వలలో ముత్యములుండును. అందు వేద పాఠ శాలల సంస్కృత పాఠశాలల పఠించు ఛాత్రుల ధ్వనియు తోఁపులందలి భ్రమరీ ఝుంకారము లొకటియై చెవులకు విందగు చుండును. అపుడపు డచట వేద సభలు జరుగుచుండును.

అట్టి యా నగరమునకు బ్రహ్మపురము, వేణుపురము, పుహాలి, వెంకురు, తోణిపురము, పూంతరాయి, శివపురము,

పురవము, చంప, కాళి, కొచ్చవయము, తిరుక్కళుమలము అను ద్వాదశ నామములు గలవు.

శివపాదహృదయుఁడు—భగవతి :—

సస్యాదులతో నతిశయించిన శీర్గాళి క్షేత్రమున వైదిక కులమున కౌండిన్య గోత్రజుఁడైన శివపాదహృదయుఁ డను విప్రోత్తముఁ డుండెను. ఆతని సతి భగవతి. ఆమెయు సద్వంశ జాతయగుట శీలవతియై నుతి కెక్కెను. ఆయమ పతిని సేవించుచు పుట్టినింటికి మెట్టినింటికి యశము సేకూర్చు చుండెను. ఆ దంపతులు శివస్మరణముచేఁ గాలముఁ బుచ్చు చుండిరి. విషయాంతరాసక్త హృదయులుగాక, వారు విభూతిని సేవించుచు శివాధీన మనంబులతో నుండిరి.

అక్కాలమున నా దేశమందు జైన బౌద్ధుల దుష్కృత్యములు మితిమీఱుచుండెను. వేదప్రచారమున కవరోధ మేర్పడెను. విభూతి ప్రకాశము క్షీణింపసాగెను. అట్లగుటకు శివపాద హృదయుఁడు చింతింపఁ జొచ్చెను.

ఒకనాఁడా దంపతులు "పరసమయ దురాచారములను దుర్భావముల నడఁచి, విభూతి మహిమను లోకవ్యాప్త మొనర్చు పుత్త్రు నొసంగు"మని శివునిఁ బ్రార్థించిరి. శీర్గాళిలో పెరియనాయకితోఁ గూడిన తోణియప్ప రాతని ప్రార్థనకు మెచ్చెను. భగవతి గర్భముఁ దాల్చెను. అతఁడు వేదవిధి ననుసరించి యా యా కాలములందు సీమంతాది కృత్యములచే గర్భరక్షణ మొనర్చుచుండెను.

సంబంధుని యవతారము :—

మిత్రాది శుభగ్రహము లుచ్చస్థాన మందియుండు శుభ లగ్నమున ఆర్ద్రా నక్షత్రమందు పరసమయాశ్రితుల గర్వము నడఁప, వైదిక శైవము విజృంభింప, శివభక్తుల హృదయకమలములు వికసింప, విభూతి మహిమ దిగంతములు వ్యాపింప, దేవాదులానందాబ్ధి నీఁదుచు మోదింప యాగములు పెంపంది భాసింప తమిళ భాషాయోష యొనర్చిన తపఃఫలమాయన శీర్గాళి మహిమాన్వితముగా శ్రీ జ్ఞానసంబంధుఁడా భగవతి గర్భ శుక్తిముక్తా ఫలంబై యవతరించెను.

కౌండిన్య గోత్రమందొక సత్పుత్త్రుఁ డుదయించె నని విని శీర్గాళివాసులంద ఆనందభరితులైరి. పూఁదోఁటలందు లతా తరువు లామూలాగ్రము పుష్పించినవి. మలయమారుతములు మెలమెల్ల వీచినవి. దేవతలు పుష్పవర్షముతోఁబాటు భూమికి దిగివచ్చి, శ్రోత్రియు లొనర్చు యాగాదులందుఁ బాల్గొనిరి. శివభూతగణాధీశు లా కారుణ్యమును స్తుతించి లోకులకు మేలొనర్చిరి. వృక్షములు పుష్పఫలాదులతో నిండి తమ యామోదమును వెలిబుచ్చినవి. పంట లపారముగఁ బండినవి. నదీనదములు సరస్సులు కుల్యలు నిర్మల జలపూరితము లయినవి. గగనము నిర్మలమై తారాగణంబులతో నొప్పినవి. పక్షిగణంబులు మధురకూజితము లొనర్చినవి. సంబంధుని యుదయమున శీర్గాళి వీథులందు శంఖ భేరీ మృదంగాదులు తమంత తామే మ్రోఁగినవి.

ఇవ్విధంబున శీర్గాళి సంతోషసాగరమున మునిఁగియుండ శివపాదహృదయుఁడు తన గృహము నలంకరింపఁజేసి, బాలునకు ప్రథమస్నాన మొనర్పఁజేసెను. పిదప జాతకర్మాదులను యథావిధిఁ గావించెను. నగరవాసులును యథోచితముఁగ గృహముల నలంకరించి పుష్పాదితో ప్రాంగణముల నింపి తమ సంతసమును వెలిఁబుచ్చిరి. పంచపాలికలను తిన్నెలపై నుంచిరి. క్రొంగ్రొత్త నీటితో నింపిన సువర్ణకలశములను ద్వారప్రదేశముల నుంచి, పుష్పమాలికలఁ గట్టి యందుఁ జేరిన తుమ్మెదలా యన నడుమ వేపాకుల దండలను చేర్చి, వాకిళ్లలో వ్రేలాడునట్లొనర్చిరి. 'అహిలు' కట్టియల పొగలతో తెల్లావాల ధూపములఁ జేర్చిరి. పౌరులు శివుని కరుణ వెల్లడి యగునటుల ననేక శుభకార్యముల నొనర్చిరి. ఇట్లు దశ దినములు వారు తమ సంతసమును వెల్లడించిరి.

ఆర్ద్రా నక్షత్ర జాతునకు సార్థకమైన పేరిడి, బాలార్క తుల్యుని, కుమారస్వామివలె నెసంగు వానిని, బంగరు తూఁగు టుయ్యేలలోఁ బరుండఁ జేసిరి. శివజ్ఞాన క్షీరంబులఁ గ్రోలఁబోవు నబ్బాలకునకుఁ దల్లి స్తన్యమిచ్చెను. విభూతి నధికముఁగ నాకాంక్షింపఁబోవు నా బాలకునకు మెయినిండ విభూతి నలఁదిరి.

వేదార్థ స్వరూపుఁడైన జ్ఞానసంబంధుని తల్లియు బంధు స్త్రీలును తమ యొడులలో రతనాల తూఁగుటుయ్యాలలో, పూఁబాన్పులపై పరుండఁబెట్టుచు, నీలాంబరీ రాగములఁ

బాటలు పాడుచు, జోకొట్టుచుండిరి. దినదినాభివృద్ధిం గాంచిన సంబంధుఁడు వేదములు వృద్ధిఁగాంచినటుల శిరమెత్తి, శివపాద సేవ వినా యితరము నొనర్పననునటుల మోము నాడించుచుఁ దొక్కు పల్కుల నాడ సాగెను. "మేము శైవముఁదప్ప పర సమయముల నెఱుఁగజాలము, కాన పరమతస్థులారా! దూర ముఁగఁ బొండు" అనునటుల హస్తములంజేర్చి తట్టుచుండెను. భావికాలమునఁ దాను సదాశివుని దివ్యహస్తములనుండి చిఱితాళంబులఁ బొందఁబోవుటను సూచించుచుఁ జేతులతో తాళములు తట్టుచు నాడుచుండెను. పరమతములు గతి తప్పి నశించునటుల శివజ్ఞానమును పొందఁబోవునాతఁడు, స్వగృహాం గణమున దోఁగాఁడ సాగెను. అతఁ డాడుచుండ బంధు స్త్రీలు వచ్చి "కౌండిన్య కల్పవృక్షమా! పరమత నిర్మూలనదక్షా! శివమూర్తీ! రా, రా,"యని పిలుచుచుండిరి. అపు డబ్బాల కుఁడు వారివైపు గాంచి, చిఱునవ్వు నవ్వ వారి యానందము నకు మేర లేకుండెను. పరుగిడి వారు వాని నెత్తి ముద్దాడుచుండిరి.

ఇట్లా బాలకుఁడు శుక్లపక్ష చంద్రునివలె నభివృద్ధినంది యేకవర్ష ప్రాయమువాఁ డయ్యెను. తల్లి స్నానమాడించి పుష్పా దుల నలంకరింప కాలియందెలు గల్లుగల్లుమనుచు పరమత నిరాసముఁదెల్ప తప్ప టడుగులతో నాతఁడు సంచరించు చుండెను. దాదుల హస్తము నాధారముగఁగొని నడచుచుఁ గ్రమముగఁ దానే నేలపై పాదములను మోఁపి, నడయాడుచుఁ గ్రీడించు చుండెను.

తోణియప్పరుని కరుణచే నాతఁడు మూఁడేండ్లవాఁడాయెను. అతఁడా వయస్సునందే మహిమోపేతుఁడై యుండెను. జన్మాంతరకృత పుణ్యవాసనా వాసితుఁడైన యతఁడు శివపాద స్మరణమును మఱువకుండెను. శివపాద హృదయుఁ డొనర్చిన పుణ్యముచేఁ బుట్టినవాఁడయ్యు శివసంబంధము వీడి వచ్చితినే యని యపుడపు డాతని హృదయమున శివస్మృతిరా, నాపరమేశునిఁ దలఁచుచున్నటుల నేడ్చుచుండును. మహాత్ముల చర్యలు వారికే తెలియుఁగాని పరులకు దురవగాహము లేగదా!

ఇట్లుండ నొకానొక దివసంబున శివపాద హృదయుఁడు స్నానాది నిత్యవిధులఁ దీర్చికొనుటకై కొలనికేఁగుచుండ, శివుని కరుణ సమీపింప సంబంధుఁ డేడ్చుచు తండ్రిని వెన్నరిెను. అట్లె తెంచు బాలునిఁగాంచి తండ్రి ముందునకేఁగక నిలువఁబడి, కపట కోపము నటించి యాతని రావలదని నివారించెను. అ బాలుఁడు గుసిలించుచు నందియలతోడి పాదములఁ దట్టుచు వెనుకకుఁ బోవనని యేడ్చుచుండెను. 'అట్లగుచో రమ్మ'ని వానినెత్తికొని, యనేక ప్రళయములఁ గాంచినదియు నిత్యాపమైన బ్రహ్మతీర్థపు టొడ్డునుఁ జేరెను.

బాలుని గట్టుపైనిడి తా జలములఁ గ్రుంక భయపడి, శివపాద హృదయుఁడు తోణియప్పరునిఁ దలఁచి బాలుని రక్షింపఁగోరి, నీటఁదిగెను. వేగముగ స్నానాదివిధులను ముగించి, భాస్కరున కర్ఘ్యమిడి యఘమర్షణ సూక్తముఁ

284B



పార్వతి సంబంధునకు జ్ఞానక్షీరముల నొసఁగుట

బఱించుచుండెను. ఆ సమయమున జన్మాంతర స్మరణముచే శివపాదంబులు స్మరణకు రా, నా బాల సంబంధుఁడు తండ్రిఁగానక యా యను నటు లేడ్వఁజొచ్చెను. కన్నీరు కాల్వలుగట్ట, బింబాధరోష్ఠము వడఁక, వేదఘోషమా యన జీవకోటులు సంతసింప దుఃఖించుచు, దిక్కులు సూచుచు చిట్టచివరకు తోణి యప్పరు నాలయపు శిఖరముంగాంచి, "అమ్మా! అప్పా" యని రుద్ధకంఠముతోఁ బిలువసాగెను.

తోణిపురేశ్వరుఁడు సంబంధుని పూర్వజన్మ సేవను తలంచి, యాతనిఁ గరుణింప నుమాసహితుఁడై వృషభా రూఢుఁడై యక్కొలని గట్టును చేరవచ్చెను. భగవతీ శివ పాదులకు నొసఁగిన వరమును సార్థక మొనర్పఁ దలఁచియు, తమ పాదములను స్మరించు నా బాలునకు శివజ్ఞానము నొసంగను, వావిడిచి తముఁబిలుచు నాతనిఁ గరుణింపఁ దోణియప్ప రుమా దేవియగు పెరియనాయకిఁగాంచి "నీ స్తన్యమును బంగరు గిన్నెలోనుంచి వీని కొసంగుము" అనెను.

వేదమాతయు సకల జగన్మాతయునైన పార్వతి శివు నానతి నా బాలుని పార్శ్వమున కేఁగి, యొడిలో నిడికొని స్తన్య మును బంగరుపాత్ర నింపి, యోగులకు నగమ్యమైన శివ జ్ఞానామృతము నాక్షీరములతోఁ గలిపి, తన్నుఁగాంచి రుదించు నా బాలుని కన్నీటిని వస్త్రాంచలమునఁ దుడిచి, యా క్షీర ములఁ ద్రావించెను. బాలసుబ్రహ్మణ్యునకు నలభ్యంబైన స్తన్య మాతనికి లభించుటఁజేసి సంబంధుఁడు జ్ఞానసంబంధుఁడై

కుమారతుల్యుఁడై విశ్వవిఖ్యాతి నందెను. జగతఃపితరులగు నుమా మహేశులచే దాసుఁడుగా గ్రహింపఁబడి యాతఁడు దాసబాలుఁ డయ్యెను. బ్రహ్మేంద్రాదులకును మహర్షులకును, యోగివర్యులకును తెలియరాని శివజ్ఞానముతో నా బాలునకు సంబంధముఁ గల్గుటచే నతఁడు జ్ఞానసంబంధుఁడని కీర్తిఁగాంచెను. ఆతఁడు మాయను నశింపఁజేయునట్టి పరాపర జ్ఞానసత్యము నెఱింగెను.

"సకలప్రాణులకు నాదిపురుషుఁడు లింగగురు స్వరూపుఁడు పరమశివుఁడే" యను తత్త్వార్థము నెఱింగినవారే భక్తులు. అట్టి తత్త్వజ్ఞానముచే సంబంధుఁడు మహిమాన్వితుఁడై ప్రకాశించెను. శివపాదహృదయుఁడు తన యాహ్నికముల నల్పకాలములోఁ బూర్తి గావించికొని తీర మెక్కి, దివ్యజ్ఞానముతో వెలుఁగొందు బాలునిఁ గాంచి "నీ వెవ రొసఁగిన క్షీరంబులఁ గ్రోలితివి? నీ మోము నిట్లు ఎంగిలి మంగలముఁ జేసినవారిఁ జూపుము" అని యొక చిఱుబెత్తముఁ జేకొని, కొట్టఁబోవువానివలె నటించును బెదరించెను. బాల. జ్ఞానసంబంధుఁడు నేత్రాంచలంబుల నానందబాష్పములు గురియుచుండ కరములు శిరమునఁ జేర్చి, మ్రొక్కి యొకయంగుళితో, గగనమును దివ్యతేజంబుతో నింపి వృషభవాహనారూఢుఁడై యుమాదేవిఁగూడి ప్రత్యక్షమైయుండు తోణియప్పరును చూపెను. వెంటనే యా బాలుఁడు హృదయము నిండి పొంగి . పొరలివచ్చు జ్ఞానసంపదతో, వేదాదియగు ప్రణవ

మందలి యోంకారముతో హల్సంయోగ మొనర్చి, వినువా రాశ్చర్యమున మునుఁగునటుల శివుని కర్ణేంద్రియములు సోఁక, మధురమైన తమిళ భాషలో శివుని కర్ణములనే వర్ణించుచు "తోడుడయ శవియర్ ..." అని యారంభించి సహజ కవితా ధారతో పది పద్యములఁ జెప్పి స్తుతించెను. అందు శివుని యంగ ప్రత్యంగములను వర్ణించి "నన్నిట్లొనర్చినవాఁ డీ శివుఁడే గదా!" యని తండ్రికిఁ జూపెను, ("తోడుడయ శవియర్ విడైయేరియోర్, తూవెణ్ మదిశూడి, కాడుడయ శుడలై ప్పొడి పూసి, ఎన్ ఉళ్ళం కవర్కళ్లన్, ఏడుడయ మలరాల్, మునై నాళ్పణింది, ఏత్త అరుళ్ శెయిద, పీడుడయ పిరమాపుర మేవియ పెమ్మాన్ ఇవన్ అన్రే") (శోభిత కర్ణకుండలములు గలవాఁడు వృషభవాహనాధిరూఢుఁడు సితపక్ష తృతీయ చంద్ర కళాధరుఁడు పితృవనోద్ధృత భస్మోద్ధూళిత దేహుఁడు మచ్చిత్తా కర్షకుఁడు పూజిత పుష్పదళ శోభితుఁడు వందిత సకల లోకుఁడు బ్రహ్మపురవాసియగువాఁడీ శివుఁడేగదా.)

సంబంధుని ప్రథమదశ శ్లోకముల సారార్థము :—

"భూలోకవాసులు అగణ్యంబులగు పాపము లొనర్చిన వారయ్యు ముక్కంటిని స్మరించు వారగుచో నాతని కృపా పాత్రులై పాపరహితులై ధన్యాత్ములగుదురు. రావణుఁడు కైలాసపతిని గణింపక యా వెండికొండ నెత్తఁబూని, దాని క్రిందఁబడి నలిఁగి శ్రమఁజెంది సామగానముతో నా పరాత్పరుని స్తుతింప కరుణఁ జూపె. భక్తితో సేవించువారిని శివుఁడుఁ

కరుణఁ గాంచునని యెఱుంగక, శివుని మ్రొక్కక మహాదోష మొనర్చిన విష్ణువు నీచమగు వరాహ రూపము నొందె! బ్రహ్మ హంసరూపముఁగాంచె. వారిరువురు శంకరుని యాద్యంతములఁ గానఁగోరి, భవలింగమును చుట్టిచుట్టియుఁ గనుఁగొనఁజాలని వారై పంచాక్షరీ మహామంత్ర మహిమచే శివతత్త్వముఁ దెలిసికొనిరి గదా! వేదాదియైన మహేశ్వరుని సాన్నిధ్యముఁ గల్పించు శైవమార్గము నెఱుంగఁజాలని శ్రమణ బౌద్ధులు నీచులై దుష్టమార్గముల నాశ్రయించి కష్టాత్ములైరి.'' అను భావముఁజెప్పి పదునొకండవ గీతములో మకుటముఁగ తన నామముఁజేర్చి, ఆ పది పద్యములఁ బాడిన విననను గల్గుఫలమును వివరించి కవిత సెప్పి యా మూఁడేండ్ల బాలుఁడు శివునిముందు నిలిచెను.

శివుఁడు సంబంధునిఁ గరుణించిన రీతిని గాంచిన దేవతలు పుష్పవర్షముఁ గురిపించిరి. గంధర్వు లాడిపాడిరి. శివగణాధ్యక్షులు దిక్కులు పిక్కటిల ''శంభో శంకర''యని ఘోషించిరి. భవసాగర తరణమునకై తన పాదములను తోణిఁగ (పడవగ) నొసఁగి రక్షించు తోణియప్పరు పెరియనాయకితో తోణియాలయముఁ బ్రవేశించెను. వేదధేనువునకు వత్సమైన సంబంధుఁడు శివుఁ డాలయముఁ జేరుటఁగాంచి యారూప మునే మనంబున నిల్పికొని మెల్లగ నడచి యాలయముఁ జొచ్చెను.

శివపాదాదుల సంతసము :—

కొమరుఁ డవ్విధంబున జ్ఞానియై కవిశిరోమణియై శివదాసుఁడై యాలయమునకుఁ బోవుటఁ గాంచుచుండిన శివపాద హృదయుని చేతిలోని బెత్త మాతనికిఁ దెలియకయే జాఱి పడి పోయెను. అతఁ డొడలెఱుఁగక యానంద తాండవ మాడెను. ఆతఁడు హృదయమున నద్భుత భయాశ్చర్యములు ముప్పిరిఁగొన సంబంధుని కవితలోని దివ్య భావములనే తలంపసాగెను. అతఁడీశ్వరునిఁ బ్రత్యక్షముగఁ గాంచని వాఁడయ్యు బాలున కచట క్షీరముల నొసంగిన చిహ్నములఁ గాంచియుఁ బాలుఁడు సెప్పిన కవితను బట్టియు, పశుపతి తన పుత్త్రునిపైఁ గరుణఁ జూపెనని నిశ్చయించెను. సంతసముతోఁ బుత్త్రుని వెన్నంటి శివపాదుఁ డాలయమున కేఁగెను, బ్రహ్మతీర్థమున ననుష్ఠాన మొనర్చుకొనుచుండిన వైదికులు, జరిగినది గాంచియు బాలుని కవితను చెవులార వినియు నా యద్భుత సంభవమున కాశ్చర్యముఁ జెంది, "ఇట్టి దీ లోకమున నెచటఁగాంచితిమి?" అని తలంచుచు నాలయ గోపుర ద్వారముచెంత గుమి గూడిరి.

సంబంధుఁ డీశుని సమీపించి "నన్నిపుడు దాసునిగాఁ జేసికొనిన శివుఁడిట నున్నాఁడు." "ఇంగు య్మెన్నె ఆళుడ య్యార్ ఉమయోడు మిరిందార్" అని యారంభమగు పద్య దశకము సెప్పి స్తుతించెను. అబ్బాలకుఁడు శివానుగ్రహముచే గానకళా మిళితమగు మధుర కవితను శివున కర్పించు స్వభా

వముఁ గలవాఁడై సేవించి గర్భాలయమును వీడి, వైదికు లుండు స్థలమునకు వచ్చెను.

శివుని కరుణా పాత్రుఁడైన బాలునకు వైదికు లెదు రేఁగి, మ్రొక్కి "జ్ఞానసాగర సుధారసరూపా! వేదోద్ధారకా! జ్ఞానజలధరా! బ్రహ్మపుర జనశరణా! శ్రుతప్రకాశా! పుణ్యరాశీ! సత్యజ్ఞాన భాసా! జయము జయ"మని వినుతించుచు స్వాగత మొసంగిరి. "నధర్మ వృద్ధేషు వయ స్సమీక్ష్యతే" యని గదా ప్రసిద్ధి. మూఁడేండ్ల బాలుని పాదములపైఁబడి వృద్ధ వైదికులు మ్రొక్కుటలో నాశ్చర్యమేమి? అతఁడు ధర్మ వృద్ధుఁడు గదా!

శివపాదహృదయుఁడు జ్ఞానసంబంధుని భుజములపైఁ దాల్చెను. శివభక్తులు వైదికులు తమ యంగవస్త్రములను వీచుచు జయఘోష లొనర్చుచుండ వీథి కిరువైపుల నుండు భవనాగ్రములఁ జేరిన భామినులు చిత్రవర్ణ భాసురంబులగు పుష్పములతోఁ బేలాలను కలిపి, మంగళగీతములఁ బాడుచు నా బాలునిపైఁ జల్లిరి. మంగళ వాద్యములు మ్రోఁగుచుండ విప్రుల సామగానములు దిక్కులు నిండుచుండ శివపాదుఁడు పుత్త్రుని గృహంబునకుఁ గొనివచ్చెను.

శివక్షేత్ర యాత్ర :—

జ్ఞానసంబంధుఁడా రాత్రి తోణి యప్పరుని పాదకమల ములను ధ్యానించుచు సుఖముఁగ నిద్రించెను. ఉషఃకాలము

240 B



జ్ఞానసంబంధుఁడు — చిఱుతాళములఁ బొందుట.

ననే మేల్కాంచి యతఁ డాలయమున కేఁగి, మాతాపితరులగు పార్వతీ పరమేశ్వరులకు మ్రొక్కి స్తుతించి, వారియనుమతి నంది "తిరుకోలక్కా" యను శివక్షేత్రమును దర్శింప బయలు దేరెను.

బంగరు చిటితాళములఁ బొందుట :—

తరంగహస్తములతోఁ బుష్పంబులఁగొని తెచ్చు కావేరీ నదీతీరమందలి తిరుక్కోలక్కాయను దివ్య క్షేత్రమును సంబంధుఁడు తండ్రితో భక్తబృందముతోఁ జేరి, యాలయమునకుఁ బ్రదక్షిణ మాచరించి, వేదమయమై ప్రకాశించు శివునకు మ్రొక్కి "పొలమున గండుచేఁప లెగురు (మడియిల్ వాళై పాయ") అని యారంభించు పద్య దశకము సెప్పి రాగయుక్తముఁగఁ గాలనియతిఁ దప్పకుండ చేతులతో తాళము వేయుచుఁ బాడెను. అపుడా పరమేశ్వరుని దయచే పంచాక్షరి చెక్కఁబడిన బంగరు తాళము లాతని చేతికి వచ్చెను. ఆ యద్భుతమున కతఁ డాశ్చర్యముఁ జెంది తాళములను శిరముపైఁ దాల్చి స్వరరాగ సుధారసము చిప్పిలునటులఁ బాడి యానందించెను. అతఁడు తాళములఁ దట్టుచు నొనర్చిన గానమునకు నారద తుంబురులు గంధర్వులు, గాన కళానిష్ణాతులగు గాయకులానందించి యాతనిపైఁ బూలవానఁ గురియించిరి. పశుపతి ప్రసాదలభ్యములైన తాళములఁ బొంది సంబంధుఁడు శీర్గాళినిఁగాంచ నభిలషించెను. తండ్రి యాతనిని భుజములపై నిడికొని రా, వచ్చి శివునిఁ గాంచి మ్రొక్కి 'తక్క'యను తమిళ

రాగమున పది పద్యములను పాడి తాళములఁ దట్టుచు నృత్య మొనర్చెను. పిదప జ్ఞానజీమూతుఁడైన సంబంధుఁడు తండ్రితో నింటికేఁగి శీర్గాళిపుర వాసులకు దర్శన మొసంగి సుఖముండెను.

ఇట్లుండ సంబంధుని తల్లియగు భగవతి జన్మస్థలమగు తిరుననిపల్లిలోని వైదికులు శ్లాఘ్యబంధువులు, ముఖ్యేఁడుల బాలుఁడు కవిత సెప్పుట, శివునివలన తాళములఁ బొందుటను విని, వేదములఁ బఠించుచు శీర్గాళికి వచ్చి యా బాలుని పాద ములకు మ్రొక్కిరి. అట్లే శివభక్తులును తండోపతండములుగ వచ్చి యాతనికి సాష్టాంగ మాచరించి సంతసించిరి. శివ పాదుఁ డందఱిని సత్కరించెను. వచ్చిన భక్త బృందములతో శీర్గాళి శివలోకమా యనఁ బ్రకాశించెను.

సంబంధుని ద్వితీయ యాత్ర :—

తిరుననిపల్లి వైదికులు సంబంధుని తమ యూరికి రమ్మని ప్రార్థింప నతఁడంగీకరించి యాలయమున కేఁగి మ్రొక్కి శివ క్షేత్ర దర్శనాకాంక్షియై వారితో నడచి పోవఁజొచ్చెను. బాలుని మోయు పుణ్య మితరుల కేల? యనియో, వాత్సల్య ముననో యాతని నఱకడ వహించి తండ్రి నడువఁ జొచ్చెను. శివ ధ్యానమున మునింగిన మనంబుతో నా బాలుఁ డేఁగుచు ననిపల్లి యెచటనని యడిగెను. తండ్రి "యదిగో వికసిత నీలోత్పల ములతోడి కేదార క్షేత్రము కావలఁ గన్పడునదియే ననిపల్లి" యనెను. సంబంధుఁడు తండ్రి మూఁపులపై నుండియే

మ్రొక్కి, "కారైగళ్ పూహై ముల్లై..." అని పాదమెత్తి చివరఁ (ఎంద్రై మేవుం తిరునసిపల్లి...) ఎవరీ తిరునసిపల్లిని స్మరింతురో వారి పాపములు నశించు నని చెప్పు ఆజ్ఞ మాదే" అను భావముఁ బ్రకటించి శివాలయముఁ జొచ్చి నతియు నుతియు నొనర్చి యచటఁ గొన్ని దివసంబులు గడపెను.

తిరుచ్చెంగాడులోని విప్రులు సంబంధుని రాక విని నని పల్లికి వచ్చి యాజగదంబికా క్షీరములఁ గ్రోలిన సంబంధుని తమ యూరికి విజయము సేయుఁడని ప్రార్థించిరి. సంబంధుఁడు వచ్చు మార్గమందంతట వారు చలువ పందిరులను స్థాపించి, వానిని పూవులతో నలంకరించి పూర్ణకుంభములను నిలిపి యా జ్ఞాన శిశువును గొనివచ్చిరి. అతఁ డచట దక్షిణావర్త శంఖాకారముతో నిర్మింపఁబడిన ఆలయముఁజొచ్చి యచటి మహిమను వర్ణించుచు పది పద్యములఁ జెప్పెను. అటనుండి వైదికులు వెంట రా, తిరువలంపురము తిరుచ్చాయికాడు లను దర్శించి కావేరీపూంపట్టణముఁజేరి, యాలమున కేఁగి శివున కంజలినిడి "కొండగోఁగుఁ బూవులఁ దాల్చిన శివా..."యని హృదయము ద్రవింపఁ బాడెను. అటనుండి తిరువెణ్కాడున కేఁగి శివునకు మ్రొక్కి "ఫాలనేత్రా..." యని యారంభించు పద్యమును జెప్పి కీర్తించెను. సమీపమునఁగల తిరుముల్లైవాయిల్ అను క్షేత్రమును దర్శించి మరలి శీర్గాళికి వచ్చెను.

తృతీయ యాత్ర :—

పిదప మణ్ణొకసాది మహేంద్రవల్లి తిరుకురుహాయూరు మొదలగు శివస్థలముల కేఁగి మధుర భావోపేతములఁగు పద్యములు సెప్పి భవానీపతిని స్తుతించి, మరలి శీర్గాళికి వచ్చి తోణియప్పరుని సేవించుచుండెను.

నీలకంఠయాల్పాణుని సంధించుట :—

జ్ఞానసంబంధుఁడు శీర్గాళిలోనుండు నక్కాలమున, సంగీతకళానిపుణుఁడగు తిరునీలకంఠయాల్పాణుఁడు నాతని భార్య మతంగచూడామణియు సంబంధునిఁ గాంచి మ్రొక్కఁ గుతూహలముతో యాల్పాణమను వీణియఁ జేపట్టి శీర్గాళికి వచ్చుచుండిరి. సంబంధుఁడా హరిజన భక్త దంపతుల రాక విని, వారిఁ దోడ్తేర నెదురువోయెను. ప్రీతితోఁ దమ్మట్లు ఆహ్వానింప వచ్చిన యా బాలుని పాదపద్మములకు వారు నమస్కరించి లేచి, భక్తితోఁ బొగడి భాగ్యవంతులమైతిమని సంతసించిరి. సంబంధుఁడు వారిఁ బ్రియమారఁ గాంచి "మీరు దయతో ననుఁ గాంచ వచ్చుటచే నా శివసేవ యూర్జితమైనది" యని చిఱునగవులు చిందుచుండఁ బలికి వారితో తోణియప్పరు నాలయ గోపుర ప్రాంగణముఁ జేరెను. వారు శివునకు మ్రొక్క "నీవు నీ వీణియను పలికించి శివుని నుతింపు"మని సంబంధుఁడు పల్కెను. వెంటనే యాల్పాణుఁడు వీణియను శ్రుతిసేసి స్వర రాగ సుధారసంబులు వెల్లి విరియ మతంగ చూడామణితో గలిసి శివునిపై గేయములఁ బాడుచు

మీాటెను. సశాస్త్రీయముగ వీణెనుండియు, వారి కంఠముల నుండియు వెలివడు గానమాధుర్యమునకు నారోహావరోహణ మూర్ఛనలకు సంబంధుఁడు మెచ్చి, యానందసాగరమున మును కలు వైచెను. మహతిని మించు నా వీణియ నాదమునకు సంబంధుఁడే గాక పరమశివుఁడును సంతసించెను. ఆ గాన మాధుర్యమునకు గంధర్వ కిన్నర విద్యాధరులు మైమఱచి యాకాశమున గుంపులు గట్టిరి. వారాంగన లాడిరి. యాల్పా ణుని గానము ముగియఁగనే సంబంధుఁడు వారికొక విడిది సూపెను. అచట వారికి విందు భోజన మిడెను.

అప్పటికి సంబంధుఁడు సెప్పిన పద్యములను భక్తులు పాడ విని, యాల్పాణుఁడు వానిని స్వరపఱచి, రాగముల నెన్ని తన వీణియపై వానిని చక్కఁగఁ బలికించుచు భక్తులను సంతసపఱుపసాగెను. ఒకనాఁ డాతఁడు సంబంధునిఁ గాంచి "స్వామీ! మీరు శివునిపైఁ బాడఁబోవు గీతముల నన్నింటిని స్వరపఱచి యీ వీణియపై ప్రయోగింప మనస్సు గలుగు చున్నది. కాన మిమ్ము విడువక, మీతో నిరంతర మైత్రి గల్గునటుల నిచట మా సదావాసమున కనుమతించి కృప సూపుఁ"డని ప్రార్థించెను. సంబంధుఁ డాతని వేడికోలును మన్నించెను. అది శివుని కరుణయే యని యాల్పాణుఁడు భావించెను. ఆనాఁటినుండి యతఁడు సంబంధుని పద్యములను వీణియపై మీాటుచు నాతని సౌహార్ద సౌఖ్యముల ననుభ వించుచు సంతసించుచుండెను.

చతుర్థ యాత్ర:—సంబంధుని చిదంబర దర్శనము:—

సంబంధుఁడు చిదంబరమున నట్టనమాడు నటరాజుఁ గాంచి నుతింపఁ దలఁచి తన కోరికను తండ్రికిఁ దెల్పెను. తండ్రియు బాలు ననుసరించుట కంగీకరించెను. వెంటనే సంబంధుఁడు తోణియప్పరు ననుమతి నంది, యాల్పాణ దంపతులు తండ్రియు భక్తులు వెంటరా చిదంబరమునకుఁ బయన మాయెను. అతఁడు మార్గమందలి శివక్షేత్రములఁ గాంచి మ్రొక్కి నుతించుచుఁ బయనించి కేదారక్షేత్రములను నదులను దాఁటి, కొల్లడపు దక్షిణతీరముఁ జేరెను. అధిక వేగముతోఁ బ్రవహించు నా కొల్లడ మను నది శివబాలుఁడైన జ్ఞానసంబంధునిఁ గాంచి, తన వేగము నాపి, భక్తితో శిరము వంచి మార్గము నిచ్చెను. అతఁడా నదిని దాఁటి, యుప్పు కాలువల నధిగమించి, కొంత నేల పయనించి భక్తాభీష్టద మగు చిదంబరపు టెల్లఁజేరి శివగతి ప్రయోజన మందిన వాని వలె సంతసించెను.

సంబంధుఁడు వచ్చు మార్గమున కిరువైపులనుండు సరోవరంబులు, పక్షుల ధ్వనులే పొగడికలుగ, కమలకోరకహస్తములను జోడించి, పుష్పముఖంబుల నాతని కాహ్వాన మొసంగెను. ఉద్యానవనంబులు మయూర క్రేంకారములు స్వాగత వచనములుగ, చల్లని పిల్ల తెమ్మెరలతోఁ గదలు పుష్పముఖముల నాడించి యాహ్వానించునటుల నుండెను. మనోహారంబులగు కేదారంబులు పైరులతోఁ బెరిగిన లతా పుష్ప

ములలోని పుష్పాడిని వెదఁజల్లుచు సంతసముతో మ్రొక్కు-చున్నవా! యన నుండెను. క్రముక వృక్షంబులు బాలసంబంధుని మార్గాయాసము నపనయించుచున్నవా యన కదలుచుండెను. శ్రోత్రియులు హోమముసేయు నగ్నిగుండములనుండి యెగసిన ధూమవ్యాప్తిచే నాకాశము నీలాంబరవితాన మాయెను. సంబంధుఁడిట్టి మనోజ్ఞదృశ్యములఁ గాంచుచు చిదంబరపు దక్షిణ ద్వారముఁ జేరెను.

శివజ్ఞానక్షీరములఁ గ్రోలిన సంబంధుఁడు వచ్చుచున్నాఁడని వినిన చిదంబర వాసులగు శ్రోత్రియులు, భక్తదాసులు నగరమును చక్కఁగ తోరణాదులతో నలంకరించి, వేదఘోషములు మంగళవాద్య ధ్వానులను మించుచుండ, పూర్ణకుంభములతో నెదురు వచ్చి సుస్వాగతము వల్కి- నగరిలోనికిఁ దోడ్తెచ్చిరి. సంబంధుఁడు వారితో నావరణ వీథినిదాఁటి, దీక్షితులు నివసించు వీథినిగాంచి మ్రొక్కెను. భక్తుల మనంబువలె పరిశుద్ధమైన తిరువీథినిఁగాంచి సంతసించి, ప్రాగ్ద్వారముఁ జొచ్చెను.

ప్రధానద్వారముదాఁటి, బంగరు నాలయమునకు సంబంధుఁడు ప్రదక్షిణముఁగ వచ్చి, కనకసభకు మ్రొక్కి- నందీశ్వరాది శివగణనాథులు గొలిచియుండు నటరాజుఁగాంచి, భక్త్యతిశయమున శిరమునఁ గరములు గీలించి యానందాశ్రువులు రాల గర్భాలయములోని కేఁగెను. సత్యజ్ఞానప్రకాశముతో వెలుంగు కనకసభలోని యానంద నటనముఁగాంచి నమస్కరించెను.

"ఇంద్రియాతీతుఁ డయ్యు మద్భావంబునఁ దిరముగ నిలిచి నన్ను ధన్యు నొనర్చితివి..." యను గీతముఁ బాడి స్తుతించెను. పాడియాడెను. ఆదిపురుషుఁడగు నటరాజేశ్వరు నెల్లవేళల సేవించు భాగ్యము నందిన చిదంబర దీక్షితుల మహిమఁ బొగడుచు "నిత్యాగ్నిహోత్ర తత్పరులగుచు, శనైశ్చరు చర్యలనడ్డి, సదాశివుని పాదపద్మములఁ గొల్చు భాగ్యము నంది, పాప విదూరులగు శుద్ధ శ్రోత్రియ దీక్షిత ప్రవరులను నుతింతు. (కట్రాంగ ఎరియోంబి...) ఇత్యాది భావయుక్తంబులగు పద్యములు సెప్పి యానంద తాండవామృతమును కన్నులార గాంచెను. వేదాదులు సర్వదా నుతించు కనకసభకు మరల ప్రదక్షిణమొనర్చి, వెలికివచ్చి యా క్షేత్రముననుండుటకు భీతిం జెంది, సమీపముననుండు తిరువేళ్కాలము అను చిదంబర సమీప క్షేత్రమున నుండఁ గోరెను.

సంబంధుఁడు వేళ్కాలమను గ్రామముఁ జేరి యచటి భవ లింగముఁ గరములతో నభిషేకించి పూజించి స్తుతించి యచట నివసించుచుఁ బ్రాతఃకాలమున చిదంబరమున కేఁగి నటరాజును సేవించి వచ్చుచుండెను, ఒకనాడు కళిపాలై, నెల్‌వాయిల్ అను క్షేత్రములకేఁగి శివుని సేవించి స్తుతించెను. యాల్పాణుఁడా గీతములను స్వరపఱచి వీణియలో మీటెను. మఱల చిదంబరమున కేతెంచి సేవించి వేళ్కాలమునకుం బోవుచుం, శివుని నిత్యసేవా భాగ్యమునందిన దీక్షితుల మహిమ కాశ్చర్యపడెను. ఒకనాఁడు మూఁడువేలమంది దీక్షితులు శివగణంబులుగఁ

గన్పింప నా దివ్య దృశ్యమును తిరునీలకంఠ యాల్పాణునకుఁ జూపి వారికి వందన మాచరించెను. వారును ప్రత్యభివాదన మొనర్చి యా బాలుని నటరాజు సన్నిధానమునకుఁ గొంపో యిరి. అట సంబంధుఁడు "దధిక్షీరాభిషక్త సర్వాంగా!..." యని యారంభించి, యానాఁడు దీక్షితులను శివగణంబులుగఁ గాంచిన మహిమను నుతించుచు, అట్టి దీక్షితులచే సేవింపఁ బడున దీకనకసభయేగదా! యని ముగించు పదిహాముఁ బాడెను. నటరాజును సేవించి వెలికి వచ్చిన సంబంధుని యాల్పాణుఁడు సమీపించి "ఈ దాసుని జన్మస్థలమగు ఎరుకత్తంబులియూరు సమీపముననే గలదు. అచటికి విజయము చేసి పిదప నీవానదీతీరస్థ క్షేత్రంబుల దర్శింప వేఁడెద" ననెను. అతఁడట్లే యని తన్ననుసరించి వచ్చు తండ్రి తదితర భక్తులతో బయలుదేఱ నీలకంఠ యాల్పాణుఁడు వీణియ మీటుచుండ, మతంగచూడామణి కంఠమెత్తి దివ్యగానము సేయుచుండ నీవానదీతీరము నంటి పోయి, ఎరుకత్తంబులియూరును సమీపించెను. అపుడు యాల్పాణుఁడు "ఇది యేదాసుని జన్మభూమి" యనెను. సంబంధుఁడు "నీ యవతారభాగ్యము నందిన యీ యూరేమి తపంబొనర్చెనో?" అని పలికి శివాలయముఁ జొచ్చి సేవించెను.

పిదప నటనుండి వృద్ధాచలమునకుఁ బయనమాయెను. "మణిముక్తానదీ పరివృతంబగు వృద్ధాచలము చేరుదము రం"డని పాడెను. ఆనగరముఁజొచ్చి వృద్ధగిరీశ్వరుని చదసరో

జంబులను మ్రొక్కి స్తుతించి, యచటి నదీమహిమను వృత్త ములఁబాడి యచట కొన్నిదినంబులు గడపెను. పిదప వృద్ధగిరీశ్వరు ననుమతి నంది, బయలుదేఱి తిరుపెన్నాకడమునుచేరి, అచటనుండు తూంగానై మాడమను నాలయమున దివ్య తేజోరాశియగు పరమశివుని దర్శించి వందనమాచరించి "ఆపదలు నశింపఁ గోరువారు నిన్నే ధ్యానింపవలె..."నని పాడి పయనమై పెన్నాకడమను శివస్థలముఁగాంచి తీరుత్తురై యను క్షేత్రమున కేఁగుచుండెను. సంబంధుఁడీక తండ్రి మూఁపుల నెక్కి పోరాదని తలంచి, కాలినడకతో పయనింప నాతని కోమలపదకమలము లెఱుపెక్కెను. వానిఁగాంచి పిత్రాదులు దురపిల్లిరి.

సుధాకరునివంటి సంబంధుఁడు మార్గాయాసమును లెక్కింపక, పాశరహితుఁడయ్యు శివపాశమధికముగఁ గలవాఁడగుటచే మ్రొక్కుచు 'శంభో త్రిపురహార త్రినయనా!' యని ప్రార్థించుచు మార్గముననున్న మారన్పాడియను క్షేత్రము సమీపించు సరికి వారలసిరి. దాని నెఱింగి సంబంధుఁడు పంచాక్షరి నొకసారి బిగ్గరగ నుచ్చరించి "ఇట నీరేయి గడపుద"మనెను. "అర్యముఁడు తన ఖరకిరణజాలముచే భక్తులను బాధించితిఁగదా" యని భీతిల్లెనో యన సహస్ర కిరణములను సంకుచించి పశ్చిమాద్రిఁ గ్రుంకెను. సంబంధుఁడు భక్తులతో నా రేయి యటఁ గడపెను.

స్వప్నము :—

తండ్రి భుజములపై నెక్కి పయనించుటకు నంగీకరింపక నడచివచ్చు జ్ఞానసంబంధ శిశువున కిఁక కష్టము గల్గరాదని, యార్తార్తిహరుఁడగు హరుఁడాతనికి ముత్యాలపల్లకిని ముత్తె ముల గొడుగును శంఖాది చిహ్నముల నొసఁగ నిశ్చయించి యా నిశియందే మరుత్తురవైదికుల స్వప్నమందుఁ గన్పించి "సంబంధుఁడు నా సన్నిధికి వచ్చుచున్నాఁడు. మీ రాలయ ముననుండు శిబికను ఛత్రాదులను గైకొని రం"డని యాజ్ఞ నిడెను. వైదికులు మేల్కాంచి పరస్పరము స్వప్న వృత్తాంత ముఁదెల్పికొని యాలయమునకుఁబోవ, నచటి వారును అట్టి కలనే గాంచి కవాటములఁ దెఱచి వచ్చి వైదికులను లోనికిఁ గొనిపోవ నచట శివుని కరుణచే ముక్తాశిబికాదులు గన్పించెను. వానిఁగాంచి మ్రొక్కి, గైకొని మంగళవాద్య ధ్వనులతో నేఁగి సంబంధుని గాంచిరి.

వైదికుల కలలోఁ గన్పడినట్లే యా రాత్రి సంబంధునకుఁ గన్పించి "నీకు శిబికాదులఁ బంపుచున్నాను. ఆశిబిక నధిరో హించి ననుఁ గాంచరమ్ము" అని యనుగ్రహించెను. తద్వృత్తాం తము నతఁడు తండ్రికి భక్తబృందముల కెఱిఁగించెను. అరుణో దయ మాయెను. బాలుఁడు ఆహ్నికములను నిర్వర్తించి, విభూతిఁదాల్చి పంచాక్షరిని జపించుచుండెను. ముక్తాశిబిక నారోహించు సంబంధునిఁ గాంచఁ గుతూహలియై యుదయించె నా యన భాస్కరుఁడు తూర్పుకొండపైఁ జూపట్టెను.

అపుడు వైదికులు హరహర యని ఘోషించుచు శిబికాదులను వహించి వచ్చి సంబంధునకు మ్రొక్కి "ఈశానుని కరుణారూపంబులగు వీనిఁ గైకొనుఁ"డని ప్రార్థించి స్వప్న వృత్తాంతముఁ దెల్పిరి. అంత సంబంధుఁడు "ఇది యంతయు నటరాజేశ్వరుని కరుణాతిశయమే. దాసుఁడనగు నన్ను స్వీయ భక్తులలో నొకనిఁగా గ్రహించె" నని పల్కి "ఇది యరుత్తుర యీశుని..." అని గీతముఁ బాడి, విభూతి ప్రకాశమువలె నిర్మలకాంతులతో వెల్గొందు పల్లకికిఁ బ్రదక్షిణ మాచరించి, పంచాక్షరిని జపించుచు నధిరోహించెను. అతఁడు శిబికలో కాలిడుటతో భక్తుల 'శంభో శంకర' యను నినాదము దిక్కులు నిండెను. వేదఘోషము చెలఁగెను. దేవతలు పుష్పవర్షముఁ గురియించిరి. శంఖము తనంత తానే మ్రోఁగెను. శివుఁ డనుగ్రహించిన ముత్యాల గొడుగు విచ్చికొని దివ్య ప్రభలతో నాతనిపైఁ బ్రసరించెను. ఆ దృశ్యముఁ గాంచిన వైదికు లానందాబ్ధిలో మునింగిరి. శివుఁ డొసఁగిన శంఖము "సప్తలోకంబులు వేదాదులును జీవింప సంబంధుఁడు వచ్చె. గిరిజ యొసఁగిన జ్ఞానక్షీరములఁ గ్రోలిన బాలుఁడు వచ్చె. పఠింపకయే వేదశాస్త్ర రహస్యంబుల నెఱిఁగిన తమిళ పండితుఁడు మధురకవియునైన సంబంధుఁడు వచ్చె"నని ఘోషించెను. "అజ్ఞానాంధకారముఁ దొలఁగించి తమిళ వేదమును ప్రకాశింపఁజేయు జ్ఞానభాస్కరునకు జయము" అని భక్తులందఱేకకంఠమున జేజేలు పెట్టిరి. భక్తులు సంబంధుని శిబికను

మోయుచు నరుత్తుర యాలయముఁ జేరిరి. సంబంధుఁడు దూరముననే శిబిక నవరోహించి యాలయమునకు ముమ్మారు ప్రదక్షిణ మాచరించి మ్రొక్కి "నన్నొక వస్తువుఁగా దలఁచి దయసూపిన బంగారు పాదపద్మముల నుతింతు......" అను పదిహముఁ బాడెను. అచట కొన్ని దినములు గడపుచుండ నొకనాఁడు పెరియనాయకి తోణియప్పరులు భావమునఁ దోఁప నతఁడు అరుత్తరనాథు ననుమతి నంది, ముక్తా శిబికలో శీర్గాళికిఁ బయనమాయెను.

సంబంధుఁడేఁగు మార్గమందలి గ్రామవాసులు తమతమ యూళ్ల నలంకరించి యా బాలునకు మ్రొక్కి తమ జన్మలు సఫలమాయెనని భావించిరి. అతఁడు గజచర్మ కృంతనుఁడగు కృత్తివాసుఁడుండు తిరుప్పళయూరును దర్శించి యచటి బ్రాహ్మణ భక్తుల సేవామహిమను నుతించి పాడి, విషయ మంగ[illegible]ను క్షేత్రమును దర్శించి యచటి గోమహిమను పద్యములఁ బాడి, వైఘ, పురంపయఁములను దర్శించి, చండేశ్వర నాయనారుని జన్మభూమియగు తిరుచేంయనల్లూరును సమీపించెను. అచటి భక్త వైదికులు ఘనస్వాగత మొసఁగిరి. సంబంధుఁడు శిబిక దిగి నడచి వచ్చుచుండ వైదికులు తమ కమండలూదకములను ముందుగ ప్రోక్షించుచు నేఁగిరి. పుణ్యసతులు పేలాలు చల్లిరి. వారితో నా బాలుఁ డాలయముఁ జొచ్చి మ్రొక్కి, "శివాపరాధి తండ్రి యని మెఱంగియు పితృ పాదములను ఛేదించిన" చండేశుని భక్తి భావమును పొగ

డుచు పదిహాముఁ బాడెను. పిదప తిరుపనందాళ్, పందనై నల్లూరు, ఓమాంబులియూరు, వాళ్కొలిపుత్తూరు, కడంబి, తిరునావలూరు, కంపలియలూరు, మొదలగు శివక్షేత్రములను దర్శించి మ్రొక్కి పాడి కేదారక్షేత్రములతో రమ్యమైన శీర్గాళి క్షేత్రముఁ జేరెను.

తోణిపురి పౌరులు భక్తులు శ్రోత్రియులు పురము నలంకరించి పూర్ణ కుంభములతో సుస్వాగత మొసఁగిరి. సంబంధుఁడు పల్లకి దిగి వారికి మ్రొక్కెను. ముత్తైదువలు మంగళగీతములఁ బాడుచు వెంటరా నాలయముఁ జొచ్చి సాష్టాంగముగ మ్రొక్కి శివుని సేవించి వచ్చి, యాల్బాణ మతంగచూడామణులను గృహంబుల కేఁగ ననుమతించి, గృహంబునకుఁ బోవ, తల్లి భగవతి హారతి నిచ్చి బాలుని కౌఁగి లించి ముద్దాడి విభూతి నిడి లోనికిఁ గొంపోయెను.

ఉపనయనము :—

సంబంధుఁడు ప్రత్యహము తోణియప్పరుని సేవించి కవితాధారతో స్తుతించుచుండు కాలమున నతనికి నుపనయన ప్రాయము వచ్చెను. వృద్ధులు లగ్నమును నిశ్చయించిరి. సకల వస్తు సామగ్రిని సమకూర్చిరి. వైదికులా బాలునకు హరిణచర్మముతోఁగూడిన యజ్ఞోపవీతమును వైచి గాయత్రి నుపదేశింప నతఁడు దివ్యబ్రహ్మవర్చస్సుతో విరాజిల్లెను. లోక శాస్త్రరీతి ననుసరించి యాతని నుపనీతుఁ గావించిరే గాని,

యా జీవన్ముక్తున కది లాంఛన ప్రాయమే. గురువు లాతనికి వేదాదులను నేర్పం బూనిరి. వారుపదేశించుటకుం బూర్వమే యాతనికి షడంగసహిత వేదములు స్ఫురించెను. వాని దివ్య ప్రతిభకు గురువులు చకితులై యది సర్వజ్ఞుని దయ యని భావించి తమ సంశయముల నాతనివలన నివారించుకొను చుండిరి. అతండా గురువుల సంశయములను నివారించి, "సకల కాలములందుం దోంచునది పంచాక్షరియే. త్రిసంధ్య లందు శ్రోత్రియులు జపింపందగినది పంచాక్షరియే" యని పంచాక్షరీ మహిమం దెల్పు పంచాక్షరీ పదిహమును పాడెను. వారాతని కవితలోని భావముల నెఱింగి యాతని గురుగుహుం డని భావించి మ్రొక్కిరి. ఇట్లాతండు తండ్రి యింట బ్రహ్మ చర్యమును గడపుచుండెను.

నావుక్కరసు ప్రథమ సందర్శనము :—

వాగీశుండు సంబంధుని మహిమాతిశయమును విని, యాతని దర్శించి మ్రొక్కందలంచి శీర్గాళికి వచ్చుచుండెను. సంబంధుం డా భక్తుని రాక విని యది జన్మాంతర సుకృతమని తలంచి యాతనికి స్వాగత మీయ భక్త గణంబులతో నెదు రేంగెను. వృద్ధుండగుటచేం దడబడు దేహము గల్గి, విభూతిం దాల్చి, యాశారహితుండై, శివభక్తి పారముం జేరినవాండై దోంకుడు పారను చేందాల్చి, యానంద బాష్పములను వదలుచు నపరశివునివలె వచ్చు వాగీశునిం గాంచి సంబంధుండు "భక్తా వతంసునిం బ్రత్యక్షముగం గాంచంగల్గితి"నని పల్కుచు

వందన మాచరించెను. అతఁడు ప్రత్యభివాదముగావింప, నాతనిని తోణియప్పరు నాలయమునకుఁ గొంపోయి యాతనిఁ గూడి శివు నారాధించెను. పిదప వాగీశునకు నాతని వెంట వచ్చిన భక్తగణంబులకు విందు చేసెను. ఆ భక్తకవిద్వయము ప్రతిదినము శివుని పద్యములతోఁ గీర్తించుచుండిరి. వాగీశుఁ డట్లు కొన్ని దినంబులు గడపి "మరల వచ్చి దర్శింతు"నని పల్కి శివక్షేత్ర దర్శనమునకై సంబంధుని యనుజ్ఞ వడసి యరిగెను.

నావుక్కరసేఁగిన పిదప సంబంధుఁడు వివిధ తమిళ వృత్తములతో శివునిఁ గీర్తించుచుండెను. నీలకంఠ యాల్పా ణుఁడా వృత్తములను వీణియపైఁ బలికించుచుండెను. మతంగ చూడామణి వానిని పాడి తన గంధర్వగానముతో జనులను పరవశులఁ గావించుచుండెను.

సంబంధుని పంచమ తీర్థయాత్ర :—

సంబంధుఁడు దక్షిణదేశమందలి సకల శివక్షేత్రములను దర్శింపఁ గుతూహలియై యా వార్తను తండ్రికిని శ్రోత్రియ భక్తులకుఁ దెల్పెను. శివపాదహృదయుఁడు "పుత్రా! లేక లేక నినుఁగాంచి యిపుడు నిన్నువిడిచి నే నెట్లొంటరిగ నుండఁ గలను? ఇహపరసాధకమైన శివయాగము సేయఁ దలంచి యున్నాఁడను. నీతోఁగూడ నేను వత్తును" అనెను. సంబం ధుఁడు తండ్రి రాక కానందించి తోణియప్పరునకు మ్రొక్కి

యనుమతి నంది బయలుదేఱెను. నీలకంఠ యాల్పాణ దంపతు లతని ననుసరించిరి. సత్యాన్వేషకులగు మునులు భక్తులు వారిని వెన్నంటిరి. సంబంధుఁడు ముక్తా శిబిక నెక్కెను. ముత్యాల గొడుగు పూర్ణ చంద్రునివలె భాసించుచు నెండ సోకకుండఁ జేయుచుండెను. శంఖాది ధ్వనులతో నాతని పయనము పురందరుని యుత్సవముంబుగ సాగెను.

కౌండిన్య కులవర్ధనుఁడగు సంబంధుఁడు తిరుక్కణ్ణారను శివస్థలముఁ జేరి భవుని సేవించి స్తుతించెను. పిదప కావేరి యుత్తరతీరము నంటి కొంతదూరమేఁగి పశ్చిమమునకుఁ దిరిగి, సంపాతి జటాయువుల పూజ నందిన వైదీశ్వరములోని శివుని స్తుతించి, నన్నిప్రి, నీడూరు, పుంగూరు, పడక్కర, కురుక్కైక్కపది, అన్నియూరు, తిరుపందనైనల్లూరు, తిరుమణంజెరి, ఎదిర్కొల్పాడి, తిరువేళ్వికుడమునై యను శివస్థలములఁ జేరి భవలింగములకు సాష్టాంగ మొనర్చి, తన కవితా ప్రసూన మాలికల నర్పించి సేవించెను. వేళ్వికుడిలో రేయింబవలు శివుఁడు కల్యాణవేషముతోఁ బ్రత్యక్షమగుచుండునని పాడెను. పిదప తిరుకోడికా, తిరువంజనూరు, మాంతురై, మంగళక్కుడి, వియలూరులను దర్శించి దేవంగుడిని జేరి, యచటి నీలకంఠుని "ఇతని వేషమే మంత్రము. భవరోగనివారణౌషధ మగుఁగదా!" యని పాడి స్తుతించెను. అటనుండి పయనమై తిరుఇన్నంబరై, వడకురంగాడులను చేరెను. అచటి మహాదేవుని పూజించి, శరణుఁబొంది ధన్యుఁడై వాలి చరిత్రముఁ

బొగడుచుఁ బద్యములు చెప్పెను. పిదప తిరుప్పళనేశ్వరుని సేవించి తిరువైయూరును సమీపించెను.

శివజ్ఞాన శిశువు తమ యూరికే తెంచుచున్నాఁడని విని యచటి భక్తులా యూరిని చక్కగ నలంకరించి యాతనిఁ గొనిపోవ నెదురు వచ్చిరి. సంబంధుఁడు వారిఁగాంచి శిబిక నుండి దిగి, నంది తపమొనర్చి శివుని కరుణకుఁ బాత్రుఁడైన యా స్థలమునకు మ్రొక్కి, "యంత్యకాలము సమీపించు వారిని భయపడకుఁడని యభయమిచ్చు భవుఁడీ తిరువై యారులో నున్నాఁ"డని పాడుచు భక్తగోష్ఠితో వీథులను గాంచుచు గోపురద్వారముఁజేరి నతి యొనర్చెను. ఆలయ మును వలగొని సువర్ణ జ్యోతిర్నాథునకు మ్రొక్కి "వసంత మున మలయమారుతము వీచుచుండ, కోయిల కుహూకుహూ నినదములు నింప..." అని పాడుచు, 'తాండవనృత్యకరా! శివా!' యని మ్రొక్కెను. పిదప భక్తులతో నచటఁ గొంత కాలముండెను.

తిరుప్పాచ్చిలాశ్రమముఁ జేరుట :—

తిరువయ్యారు పంచనదీశ్వరునకు వందన మాచరించి యా దేవు ననుమతి నంది, బయలుదేటి తిరుమళపాడిని చేరి "అర్ధనా రీశ్వరా! నిన్ను మ్రొక్కువారు భాగ్యవంతులు..." అని పాడుచు నాలయములోని కేఁగి, కవితాసుధాలహరితో స్తుతిం చెను. పిదప తిరుకానూరు, అన్బిలూరులను చేరి "ఇంద్రాది

దేవతల పూజల నందిన నీ మహిమ వర్ణింపఁదరమా......"
యని పాడి మ్రొక్కి మలనాఁడును ప్రవేశించి తిరుప్పాచ్చి
లాశ్రమమును చేరెను.

కొల్లి మలవరాజు పుత్త్రి వాత వ్యాధి:—

తిరుప్పాచ్చిలాశ్రమమును కొల్లి మలవరాజు పాలించు
చుండెను. అతనికి నమృతభాషిణి సుందరియగు పుత్త్రిక
యుండెను. ఆ హరిణనయన యౌవనవతియై యగ్నిశిఖవలె
నుండెను. ఆ పరువమున నామె వాతవ్యాధికి గుఱియయ్యెను.
కాలు సేతులను లాఁగికొనుచు నోట నురుగులు గ్రమ్మ నేలఁ
బడి చక్రమువలెఁ దిరుగుచు చెప్పరాని బాధ ననుభవింప
సాగెను. తండ్రి, కొమరిత బాధలను గాంచఁజాలక దుఃఖించు
చుండెను. ఆమె పాటునకు బంధువు లందఱు శోకసాగరమున
మునిఁగిరి. ఆ రాజు శివభక్తుఁడు. ధన్వంతరిని మించిన వైద్యు
లెందఱో చికిత్సలు సేసిరి. వ్యాధి తగ్గలేదు. రాజు కన్యకను
శివాలయమునకుఁ గొనివచ్చి, త్రిపురాంతకుని ముందుంచి
"ఇఁక నీవే శరణ్యము" అని వదలెను.

సంబంధుఁడు తన నగరమునకు వచ్చుచున్నాఁడని వినిన
కొల్లి మలవరాజు వెంటనే పురము నలంకరింప నాజ్ఞ యిడెను.
రాజోద్యోగులు పురమందంతటఁ దోరణములఁ గట్టి, పూర్ణ
కుంభముల నిడి, చందనోదకములఁ జల్లి, చక్కఁగ నలంక
రించిరి. కొల్లి మలవరాజు పౌరులతో సంబంధున కెదురేఁగి,

ముత్యాల పల్లకి ముందు సాష్టాంగ మొనర్చెను. సంబంధుఁ డాతని "లెమ్మ" అన నతఁడు చేతులు జోడించి ముందు పోవుచు రాజమార్గమున నగరములోనికిఁ గొనివచ్చెను.

సంబంధుఁడు వాతవ్యాధిని నివారించుట:—

సంబంధుఁ డలంకృతమైన రాజమార్గమును దాఁటి, యాలయమును సమీపించి, శిబికనుండి దిగి, గోపురద్వారముఁ జొచ్చి లోనికేఁగి, వలగొని పరమేశ్వరుని మ్రొక్కుటకు వచ్చుచు నట మూర్ఛిలి పడియుండిన రాజకుమారిఁ గాంచి "యిదియే"మనెను. అంత నా రాజు సంబంధునకు వందన మాచరించి, "యీ నా కుమారి వాతవ్యాధితో బాధపడు చుండ నివారణోపాయముఁ గానక, శివుని యెట్టయెదుట నుంచితి"నని పలుక సంబంధుఁ డా కన్యకపై దయఁగొని, యటనుండియె తిరుపాచ్చిలాశ్రమేశ్వరునకు మ్రొక్కి, తద్రోగ నివారణకై "చంద్రకళాధరా శివా!...(తుణివలర్ తింగళ్...) యను పదిహముఁ బాడి చివర "ఈ కన్యక బాధఁజెందు నట్లొనర్చుట తగునా" యని స్తుతించెను. ఆ పదిహ మంత మగునంతలో నా బాలిక లతవలెఁ నీరోగయై లేచి, వచ్చి తండ్రి పార్శ్వమున నిలువఁబడియె. దానింగాంచిన రాజానంద భరితుఁడై పుత్రికతో నాతని పాదములకు మ్రొక్కెను. పిదప సంబంధుఁ డా భవరోగ వైద్యుఁడగు మృత్యుంజయు నకుఁ బ్రణమిల్లి యచట కతిపయ దినంబు లుండెను.

అటనుండి తిరుపైంగి లీశ్వరుని సేవించి కొంగు దేశముఁ (సేలము-కోయంబుత్తూరు) జేరెను. మహోన్నత ప్రాకారావృతమైన శెంగునూరుఁజొచ్చి యచటి యుమామహేశులను సేవించెను.

అది శీతకాలము, భ్రమర భ్రమణము లాఁగెను. తామర పూవులు మంచు దెబ్బకు వాడెను. మరకతములో వజ్రముఁ బొదిగినట్లు పచ్చి గడ్డి మోసులందు మంచు నీటిబొట్లు నిలిచియుండెను. శుద్ధ శ్వేతవస్త్రము గప్పినటుల కొండలపై హిమమంతట వ్యాపించెను. మంచుగాలి వీవసాగెను. ఉద్యానవనంబులు హిమముచే క్షీణించెను. భానుని కిరణజాలంబులు హిమమునకు భయపడెనా యన సంకుచించుకొని యలఁతిగ వేఁడి నిచ్చుచుండెను. మేడల చూరులందు నివసించు పారావతములు పెంటి పక్షులఁగూడి యొదిగియుండెను. వృద్ధులు దంతవీణలను మ్రోఁగించుచుండిరి. ధనికులు కుంకుమ పుష్పములతో పసుపుఁగల్పి, చందన కాష్ఠములను రగుల్కొల్పి, యందాకల్కమును వైచి ధూమములఁ గల్పించుకొని శీత బాధను కొంతవఱకు నివారించుకొనుచుండిరి. బీద లినుప బాణలులందు నిప్పునుంచుకొని యెట్లో జీవించుచుండిరి. సంబంధుని వెంట వచ్చిన వారాచలిని భరింపలేక గడగడ వడంకిరి. కొందఱు జ్వరపీడితులైరి. వారి బాధలఁగాంచి సంబంధుఁడు శివునకు మ్రొక్కి "నీలకంఠా! ఈ జ్వర మీ దేశసహజమైనను నీ భక్తుల మగు మమ్ము బాధింపరా "దని పాడి యానవెట్టెను.

(ఎమదు తుంబంగళై యెల్లాం వరామల్ శివనదు నీలకంఠమే యాహుం) అద్దాన భక్తులకేగాక తద్దేశీయుల కానాఁటినుండి శీతజ్వర బాధ నశించెను.

అటనుండి బయలుదేఱి తిరుప్పాండికురిపి, వెంజమర కూడలియందలి భవలింగములకు మ్రొక్కి తిరుఆనిలై చేరి శివునకు పద్యమాలిక నర్పించి కొంగుదేశపుటెల్లను దాఁటి చోళదేశముఁ బ్రవేశించెను. సంబంధుఁడు కావేరీదక్షిణ తీర మునఁగల మాణిక్య పర్వతములను దర్శించి, తిరుప్పరాయితుర యందలి భవానీపతికి పద్యమాలిక నర్పించి, తిరుఆలంతుఱై, మూక్కీశ్వరము తిరుచ్చిరాపల్లియను క్షేత్రములను దర్శించుచు తిరువాఞై క్కా అను శివస్థలముఁ జేరెను. అచట జంబుక వృక్షము క్రింద నెలకొని యైరావతముచేఁ బూజల నంది, కోచ్చెంగ చోళునిచే సేవితుఁడైన జంబుకేశ్వరుని మహిమను పాడి స్తుతించెను. అటనుండి తిరుమాహేంద్రము, తిరుక్కేౖ, తిరువారూరు, తిరుపత్తురై, తిరుపాఱై మొదలగు శివ క్షేత్రములఁ గాంచుచు తిరునెడుమంగలముఁ జేరెను. అచటి ఖట్వాంగధరునకు మ్రొక్కి "నీయందు భక్తిఁగలవారి కష్ట ములఁ దొలఁగించి కాపాడుము..." అని విన్నవించి తిరుక్కాట్టు పల్లిని జేరి అచటి శివుని "పిహితకంచుక కుచభార నమ్ర దేహా..." యని మొదలిడు పదిహములతో స్తుతించెను.

పిదప తిరుప్పూందురుత్తి మొదలగు శివక్షేత్రములకు భక్తబృందములతో నేఁగి, యచటి భవలింగములకు మ్రొక్కి,

మధురభావపూరితములగు పద్యములతో స్తుతించి, శుద్ధ శ్రోత్రియుల కావాసంబులగు తిరుచక్రపల్లి తిరుప్పాలత్తురై యను దివ్యస్థలములఁ గాంచుచు నరణ్యములను దాఁటి కేదారముల నధిగమమించి తిరునల్లూరుఁ జేరెను.

అచటి ప్రజలు భక్తులు శ్రోత్రియులు సంబంధుని రాకను విని మంగళ ద్రవ్యములతో నెదురువోయి, స్వాగత మొసంగిరి. జ్ఞానసంబంధుఁడు శిబిక దిగి వారి వెంట నాలయముఁ జొచ్చి, వెండికొండవలె దివ్యదీధితులతో విలసిల్లు నాలయమును వల గొని, యానందాతిశయముతో భవుని ముందు నిలిచి నమస్కరించి పాడి స్తుతించెను. కొంతవడి వివశుఁడై యటనుండి వెలికివచ్చి శ్రోత్రియులవేడికోలు నంగీకరించి యచట కొన్ని దినములుండె. ఆదినములలో నతఁడు పంచవృత్తుల నాట్య మాడు శివుని మహిమాతిశయమును స్తుతించి యనేక రీతులఁ గవిత చెప్పెను. పిదప మల్లికోద్యాన వనంబులతో రాజిల్లు తిరుకృమహామూరు అను శివస్థలముఁ జేరి "వినాశ రహితుఁడగు విశ్వనాథుని దేహచ్ఛాయ సప్తజిహ్వుని మించి నదిగదా..." యని పాడి శివపాదారవిందములఁ బొగడి, తిరుపూరనూరుఁ జొచ్చి పరిధియుడయారు నీలకంఠుని స్తుతించి మఱల తిరునల్లూనకు విజయము చేసెను.

పిదప నల్లూరి నాగాభరణుని సేవించి తిరువళంబుళి క్షేత్రమున కేఁగెను. ఆ క్షేత్రవాసు లీ తమిళకవికి స్వాగత మొసఁగిరి. తెల్లని మేఘములు చంద్రుని చుట్టియుండు నటుల

విభూతిధారులు సంబంధునిఁ జుట్టి రా నతఁ డాయూరి శివాల యముఁ జొచ్చి శిరమునఁ గరముల నిడి, ద్రవించిన హృదయ ముతో మ్రొక్కి, యా లోకేశ్వరుని పాదపద్మములను వర్ణిం చుచు పదిహాముఁ బాడి యచట భక్తులతో కతిపయ దివసంబులు గడపెను.

గ్రీష్మము:—

అక్కాలమున మిత్రుఁడు మకరరాశిఁ జొచ్చెను. సప్త సాగరములు సప్తాశ్వుని కిరణవ్యాప్తిచే మ్రగ్గఁజొచ్చెను. ఖర్వాటుల శిరములను వ్రీలఁజేయు నా గ్రీష్మమున జనులు మలయమారుతమును, సుగంధి చందనద్రవమును, వాసనా వాసిత శీతలోదకమును, ముక్తాహారముల నాకాంక్షింప సాగిరి. చల్లని పానీయములపై మక్కువ సూపుచుండిరి. జింకలు కడుపులు పిపాసార్తములై యెండమావులఁ గాంచి జలభ్రాంతిచేఁ బరుగిడ సాగినవి. జలబిందువుల నాహారించు చాతకము లయ్యవి దుర్లభంబులగుటఁ జేసి, యాహారాంతరము నన్వేషింపఁజొచ్చి నవి. పక్షిజాతంబు లా తీవ్రోష్ణమును సహింపఁజాలక పక్షంబు లను విప్పి, చంచుపుటంబులఁ దెఱచి, శీతలచ్ఛాయలకై దిరుగు లాడుచుండెను. ధనికులు భవనంబులపైఁ చంద్రశాలలకును, ఛాయోపేతంబులగు నుద్యానవనంబులకు, సరస్తీరంబులకేఁగి ప్రొద్దు పుచ్చసాగిరి. ఆతపాధిక్యముచే మయూర నాట్యంబు లాఁగెను. భ్రమర సంచారము మిక్కుటమాయెను. పికంబులు చూతాంకురాస్వాద కషాయకంఠములు గలవై కుహుకుహూ

నినాదములతో రమ్యముగ పంచమస్వరంబుల నాలపించెను. పారావతంబులు తమ నీడంబుల వీడి రా భయపడెను. ఇట్లా గ్రీష్మము దినదినప్రవర్ధమానమై సకల ప్రాణిజాల భయంకర మాయెను. . . .

కైలాసపతి కరుణాతిశయముచే శివభూతగణంబులు సంబంధుని శిరముపై తమ్మెవరుఁ గాంచని విధమున ముత్తెముల ఉల్లభమును పట్టి "తామీ గ్రీష్మమున నీ యుల్లాభము క్రింద నేఁగవలయు నని పట్టీశ్వరుఁడు మా వెంట దీని నంపెను" అని పల్కిరి. జనులంద ఆశ్చర్యచకితులగు నటుల ఆకాశమున తెల్లని పందిరివలె మేలుకట్టు గన్పించెను. శంకరుఁడు తనపైఁ బ్రత్యేకముగఁ జూపు వాత్సల్యాతిశయమునకు సంబంధుఁడు పులకాంకురిత దేహుఁడై ధరణిపైఁబడి సాష్టాంగమొనర్చెను. అపుడు ముత్యాల జాలరులతో నుల్లాభము చతుర్దండములతోఁ గ్రిందికి దిగి రా భక్తులద్దాని హస్తంబుల గ్రహించి సంబంధునకుఁ బట్టిరి. అపుడు సంబంధుఁడు కనకసభలో నాట్యావసరమునఁ బైకెత్తిన నటరాజ పాదచ్ఛాయలో నుండునట్లు కన్పించె. పట్టీశ్వరమందలి జనులు వెన్నంటి రా సంబంధుఁ డాలయముఁ జొచ్చి బ్రహ్మాదుల కగమ్యుఁడగు భవునకు వందనమొనర్చి మధురవాక్కులతో స్తుతించెను.

పిదప నా స్థలమును వీడి తిరుప్పళయూరు, వడదళి, మొదలగు శివక్షేత్రములను దర్శించును, తమిళ పద్యమాలికల నర్పించుచు, తిరుక్కాడమూక్కి (కుంభకోణము) ని చేరెను.

సంపద్విశిష్టులు శిష్టులునగు కుంభకోణవాసులు వేదనినాదము లతో మంగళవాద్యధ్వనులతో సంబంధు నెదుర్కొని స్వాగత మిడి నగరములోనికిఁ గొంపోయిరి. సంబంధుఁ డచటి శివా లయముఁ జేరి, "ఇచటి శివుఁడు నా ఱాజు..." అని మొద లిడు పదిహామును పాడెను. గంగాది పుణ్యతీర్థములు మఖా నక్షత్రమునఁ జేరు సరోవరముఁగల నాగేశు నాలయమున కేఁగి, మ్రొక్కి యానందముఁ బొందెను. పిదప భక్తులతో నచటి కాశీ విశ్వనాథాలయమును దర్శించి, యాదిశేషుని పూజ లంది నదియు, సేవించువారి యాధి వ్యాధులఁ బోనడచు విశ్వనాథా లయమందలి విశ్వనాథుని మహిమను పద్యములతో నుతించెను. అటనుండి తిరువిడైమరుదూరున కేఁగి, "కపాలధారీ! నన్నుఁ గాపాడు భగవంతుఁ డుండు తిరువాడుదురై యిదియేనా..." అని పాడుచు నా యూరఁ బ్రవేశించెను. పిదప నచటి పశు పతి కోవిలఁ జొచ్చి వందన మాచరించి స్తుతించి కొన్ని దినము లచట గడపెను.

అక్షయ నిధి ప్రాప్తి :—

సంబంధుఁ డటనుండు కాలమున నొకనాఁడు శివపాద హృదయుఁడు పుత్త్రుని సమీపించి "నేను శివయాగముఁ జేయు కాల మాసన్నమాయెను. తన్నిర్వహణమునకు ధనము గావలయుఁగదా! దాని నెట్లని సమకూర్పుము" అని కోరెను. సంబంధుఁ డేమియు మాఱు వల్కక, "మనకు ధనము శివ పాద కమలమే" యని భావించి యాలయమున కేఁగి "కోరిన

వారికి ధనమిచ్చు శక్తిలేనివాఁడఁగదా! నీ పాదములే నాకు ధనము. వేఱొక సాయము లేదు హరా!" అని స్తుతించెను. వెంటనే సంబంధుని కోరికను శివుఁడు మన్నించెనా యన ఒక శివభూతము సహస్ర సువర్ణములుగల మూటను బలిపీఠముపై నుంచి "ఈ ముడియయందు బంగరు నాణెములు గలవు. ఎన్ని తీసిన నివి తఱుఁగవు. మాసిలామణీశ్వరుఁ డిద్దాని నీ కిమ్మనె" నని పలికి యదృశ్యుఁడయ్యెను. సంబంధుఁ డద్దానిఁగాంచి యానందాతిశయమున నాడి పాడి, బలిపీఠిపై ముడుపును గ్రహించి శిరముపై నిడికొని, శితికంఠుని కరుణాతిశయమును నుతించుచు వచ్చి, తండ్రినిగాంచి "వేదచోదిత శివయాగ మును శీర్గాళివాసుల సాయమునఁ బూర్తిగావింపుము" అని పల్కి ధనము నిచ్చి పంపెను. శివపాద హృదయుఁ డాద్రవ్య ముతో శీర్గాళికిఁ బోయెను.

పిదప సంబంధుఁడు తిరువావడుదురై నుండి బయలుదేఱి, తిరుకోలము, తిరునల్లము మొదలగు శివస్థలములఁ గాంచుచు తిరుతిరుత్తికిఁ బోయి "మేరుపర్వత శిఖరాగ్రవాసీ! పర మేశా..." యని మొదలిడు పదిహముఁ బాడి, మావలూరి సదాశివుని నుతించి, తిరుమైలాడుదురై (మాయవరము) యను పుణ్య క్షేత్రమునకేఁగి, మ్రొక్కి కవితా సుమ మాలికల నర్పించి, యటనుండి పరియలూరు, వీరస్థములను దర్శించుచు తిరువేట్టకుడి యను క్షేత్రముఁ జేరెను. అచట శ్రమణ బౌద్ధుల

యాచారములను ఖండించి, సత్యధర్మ మార్గములను బోధించి ధర్మపురముఁ బ్రవేశించెను.

ధర్మపురము నీలకంఠయాల్పాణుని తల్లికి జన్మభూమి. కాన యాల్పాణుని బంధువు లెదురు వచ్చి మ్రొక్కిరి. సంబంధుఁడు వారిఁగాంచి, "మీ యాల్పాణుఁడు నేఁగూర్చిన పాటలను తన వీణయందుఁ జక్కఁగ పలికించి, శివసేవా భాగ్యము నందుచున్నాఁడు" అని యుదాత్తముగఁ బల్కెను. వారు యాల్పాణుఁగాంచి "అప్పా! నీ వీ సంబంధుని పద్యములను రాగయుక్త మొనర్చి, వీణియపై బ్రయోగించుటచే సంగీతము లోకమం దభివృద్ధి నందినది" యని పొగడిరి. యాల్పాణున కా పొగడిక యసహ్య మాయెను. మనంబు చలించుచుండ నతఁ డాజ్ఞాన శిశువునకు మ్రొక్కి "దేవా! తాము మానవుల శక్తి కందని విధమున రాగ తాళలయ యుక్తముగ నొక కృతిని పాడవలయును. అట్లొనర్చి మీ కృతి వీణపై వినుటుట అసాధ్యము అని యీ మూఢలోకమున కొక నీతిని గఱుపవలయు. వీరు నాకీ మహిమను తలఁబెట్టుట కోర్వలేకున్నాను. నా కోరికను మన్నింపుఁ"డని ప్రార్థించెను. సంబంధుఁడట్లే యని శివసాన్నిధ్యముఁజేరి "మా ధర్మ డప్పిడి...." అను చరణమెత్తి యపూర్వ రాగ తాళములతోఁ బాడి స్తుతించెను.

తిరు నీలకంఠ యాల్పాణుఁడు వీణను శృతిసేసి సంబంధుఁడు పాడిన కృతిని స్వరపఱచి ప్రయోగింప యత్నించెను. కాని యది యసాధ్యమాయెను. ఎంత ప్రయత్నించిన నా

పాట తంత్రులకు లొంగనిదాయెను. అతఁడు భయశోకా క్రాంతుఁడై "నేను మీ కృతిని మీఁటఁగలనని దీనిని గ్రహించి తిని. ఇది యీ వీణా దోషమే. దీనిని వ్రక్కలు గావింతు." నని దానిని పైకెత్తెను. సంబంధుఁ డాతని యత్నము నాఁపి, "దానిని నా చేతికిమ్ము" అని గ్రహించి "అప్పా పార్వతీ పరమ శివుల కరుణాతిశయమును వీణలోఁ గట్టుపఱుప సాధ్యమా! మనఃపరిమితి కందని రాగ భావము నేదో యొక పరిమాణమున మన స్వభావమునకుఁ దగినట్లు చేసి పాడుటయే లోకరీతి. కాని మనస్సున కతీతమైన దానిని కార్యరూప మున పెట్ట సాధ్యమా! నీ విద్దానిఁ గైకొని పూర్వమువలె నా పద్యములను మీఁటుచుండుము" అని పల్కి దాని నొసఁగెను. అపుడు యాల్పాణుని బందుగులు సంబంధుని మహిమా తిశయమును గుర్తించి తమ తప్పిదము నెఱింగి, యాతని పాద కమలములకు సాష్టాంగ మొనర్చిరి. భక్తులకు రాగద్వేషము లంటవు. సంబంధుఁడు వారికి భక్తి మహిమను బోధించెను.

అనంతరము సంబంధుఁడు యాల్పాణాది భక్తులు వెంటరా తిరునల్లూరులోని యాలయమున కేఁగి, "భోగవినా శకరా! భుజంగమండనా!..." యని పాడి యాల్పాణుని వీణపై మ్రోఁగింపు మన నతఁడానందభరితుఁడై చక్కఁగ మీఁటెను. అమృతరస ధారవంటి యా గానమును విని జనులు సంతసించిరి. పిదప సంబంధుఁడు కావేరీనదీ తీరస్థములగు క్షేత్రములను మెట్టుచు, మానినీమణుల మోము దమ్ముల వలె

సర్వదా వికసించు తామరలతో నాహ్లాదకరమగు తిరుచ్చాత్త మంగై యను ప్రాచీన పుణ్యస్థలముఁ జేరెను. అందు నివసించు తిరునీలనక్క నయనారుఁడను భక్తశిరోమణి సంబంధుని రాక విని పూర్ణకుంభముతో నాతనికి స్వాగత మొసఁగెను. సంబంధుఁడా భక్తుని గలసి యచటి యయవందీశ్వరు నాలయమున కేఁగి, భక్త్యంజలుల నర్పించి నీలనక్కరుని గృహమున కేతెంచెను. అతఁడు భక్తుల కందఱకు చక్కని విందు నొనర్చెను. యాల్పాణ దంపతులు సంబంధునితో నాతని యింట నారేయిఁ గడపిరి. ఉదయమున మేల్కాంచి కాల్య కృత్యములఁ దీర్చి కొని సుస్నాతుఁడై సంబంధుఁ డాలయమున కేఁగి నీలనక్కరుని సేవామహిమఁ బొగడుచు "కొండగోఁగుం బూవుల మాలికలఁ దాల్చిన శివా..."యని యారంభించు పదిహము చెప్పెను. నీలనక్కరుని ప్రార్థనను మన్నించి యాతని యింట కతిపయ దినములఁ గడపెను. పిదప నాగపట్టణమున కేఁగి నాగేశ్వరుని నుతించి నీలోత్పలముల కాకరమైన "తిరుకీళ్ వేలూరు"ను సమీపించెను.

చిఱుతొండని సంధించుట :—

జ్ఞానసంబంధుని రాకను విని చిఱుతొండనంబి "తిరుచెంగాటం గుడినుండి పరుగిడిపోయి సంతసముతో మ్రొక్కి తన యూరికి విజయము సేయుఁడని ప్రార్థించి తోడ్కొని వచ్చెను. దిగంత విశ్రాంత యశస్వియగు చిఱుతొండనితో

మైత్రిఁ బాటించి సంబంధుఁ డాతనితో గణపతీశ్వరాలయముఁ జేరెను. ఆలయమును వలగొని గణపతీశ్వరునకు సాష్టాంగ మాచరించి కేలుదోయి మోడ్చి, చిఱుతొండని సేవాభాగ్యమును చేర్చి పదిహామ్లుఁ బాడి యా శివుని వేయి విధములఁ గీర్తించెను. పిదప నమాత్య బ్రాహ్మణశేఖరుఁడగు నా చిఱుతొండని గృహమున కేఁగి యాతని యాతిథ్యమును స్వీకరించెను.

సర్పదష్టుఁడైన వైశ్యుని జీవింపఁజేయుట :—

పిదప సంబంధుఁడు తిరుచ్చెంగాటమునుండి తిరుమగలూరిం జేరి మాణిక్యవణ్ణుని యాలయముఁ జొచ్చి వలగొని చంద్రశేఖరునకుఁ బద్యమాలికల నర్పించి యయ్యూర నివసించుచుండెను. ఒకానొకనాఁ డొక వైశ్యుఁడొక కన్యకం దోడ్కొని వచ్చి రాత్రి యగుటచే నందొక మఠముఁజొచ్చి నిద్రించుచుండెను. అర్ధరాత్రమున నొక కోడెత్రాఁచు మఠముఁ జొచ్చి నిద్రించు నా వైశ్యుని కాటు వేసెను. విషవేగము తలకెక్కి నోరనురుచ్చులు గ్రమ్మి నంత్యకాలము దాపురింప నాతఁడు మూల్గుటచే నా వైశ్యకాంత మేల్కొని, యతని దురవస్థను గాంచి, యేమియు సేయఁ జాలనిదై సాయపడువారు లేనందున బోరున నేడ్వసాగెను. ఆ యెడ్డున కచటి వారు లేచి వైశ్యుఁడు సర్పదష్టుఁడగుట నెఱిఁగి, మంత్రవాదులఁ బిలిచికొని వచ్చిరి. వారు మంత్ర తంత్రములఁ బ్రయోగించిరి. కాని యవ్వి ఫలోన్ముఖముఁ గాలేదు. అతఁ డసువులఁ

బాసె. నిస్సహాయురాలై యా వనిత కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండెను.

"తల్లిదండ్రులను విడిచి నిన్ననుసరించితి. నీవు పాము కాటుచే మరణించితివి. నేనేమి సేయుదు? ఎటు పోవుదు? నాకు దిక్కెవరు? అయ్యో! ఈ దుఃఖ సాగరము దరిఁ దరివలెఁ జేర్చువారెవరు? కటకటా! దైవమా! నాకీ యవస్థ నేల కల్పించితివి!" యని వాపోవుచు "గతిలేనివారికి దైవమే గతి" యని యాలయమువైపు చూచి, చేతులు జోడించి మ్రొక్కి "మృత్యుంజయా! క్షీరసాగరమునఁ బుట్టిన హాలాహలమును మ్రింగి దేవాదులను రక్షించి యభయ మొసంగితివి. నాగాభరణా! బ్రహ్మేంద్రాది దేవసంస్తుత వైభవా! నీ కోపాగ్ని యందు మదనుఁడు భస్మముగా, నవ వైధవ్యదుఃఖము భరింపఁ జాలని రతి నిన్ను వేఁడ, కరుణతో రతిపతికి జీవ మిచ్చి బ్రోచితివి గదా! మార్కండేయుని జీవములఁ గొన వచ్చిన యముని కాలదన్ని నేలఁగూలఁ ద్రోసితివిగాదే! భక్తావనదీక్షా! ఈ దాసురాలిని కరుణింపరావా! జగద్రక్షకా! ఈతని దేహమును నిర్విష మొనర్పరాదా! అనాథనాథా!" యని విలపించెను.

ఇట్లు మృత్యుంజయుని వేఁడుచు వాపోవు నాకాంత రోదనము ప్రాతఃకాల సేవార్థమై యాలయమున కేఁగు సంబంధుని చెవిఁ బడెను. సంబంధుఁ డీరోదన మెవరిది? యని మరలి యా మఠమునకు వచ్చి యా కన్యకఁగాంచి, "బాలా! భీతిల్ల

కుము. నీ చరితమును, దుఃఖహేతువుఁ దెల్పు" మనెను. ఆ వైశ్య కన్యక కన్నీరు గార్చుచుండ నా శీర్గాళి బాలుని పాదములపైఁబడి మ్రొక్కి లేచి, "దేవా! నా పుట్టిన యూరు వైపూరు. అచటి వైశ్యకుల నాయకుఁడు తామనుఁడు నా తండ్రి. ఈ మరణించిన యువకుఁడు నా తండ్రికి మేనల్లుఁడు. నా తండ్రి కేడుగురు కొమరితలు. వారిలో జ్యేష్ఠురాలి నీతని కిత్తునని నా తండ్రి చెప్పి, ధనాశాపరుఁడై వేఱొకని కిచ్చి ధనముఁ గైకొనెను. అట్లే నన్నుఁ దక్క మిగిలినవారిని ధనముఁ గైకొని యితరుల కిచ్చి వివాహములు గావించెను. మా తండ్రి చేఁతల కితఁడు దుఃఖాక్రాంతుఁడుగా నే నీతనిఁ బెండ్లియాడ నిశ్చయించి తల్లిదండ్రు లెఱుంగరాని విధమున నితని ననుసరించి వచ్చితి. ఇట నితఁడు పామువాతఁ బడెను. సాగరమధ్యమున తలక్రిందులైన పడవవలె నున్నదానను. దేవర శివుఁడు పంపిన బంధువువలె వచ్చితిరి. రక్షింపుఁ"డని మ్రొక్కెను.

ఆ దీన వాక్కులకు ద్రవీభూత మనస్కుఁడైన సంబంధుఁడు శివుని దలంచుచు "ఆర్తార్తిహరా! జటాధరా! జగన్మాతృస్వరూపా! భస్మోద్ధూళిత దేహా! త్రిపురాంతకా! నీలకంఠా! ఈమె కిట్టి దుఃఖము గల్పింప న్యాయమా" (శెడయాయ్ యెనుమాల్...) అను పదిహముతో స్తుతించెను. వెంటనే యా వైశ్యుఁడు నిద్రనుండి లేచినవానివలె లేచి, సంబంధుని పాదములకు మ్రొక్కెను. జనులందఱు

"హరహర మహాదేవ శంభో" యని ఘోషించిరి. సంబంధుఁడు వారిరువురి కల్యాణమున కనుమతించి వీడ్కొల్పెను.

క్రమ్మఱ చిఱుతొండనితోఁ గలసి యాలయమున కేఁగి, స్తుతించి చిఱుతొండని మరలి పొమ్మని యాజ్ఞనిడి, యనేక శివక్షేత్రములను దర్శించుచు తిరుప్పుహలూరును సమీపించెను. సంబంధుని రాక విని మురుగనాయనారు భక్తులతో నెదురు వచ్చి స్వాగతమీయ నాతనితో నాలయముఁజొచ్చి వలఁగొని మ్రొక్కి "పుహలూరు పుణ్యాత్మా..." యను పదిహామును పాడి స్తుతించి, మురుగనాయనారు ప్రార్థనము మన్నించి యాతని మఠమునఁ గొలఁది కాల ముండెను. అక్కాలమున మురుగనాయనారు సేవాభాగ్యముఁ బొగడుచు పద్యములఁ జెప్పెను.

వాగీశుని సంధించుట :—

సంబంధుఁడు పుహలూరిలో నుండు కాలమున వాగీశుఁడు తిరువారూరు వల్మీకనాథుని సేవించి వర్ధమానేశ్వరుఁ గొలువ వచ్చుచుండెను. ఆ శుభవార్త వినిన సంబంధుఁడు భక్తవతంసులతో నాతని కెదురువోయెను. ఓండొరులు ప్రేమాతిశయముతో వందనము లాచరించుకొనిరి. సౌహార్దముతో యోగక్షేమములఁ దెలిసికొనిరి. అంత సంబంధుడు "అప్పా! నిన్నిచటఁగాంచు భాగ్యము గల్గె. నీవు తిరువారూరున శివసేవా విధి నెట్లాచరించితివి?" అని యడుగ నతడు స్వీయ

కవితాధారతో నచటి యాత్రోత్సవమును వర్ణించెను. "నాకు నచటికేఁగ నాశ యొడముచున్నది. నేను శివుని సేవించి వచ్చెద"నని యటనుండియే తిరువారూరునకుఁ బయన మయ్యెను.

వాగీశుఁడు సంబంధు నత్యాదరమున ననిపి పుహలూరు వర్ధమానేశ్వరుని సేవింప నేఁగెను. సంబంధుఁడు పుష్పించిన లతాతరువులుగల మార్గమునఁ బయనించుచు, తిరువేర్కుడి వీరస్థముఁజేరి మ్రొక్కి పద్యమాలిక నర్పించి క్రముక పనస చూతాది వనములఁ గాంచుచు, "తిరువారూరి స్వామిని చేరుదము" అని పాడుచు తిరువారూరిని సమీపించెను. సూర్యమండలము నంటు ధ్వజపతాకలతో విలసిల్లు నా స్వర్ణ పురిని గాంచి యొడలుమఱచి యాశువుగ కవితసెప్పి నగరపు టెల్లను చేరెను. వెంటనే ముత్యాల పల్లకిని దిగి దోసిలినిండ పుష్పంబులఁ గైకొని యా స్థలము నర్చించి, "మనసు నిర్మల మైన..." అని పదిహామును పాడి మ్రొక్కెను.

తిరువారూరి పౌరులు నగరము నలంకరించిరి. వీథు లందు పునుఁగు కస్తురి కలయంపిని చల్లిరి. వెదచల్లఁబడిన పుష్ప మకరందముచే బురదకాఁగా నందలి పుష్పొడిచే నయ్యది ఘనీభవించెను. గృహములపైఁ బతాకలెగురుచుండెను. ఆ సాయంసమయమున రత్నదీపికల కాంతి నీలమణి కాంతులతోఁ గూడి పూల పందిరులపైఁ బడి కపిలచ్ఛాయ నందుచుండెను. మంగళవాద్య ధ్వనులు పెల్లుగ వెడలి మేఘగర్జనముల నధఃక

రించుచుండెను. ఇట్లు నగరము నలంకరించి భక్తు లాతనికి స్వాగత మొసఁగి మ్రొక్కిరి. సంబంధుఁడు వారికి మ్రొక్కి "సుందరేశా! కాలాంతకా! సర్వవ్యాపీ! ("అండమాయ ఉలహోరీపూ") అని పాడుచు నగరముఁ బ్రవేశించెను. పురంధ్రీ లలామలు సంబంధునిపై పూవులను పేలాలను చల్లి మంగళ హారతుల నెత్తిరి. ఆతఁడు ఆలయముఁ జొచ్చి వల్మీకనాథు నకు నమస్కరించి రాగసుధారసము వెల్లివిరియ దేవదేవునిఁ గీర్తించి, యొక మఠమున విడిసెను. కొన్ని దివసంబులట నివసించి సేవించెను.

ఒకనాఁడు "శ్రీ విభూతియే నీ కలంకారము" (తిరునీశే వమదు వాళ్వావదు") అను పదిహము పాడి బయలుదేఱి తిరుప్పవయూరను సేవించి పుహలూరు మార్గముఁ బట్టెను. తమ్ము ధన్యులఁజేయ సంబంధుఁడు వచ్చుచున్నాఁడని వాగీశుఁ డెఱిఁగి మురుగనాయనారు మొదలగు భక్తులు వెంటరా నెదు రేఁగి యతనిఁ దోడ్తెచ్చెను, సంబంధుఁడు భక్తులతో మురుగ నాయనారు మఠమున నుండెను. నీలనక్కనాయనారు, చిఱు తొండఁడు పుహలూరునకు వచ్చి సంబంధునకు మ్రొక్కి యతనితో శివసేవా మహిమలఁ జర్చించుచు, నాతని దివ్య బోధల నందుచు నానందించిరి. పూజా ధ్యానసమాధి నిష్ఠా నియమములఁ గూర్చి సంబంధుఁడు వారికి బోధించెను.

తిరు-అంబరు మాహాళముఁ గాంచుట :—

కొంతకాల మట్లు భక్తులతోఁ గడపి, సంబంధుఁ డంబరు మహాళముఁ గాంచ కుతూహలియై వాగీశునితోఁ బయన

మయ్యెను. నీలనక్క చిఱుతొండ నాయనారులు స్వస్థలముల కేఁగిరి. సంబంధ వాగీశులు నడచిపోవుచుండ వెనుక శిబిక వచ్చుచుండెను. కొంతదూర మేఁగినపిదప వాగీశుఁడు "శివుడు కరుణించి యొసఁగిన శిబిక నధిరోహింపక యిటు రాఁదగునా" యన సంబంధుఁడు "చంద్రకళాధరుని దయ యిదియే యగుచో మేలు. ముందు మీా రెచటి కేఁగుదురో తెల్పిపోయిన నేచటికిఁ జేరుదును" అనెను. వాగీశుఁడు "మేలు. ఇఁక నట్లే చేసెదను" అని పలికి యంబరును చేరెను. సంబంధుఁడు పల్లకినెక్కి అంబరును చేరెను. అచటి యాలయముఁ జొచ్చి వాగీశునిఁ గాంచి యతనితో లోనికేఁగి, వలగొని మ్రొక్కి వెలికి వచ్చి యానగరమునఁ గొంతకాల ముండెను. పట్కాల పూజావసరములఁ దప్పక శివుని సేవించుచు నచటికి సమీాపమునఁ గల కోచ్చెంగచోళుఁడు కట్టించిన మాడకోవిలను దర్శించి స్తుతించెను.

కుంగిలికలయ నాయనారుని సంధించుట:—

సంబంధుఁడు అంబరుమాహాళముమునుండి కడయూరున కేఁగెను. సంబంధుఁడు తన యూరి కేతెంచుచున్నాఁడని యెఱిఁగి కుంగిలికలయ నాయనారు భక్తులతో నెదురువచ్చి మ్రొక్కెను. సంబంధుఁ డాతనితో వీరస్థానాలయముఁ జొచ్చి వలగొని యముని శిక్షించిన మృత్యుంజయునకు వందన మాచరించి, మధుర గీతికలతో నుతించి కుంగిలికలయ నాయ

నారు గృహంబునకేఁగి యతిథి సత్కారముల నంది యాతనితోఁ గొంత కాలముండెను.

అటనుండి పయనమై వాగీశకలయనారులు వెంటరా, తోన్ని)మాడము, తీరుమీాయచ్చూరులనుదర్శించి తిరువీళిమిళల మను క్షేత్రముఁ జేరెను. వీళిమిళలి వాసులగు శ్రోత్రియులు పురిని ధూపదీపములతో నలంకరించి హస్తములఁ బూర్ణకుంభములను దాల్చి, వేదఘోషలతో నెదురువచ్చిరి. సంబంధుఁడు పల్లకిదిగి, వారికి మ్రొక్కెను. వారు నా జ్ఞాన శిశువునకు మ్రొక్కిరి. సంబంధుఁడు "కౌపీనధారీ! శివా" అని పాడుచు వాగీశాదులతో నాలయముఁ బ్రవేశించి మ్రొక్కి యాయాదిమ లింగమును గాంచి, యానంద పరవశుఁడై "గంగాధరా! పరమేశా! (శెడయార్ పునల్) అని పాడి నుతించెను. వాగీశుఁ డాలయమునకు సమీపమున నున్న మఠముఁ బ్రవేశించెను. సంబంధుఁడు తూర్పు వీథిలోని మఠమున కేఁగెను. వారచటి శివుని సేవించుచు స్తుతించుచు నటనుండి పోయి శ్రీ రామ లక్ష్మణులు దశరథునకు తిలతర్పణ మొనర్చిన "తిలవైప్పది" అను స్థలమును సేవించి మరలి మిళలికి వచ్చిరి.

వీళిమిళలిలో సంబంధుఁడుండు కాలమున శీర్గాళి విప్రోత్తములకు నాతనిఁగాంచ కోరిక యొడమెను. వారు మిళలికి వచ్చిరి. వారిని యచటి శ్రోత్రియులు విధ్యుక్తముగఁ బూజించిరి. వారు సంబంధుని గాంచి మ్రొక్కి శీర్గాళికి దయసేయుఁడని ప్రార్థించిరి. ఆ మాటలను విని సంబంధుఁడు

"మీ మాటలు మేలుగ నున్నవి. రేపు మన మీ శివుని యను మతినంది పోవుదమని పల్కెను. మిళలి వైదికులు వచ్చిన శ్రోత్రియులకు విందు చేసిరి. ఆ నాఁటి రేయి సంబంధుని స్వప్నమున శీర్గాళి తోణియప్పరు దర్శన మిచ్చి, "నీ వీయూర విమానముకడ నారూపముఁ గాంచి పూజించి పొమ్మని యను గ్రహించెను. ఉదయమున నాతఁ డాలయమున కేఁగి దేవ విమానముకడ తోణియప్పరును దర్శించి "ఆవేష మిచటఁ గన్పింపఁ జేయు మహిమ యేమి?" అని పాడి వెలికివచ్చి వైదికులఁగాంచి "బ్రహ్మపురీశ్వరుఁ డుమాసహితుఁడై యెల్ల యెడల ప్రత్యక్షమైయుండు తత్త్వము నా కెఱిఁగించె" మీరు శీర్గాళి కేఁగుఁడని చెప్పెను. వారు తోణిపురికి మరలిరి. హా రేఁగిన పిదప వాగీశునితోఁ జేరి మిళలి శివునిఁ గొల్చుచు నుండెను.

సంబంధుఁ డచట నుండుకాలమున వర్షాభావ మేర్ప డెను. నదులలో నీరింకెను. పాఁడి పంటలు తఱిఁగెను. ఎండలు మెండయ్యెను. పైరు మల్లెపట్టి చెడెను. ప్రాణు లాహారము లేక తపించిరి. దేవపూజల కాటంకము గల్గెను. వాగీశ సంబంధు లా కాటకము గాంచి చింతించిరి. అష్టమూర్తియు, లోక రక్షకుఁడు విశ్వవ్యాపియు నగు పరమేశ్వరుని పాదకమలములఁ దలంచుచు వారు నిద్రించిరి. శివుఁడు వారికి స్వప్నమునఁ గన్పించి "కీర్తిమంతులారా! ఇప్పుడీ కఱవు లోకస్వభావముచే సంభవించినది. అది మీ దరికి రాదు. మీతోడి భక్తుల

కష్టములఁ దీర్ప మీ యొక్కొక్కరికి నొక్కొక్క బంగారు కాసు నా ప్రాక్పశ్చిమ బలిపీఠంబులపై లభించునట్లొనర్చెద. తామాం తమువఱకట్లే లభించును'' అని కరుణించి యంతర్ధానముఁ జెందెను.

వారు మేల్కొని ''యెంత దయో దాసులపై '' అని తలంచి యాలయమున కేఁగిరి. ప్రదక్షిణ మాచరించి రాఁ దూర్పు బలిపీఠముపై సంబంధుని కొకటియు, పశ్చిమ పీఠముపై వాగీశున కొకటియు కాసులు కనఁబడెను. వారు వానిఁ గొని మఠముల కేఁగి ''భక్తులకు భోజన మిడుదుము రండు'' అని చాటించి, కాసు నమ్మించి వలయు పదార్థములఁ దెప్పించి, శాకపాకములు సిద్ధపఱచి దధి క్షీర శర్కరా సమ్మిశ్రితంబు షడ్రసోపేతంబు నగు భోజనమును భక్తులకుఁ బెట్టసాగిరి. వాగీశుఁడు భక్తులకు మధ్యాహ్నమునకు ముందే భోజన మిడుచుండెను. సంబంధుని మఠమున నపరాహ్ణమునకుఁ గాని వంటలు గాకుండెను. అది యేమని విచారింప, వైశ్యులు తన కాసు మేలిమి బంగారము గాదని వాదులాడుచు, చాలసేపటికి వెల తగ్గించుకొని వస్తువుల నిచ్చుటగాఁ దెలియవచ్చెను. వాగీశుని కాసు అపరంజి బంగారమఁట. సంబంధుని కాసు వన్నె తక్కువ పైఁడియఁట.

శివుఁడొసఁగు కాసులందొకటి మేల్తరము ఒకటి తక్కువ తరమగుట కేమి హేతువని చింతించెను. ''హా! తెలిసినది. వాగీశుఁడు స్వహస్తములతో నాలయమును దోఁకి సేవించుచున్నాఁడు. కాన అతని కాసు మేలైనది'' అని నిశ్చయించి

యాలయమున కేఁగి, "కొఱంత లేని కాసిచ్చిన నీకేమి కొదువ దేవా?" అని స్తుతించెను. మఱునాఁటినుండి యతనికి మంచి కాసే లభించుచుండెను. వైశ్యులా కాసునకు మంచి వెల నొసఁగిరి. ఆ దినమునుండి సంబంధుని మఠమునందును శీఘ్రము గనే వంటలు కాసాగినవి. ఇట్లు కొంత కాలము గడువ క్షామము తగ్గి వానలు కురిసినవి. దేశము సుభిక్షమాయెను.

వేదారణ్యమున కేఁగుట:—

సంబంధుఁడు వాగీశునితోఁ గలసి శివుని యనుమతి నంది, బయలుదేఱి తిరువాంచియము, ఆలంగాడు, వేలూరు, శాతంగుడి, కరవీరము, కారారాయిల్ మొదలగు శివస్థలము లను దర్శించుచు వేదారణ్యమును సమీపించెను.

కౌండిన్య గోత్రోద్ధారకుఁడు వాగీశునితో వచ్చు చున్నాఁడని వినిన వేదారణ్యవాసులు తమ పురము నలంకరించి, మంగళవాద్యములతో నెదురువచ్చి ముందుగ నేతెంచు వాగీ శునకు స్వాగతమిడి, పిదప సంబంధుని రాకను దెల్పు కొమ్ముల యులివును విని భూమిపై సాగిలపడి మ్రొక్కిరి. శీర్గాళి నాథుఁడు శిబిక దిగి, వారికి వందన మాచరించి వేదములు శివునిఁ బూజించి మూసిపోయిన యాలయ ద్వారదేశమును చేరెను.

వేదములు కవాటమును బంధించిన నాఁటినుండి యా నాఁటివఱకవి వివృతమొనర్ప సాధ్యము గాకుండినవి. కావున

భక్తులు పూజారులు వేఱొకద్వార మేర్పఱచుకొని పోయి వచ్చుచుండిరి. వాగీశ సంబంధులా వార్తను విని యాశ్చర్య పడిరి. సంబంధుఁడు తిరునావుక్కరసుఁ గాంచి "నే నీ ద్వారము నుండియే లోని కేఁగవలయు. నీవు నీ కవితాశక్తితో వీనిని తెఱపింపుము" అనెను. వాగీశుఁ డట్లే యని "రాగమువలె మధురవాక్కులుగల ఉమాదేవీ" అను పదిహముఁ బాడెను. అవి వివృతములు గానందున పదునొకండవ పద్యము చెప్పెను. వెంటనే తలుపులు తమంత తామే విడివడెను. అపుడు భక్తులు దేవత లొనర్చిన జయఘోషము లజాండము నిండెను. సంబంధుఁడు వాగీశుఁ బొగడి యా ద్వారమునఁ బ్రవేశించి శివునకు మ్రొక్కి స్తుతించి వెలికి వచ్చెను.

అపుడు శ్రమణుల వంచనలను నిర్జించిన వాగీశుఁడు "దేవా! యీ తలుపులు మూసికొనను తెఱువను సాధ్యమగు నట్లు శివుని మీ గానముతో నుతింపుఁడు" అని కోరెను. వెంటనే బాలశివభక్తాగ్రేసరుఁడు "నాల్గు వేదములు..." అను పద్యము చెప్పఁగనే యదేమి వింతయో కవాటము మూసి కొనెను. వాగీశాదులు సంబంధుని వేయివిధములఁ గీర్తించిరి. పుష్పవర్షము గురిసెను. అతఁడా పదిహమును పూర్తిచేసెను. అదిమొదలా తలుపులు మూయఁ దెఱువ సాధ్యమాయెను. లోకు లమందానంద మందిరి. వేదము లొనర్చిన కృత్యము వారికే సాధింప శక్యము.

త్తాను పది పద్యములు చెప్పినను తెలిసికొనవని తలు పులు సంబంధుని యొకపద్యముతో మూసికొనెను. ఇందు శివుని తలంపేమి? అని తలంచుచు నిద్రించిన వాగీశుని కలలో వేదారణ్యేశ్వరుఁడు గన్పించి, "తిరువాన్మియూరునకు రమ్ము" అని చెప్పి ముందున కేఁగుచుండెను. వెంటనే వాగీశుఁడు లేచి మ్రొక్కి భక్తితో నా పరమేశుని వెన్నంటెను. శివుఁడు వాగీశునకు దగ్గఱగ నడచుచున్నటులఁ గన్పించినను సమీపింప రానివాఁడై వేగముగఁ బోవుచుండెను.

సంబంధుఁడు వాగీశునిఁ గానక "అతఁడెచటికేఁగె"నన నచటివారు తిరువాన్మియూరి దిక్కున కేఁగెను అని తెల్పిరి. అతఁడు నాతోఁ జెప్పక పోవుటయేమి?" అని తలంచి వాగీశుని వెదకుచుఁ బోయెను. వాగీశునితోఁ గలిసి పోవుచుండ నుమాపతి నటనమాడు దృశ్యము సంబంధునకు గోచరింప, నతఁడు ఆ దృశ్యమును వాగీశునకుఁ జూపి స్తుతించి తిరువాన్మియూరునకేఁగి, సదాశివుని దర్శించి మ్రొక్కి స్తుతించి వేదారణ్యమునకు వెనుదిరిగి వచ్చెను.

పాండ్యదేశ స్థితి:—

అక్కాలమునఁ బాండ్యదేశమున వైదికమార్గము నశించి, శ్రమణమత మభివృద్ధిలో నుండెను. పాండ్యరాజు జన్మాంతర దుష్కృత ఫలముగ జైనమతము నాశ్రయించి యుండెను. "యథారాజా తథాప్రజా" అనునటుల ప్రజలు

సన్మార్గమును వీడి జైనులై పాపపు నడవడికల నవలంబించిరి. పాండ్యదేశమందలి పవిత్ర స్థలములన్నియు జైనమఠములతో నిండియుండెను. ఎచటఁ గాంచినను నెమలియీఁకలను కమండలువులఁ దాల్చి జైనులు నడుమునకు చాఁపలఁ గట్టికొని మతాచార్యులమని చెప్పికొనుచుండిరి. దేశమందు మచ్చునకైన శివదాసుఁడు గానరాకుండెను.

చోళరాజ పుత్రికయు పాండ్యుని దేవియు నగు మంగయక్కరశి, మంత్రి కులచ్చిరయారును శైవులై యుండిరి, వారు దేశమునకుఁ గల్గిన దుస్థితికి విచారించుచుండిరి. రాజునకుఁ దెలియని విధమున వారు శివపూజా తత్పరులై యుండిరి. లోకమును సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయుచు, శైవమును ప్రబోధించుచు సంబంధుఁడు వేదారణ్యమున నున్నాఁడని, వారు వినిరి. అవ్వార్త వినుటతో హేమంతమున వాడిన తామరలు గ్రీష్మమున వికసించినటుల వారి మోముదమ్ములు విప్పారెను. వారాతనిని దర్శింపఁగోరి యాంతరంగికులగు పరిజనులఁ జీరి "మీరు వేదారణ్యమునకేఁగి, సంబంధుని దర్శించి పాండ్యదేశ స్థితిని విశదపఱుపుఁడు" అని యాజ్ఞయిడి పంపిరి.

వారా యాజ్ఞను శిరసావహించి, నదీనదములను పర్వతములను మహారణ్యములను దాఁటి, మొగలిపూవులతో మనోహరమగు సముద్ర తీరముఁ జొచ్చి వేదారణ్యమును చేరిరి. సంబంధుని మఠమును చేరి "మేము పాండ్యుని దేవి మంత్రియుఁ బంప వచ్చితిమి" అని తెల్పిరి. భక్తు లా విషయముఁ దెల్ప

సంబంధుఁడు "మీ రాణికి మంత్రికిఁ గుశలమేగదా" యని యడిగెను. వారు వారి క్షేమములు దెల్పి, "దేవా! పాండ్య దేశము పాడైనది. జనులు జైనులైరి.. రాజు వారి మాయ లను లోఁగెను. మీ్రారేతెంచి జైనుల కపటముల నడంప నిచో ప్రజలు నశింపఁగలరు. ఈ పరిస్థితిని మీకుఁ దెల్ప రాణి పంపినది "మీరు త్రోసిరాజనక రాజును జనులను విభూతిప్రియులను గావింప ప్రార్థన" మని విన్నవించిరి. సంబం ధుఁడు వారి నాదరించెను.

పిదప సంబంధుఁడు వాగీశునితో నాలయమున కేఁగి మ్రొక్కి ద్వారదేశమున నాసీనుఁడై యాతనికి పాండ్యదేశ స్థితిని దెల్పి, రాజ్ఞీ మంత్రుల విన్నపములను సాంతముగఁ జెప్పి తాను పాండ్యదేశమున కేఁగఁ దలఁచినట్లు చెప్పెను. అపుడు వాగీశుఁడు "బాలకా! జైనుల కపట తంత్రము లనేకములు. ఇప్పుడు గ్రహస్థితియు బాగుగలేదు. నీవు పాండ్యదేశమునకుఁ బోవుట మేలుగాదు" అనెను. అంత సంబంధుఁడు మనమున శివునిఁ దలఁచి "వేణువువంటి భుజములు గల్గిన ఉమాదేవిని వామభాగమునఁ గల శివా! నీలకంఠా! వీణాగానప్రియా! గంగాధరా! చంద్రకళాధరా! ఆది సోమ మంగళ బుధ గురు శని వాసరంబులు రాహుకేతువులన్నియు మంచివే గావా! నీ దాసుల కివియన్నియు శుభస్కరములే..." (వేయిరుతోళ పంగన్...అడియార్ అవర్కు మిహవే) అను పదిహమును పాడెను. ఆ గీతములను విని వాగీశుఁ డాతని పాండ్య దేశ

గమనమున కంగీకరించెను. తాను వత్తునన, సంబంధుఁడు "నీవీ చోళదేశమున నుండుట యుక్తము" అనెను. వాగీశుఁడు వందన మాచరించి చోళదేశమున నుండ నంగీకరించెను.

పాండ్యదేశ యాత్ర :—

సంబంధుఁడు శైవమును దిగంతవిశ్రాంత మొనర్చి, వేదమార్గమును రూఢిపఱుప పాండ్యదేశ మేఁగఁదలఁచి, వేదారణ్యేశ్వరుని మ్రొక్కి పాడి నుతించి యనుమతి వడసి, యాలయము వెలికి వచ్చెను. వాగీశుఁ డాతనికి మ్రొక్కి బయలుదేఱెను. కొంతవడి యాతనితో భాషించి సంబంధుఁడు ముత్యాలపల్లకి నెక్కి బయలుదేఱెను. పరమశివుని పాదారవిందములను హృదయమున నిల్పి, పంచాక్షరిని జపించుచుఁ బయనించునెడ భక్తబృందములు "హరహర శంభో మహాదేవ" యని యుచ్చైస్స్వనంబునఁ బల్కిరి. శంఖ భేరీకాహళాది ధ్వనులతో, ధ్వజపతాకలతో సంబంధుని ప్రయాణము విజయ యాత్రను తోఁపింపఁ జేసెను. సంబంధుఁడు తిరువహత్తియూరు, కాడహార్కోయిల, కడిమలము, తిరుశాత్తానము అను దివ్య క్షేత్రములను దర్శించి, సముద్రతీర మార్గమును దాఁటి పోవుచు కదళీ పనస క్రముకాది వనములను గాంచి సంతసించుచు, సరోవరములనుండి వీతెంచు చల్లని గాలుల కానందించుచు, కర్షకస్త్రీల పాటలను వినుచుఁ బోవసాగెను. మధ్యేమార్గమందలి గ్రామములలో వైదికుల యాగశాలలను భక్తుల

మఠములను చూచుచు నెడారి ప్రదేశమునుదాఁటి దక్షిణ పాండ్య దేశముఁ జొచ్చెను.

నదులను తరించుచు, జింకల కదుపులతో నిండిన అడవులనుదాఁటి, తిరుకోడు కున్ట్రిమను క్షేత్రముఁజేరి శివుని మ్రొక్కి పాడి నుతించి సుధాంశు మండలము నంటు ప్రహరులు గల మధురాపురిని సమీపించెను.

జైనుల దుశ్శకునములు :—

సంబంధుఁడు మధురాపత్తనపు టెల్లను సమీపింపఁగనె, యానైమల మొదలగు నెనిమిది కొండల గుహాలలో వసించు జైనులకు రాఁబోవు దుర్దశను ముందుఁగనే తెలియఁజేయు నట్లనేక దుశ్శకునంబులు దుస్స్వప్నంబులుఁ దోఁచెను. జైనుల గృహంబులపై మఠాచార్యుల మఠాములపై గ్రుడ్లగూబలు గుంపులుగఁ గూడి పోరాడుచుండెను. జైనుల హస్తములనుండి నెమిలియీఁకల కట్టలు, వారు గట్టికొనిన చాఁపలు తమంత తామే యూడి నేలఁబడెను. శ్రమణమును లొండొరులు నిందించుకొనుచు శమదమములను వీడి, రాగ క్రోధాదులకు లోనై నిష్కారణ వైరము వహించిరి. ఒండొరులు గాంచిన దుశ్శకునములఁ జెప్పికొనసాగిరి, పర్వతవాసులు పత్తనవాసులగు జైనులంగాంచి తమ దుస్స్వప్నాదులం జెప్పి వారి యనుభవముల నెఱిఁగిరి. అందఱు తమ యనుభవములను రాజునకు విన్నవించిరి. అశోకవృక్షము నిష్ణేతుకముగఁ వ్రాలి

యర్హాతుని విగ్రహమును భగ్న మొనర్చుచుండఁ గాంచితి నని యొకఁడు, కమండలువులు వగుల, కట్టిన చాఁపలు చినుఁగ, మునులు దిగంబరులై పాఱుటఁ గాంచితినని యొకఁడు, గుహల నుండి శ్రమణులు గార్దభములపై నెక్కి పరుగిడునట్లు కల గంటి నని యొకఁడు, శ్మశానమున నర్తనమాడు శివుని భక్తులు మధు రను ప్రవేశించినటులఁ గంటినని యొకఁడు, రాజగ్నిలోఁ బడినట్లు, ఒక బాల వృషభము జైనుల కాళ్లు విఱుగఁ ద్రొక్కినట్లు, వారు వారు గాంచిన స్వప్నములను భీతిగ్రస్తులై వర్ణింపసాగిరి. "వీని ఫలమేమో! ఇయ్యవి జైనులకుఁ గలుగఁబోవు దుర్దశ లను దెల్పుచున్నవి" అని దుఃఖించుచు కలతఁ జెందిరి.

మహారాణికి మంత్రికిఁ దోఁచిన శుభశకునములు:—

జైను లివ్విధంబున దుఃఖించుచుండ శివదాసురాలైన మంగయక్కరశికి, మంత్రి సత్తముఁడైన కులచ్చిరయారునకు శుభశకునంబు లనేకంబులు పొడసూపెను. వానిఁగాంచి వారు సంతసంబున నుండ వేదారణ్యమున కేఁగిన దూత లేతెంచి, సంబం ధుఁడు వచ్చు శుభవార్తఁ దెల్పిరి. పాండ్యునిరాణి వారికి ధన కనకాదు లొసఁగి పంపి, నిర్భరానంద పరవశయయ్యెను. అపుడు కులచ్చిరయారు అంతఃపురమున కరుగుదెంచి మహారాణికి మ్రొక్కి యంజలి బద్ధుఁడై యుండఁగాంచి రాణి "ఆర్యా! సంబంధుఁ డిటకు విజయము సేయుచున్నాఁడు. మీ రా మహా త్మునకెదు రేఁగి, సగౌరవముగఁ దోడ్తెండు" అని పల్కెను.

మంత్రి దేవియాజ్ఞను తలఁదాల్చి "ఇది యందఱకు శుభావహామే" యని భావించుచు సపరివారుఁడై మధురను వీడి కొంత దూరమేఁగి, సంబంధుని రాకఁ బ్రతీక్షించుచుండెను. మంగయక్కరశి "సోమసుందరేశ్వరుఁ బూజించి వత్తును" అని రాజానుమతి నంది యాలయముఁజొచ్చి భవుని శ్రీపాదంబులను సేవించి సంబంధుని దర్శింపఁ గుతూహలినియై యాతని యాగమనమును నిరీక్షింప సాగెను.

ముక్తాశిబికారూఢుఁడై, రాకాచంద్రునివలె విలసిల్లుచు సితాతపత్రంబునీడ భక్తులు పరివేష్టించి రా సంబంధుఁడు మధురఁ బ్రవేశించెను. వైదికులు వేదధ్వనులతో నెదురు వోయిరి. మంగళతూర్యారావంబులు మిన్నందెను. మలయమారుతంబులు మందమందముగ వీఁచెను. జైనుల పాపకృత్యంబులచే మలినమైన పాండ్యదేశముఁ బావన మొనర్ప నేతెంచు గంగాప్రవాహమో యన, జైనాజ్ఞానాంధకారము నడఁగింప నేతెంచు జ్ఞానభానూదయమువలె, పాండ్యదేశ మొనర్చిన సుదీర్ఘ తపఃఫలమా యన నా శివబాలుఁడు పట్టణప్రవేశ మొనర్చు సమయమున నాతనికి పరమశివుఁ డనుగ్రహించిన వాద్యము లాతని వివిధ నామంబుల నుచ్చరించుచు "పరమత హరిణంబులను సంహరించు సింహము వచ్చె"నని ధ్వనించెను. ఆ భక్తవాహినిఁ గాంచి విమత సైన్యంబులు వెనుసూపి పఱుగిడెనా యన నెల్లయెడల శైవులే గన్పించిరి గాని యా జినాశ్రయుఁ డొక్కరుఁడు గన్పింపఁడాయె.

అపుడా బంగరు వాద్యముల ఘోషములు చెవి సోక సంబంధుని రాక నెఱింగిన మంత్రి ముందుగ వచ్చు భక్తబృంద మునకు సాఁగిలపడెను. భక్తులు మంత్రి వచ్చియున్నాఁడని సంబంధునకుఁ దెల్పిరి. అతఁడు శిబికనుండి దిగి, వచ్చి యాత నిని హస్తములఁబట్టి లేవనెత్తెను. కులచ్చిరయా రాతని పాదము లకు మ్రొక్కెను. కరుణామూర్తియగు సంబంధుఁడు "చోళుని పుత్త్రికయగు మంగయక్కరశికిని నీకును సదాశివునియందు భక్తి నిరంతరము నిరంతరాయముగ వర్ధిల్లుచున్నది గదా" అని పల్కెను. "తమ రాకచే మా సేవాభాగ్యము ఫలించినది. వేదమార్గ విదూషకులగు జైనులందు విశ్వాసమునిడి పాండ్య చక్ర వర్తి విభూతి మహిమ నెఱింగి జీవించుఁగాక. రాణి మీ శ్రీపాద ములకు మ్రొక్కి తోడ్తెమ్మని యాజ్ఞాపింప నీ దాసుఁడిట్లు వచ్చి నిలిచియున్నాఁడు" అని మంత్రి వినయముతోఁ బల్కెను.

సంబంధుఁ డాతని వినయోక్తుల కలరి, మధురాపురీ రాజమార్గమున నేఁగుచు "సోమసుందరుని యాలవాయి నిలయ మెచటఁ గలదు" అని యడిగెను. మంత్రి "దేవా! అదిగో! ఆకాశమంటు ధ్వజపతాకలతో, గోపుర ప్రాకా రాదులతో నొప్పునదియే సుందరేశుని యాలవాయి" అని చూపెను. వెంటనే సంబంధుఁడా దెసకు మ్రొక్కి లేచి "మంగయక్కరశి, కులచ్చిరయారుల సేవల నందు ఆలవాయి యిదియే" (మంగయక్కరశి వళవర్ కోన్ పావై.....ఆల వాయి ఆవదు మిదువే) అని పాడుచు, శివదాసులు వెంట రా

బ్రహ్మాదులకగమ్యుఁడగు సోమసుందరు నాలయముఁ జొచ్చి, వలగొని సకలలోక సుందరుని కన్నులారఁ గాంచి పంచాంగముగ, సాష్టాంగముగ ప్రణమిల్లెను. పులకాంకురిత దేహుఁడై యానంద బాష్పములను విడుచుచు "ఆలవాయి నివాసా! సుందరేశా! నీలకంఠా!..." యను పద్యమాలిక నర్పించెను. ప్రథమ తమిళ సంఘమున పండితకవిగా విలసిల్లిన సోమసుందరేశ్వరుని పాద సన్నిధిలో కొంతవడి సంతోషసాగరమునఁ గ్రుంకులిడి, మరలి బహిర్ద్వాఃకవాటముఁ జేరెను. శివసందర్శనోద్వేగమున నేఁగు సంబంధుని మొదట గాంచియు, నెదురేఁగక యొదిగియుండిన పాండ్యుని రాణి యపుడు ద్వారదేశముఁ దరియు నా శివబాలుని ముందునకు వచ్చి నమస్కరించెను. "ఈయమయే చోళుని పుత్త్రిక" యని మంత్రి పల్కెను. సంబంధుఁ డామెను గాంచి వేగముగ సమీపింప, నామె యాతని పాదములకుఁ బ్రణమిల్లెను. సంబంధుఁ డామెను లేవనెత్తి నామె నేఁడు పాండ్యదేశము ధన్యమైనదని తలంచుచు, వీణాతంత్రీనాదము వంటి మధురవాక్కుతో బింబాధరోష్ఠముచలింప "నా ప్రాణనాథుఁ డొనర్చిన తపఃఫలమెట్టిదియోగదా!" అనెను. పరమతపంచాస్యముల మధ్యమున హరిణాంగనవలెఁ జిక్కుకొనియు సేవాధర్మము విడువక సుందరేశుని భక్తిలో మునిఁగిన నిన్నుఁ గాంచుటకే వచ్చితిని అని సంబంధుఁడు కరుణతోఁ బల్కెను. అపుడు మంత్రి యానాఁటి పాండ్యదేశ స్థితిని సంగ్రహముగఁ దెల్పెను. సంబంధుఁడు

దేవికి నంతిపురికేఁగ ననుమతినొసఁగ, నాయమ హితజనులతో వెడలి పోయెను. సంబంధుఁడు రెండడుగులిడ ఆలవాయి పరిచారకులువచ్చి మ్రొక్కి "జైనాంధకారముఁ దొలఁగింప దేవర రాకకు మేమేమి తపము చేసితిమి?" అని స్తుతింప వారి నామంత్రించి కులచ్చిరయారు సూపిన యొక్క మఠమును భక్తులతోఁ బ్రవేశించెను. కులచ్చిరయా రానాఁడు భక్తులకు సంబంధునకు చక్కని విందు చేసెను.

జైనుల మొఱ:—

సూర్యుఁ డస్తంగతుఁ డయ్యెను. దినము తెగుదల రాత్రి యేతెంచె. సంబంధుని రాక వినిన జైనులంద ఱొకచోఁ జేరిరి. భక్తుల శివనామ సంకీర్తనము పిడుగువలె వారి కర్ణరంధ్రములను విదారించెను. దానిని సహింపనివారై శైవుల కోలాహలమును రాజునకుం దెలియఁజేయ నిశ్చయించిరి. వారొక పన్నుగడతో రాజునుగాంచి మ్రొక్కిరి. పాండ్యుఁడు వారి నాదరముతోఁ గాంచి, వారి మోములు వాడియుండుట నెఱింగి "మీ రాకకుఁ గతంబేమి?" అని యడుగ వారు "అది చెప్ప సాధ్యముగాదు" అనిరి. "మీకేమి కష్టము గల్గె" నని రాజడిగెను. వారు "రాజా! వైదిక శైవులు మధురఁ జొచ్చిరి. వారిఁగాంచుటచే మేము అస్పృశ్య దర్శన దోష దూషితులమైతిమి." అనిరి. అంత రాజు "అట్లగుచో నేను వినఁగూడని దానిని వినిన దోషముచే దూషితుఁ

డనైతి. నా యొనర్చిన ధర్మ మిట్లాయెనా! శివభక్త
లిచటికి రాఁగతంబేమి?" అని కోప సందష్టాధరోష్ఠుఁడై
ఆరక్తాంత నేత్రుఁడై పల్కెను. అంత వారు "చోళ
దేశమండలి శీర్గాళిలోఁ బుట్టి, శూలపాణివలన జ్ఞానముఁ
బొందితి నని చెప్పికొనుచు, శివభక్తులు చుట్టి రా ముత్యాల
పల్లకినెక్కి, మమ్ము వాదమున నోడింతునని యొక బాలుఁడు
వచ్చియున్నాఁడు" అని పల్కి, పాండ్యరాజు "మన యనుమతి
లేక యిటకు వచ్చినవాని నేమిసేయుదము" అని యడిగెను.
దుష్క్రియలందు నిపుణులగు నాకుపితజైనులు "రాజా!
వానిపై బలప్రయోగ మక్కఱలేదు. మంత్రశక్తితో నాతని
మఠమున నగ్నిఁబుట్టింతము. అంత నతఁడు భయపడి నగరము
వీడి పాఱిపోవును" అనిరి. అసత్పథమును సత్పథమని భ్రమిం
చిన రాజు "అదియ కర్తవ్యమగుచో నట్లే మంత్రబలమున మఠ
మున కగ్నిని రగుల్గొల్పుఁడు" అని పల్కి వారిని వీడ్కొల్పి
యంతఃపురమున కేఁగెను.

పిదప రాజు శయనాగారమునకుఁ బోయి కలఁతవడిన
మనంబుతో పూల సెజ్జపైఁ బరుండెను. అపుడు రాణి
మంగయక్కరశి రాజును సమీపించి పల్కరింప నతఁడూర
కుండుటఁగాంచి, "ప్రాణనాథా! మీ మోము వికాసరహితమై
యుండుటకుఁ గతమేమి?" అని యడిగెను. రాజామెను
గాంచి "మానినీ! శీర్గాళివాసి శంకరుని కరుణాపాత్రుఁడగు
బాలుఁడొకఁడు జైనులను వాదమున నోడింప ఘన నగర

మునకు వచ్చియున్నాఁడు. వానినిఁగాంచి జైనులు అదర్శ దర్శనదోష దూషితులైరి. నే నా మాటను వినుటచే నశ్రవణ శ్రవణదోష దూషితుఁడనైతి. ఇదియే నా చింతకుఁ గారణము. వేఱెద్దియు లేదు.'' అనెను. రాణి "నాథా! తత్వార్థముఁ దెలిసి యెవరు వాదించి జయించి దైవమును నిరూపింతురో వారిని మనము చేరుదము. ఇందు చింతకు హేతు వేమిగలదు? ఊరడిల్లుఁడు'' అని చెప్పి మనంబున "ఆహా! శీర్గాళి బాలుఁడు మమ్ముఁబాలింప నేతెంచిన తాత్పర్య మెద్దియో!'' అని సంతసించుచు తన పడక గదిని చేరెను. అపుడు మంత్రి కులచ్చిరనాయనారు రాణికడకు వచ్చెను. దేవి యాతనికిఁ దనకు రాజునకు జరిగిన సంభాషణముఁ దెల్పెను. అంత మంత్రి "దేవీ! సంబంధుఁ డిచటికి వచ్చు భాగ్యము గల్గినది. కాని దుష్టజైను లిఁక నెట్టి నీచకృత్యములను గావింతురో! వారు పాపములఁ జేయ సమర్థులు.'' అని విన్నవించెను. రాణి "అయ్యా! మీరు వల్కినది నిజము. సంబంధున కెట్టి కష్టములు గల్గినను మనము జీవములను విడువవలసినదే'' యనెను.

జైనులు సంబంధుని మఠమునకు నిప్పుఁ బెట్టుట:—

రాజానుమతితో నేఁగిన జైనరాక్షసులు రహస్యముగ మంత్రములఁ బఠించి సంబంధుని మఠమున కగ్నిప్రయోగము గావించిరి. శివపంచాక్షరీ మంత్ర జపపరుల నితరమంత్రము లేమి సేయఁగలవు? ఆ విభూతిధారుల మఠముపైఁ బంపిన

యాగ్నేయ ప్రయోగము ఫలింపదాయె. దానిఁ గాంచిన జైనులు తమ గౌరవము మంట గలియునని బ్రతుకు బండయగు నని తలంచి రహస్యముగ నగ్ని గొంపోయి మఠమునకు ముట్టించిరి. జైనులు నిప్పు పెట్టుటఁ గాంచిన పరిజనులు కలఁతపడుచు లోనికేఁగి "మఠము తగులఁబడుచున్నది రండు" అని కేక లిడిరి.

వెంటనే సంబంధుఁడు "పాపులారా! శివభక్తులు నిద్రించు మఠముఁ దగులఁబెట్టఁ దలంచితిరా! నాకుఁ గీడు తలపెట్టినను మేలే! కాని శివభక్తులకు కీడుసేయుటయా? రాజధర్మ మిట్లు మంటఁగలిసెనా! 'యథా రాజా తథా ప్రజాః' రాష్ట్రమునఁ బాపము జరిగిన నది రాజునకుఁ జెందును. ఇదియే విధి" అని తలఁచి, "రక్తవర్ణశోభితా! ఆలవాయి పరమేశా!..." అను పదిహమును పాడి "శివభక్తులు నిద్రించు మఠమునకు జైనులు పెట్టిన నిప్పు మెల్లఁగపోయి రాజుఁజేరుగాక" యని యాజ్ఞాపించెను. రాణి మాంగల్యముఁ గాపాడుటకు మంత్రి భక్తిని బ్రోదిసేయుటకు, రాజపుడు దోషియైనను క్రమ్మఱ శైవుఁడు గాఁ బోవుననియు నెఱింగిన వాఁడగుట "మెల్లగ నిప్పు పోయి" యని చెప్పినవాఁడాయె. అట్టి భావముతోడి పద్యములు సెప్ప నా యగ్ని రాజుఁజేరి యుష్ణవ్యాధిగ బాధింప సాగెను.

రాణి విచారము :—

జైనులు మఠమునకు నిప్పువెట్టిన రేయిగడచెను. మఱునాఁడు కులచ్చిరయారు రాణికడకేఁగి, జైనుల దుశ్చర్యను

వినిపించెను. దానిని విని రాణి "శీర్గాళి బాలుని బిలిపించిన మనము దేహత్యాగ మొనర్చుట మేలు" అని పల్కి మూర్ఛిల్లెను. కొంతవడికిఁ దెలిసి మఠమునకుగాని సంబంధునకుఁగాని భక్తులకుఁగాని యెట్టి యాపద గల్గలేదని విని సంతసించెను. అంతలోఁ గంచుకి పరుగిడి వచ్చి "అమ్మా! రాజున్న వ్యాధితో బాధపడుచున్నాఁడు" అని చెప్ప నామె తడఁబడుచు, వేగముగ రాజున్న భవనమున కేఁగెను. మంత్రియు నామె ననుసరించెను.

వేఁడిమి రాజు శరీరమును దహింప నతఁడు పండుటాకు వలెఁ గృశించెను. క్షణములో శరీరము పాలిపోయెను. జీవము లెగయునట్లుండెను. రాజుం గాంచవచ్చినవారా వేఁడిమిని భరింపలేక దూరమున నిలిచిరి. వెజ్జులు గప్పిన అనఁటిమోసులు మలమల మాడిపోయెను. వారొనర్చిన చికిత్సలు వ్యర్థములాయెను. రాజునకుఁ గ్రమముగ బ్రజ్ఞ నశించెను. మాటలు నిలిచెను.

జైనులు రాజు దురవస్థను విని "మనము రాత్రి యొనర్చిన దుశ్చర్యకు ఫలితమా యిది" యని సంశయుంచియు మానరహితులుగాన రాజు కడ కేతెంచిరి. వారు తమ దేవుని స్మరించి నెమిలి యీఁకలతో నాతని దేహముఁ దడవ నవి భస్మమాయెను. వారది గాంచి భీతులైరి. వారు కమండలూదకోమును హస్తమునఁ దాల్చి "అర్హా! కాపాడుము" అని యాతనిపైఁ బ్రోక్షించిరి. అగ్నిం బడిన యాజ్యమువలె నా

బిందువులు నుండెను. రాజాబాధను భరింపలేక కనుఁదెఱచి "మీా రిటనుండి తొలఁగి పొండు" అని పలికి మఱల మూర్ఛిల్లెను.

రాణి విన్నపము :—

దేవి భీతిగ్రస్తయై "జైను లొనర్చిన దుష్కార్య ఫలితమే యిది" యన మంత్రి "దేవీ! జైనులు శివభక్తులకు నొనర్చిన కీడునకు ఫలితమే యిది" అనెను. వారిరువురు రాజునకు మ్రొక్కి, జైనులు మధురకేతెంచి సంబంధున కొనర్చిన పాప ఫలమే మీాకీ వ్యాధినిఁ గల్గించె. ఆ శైవబాలుని కరుణచే నిది తొలఁగును. వీరి కపట కృత్యములచే నిది తఱుఁగదు. జ్ఞాన సంబంధుని కరుణాదృష్టిచే నీ వ్యాధియేగాదు; జన్మాంతర కృత పాపములున్నై తము తొలఁగును". అని విన్నవించిరి.

వారుచ్చరించిన సంబంధుని నామము తిరుమంత్రమువలె రాజు చెవి సోకఁగ యాతని వ్యాధి కొంత యుపశమించినటులఁ దోఁప, నతఁడు "వైదిక శైవబాలుని కరుణచే నీ వ్యాధి శమించునటు లున్నది. అట్లగుచో సత్య స్వభావమును నిశ్చయించి తెలిసికొందు. నాకీ బాధను తొలిగించు వారిపక్షమే నే నవలంబింతును. ఆ బాలుని పిలిపింప నవకాశమున్న అటులఁ జేయుఁడు" అని రాజు పలికెను. రాజు మాటలకు దేవి సంతోష సాగరమున మునిఁగెను. వెంటనే యామె రతనాల పల్లకి నెక్కి, చెలులు వెంటరా సంబంధుని మఠమ్ముఁ జేరెను.

మంత్రియు నశ్వారూఢుఁడై యామెకంటె ముందుగ నేఁగెను. మంత్రి తమ రాకను సంబంధునకుఁ దెల్పి యాతని యంగీకారముఁ బడసి లోనికేఁగెను. రాణియు లోనికేఁగి సత్య శివ జ్ఞాన మూర్తియును, రూపొందిన చతుర్వేద సారమును, శైవమును లోకమున వ్యాపింపఁజేయ నవతరించిన రాకాసుధాకరుఁడగు సంబంధునిఁ గాంచి మ్రొక్కి, మాటలు తడఁబడ, శరీరము వడకుచుండ, నా బాలుని పాదకమలములపైఁ బడెను. సంబంధుఁడు రాణిని హస్తములనెత్తి "పుణ్యాత్మురాలా! నీ కలఁతకుఁ గారణమేమి" యనెను. అంత నామె "దేవా! జైనుల దుశ్చర్యకు దుఃఖించితిమి. వారిచర్య కఠినోష్ణ వ్యాధిరూపమున జేని బాధించుచున్నది. జైనుల కపటమంత్రములచే నది తగ్గలేదు. దేవర కరుణించి మా జీవములను ప్రభుని జీవములను నిల్పుఁడు" అని వేఁడెను. సంబంధుఁడు "మీరు కొంచెమైనను భయపడకుఁడు. మూఢాత్ములగు జైనులను వాదమం దోడించి మీకు సంతసముఁ గల్పింతును. పాండ్యరాజు విధిగ విభూతిఁ దాల్చునట్లొర్తు" ననెను. అంత మంత్రియు రాణియు "దుఃఖసాగర నిమగ్నులమగు మమ్ముద్ధరింప నేతెంచితిరి. ఇఁక సకల భాగ్యము లందినట్లే" యనిరి.

అంత సంబంధుఁడు "జనన మరణాదులు పరమేశుని విలాసములు. పాపాత్ములగు జైనులను జయించుటకు సుందరేశుని దర్శించివత్తు" నని పలికి భక్తులతో నాలయమున కేఁగి, సుందరేశునకు మ్రొక్కి, "జాతవేదా! చూడఁదగని జైనులఁ

గాంచి వాదింప ననుమతి నిండు. పితృవనవాసా! "(కాట్టు మావది ఉరి...") అను పదిహేముఁ బాడెను. కాలకూటము నమృతమువలె నాహరించితివి. మార్కండేయుని రక్షింప శమనుని శిక్షించితివి. అట్లే దాసుఁడనగు నన్ను కరుణించి, దేవర కీర్తి విశ్వవ్యాప్తమొనర్చి స్తుత్యర్హముఁ గావింపుఁడు" అని విన్నవించెను. ఇట్లు వినుతిచేసి యాలవాయి సుందరేశుని కరుణఁబొంది వెలికివచ్చి ముక్తాశిబిక నధిరోహించెను. భక్తు లొనర్చిన జయఘోషలపుడు దిగంతములు నిండెను. మధురాపురీ పౌరులు సంబంధునిఁ గాంచి "సుందరేశుఁడే వచ్చెనా" యని తలఁచిరి. కులచ్చిరయారు దారి సూపుచుండ రాణి పల్లకి నెక్కి వెనుక వచ్చుచుండ సంబంధుఁడు రాజమార్గమును దాఁటి యంతఃపురముఁ జొచ్చెను.

మంత్రి రాజునకు సంబంధుని రాకఁ దెల్పెను. ఆ వార్త కొంత మనశ్శాంతిని గల్పింప నతఁడు సంబంధునకు బంగరు పీఠము నమర్పుఁడని కోరెను. సంబంధుని లోనికిఁ దోడ్కొని రమ్మని పల్కి మంత్రి సంతసముతో నేఁగెను. జైనులు రాజు పల్కులను విని "మహారాజా! ఇది మన మతమును గౌరవించినట్లగునా! మమ్మిట్లవమానింపఁ దగునా! అతఁడు వచ్చినపిదప మీ వ్యాధి బాధను నిర్మూలింప నుభయులను కోరుఁడు. అతఁడు నీ వ్యాధిని తొలగించినను మేముగూడ కొంత నివారించితి మని పల్కుఁడు" అని కోరిరి. రాజు "నేనిఁక నీతిని విడిచి కపటముగఁ బ్రవర్తింపఁ జాలను. ఇరువాగులవారు మీ

మీా దైవబలముచే నా వ్యాధిని వెవ్వేఱుగ నశింపఁ జేయుఁడు'' అనెను. రాజు తమ తంత్రములకు లొంగమిఁ జేసి వారు తలలు వ్రాల్చిరి.

పాండ్యదేశ మొనర్చిన తపఃఫల మాయన సంబంధుఁడు ద్వారముకడ శిబిక దిగి, రాణి యనుసరింప లోని కేఁగెను. పెంజీఁకటి నశింప గగనమునుండి భూమికి దిగిన శీతమయూఖుని పలె వచ్చు కౌండిన్య కులాలంకారుని గాంచి రాజు చేతులు జోడించి మ్రొక్కి తన తలగడకు ప్రక్కగ నమర్పబడిన స్వర్ణ పీఠమునఁ గూర్చుండ సన్న చేసెను. ముత్తమిళ పండితకవి యల్లే యాసన మలంకరించెను. అతని దర్శనమాత్రమున రాజు నకు కొంత వ్యాధి యుపశమించినటులఁ దోఁప ''తమనివాస మెద్ది?'' యని యడిగెను. సంబంధుఁడు బ్రహ్మపురము వేణు పురము...అను పద్యమును పాడెను.

బంగరు గద్దియ నెక్కిన సంబంధునిఁగాంచి జైనుల సూయఁజెందినవారై యాతనిచుట్టు నిలిచి వాదమున నోడింపఁ దలఁచి యర్థ్వత శాస్త్రములందలి విషయముల నేకరువుపెట్ట సాగిరి. సంబంధుఁడు ''ఈ కాకిగోల యేల? మీా రొక్కొ క్కరే మీామీా వాదములఁ దెల్పుఁడు'' అనెను. వారు శివమెత్తి నట్లు తలల నాడించుచు నెవ్వియో పదర సాగిరి. అపుడు మంగ యక్కరశి వారి యుద్ధతిఁగాంచి రాజువైపు దిరిగి ''నాథా! సంబంధుఁడు బాలుఁడు, వీరు లెక్కకు మిక్కుటముగ నున్నారు. సంబంధుఁడు మీా వ్యాధిని నివారించిన పిదప వీరు వాదింప

వచ్చు" ననెను. రాజు "దేవీ! చింతింపకుము" అని చెప్పి జైనులఁగాంచి "నా వ్యాధిని తొలగించుట తప్ప వేఱువాద మేమి గలదు?. మీమీ దైవబలముచే నా వ్యాధి నివారణఁ గావింప నలయు. ఇదియే వాదము" అనెను.

జ్ఞానక్షీరములఁ గ్రోలిన సంబంధుఁడు తన బాల్యావస్థను గాంచి భయపడిన రాణిని "దేవీ! నన్ను నీవు బాలుఁడని తలంచి భీతిల్లకుము. ఆలవాయి సుందరేశుండుండ హరిణేక్షణా! భయమేల? (మాని నేర్వాళి మాదరాయ్...) అను పదిహాము పాడెను. అంత రాజు జైనులతో "మీ శక్తి నుపయోగింపుఁడు" అనెను. వారు రాజా! మేము మా దైవ బలముచే మీ వామభాగమున నున్న యుష్ణమును నివారింతుము" అని పల్కి, కొంతవడి ధ్యానించి నెమిలి యీఁకలతో నాతని వామ భాగముఁ దడవిరి. వాని స్పర్శచే రాజునకు వాక్రువ్వ రానంత బాధ యొడమెను. అతఁ డద్దానిని భరింపజాలక సంబంధునివైపు దీనముగఁ జూచెను.

పాండ్యుని మనోగతి మెఱిఁగిన సంబంధుఁడు సుందరేశుని స్మరించి "విభూతియే దివ్యౌషధము. మంత్రమే భస్మము..." అని యారంభించు పదిహాము పాడి విభూతిమహిమను స్తుతించి రాజు దక్షిణార్ధ దేహమున విభూతిఁ దడవెను. వెంటనే యా వైపు బాధ తొలఁగి హిమసదృశ మాయెను. యుభయ పార్శ్వములందలి యుష్ణమొకవైపు వామభాగమును కాలాగ్ని వలె దహింపఁ జొచ్చెను. జైనులు చేఁబట్టిన యీఁకలు భస్మ

మాయెను. ఆ వేడిమి వ్యాపించి జైనుల దేహమును నలుపు చేసెను. వారొదిగి నిలిచిరి. లోకమున శీతోష్ణములు గలిసి యుండునట్లా రాజు దేహమున నొకవైపు శీతలము మఱొక వైపు వేడిమియు నుండెను.

పాండ్యుఁ డదిగాంచి "క్రూరకఠోరనరక మొకవైపు, స్వర్గసుఖ మొకవైపు, విషాగ్ని యొకతట్టు, అమృతశీతల మొకతట్టు. ఈ అతిశయమేమి? జైనులారా! మీ రోడితిరి. పొండు" అని పలికి సంబంధుని పాదకమలములఁ గాంచి, "నన్ను దాసునిగాఁ జేసికొనిన వైదికకుల పండితా! ఈ నా వ్యాధి సంపూర్ణముగ పోవునట్లు కరుణింపుము". అని మ్రొక్కి ప్రార్థించెను. సంబంధుఁ డాతని ప్రార్థన నంగీకరించి హస్తమున విభూతిఁ దాల్చి పూర్వపు పదిహముఁ బాడి విభూతి మహిమను స్తుతించి, పాండ్యుని దేహమున దానిఁ ద్రడవెను. తడవుటయే తడవుగ నా వ్యాధి మాయమయ్యెను. రాజు రోగరహితుఁడై లేచెను. రాణి బాలుని పాదములకు మ్రొక్కి "మేము భాగ్యవంతులమైతిమి. నా నాథుఁడు పునర్జన్మము నొందెను" అని స్తుతించెను. రాజు పూర్ణారోగ్యవంతుఁడై లేచి సంబంధుని పాదములకు సాష్టాంగ మెఱఁగి "మీ దయచే బ్రతికితి" ననెను.

జైనులు తమ మంత్ర విద్య నిష్ఫలమగుటకు భయపడి, తర్కవాదమున నీతని నోడింప వలనుగాదు. జలాగ్ని వాదముల నోడింతమని తలంచుచుండిరి. వారి మనోగత మెఱిం

గిన సంబంధుఁడు "ఇఁక మీ మీ శాస్త్రములను విప్పి చెప్పుఁడు" అనెను. అంత వారు "ఇఁక శాస్త్రవాదములతోఁ బనిలేదు. మన మతసూక్తులను తాళపత్రములపై లిఖించి యగ్ని జలంబుల నైచి సత్యార్థము నిర్ధారింతము" అనిరి. రాజు "మీరు, నా వ్యాధిని దొలగింపఁ జాలరైతిరి. ఇఁక మీకే వాదము గావ లయు?" అనెను. వెంటనే వారు "మహారాజా! మామా వాద ములను తాళపత్రములపై వ్రాసి మొదట యగ్నిం బడవైతము. అందెవరివి తగులఁబడక నిలుచునో వారిదే జయము" అనిరి. సంబంధుఁడు మీ యిచ్చ చొప్పున గావింత మనెను. రాజాజ్ఞచే భటులచట కాష్ఠములఁ దెచ్చి రగుల్కొల్పిరి. సంబంధుఁ డగ్నిని సమీపించి తన పదిహాముల తాళపత్ర సంపుటిని విప్పి "మాకు నాథుఁడు ఆది భగవానుఁడు శివుఁడే" యని మ్రొక్కి పత్రములను విడఁదీయుచుండ "రత్నాభరణ ప్రకాశిత వక్షోజంబులుగల యుమాదేవి..." అని మున్ను తిరువల్లారు పార్వతీపరమశివులను నుతించిన పదిహాముగల పత్రము తనంత తానే ముందునకు వచ్చెను. అతఁ డద్దాని నెత్తి సంతసముతో "నన్ను దాసునిగ గ్రహించిన శివుని నామమే సత్యపదార్థము దీని నగ్నిఁ బడవైచినను దోసము రాదు" (తళిర్ ఇళవర్ బళి...) అను పదిహాముఁ బాడి సభ్యులందఱకుఁ జూపి యా యగ్నిం బడవైచెను. ఆ పత్రమా దహన జ్వాలలలో భస్మము గాక చెక్కు చెదరక ప్రకాశించు చుండెను.

శ్రమణులు తమ సూక్తులను వ్రాసి యా పత్రము నగ్నిలోఁ బడవైవ నది దూది రాశివలె క్షణములో భస్మ మాయెను. వారు విభ్రాంతులైరి. సంబంధుని పత్రము ముందటి కన్నను పచ్చగ మిలమిల ప్రకాశించు చుండుటఁగాంచి, జను లంద ఱాశ్చర్యపడుచుండ సంబంధుఁడు దాని నెత్తి యందఱకుఁ జూపి యథాక్రమముగ దానిని తాళపత్ర సంపుటమునఁ బెట్టి కట్టెను. రా జాశ్చర్య చకితుఁడై జైనులఁగాంచి మీ పత్రము నెత్తి చూపుడు" అనెను. పత్రమునకై వారగ్నిని సమీపింప జ్వాలలు వారిని దరిఁ జేరనీయకుండెను. సేవకులు నిప్పు నార్పిరి. వారి యవివేకముఁగాంచి రాజునవ్వి "అసత్యమును సత్యమని నమ్మి దుఃఖించు మూర్ఖులారా! నా వ్యాధి తొలఁగినపుడే మీ రోడితిరి. అగ్నిలో వైచిన పత్రముతోఁ బాటు మీ మతమును భస్మమైనది" అనెను.

లజ్జావిరహితులగు జైనులు "మహారాజా! రెండు సారులు వాద మొనర్చితిమి. లోక మర్యాద ననుసరించి మూఁడవ సారి వాదముసేయ ననుగ్రహింపుఁడు" అని ప్రార్థించిరి. అంత రాజు "ఇఁక మీరు చేయఁబోవు వాదమేమి" అన వారు "మా మత ధర్మపత్రములను వైఘానదీ ప్రవాహమున వైతుము. అందెవరి పత్రము నీటి కెదురెక్కునో వారి మతము జయించినట్లు" అన సంబంధుఁ డంగీకరించెను. అపుడు కుల చ్చిరయారు "అపుడును జైను లోడిన నేమి చేయఁదగునో వారే నిశ్చయింపవలెను" అనెను. జైనులు కోపారుణిత

నేత్రులై "ఈ వాదమున మే మోడిన రాజు మమ్ము శూలాగ్రములఁ గ్రుచ్చి చంపునుగాక" యనిరి.

రాజు "మీరు భవిష్యము నెఱుఁగక యిట్లు శపథ మొనర్చితిరి. మేము సత్యముఁ దెలిసికొన వైఘు కేఁగుచున్నారము. మీరును రండు" అని పల్కెను. సంబంధుఁడా బంగరు పీటనుండి దిగి, ముక్తాశిబిక నెక్కి బయలుదేఱెను. అతని వెనుక యశ్వారూఢులై రాజును మంత్రియు నేఁగిరి. ఆ విచిత్రముఁగాంచ జనులు తండోపతండములుగ బయలుదేఱిరి. పౌరులు సంబంధునిగాంచి సాష్టాంగ మొనర్చిరి. వారొక రొకరితో ననేక రీతుల సంభాషించుకొన సాగిరి. మన రాజు వ్యాధిని నివారించిన దితఁడే. జ్ఞానక్షీరంబులఁ గ్రావి తొక్కు పల్కుల నాడుచు పగడంబులఁ దిరస్కరించు నధరమాధురీ మహిమఁగల బాలుఁ డితఁడే. మన పాండ్య దేశము నుద్ధరింప వచ్చిన మహాత్ముఁ డితఁడే యని కొందఱు, మన జైనాచార్యుల నోడించి విభూతి మహిమను చాటినవాఁ డితఁడే యనియు, సంబంధునిఁగాంచు భాగ్యము గల్గెనని కొందఱు, ఈ యందము మానవుల కలభ్యము, ఇట్టి వీనిఁగాంచుటచే కన్నుల కఖిలార్థ సిద్ధి గల్గెనని కొందఱు, ఈ బాలునకుఁ గీడు దలపెట్టిన జైనులచే మనకుఁ బాపమే కల్గెననియు, ఆలవాయి సుందరేశుఁడే యాది దైవము. శివు నెఱుంగుటయే జ్ఞానము. ఇఁక వేదములు విభూతియు లోకమున వ్యాపించునని కొందఱు, క్రూర జైన నిశాచరుల పాప కృత్యముల కంత్యకాలము సమీపించెను.

జైనాజ్ఞానాంధకారము పటాపంచలగును. జ్ఞానభాస్కరుఁ డుద యించెనని కొందఱు, అగ్ని వాదమున నోడిన వీరు జలవాదమున జయింతురా యని కొందఱు, కులచ్చిరయారు వీరికై పెక్కు శూలములను సిద్ధపఱచి యుండునని కొందఱు, సంబంధుని పత్రము నీటికెదురు వోవును. దానిఁగాంచ లోకమిచటికి రాఁగలదు. సంబంధున కిది యొక గొప్పపని గాదు అని కొందఱు, ఇట్లు పరిపరి విధములఁ బల్కఁజొచ్చిరి.

భక్తులు ముత్యాల గొడుగుఁబట్ట రతనాలపల్లకినెక్కి సంబంధుఁడు పాండ్య దేశీయులకు రాజమార్గముఁ జూప వచ్చెనా యనఁ నరుగుచుండ పరమశివుఁ డొసఁగిన వాద్యములు సంబంధుని యాగమన వార్తను దిక్కులు నింపుచుండ నతఁడు మెల్లఁగ వైఘాతీరముఁ దరిసెను. జైనుఁ లొక్కచో గుమి గూడిరి.

జలవాదము :—

కామార్తురాలగు వనిత నాయకునిఁ జేరునటుల వేగముగ తరంగ హస్తములతో సాగరుఁజేరు వైఘా నదీతీరమును సమీపించి రాజు, పక్షద్వయముఁగాంచి, మీా మీా పత్రములను నదిలోఁ బడవేయుఁడు" అనెను. ఓడినవారము మరల నేల యోడుదుమని తాలుగింజలవంటి జైనులు తామే మొదట పత్రమును నదిలో వేయ నిశ్చయించి, యర్హాతుని శాస్త్రమందలి ముఖ్య సూత్రమగు "అస్తినాస్తి" యని వ్రాసి యా

పత్రమును నదిలోనైచి యాశాదృష్టులఁ గాంచిరి. వెంటనే జైనుల పత్రము ప్రవాహవేగము నంటి సాగరుఁజేర నుంకించెను. జైనులు దిగ్భ్రాంతితో పత్రమును క్రమ్మఱించు వారివలె తీరమునంటి పరుగిడిరి; నశించు తత్త్వముఁగల యా పత్రము నీట ధనుశ్శత ప్రమాణమున వారి దృష్టి కందనిదై పోయెను. జైనులు బెదరి చెదరి రాజాజ్ఞకు భయపడి తమ కంత్యకాలము సమీపించెనని వగచుచు, రాజుకడకు వచ్చి నిలిచిరి. అంతరంగిక భీతిని మఱుఁగుపఱచి "సంబంధుని పత్రమునకేగతి పట్టునో చూడుఁడు" అనిరి.

పాండ్యుఁడు శివజ్ఞాన ప్రకాశముతోఁ దేజరిల్లు సంబంధుని గాంచెను. అతఁడు పరమత వాగురలఁ జిక్కినవారి మనంబులు వినిర్మలంబగునటుల పాశుర మొకదానిఁ బాడెను. సంబంధుని స్పర్శచేతను, బవిత్రమైన విభూతిఁదాల్చిన కతంబునను, స్వీయ పాపము నశించుటచేతను, మలమాయాదులు నశించి సత్యనిపాతము గల్గుటచేతను, పాండ్యరాజు ఆది భగవాను నెఱుఁగఁజాలెను. మోక్షమునంద శైవమే సత్యమార్గమను రహస్యమును పాండ్యుఁడెఱుఁగ సమర్థుఁడై యుండెను. అట్టి యాతని స్థితి నూహించి సంబంధుఁడు "ద్విజోత్తములారా! జీవింపుఁడు. రాజులు న్యాయపరిపాలనాదక్షు లగుదురుగాఁక, గో బ్రాహ్మణులకు శుభంబగుగాఁక, లోకములు పాపరహితంబులై సుఖించుఁగాక, మేఘుంబులు సదా అమృతధారలు గురియుఁగాఁక, అంతట శివనామమే స్మరింపఁబడుఁ

గాఁక, లోకులు దుఃఖరహితు లగుదురుగాక" అను భావము గల సంద్రెండు పద్యములను పత్రమున లిఖించి, (వాళ్గ అాద నర్ వానవర్ ఆనినం...) సుందరేశుని స్మరించుచు నదీ ప్రవాహమున వైచెను, లోకులు శైవమే సత్యమని యెఱుఁగు నటుల సంబంధుఁ డమృత హస్తమున వైచిన పత్రము మహర్షుల మనంబు జన్మదుఃఖమునుండి యెదురెక్కునటుల జలంబులఁ జీల్చు కొనుచు నీటికి నెదురెక్కి పోవసాగెను. శివుఁడే యాది దైవ మని వ్రాసిన పత్రము ఎదురీఁది పోవుచుండ శివుని కరుణచే అన పాయచోళుని నీతితోఁ బాటూపాండ్యుని గూను చక్కనయ్యెను.

సంబంధుని పత్రము నీటికెదు రీఁదుచుండ దేవతలు పుష్ప వర్షముఁ గురిపించిరి. కులచ్చిరయా రా పత్రము దెచ్చుటకు నశ్వారూఢుఁడై తీరమునంటి పోయెను. సంబంధుఁడు వాయు వేగమునఁ బోవు నా పత్ర మాఁగునటుల "అగ్నిని హస్తంబునఁ దాల్చిన శివా...!" (వన్నియుం అత్తముం...) అను పదిషాముఁ బాడెను. పత్రము యేడహ మనుచోట నాఁగెను. కులచ్చిర యారా పత్రముఁగొని శిరముపై నిడికొని యేడహేశ్వరునకు మ్రొక్కి స్తుతించి తెచ్చి జనులకు దానిఁ జూప వారు "హర హర మహాదేవ శంభో" యని దిక్కులు బిక్కటిల్ల ఘోషించిరి.

జైనుల శూలారోపణము :—

నెడుమారకుబ్జ పాండ్యుఁడు మంత్రిని గాంచి "సంబం ధున కనుచితము గావించి వాదించి యోడిన జైనులను వారి

శపథానుసారము నీతిఁ దలఁచి దండింపు" మని యాజ్ఞా పించెను. రాజాజ్ఞను వినిన సంబంధుఁడు "జైనులయెడ కోపము లేనివాఁడయ్యు, హింస సేవగించువాఁడయ్యు, వారు శివభక్తుల ప్రాణములఁ దీయ వ్రతమునకు నిప్పుపెట్టినవారగుట నీతి ననుసరించి దండ్యులే" యని తలఁచి యూరకుండెను. హంతకులను క్రూరులను దండింపక విడిచిన లోక మధర్మ భూయిష్ఠ మగును గదా! దండ నీతియందు సుశిక్షితుఁడగు కులచ్చిరయారు వాఁడి కొఱ్ఱులను లెక్కలేనన్ని నాటించి యానమల్లై వాసులగు జైనులను ఎనిమిదివేలమందిని శూలముల కెక్కించెను. ఆ శూలములు "శివుఁడు వినా యితర దైవము లేదు. అను సత్యమును లోకమునకుఁ దెల్ప నాఁటిన జయస్తంభములా యన, సంబంధుని కీర్తిని దిగంతములందు వ్యాపింపఁజేయు ధ్వజ స్తంభములా యన నుండెను.

శీర్గాళి భాగ్యభాగధేయుఁడైన సంబంధుఁడు పాండ్యునకు విభూతి నొసఁగెను. అతఁడు మ్రొక్కి యందికొని మెయినిండఁ దాల్చెను. అట్లొనర్చిన రాజుం గాంచి ప్రజలెల్లరు విభూతి ధారులైరి. వైదిక ధర్మము విభూతి ప్రకాశము లోకమున వ్యాపించెను. జ్ఞానభాస్కరోదయముచే జైనాజ్ఞానాంధతమస్సు నశించెను. వైదికులు శివయాగంబుల నొనర్చిరి. దేవతలు ముమ్మారు వర్షముఁ గురిపించిరి. రాజధర్మము నాల్గు పాదములతో నడచెను. లోకులు సదా శివనామోచ్చారణచే జన్మజరామరణ దుఃఖరహితులైరి.

సంబంధుఁడు మీనాక్షీ సహిత సుందరేశునకు మ్రొక్కి శిబిక నెక్కి యాలవాయికి బయలుదేరెను. నెడుమార పాండ్యుఁడు, మంగయక్కరశియు, మంత్రియు నాతని వెన్నంటిరి. పౌరులు జ్ఞానసంబంధుని కన్నులారఁ గాంచి నుతించిరి. ఆల యముఁ గాంచి దాసభావముతో మ్రొక్కి ద్వారదేశమున శిబిక దిగి సంబంధుఁడు లోనికేఁగ రాజదంపతు లాతని ననుస రించిరి. అతఁ డాలయమును వలగొని కరములు శిరమునఁ జేర్చి "మధురాపురీ సదావాసా! ఆలవాయి నివాసా! దాసుని భయపడకుమని కరుణించిన దయామయా..." (వీడల్ ఆల వాయిల్...) అను పదిహామును పాడెను. అందు "భవ చ్చింతనామృతపానము దక్క నాకు వేఱొక చింత లేదు. విశ్వనాథా! సకల జీవులు జీవింప నానందతాండవనృత్య మొనర్చిన నీ ధ్యానమే నా నియమము" అను భావములఁ జేర్చి నుతించెను. పిదప నెడుమార పాండ్యుఁడు "సుందరేశా! నే నిన్నాళ్లు నీ మహిమ నెఱుంగక జైనుల కపటములకు లొంగి సత్యమును మఱచి మూఢుఁడనైతి. అట్టి నన్ను భవ త్పాదదాసునిగ స్వీకరింప జ్ఞానసంబంధుని నాకొసంగి కరుణా మృతమును వర్షించితి" వని స్తుతించి మ్రొక్కెను. సంబం ధుఁడు సుందరేశు ననుమతినంది మఠమున కేఁగెను. రాజ దంపతు లా బాలునకు మ్రొక్కి యంతఃపురమునకుఁ బోయిరి.

సంబంధుఁడు మధురలోనుండు నపుడొకనాఁడు నీలకంఠ యాల్పాణుని శివుఁడు కరుణించిన విధమును పద్యములందుఁ

జేర్చి చెప్పి యాతనితో శివమహిమలను ముచ్చటించెను. భక్తులకు భక్తినిగూర్చి యుపన్యసించుచుఁ గొంతకాలమటఁ గడపెను. అపుడు జనులు మధురకుఁ జుట్టుప్రక్కలనుండు జైనమఠములను నేలమట్టమొనర్చి యచట శివచిహ్నములను స్థాపించిరి. నెడుమార పాండ్యుఁడు నాతని దేవియు ననవ్వాహ మా సంబంధుని దర్శించుచు సేవించుచుండిరి.

సంబంధుని తండ్రి శివపాద హృదయుఁడు 'శివదాసులకు జీవమిచ్చు పుత్త్రునకు జైను లేమియొనర్చిరో' యని చింతించి తోణి యప్పరునకు మ్రొక్కి పాండ్య దేశమునకు బయలుదేఱెను. కొన్ని ప్రయాణముల మధురనుచేరి యాలవాయి చొక్కలింగేశునిఁ గాంచి మ్రొక్కి యచటివారిఁగాంచి "సంబంధుఁ డెచట నున్నాఁ"డనెను. అంత వారు "ఆర్యా! మా యజ్ఞానాంధ తమస్సును పాఱఁద్రోలి శివజ్ఞానబోధఁ గావించిన సంబంధుఁ డా మఠమునఁ గలఁడు." అని చూపిరి. వారు మార్గదర్శకులుగా నతఁడు రక్తాంభోజమువలె నందమగు మఠముఁ జేరెను. భక్తు లాతనిఁగాంచి "మన సంబంధుని తండ్రి వచ్చె"నని లోని కేఁగి తెల్పిరి. సంబంధుఁడు తండ్రి కెదురు వచ్చి మ్రొక్కి "తండ్రీ! యెపుడు వచ్చితిరి. తల్లికిఁ గుశలమేగదా?" యనెను. తండ్రి యా బాలునకు ప్రత్యభివందన మాచరించెను. సంబంధునకు తోణియప్పరు మనంబునకు రా "మహర్షీ? యాబాల్యము నన్ను దాసునిగ గ్రహించిన యుమాపతి తోణియప్పరు కుశలుఁడేగదా యని యడుగ నే నెంతవాఁడ..." (మణ్ణిల్ నల్ల

వణ్ణం...) అను పద్య దశకముఁ జెప్పెను. తండ్రి నుపచరించి కొంతకాలము గడపి, శివక్షేత్రములఁగాంచి స్తుతింప సంబంధుఁ డాశించెను.

జనకాదులకు ధర్మముఁ దెల్పినవాఁడు, గృహస్థ ధర్మములను సంఘకాల పండితులకు బోధించినవాఁడగు నాలవాయి సుందరేశునకు మ్రొక్కి యనుజ్ఞఁగొని మధురను సంబంధుఁడు వీడెను. రాజ దంపతులు మంత్రియు సంబంధుని యెడబాటును సహింపలేక వేగముగ వచ్చి మ్రొక్కిరి. సంబంధుఁడు వారిఁ గాంచి "నన్ను విడువ మనంబు లేదేని నాతో క్షేత్ర దర్శనమునకై రం"డనెను. ఆతని యాజ్ఞను శిరసావహించి యా ముగ్గురు ఆతనిని వెన్నంటి తిరుపురకున్ర్రము, మొదలగు క్షేత్రములను దర్శించుచు నేఁగిరి. సంబంధుఁడు దశకంఠుని లంకాపురిని ధ్వంసముచేసి యాతనిఁ జంపిన పాపపరిహారార్థము శ్రీ రామచంద్రుఁడు ప్రతిష్ఠించి పూజించిన రామేశ్వరాలయముఁజేరి మ్రొక్కెను. అట పాండ్యరాజు దశదానముల నొసఁగెను. సంబంధుఁ డటనుండియే లంకాద్వీపమునఁగల తిరుక్కోణమలై, తిరుక్కేదీశ్వరములఁ దలఁచి మ్రొక్కి పదిహములను పాడెను. అటనుండి పయనమై కులచ్చిరయారుని జన్మభూమియగు 'మణకోర్కుడి' యను శివక్షేత్రమునకేఁగి భవునకేటికోళు లర్పించి తండ్రితో రాజదంపతులతో మంత్రితో శివధ్యాన మొనర్చుచు నట కొన్ని దినంబు లుండెను.

పిదప• సంబంధుఁడు చోళదేశమేఁగఁ దలంచెను. పాండ్య రాజాదు లాతనివెంట నేఁగఁదలఁచిరి. సంబంధుఁడు వారిని గాంచి, మీరు మధురకుఁబోయి "శివసేవాపరులై శైవమును వ్యాపింపఁ జేయుచు సుఖముండుఁ"డని యాజ్ఞాపించెను. వారు భయపడిన వారై మధురకుఁబోవ నంగీకరించి యాతని పాదములకు మ్రొక్కి వెడలిపోయిరి. జ్ఞానసంబంధుఁడు భక్తులతో బయలుదేరెను.

చందనాది వృక్షంబులను గొని తెచ్చుచు తీరస్థ వృక్షములను ప్రవాహ వేగమునఁ ద్రోయుచు దాఁటరానిదై పాఱు నొక నదిని మార్గమున వారు తరింపవలసి యుండెను. కర్ణధారులా ప్రవాహమునకు భయపడిరి. ఆవలి యొడ్డున తిరుకొళందూరను క్షేత్రముండుట నెఱిఁగి సంబంధుఁ డా శివుని మ్రొక్కఁగోరి పడవత్రాళ్లను విప్పి యందు భక్తులతో నాసీనుఁడై తన వాక్కును తెడ్డుగాఁజేసి "కమలార్చిత పాదకమలా... (కొట్టమేకమలం...) యని పద్యదశకముఁబాడ శివుని కరుణాతిశయముచే నా పడవ కర్ణధారులు కర్ణములు లేకయే యావలిగట్టును చేరెను.• భక్తులతో నాలయమునకేఁగి "నాగాభరణా! భక్త ప్రీతిచే కర్ణధారివై పడవను గట్టుఁజేర్చిన నీ మహిమ నెట్లు నుతింపఁగలాఁడ" అని స్తుతించెను.

తిరునల్లూరు దర్శనము:—

జైనుల నెదిరించి వాదము సేయునపుడు అగ్నిలో దగ్ధముగాక జయమొడఁగూర్చిన పద్యముల కధినాథుఁడగు తిరు

నల్లూారు నీలకంఠునకు నమస్సు లర్పించగోరి సంబంధుఁడు భక్తులతో పయనమై నల్లూారును సమీపించి పల్లకినుండిదిగి యాలయమునకు వలగొని లోనికేఁగి మ్రొక్కి "మృదుపాద పల్లవంబులుగల పార్వతికి నర్ధదేహమిచ్చిన నాథా? పాండ్యుని సభలో నగ్నిలో వైచిన పత్రము భస్మముగాకుండ నొనర్చి నాకుఁ దోడై యాలవాయిలోఁ బ్రత్యక్షమైన నిన్నెట్లు పొగడఁగలాఁడ" అని స్తుతించి యచట కొంతకాల ముండెను.

పిదప నటనుండి బౌద్ధులకు నిలయమగు బోధిమంగయను గ్రామముఁ జేరెను. అచటి శివభక్తులు సంబంధుని రాకను విని సంతోషభరాక్రాంతాంతరంగులై మంగళ వాద్యములతో నెదురేఁగి స్వాగత మొసంగిరి. శివ వాద్యములు "పరసమయ మృగ భయంకరుఁడగు మృగరాజు వచ్చె"నని ఘోషించెను. ఆ వార్తవిని బౌద్ధు లసూయావిష్టులైరి. వారు తమ యాచార్యుఁడగు బుద్ధనంది కా వార్త నెఱిఁగించిరి. శివభక్తుల ఘోషలు శివచిహ్నముల ధ్వనిని విని బుద్ధనంది వృద్ధుఁడై యుండియు వచ్చి "ఓయీ! మమ్ము వాదమున జయించియేగదా యిట్లు ఘోషింపవలయు. ఊరక యేల యీ వ్యర్థాలాపంబులు. మీ వాద్యములను మ్రోఁగింపకుఁడు" అని రౌద్రముగఁ బల్కెను. శివభక్తు లా మాటలను విని "వీరిని వదలుట మేలుగా"దని సంబంధునకు విన్నవించిరి. సంబంధుఁడు "మనము వెదుకకమున్నే వీరిట్లు వచ్చి విరోధించుట యెంతయు మేలుగదా! బుద్ధనంది పైకొని వచ్చుటకు హేతువేమియో!

వాదస్థలమున నాతని యసత్యార్థమును లోకమెఱుంగఁ జేయుదము" అనెను.

బుద్ధనంది శిరముపైఁ బిడుగు పడుట :—

సంబంధునికవితను గ్రంథస్థముసేయు లేఖకుఁడు బుద్ధ నంది మాటల కాగ్రహించి "బుద్ధులు జైనులవలె నసత్యార్థ మునే నమ్మి విభూతిధారులకుఁ బరమ శత్రువులై యున్నారు. వీరి విరోధము నడఁప పంచాక్షరియే సమర్థము" అను పద్యముసెప్పి "వీని శిరము నేలఁ బడుఁగాక" యనెను. శివ పూజను, శివభక్తుల నెదిరించు కష్టాత్ములఁ జెఱుప శివాస్త్రము వంటి పిడుగొకటి వెంటనే యా బుద్ధనందిశిరముపైఁ బడెను. ఆ దృశ్యముఁగాంచి బుద్ధనంది శిరము వ్రీలుటను "భక్తులు సంబంధునకుఁ దెల్పిరి." ఇదియు శివునికరుణయే. మహాదేవుని స్మరింపుఁడని యా బాలుఁడు పల్కెను. వెంటనే "జయజయ మహాదేవా!" యని యందఱు ఘోషించిరి.

సారిబుద్ధునితో వాదము :—

బుద్ధనందితలపై, బిడుగుపడుటఁ గాంచిన బౌద్ధులు "ఇది తంత్రమా! శైవుల మహిమయా" యని తలఁచి తమ నాయకుఁడగు సారిబుద్ధుని ముందిడుకొని వచ్చి "మీరు మంత్ర తంత్రములను వీడి సత్యార్థము నిశ్చయింప వాదమునకు రండు" అని పిలిచిరి. సంబంధుఁ డిదియుమేలేయని సమీపస్థమండపముఁ జేరెను. వాదమునకు బౌద్ధులఁ బిలువుఁడన శిష్యులు వారికడ

కేఁగి, "శీర్గాళినాథుఁడు, వేదనిధి ముత్తిమిళ పండితుడగు జ్ఞాన సంబంధుఁడు మీరు గోరినట్లు వాదమునకు సిద్ధముగ నున్నాఁ" డని తెల్పిరి. సారిబుద్ధుఁడు బౌద్ధులంగూడి యచటికి వచ్చెను.

అపుడు బుద్ధనంది శిరము తెగ కవిత చెప్పిన సంబంధ శరణాలయుఁడను భక్తుఁడు సంబంధుని పాదములకు మ్రొక్కి సారిబుద్ధునితో వాదమునకుఁ దన్ననుగ్రహింప వేఁడి యనుమతి నంది వాదమునకుఁ బూనెను. సారిబుద్ధుని ముక్తి లక్షణము లను వారి ధర్మసూత్రములను ఖండించి యందలి లోపముల నెత్తి చూపి బౌద్ధ ధర్మమార్గములను ఖండించెను. సారి బుద్ధుఁడు బౌద్ధ ధర్మములలో నొకదానినైనను స్థాపింపఁజాలక యోడిపోయెను. ఇవ్విధమున సంబంధ శరణాలయుఁ డాతని నోడించి సంబంధునకు మ్రొక్కెను. వాదమున నోడిన బౌద్ధులు సంబంధుని పాదకమలములకు మ్రొక్కిరి. శైవమే ముక్తి మార్గమని సంబంధుఁడు వారికి బోధించెను. సారిబుద్ధాదులా సత్యమును గ్రహించి విభూతిని గ్రహించి శైవులైరి. అపుడు పుష్పవర్షముఁ గురిసెను.

పిదప సంబంధుఁడు తిరుకడవూరిఁ జేరి శంకరుని సేవించి 'వాగీశుఁ డెట నున్నా'డని విచారించెను. నావుక్కరసు తిరు పూందురుత్తిలో సేవ సేయుచున్నాఁడని విని యాతనిఁ గాంచ బయలుదేరెను. పుష్పోద్యానములతో నిండిన కావేరీ దక్షిణ తీరము నంటి యేఁగి తిరుపూందురుత్తిని సమీపించెను.

వాగీశ్వుఁడు సంబంధుని రాక విని, "మనలఁ బాలించు సంబంధు' నెదుర్కొని మ్రొక్కుటే మన జన్మాంతర భాగ్యమే" అని సంతసించి "యెదురేఁగి, వందన మాచరింతు"నని శివునకు మ్రొక్కి, పోయి సంబంధుని మార్గమున గుమిఁగూడియున్న భక్త బృందమున తన్ను గుర్తింపని విధమునఁ జేరి సాష్టాంగ మాచరించి పల్లకి మోయువారిలో తా నొకఁడై మోయ సాగెను. పూందురుత్తిని చేరిన వెంటనే సంబంధుఁడు "వాగీశుఁ డేఁడీ" యని యడిగెను. వెంటనే వాగీశుఁడు "దాసుఁ డపార తపమొనర్చినవాఁ డగుటచే దేవర పాదములను వహించు భాగ్యము నంది యిటనే యున్నాఁడు" అనెను. సంబంధుఁ డవ్వార్తను విని భయమున పల్లకి దిగి "యిట్లు దేవర సెప్ప నేమియగు" ననుచు మ్రొక్కెను. భక్తులంద ఱా భక్తద్వయముఁ గాంచి "వీరి నిట్లు గాంచుటచే మన దుఃఖములు తీఱెను" అని చేతులు జోడించి ప్రణతులైరి. సంబంధుఁడు వాగీశుని కౌఁగిలింప నతఁడాతని పాదములకు మ్రొక్కెను. వారిరువు రాలయమున కేఁగి సేవించి వచ్చి సుఖముండిరి.

వాగీశుఁ డొకనాఁడు సంబంధుని మధురాపురీ యాత్రో దంతము వినఁగోరెను. సంబంధుఁ డచటి సంభవముల నన్నిఁటిని పూసలు గ్రుచ్చినటులఁ దెల్పెను. వాగీశుఁడు పాండ్య దేశపు వార్తలను విని "సేవాసస్య మభివృద్ధినొంద తాము క్షేత్రమైతిరి" అని పొగడెను. సంబంధుఁడు యశోవతియగు

మంగయక్కరశి గుణాతిశయములను, శైవ భక్తాగ్రేసరుఁడగు కులచ్చిరయారుని సేవా మహిమను, పాండ్యునకు జీవముతోఁ బాటు విభూతి నొసఁగుటయు, దేవికి మనశ్శాంతి గల్గించు టయు, పాండ్య దేశమున వైదిక శైవమును విస్తరింపఁ జేయు టయుఁ జెప్ప వాగీశుఁడు విని యానందించెను. వాగీశుఁడు తాను తొండమండలమున కేఁగి కాంచీపురాధినాథుఁడగు నేకామ్రనాథుని దర్శించుట మొదలగు వృత్తాంతములను సంబంధునకు విన్నవించెను. సంబంధుఁడు తొండమండలమును దర్శింపఁ గుతూహలి యయ్యెను. వాగీశుఁడు సుందరేశునిఁ గాంచ పాండ్య దేశమున కేఁగఁ దలంచెను. సంబంధుఁడు వాగీశు ననుమతి నంది కావేరీ నదీతీరము నంటి పోవుచు నైత్తానము, తిరువయ్యారు, తిరుపళనము మొదలగు శివ క్షేత్రములను దర్శించి శీర్గాళిని జేరెను.

పాండ్య దేశమున జైనుల నడఁచి విభూతి మహిమను వ్యాపింపఁజేసిన సంబంధుని రాకను విని యాతని నెప్పుడు కన్నులారఁ గాంతుమని యుద్వేగులై యుండిన శీర్గాళి వైదికులు వేగముగ నెదురేఁగి, వైదిక సూక్తములతోఁ స్వాగత మొసంగిరి. సంబంధుఁడు వారిఁగాంచి శిబికావరోహణ మొనర్చి, వారికి మ్రొక్కి తోణి యప్పరు నాలయముఁ గాంచి వలగొని లోనికేఁగి పులకిత దేహుఁడై యానందబాష్పములు గండంబులపై జాఱుచుండ నతులొనర్చి " చక్కగ నినుచేరు భాగ్యముందితి పాండ్యుని సభలో జయము నిచ్చి యగ్నిలోఁ

బత్రము భస్మము గాకుండ నొనర్చి, వైఘులో పత్రము నెదు రీదఁజేసిన నాథా! (ఉట్రుడమై నేర్పరు...) అను పదిహాముఁ బాడి స్తుతించెను. అంతలో నాతని తండ్రియగు శివపాద హృదయుఁడు వచ్చి మ్రొక్కెను. తండ్రితో గృహమున కేఁగు చుండ మార్గమున నిరువైపులఁజేరిన సతీమతల్లులు మంగళగీత ములఁ బాడిరి. గృహముఁజొచ్చి వెంటవచ్చినవారిని కరుణ వాక్కులతో మన్నించి, పంపి మతంగచూడామణిని తిరునీల కంఠ యాల్పాణు నామంత్రించి, వారిని గృహములకుఁ బోవు నట్లుత్తరువు నిచ్చి మాతృపాదాభివందన మొనర్చి సుఖ ముండెను.

ఒకనాఁ డా జ్ఞానక్షీరంబులఁ గ్రోలిన సంబంధుఁడు కాంచీపురమున కామాక్షీసహితుఁడగు నేకామ్రనాథుని దర్శింపఁదలఁచి, తన యిచ్ఛను భక్తులకుఁ దెలిపి తోణియప్పరు నాపతిఁగొని బయలుదేరెను. అపుడు శివపాదహృదయుఁడు తాను వత్తునన "తండ్రీ! పూజ్యపాదా! ఇఁక నా వెంటవచ్చు నాశను వీడి యాగాదుల నొనర్చుచు శివుని సేవింపుము" అని పలికి మార్గమందలి శివక్షేత్రములను సేవించుచు చిదంబరముఁ జేరెను. అచటి నటరాజును దర్శించి పద్యమాలికల నర్పించి, తిరుత్తినము, తిరుమాణిక్కుడులను అర్చించి పులియూరునందలి సర్వమంగళాధవుని నుతించి తిరువీరస్థానముఁజేరెను. అట శివుఁడు తాండవమాడు తన రూపముఁజూప ద్రవీభూత చేత స్కుఁడై "భూతగణాధిపసేవిత పాదపద్మా...(కుంఢై కురళ్

భూతం...) అను పదిహము( జెప్పి తిరువణ్ణామలను చేరెను. అచటి పర్వతరాజముఁగాంచి "ఉణ్ణామలలోఁ బార్వతీ సహితుఁడవై యుండు పరమేశా..." (ఉణ్ణామలై యుమయాళుడం...) అని పాడి మ్రొక్కి యరుణాచలేశ్వరుని పాదకమలములకు సాష్టాంగ మాచరించి కొన్నిదివసంబు లచటఁ గడపి యుత్తరముఁగఁ బయనమై పర్వతములను నదులను దాఁటి తొండమండలములోని యోత్తూరుఁ జేరెను.

తిరుయోత్తూరు నందలి భక్తులు సుస్వాగతమొసఁగ వారితో నాలయమునకేఁగి మ్రొక్కి యచటి మఠముననుండెను. ప్రత్యహము త్రికాలములం దాలయమునకేఁగి సేవించుచుండెను. ఒకనాఁడొక భక్తుఁ డేతెంచి "స్వామీ! మహాదేవునకై నే నొక తాళవనముఁ బెంచితి. అవి చక్కఁగ బెరిగి మగతాడులైనవి. జైనులు నన్నుఁ బరిహసించుచున్నారు. దేవర కరుణించి వానిని ఫలించునట్లొనర్ప ప్రార్థించుచున్నాను" అనెను. సంబంధుఁడా దాసుని దాసత్వమునకుఁ బ్రియమంది యాలయముఁ జొచ్చి చంద్రశేఖరునకు మ్రొక్కులిడి "పూవులుపూచి గొలలునైచి కాయలనొసఁగ మగతాఁడు లాడుతాఁడులాగాక.... (కురుఃబై యాణ్ పలై యాగ్ గొలై ఓత్తూగ్...) అని పాడి కరుణించెను. వెంటనే యా తోఁపునందలి మగతాఁటి చెట్లాడుతాఁటిచెట్లై కాయలు గాచెను. జనులా దృశ్యముఁగాంచి సంబంధుని మహిమాతిశయమును వేవితములఁ బొగడి మ్రొక్కిరి. జైనులు గొందఱు సిగ్గునఁ దలలు వ్రాల్చి యా

దేశమును వీడి పాఱిపోయిరి. కొందఱు ఆదిదైవము పరమ శివుఁడేయని యెఱిఁగి శైవమును స్వీకరించిరి. తాఁడులు సంబంధుని కరుణాపాత్రములై శివపదవి నందెను. జ్ఞానపండితుఁడగు సంబంధుని మహిమ యిట్టిది.

కాంచీపురీ దర్శనము :—

సంబంధుఁ డోత్తూరునుండి పయనమై యనేక శివస్థలములను దర్శించుచు తిరుమాకరమునుగాంచి దాసవర్యులతోఁ గూడి, మహోన్నత ప్రాకారావృతమైన కాంచీపురిఁ జేరెను. అచటి పౌరులు, భక్తులు సంబంధుని రాకను విని, సంతోషభరాక్రాంత హృదయులై వీథులను క్రముక కదళీస్తంభములతో నలంకరించి పూవుల పందిరులను వైచి, సుగంధిజలములతో, నిండిన పూర్ణకుంభములను నిల్పి బంగరు దివ్వియలను వెలిఁగించి, మధురగీతములఁ బాడుచు వనితాజనంబులతో, గూడి వేదనినాదములతో, నాట్యమాడు వారవనితల పాదముల కింకిణీరవంబులు మిన్నుముట్ట సంబంధు నెదుర్కొన నేఁగి భక్తగోష్ఠినిగాంచి మ్రొక్కిరి.

పిదప సంబంధునకుఁ జోతలిడి హరహర ధ్వానులతో, స్వాగతముఁ బల్కిరి. సంబంధుఁడు శిబికావరోహణ మొనర్చి వారితో నగరముఁ జొచ్చెను. పౌరు లాతనిపై పూవులవానఁ గురిపించిరి. మంగళగీతములఁ బాడిరి. సంబంధుఁడు మార్గమునఁగల శివాలయములఁగాంచి మ్రొక్కి స్వర్ణప్రాకారమునకుఁ

ప్రదక్షిణ మాచరించి, కామాక్షీ దేవ్యాలింగన చిహ్నములచేఁ జిహ్నితుఁడై వెలయు నా యేకామ్రేశ్వరుని సమీపించి, భక్తిప్రేమలు కొనలుసాగ భూమిపైఁబడి సాష్టాంగముగ వందనం బాచరించెను. శిరమునఁ గరములుసేర్చి "వేదస్తుత్యా! గజ చర్మాంబరధరా..." అని మొదలిడు పద్యదశకమును రాగ తాళ లయాన్వితముగఁ బాడి యానంద తాండవ మొనర్చెను. వర్ష ధారలవలెఁ గన్నీరుంగార్చెను. ఇట్లు సేవించి యొక మఠమున విడిసి ప్రత్యహము కామాక్షీ నిత్యవాసమగు కామకోటమున కేఁగి సేవించి వచ్చుచుండెను. త్రికాలములందేకామ్రేశ్వరు నాలయమున కేఁగి సాలంకారములగు పద్యమాలికల నర్పించుచుండెను. కాంచీపురమునకు సమీపమునఁగల తిరుకచ్చి, నెరికాడు, కావదము మొదలగు క్షేత్రములను సేవించెను.

పిదప నా జ్ఞానబాలుఁడు కంచినివీఁడి, పాలారు నదీతీర మార్గము ననుసరించి పయనించి తిరుమాల్పేరు, తిరుకల్లము అను క్షేత్రములను దర్శించి దేవగురువుననుఁగు సోదరుఁడు వర్ధనముని తప మొనర్చి పూజించిన తిరువ్వూరుఁజేరి యచటి మహేశుని సేవించి పద్యమాలిక నర్పించెను.

తిరువాలంగాడును దర్శించుట :—

భక్తులతో సంబంధుఁడు తిరువాలంగాడును సమీపించెను. పరమభక్తురాలగు కారైక్కాలమ్మయారు శిరముతో నడచి మహాదేవుని సేవించిన యా పుణ్యస్థలమును పాదములఁ ద్రొక్క–

రావని భయపడి యా రాత్రి యచటి మఠమున నిద్రించెను. శివుఁడర్ధరాత్రమున సంబంధుని స్వప్నమునఁ బ్రత్యక్షమై "మమ్ము నీ కవితతో స్తుతింప మఱచితివా" యని పల్కి యదృశ్యుఁ డాయెను. సంబంధుఁడంత చకితుఁడై లేచి, యా శంకరుని దాక్షిణ్య భావముఁ బొగడి "నిద్రలోఁగూడ దర్శన మొసఁగితివా! శివా" యని పాడి స్తుతించెను. పిదప భక్తుల కా వృత్తాంత మెఱిఁగించి వారితో నాలయముఁజొచ్చి మ్రొక్కి పదిహాములతో స్తుతించెను.

పిదప నా స్థలమునువీఁడి తిరుపాశరమను స్థలముఁ జేరి" సదా నామనంబును వీఁడని శివా..." యని పాడెను. పిదప తిరువెణ్పాకమును సేవించెను. కన్నప్ప సేవ మనంబునకు రా శ్రీ కాళస్తీశ్వరుని సేవింపఁదలఁచి, పాలారునదిని వదలి కొండల నడవులనుఁ దాఁటుచుఁబోయి కారికరై యను శివక్షేత్రమును దర్శించి భక్తు లొనర్చు శివనామ స్మరణను విని తమ క్రూర స్వభావంబులను వీఁడి ప్రశాంతములై వ్యాఘ్రాదులు సంచరించు నడవుల నధిగమించుచు, పాదముల చెప్పులఱుగునటుల కన్నప్ప సంచరించి వేఁటాడిన యడవినిదాఁటి శ్రీ కాళహస్తి పర్వత రాజమును సమీపించెను.

శ్రీ కాళహస్తీశ్వరుని సేవించుట:—

జ్ఞానామృత పానాహ్లాదియగు సంబంధుఁడు వచ్చు చున్నాఁడని యెఱింగిన భక్తులు, శైవవ్రతులు, కిరాతులు

గుంపులు గుంపులుగ నెదురేతెంచిరి. విభూతి ప్రకాశమెల్లెడల నిండెను. అది శివలోకమా యన నుండెను. సంబంధుఁడు పల్లకినుండిదిగి వారికి మ్రొక్కెను. వారును ప్రత్యభివందన మొనరించిరి. అతఁడు వారిఁగాంచి "యీ పర్వత రాజములలో నెద్ది. కాళహస్తి నాథుఁ డుండునది?" యని ప్రశ్నించెను వారు "వేదబాలా! కాళము గజము వైరముఁగొని పూజించిన పరమేశునకు వాసస్థాన మిదియే" యని చూప నతఁడద్దానికి మ్రొక్కెను. వెంటనే "దేవాది దేవేంద్ర పూజితా..." అను పదిహముఁబాడి కన్నప్ప సేవను నుతించెను.

ఆ కొండమెట్లు నెక్కి గోపుర ద్వారమునకు వందన మాచరించి యాలయమును వలగొని యార్తిహరుఁడగు నాజ్ఞాన ప్రసూనాంబికాధవుని మ్రొక్కి కిరాతరాజగు కన్నప్పనుగాంచి, యాతని పాదములపై శిరముఁ జేర్చెను. సత్య స్వరూపుఁడగు శివునియందు నిర్మల భక్తియుక్తుఁడగు కన్నప్ప నుద్ధరించిన భావము మనంబుననిండ, పల్లమున కేఁగు జలప్రవాహము వలె చిత్త మాశివునిపైఁబాఱ, పరమానందకందళిత హృద యుఁడై నమస్కరించెను. అచట కొంతకాలము గడపి, మధుర వాక్కులతో శివుని నుతించెను.

శ్రీ కాళహస్తియం దుండియే తమిళభాష నెఱుఁగని యుత్తరదిశలోని శ్రీశైలమును, కైలాసము, కేదారము, గోకర్ణము, మొదలగు దివ్య క్షేత్రంబులఁ దలఁచి మ్రొక్కి పాడెను. పిదప తిరుఒత్తియూరును దర్శింపఁ గుతూహలియై స్వర్ణముఖీ నదీమతల్లిని నుతించి బయలుదేఱెను.

తిరుఒత్తియూరుఁ జేరుట :—

వేదమార్గ మభివృద్ధిఁజెంద నవతరించిన సంబంధుఁడు భక్తులతో తిరువేర్కాడు, తలవాయి యను స్థలములఁజేరి మ్రొక్కి నుతించి, సముద్రతీర మార్గము ననుసరించి తిరుఒత్తి యూరును సమీపించెను. అచటి భక్తులు భక్తితో సంబంధు నకు స్వాగత మొసఁగిరి. వృషభవాహనా! పశుపతీ! యని పాడుచు నాలయమును సమీపించి గోపురమునకు మ్రొక్కి లోని కేఁగి వలగొని శివునకు సాష్టాంగ వందనమాచరించి పద్యమాలికల నర్పించి యానందముతో నాడి, వెలికివచ్చి యచట కొన్నిదినము లుండెను.

శివనేశుని శీలము :—

సంబంధుఁ డటనుండు కాలమున మైలాపూరునఁ గీర్తి గల వైశ్యకులమున శివనేశుఁడను శివభక్తుఁ డుండెను. అతఁడు దేశాంతరములతో నౌకా వ్యాపారముఁజేసి నిధిపతియై యుండెను. స్వర్ణ రత్నాదుల నపారంబుగ నార్జించి కోట్లకు పడగ నెత్తియు శివదాస్యము నేమఱక సన్మార్గగామియై, భక్త జనసేవా పరతంత్రుఁడై "పరమతపీడ లేక దేశమెపుడు బాగుపడునా" యని చింతించుచుండెను. సంబంధుఁడు పాండ్య దేశమున కేఁగి, జైన బౌద్ధుల మతముల నడఁచుట మొదలగు విషయములను భక్తులు సెప్ప విని, యాతని పాదములందు భక్తిఁగలవాఁడై యహర్నిశ లాతని స్మరించుచుండెను.

శివనేశుఁడు కుబేరాధిక సంపదలు గలవాఁడయ్యు సంతతి లేనివాఁడై యుండెను. పుత్త్రముఖ సందర్శన భాగ్యము లభింపమి కాతఁడు వెతఁజెందెను. అతఁ డనేక వ్రతాదుల నొనర్చి భక్తులఁ దృప్తిపఱచెను. తత్ఫలితముగ నాతని కాంత గర్భవతియై నవమాసములు నిండ నొక శుభదినమున లక్ష్మిఁబోలు నొక పుత్త్రికా రత్నముఁ గనియె. అతఁ డపుడా యానందముతో బధిర పంగ్వంధుల కపార ధనంబు నొసఁగెను. శివభక్తుల నిష్టమృష్టాన్నములచేఁ దృప్తిపఱచెను. వైదికు లకు నభీప్సితంబుల నొసఁగె. జాతకర్మానంతర మా బాలికకు పూంపావ యని పేరిడెను. దినదినాభివృద్ధి నంది యా బిడ యేక వర్ష వయస్కయై చిఱు పాదంబుల బంగరు జంగెలు గల్లుగల్లు మన నడయాడ సాగెను.

క్రమంబుగ చలించు మెఱపు తీఁగయో, కదలి యాడు బంగరు ధ్వజమో! లేఁజిగురో! రత్నదీపమో యన సౌందర్య రాశియై సప్తవర్ష ప్రాయయయ్యెను. తోడి బాలికలఁ గూడి, బంతియాటలు చెమ్మ చెక్క లాడుచు, చిలుకవలెఁ బల్కుచుఁ గోయిలవలెఁ బాడుచు, నిసుకలతో నిండ్లఁ గట్టుచు, తూఁగు టుయ్యేల లెక్కుచు నాడుచుఁ బాడుచు నూఁగుచుఁ, దల్లి దండ్రులకు సంతసముఁ గల్గించుచుండెను.

శివనేశుఁ డామె యందచందములకు రమణీయ రూప మునకుఁ దగిన వరుఁడు సంబంధుఁడ దక్క మఱెవరున్నారని తలంచి, తన ధన సంపదతోఁబాటు కన్యకయు నాతనికే

దక్కఁగాక యని మనంబున నిశ్చయించెను. అట్టి కాలమున భక్తులు గొంద ఱాతని కడకు నేఁగి సంబంధుఁడు పాండ్యదేశమున కేఁగుటయు, జైనుల నోడించుటయు, పాండ్యుని వ్యాధిని నివారించుటయు, జలాగ్ని వాదములందు విజయమునంది పాండ్యునకు విభూతి నిచ్చుటయు, జైనులు శూలము నధిరోహించుటయు మొదలగు విషయములఁ దెల్పిరి. శివనేశుఁ డా వార్తల నెఱింగించినవారి కపార ధనంబుల నొసఁగెను. శీర్గాళి బాలుఁడుండు దిక్కునకు మ్రొక్కి "నన్ను నా ధనమును కుమారిని సంబంధున కొసఁగితి"నని పల్కెను.

ఇట్లుండ నొకనాఁడు పూంపావ చెలులతోఁ గన్యకా మఠము వెనుకనుండు పూఁదోఁట కేఁగి పుష్పాపచయ మొనర్చుచుండెను. శివనేశుని కోరిక విధికి విరుద్ధమనియో, ఆతని యిచ్ఛ నెఱవేఱదని తెల్పుటకో, ఏలకో విధి యొక ఘోర సర్పమై యచటి మల్లె పందిరిలో నుండి యమునిదూతయో యన విషపుఁగోరలు దిగఁబడ నా బాలిక హస్తముఁ గ్రుచ్చి పడగనెత్తియాడి పరుగిడిపోయెను. విషము తలకెక్క నా బాలిక మైమఱచి నురుగులు గ్రక్కుచు నేలఁబడెను. చెలులది గాంచి భయపడి యా బాలిక నెత్తికొని కన్యకా మఠము జేర్చిరి. పిడుగువంటి యా వార్త వినిన శివనేశుఁడు మూర్ఛపోయి లేచి యేడ్చుచు నచటికి పరుగిడెను. మంత్రతంత్రవాదు లనేకులువచ్చి మంత్రౌషధములచే చికిత్స యొనర్చిరి. నిష్ఫలమాయెను. ఆమె శరీరము చల్లనై ప్రాణవాయువు లెగసిపోయెను. శివనేశుఁ డామెపైఁబడి యేడ్వఁ జొచ్చెను.

అతఁడు తేటికొని "యెవ్వరేని యీ బాలికను జీవింపఁ జేసినవారికి నా సకల ధనము లిత్తును" అని ప్రకటించె. పిదప దినత్రయము రాజవైద్యులు మంత్రవిదులేతెంచి యెన్నియో యత్నము లొనర్చిరి. అవియన్నియు బూఁదిలోఁబోసిన పన్నీ రాయెను. గత్యంతరముఁ గానక శివనేశుఁడు "బాలికను సంబంధున కర్పించితిఁగదా! నేనేల దుఃఖింపవలయు?" అని తలంచి శాంతచిత్తుఁడై యా బాలిక దేహమును దహింపఁ జేసి, చితాభస్మమును అస్థులనొక మృద్ఘటమునమంచి దానిని కన్యకా మఠమున భద్రపఱచి కనకాభరణాదులతో నలంకరించి పూజించుచు వచ్చెను.

సంబంధుఁడు తిరుఒత్తియూరున కేతెంచి శివుని సేవించుచున్నాఁడని శివనేశుఁడు విని మయిలాపురినుండి తిరుఒత్తియూరు వఱకు మార్గము నందంతట చలువ పందిరులను వేయించి వితానములఁ గట్టించి, కదళీక్రముకాదులను నిల్పి యలంకరింపఁ జేసెను. తిరుఒత్తియూరున కేఁగి సంబంధుని పాదములపైఁబడి యాతని నాహ్వానింప బయలుదేఱెను. మార్గమున సంబంధునిఁగాంచి మ్రొక్కెను. శివనేశుని దాసభావమును భక్తులు సెప్పవిని సంబంధుఁ డాతని నాదరించెను. సంబంధుఁడు వారితో మయిలాపురిఁజేరి, శివనేశునకుఁ గల్గిన దుఃఖమును మనంబునఁ దలఁచి, యాతని శివసేవను లోకమునకుఁ దెల్పఁగోరి కపాలీశు నాలయముఁజొచ్చి వలగొని మ్రొక్కి స్తుతించిఁ మరల ద్వాఃప్రదేశముఁ జేరెను.

అపుడు సంబంధుఁడు శివనేశునిగాంచి "నీవు నీవారితో నేఁగి ఏ పుత్రికా చితాభస్మపు కుండికఁ దెమ్ము" అని యాజ్ఞాపించెను. అతఁడు సంతసముతో మ్రొక్కి పోయి కన్యాకామఠమందలి కుండను పల్లకిలోనుంచి తెచ్చెను. ద్వారముకడ పల్లకిని దింపి తెఱఁదొలఁగించి కపాలీశునకెదుట ఘటమునుంచి మ్రొక్కెను. ఏమిజరుగునో చూతమని పౌరులు జైనులు బౌద్ధులుగూడ నచటి కేతెంచిరి. దేవత లాకసమున గుమిగూడిరి.

పూంపావ సజీవయగుట :—

పశుకరణ రహితుఁడు శివకరణ సహితుఁడగు సంబంధుఁడు గోపుర ద్వారముఁజేరి, పూంపావ యెమ్ములు నిండిన ఘటమును కరుణతోఁగాంచి, శివుని కరుణాసంపదను మనంబున భావించి, "పూంపావా!" యని యా కన్యక పేరెత్తి పిలిచి "మనుజన్మమెత్తియు ప్రమోజనమందుట, భక్తితో శివభక్తులకు భోజన మిడుట, పార్వతీ పరమశివుల యుత్సవ సౌభాగ్యములఁ గాంచి యానందించుట యను సత్యసౌఖ్యములనందు పూంపావా! ఈ లోకులుగాంచ లేచిరమ్ము" (మట్టిట్టపున్నై..) అను పది పద్యములను చెప్పి శివునకు మ్రొక్కెను. ఆ పది పద్యములలోని వాగమృత మా యెమ్ములఁగూడి రూపుఁదాల్చెను. మొదటి పద్యముతో నామె సౌందర్యరాశియై ద్వాదశ వర్షప్రాయ యయ్యెను. జైనుల దుష్కృత్యములఁ జెప్పు పదియవ పద్యము సెప్పగనే కోమలమృదు హస్తము పైకెఁ గన్పించెను.

పద్మమునుండివచ్చు లక్ష్మివలె నా కన్యక భిన్న ఘటమునుండి లేచినిలిచెను. సజీవయై లేచిన యీ బాలికనుగాంచి యాశ్చర్య చకితులు గానివారు లేరు. జనులు "దైవ స్వభావముగల పూంపావను చూడుఁడు" అని యఱచిరి. అపుడు భక్తులు గావించిన హరహర నాదము దేవలోక మంటెను. అకసము నుండి పూవులవాన కురిసెను. ఆ పరమశివుని కరుణఁగాంచిన జనులందఱు సాష్టాంగముగ వందన మాచరించిరి. ఆ యద్భుతముఁ గాంచిన జైనులు మూర్ఛిల్లిరి.

పూంపావ సౌందర్యము కన్నులకు మిఱుమిట్లు గొల్పు చుండెను. కేశపాశము తుమ్మెదల బారుగ, నొసలింద్రధనువుగ, కనుబొమలు పుష్పచాపుని సమ్మోహనాస్త్రములుగ, కన్నులు గండుమీలుగ, నాసిక తిలపుష్పముగ, కంఠము శంఖముగ, ముఖము పద్మముగ, హస్తములు తామర తూఁడులుగ, స్తనములు శివకరుణామృత పూరిత ఘటములుగ, ఊరువు లేనుఁగు తొండములుగ, పాదద్వయము పుష్పగుచ్ఛముగనుండ గాంచిన జను లామెకు రతీదేవియు సాటిగాదని తలంచిరి. బ్రహ్మ యనేక యుగములు తా నొనర్చిన తపః ఫలముగ తిలోత్తమను సృష్టించి యామె యందమును నాల్గు మోములఁ గాంచెనట. శివకరుణా పాత్రుఁడగు నా పదునారేడుల జ్ఞానసంబంధుఁడు తిలోత్తమకంటె వేయింతలు రూపవతియగు పూంపావను వేయిమోములతో గాంచెననుట యతిశయోక్తిగా నేరదు.

380 A



జ్ఞానసంబంధుఁడు పూంపావను సజీవయొనర్చుట

సత్ప్రాణమైన పూంపావను గాంచిన శివనేశుఁడు సంబంధుని పాదములపైఁబడి మ్రొక్కెను. పూంపావ కపాలీశునకు పిదప సంబంధునకు వందనమాచరించెను. సంబంధుఁడు శివనేశునితో "నీ పుత్త్రికతో గృహమున కేఁగు" మనెను. శివనేశుఁడు "దాసుఁడు గాంచిన పూంపావను మీరు వివాహమాడ ప్రార్థించుచున్నాఁడను" అనెను. సంబంధుఁడు "ఓయీ! నీ యీ పుత్త్రిక సర్పదష్టయై మరణించినది. కపాలీశుని కరుణచే నేను బ్రతికింపఁజేసిన కారణమున నీవు గోరినట్లొనర్ప యుక్తముగాదు" అనెను. శివనేశుఁడు వాని బంధువులు సంబంధుని పాదములపైఁబడి యేడ్చుచుఁ బ్రార్థించిరి. సంబంధుఁడు వారి కనేక శాస్త్రవిధులను చెప్పి యోదార్ప వారు తమ యాశయము యుక్తమని గ్రహించిరి. సంబంధుఁడాలయము లోనికేఁగెను. సంబంధునకీయ నిశ్చయించిన కన్యను వేఱొకని కీయరాదని శివనేశుఁ డాకన్యను కన్యకామఠముఁ జేర్చెను. ఆమెయు శివసేవాసక్త చిత్తయై శివభావము నందెను.

సంబంధుఁడు కపాలీశునకు మ్రొక్కి పొగడి వచ్చెను. కొన్ని దివసంబులు చన సంబంధు, డితర శివస్థలముల కేఁగఁ దలఁచి శివనేశుని మధురవాక్కులతో నోదార్చి, "తిరువాన్మియూరు"న కేఁగెను. అచటి భక్తులు స్వాగతమీయ నాలయముఁజొచ్చి మరుందీశ్వరుని ప్రశ్నోత్తరరూపక పద్యములతో స్తుతించి తిరువిడ పశురమునకుఁ బోయి "ఈతనివన్నెయేమి. . .

(ఇనర్ వళ్లంఎన్నై...) యని వినుతిసేసి శివానంద సాగరమున మునిఁగి, తిరుకళికుంద్రమును చేరి పల్లకిదిగి, కొండనెక్కి యాల యమును వలగొని, పద్యములతో నా శివుని సౌభాగ్యముఁ బొగడెను. కొండదిగి, యచ్చిరుపాకమును చేరి యచటి యాది దేవునకు మ్రొక్కి తిరు అరశిల తిరుపుర వాపనమను క్షేత్ర ములను దర్శించి చిదంబరముఁ జేరెను.

శివజ్ఞాననాథుఁడగు సంబంధుఁడు వచ్చు వార్త వినిన చిదం బర దీక్షితులు భక్తులు నెదురువోయి స్వాగతమిడిరి. అతఁడు ముత్తెముల పల్లకి దిగి మ్రొక్కి నడచుచు నుత్తరద్వారముఁ బ్రవేశించి, వేదధ్వనులతో నిండిన రాజవీథులను దాఁటి కర ములు శిరమునఁ జేర్చి కనకసభను కాంచి వందన మాచరించెను. శివకామి సంతసించునట్లు ఆనంద తాండవమొనర్చిన నటరాజుఁ గాంచి సాష్టాంగ మొనర్చెను. పంచాక్షరీ సోపానమునకు నమోవాకము లర్పించెను. క్రమ్మఱ కనకసభకు మ్రొక్కి వెలికి వచ్చి తనకై సిద్ధపఱుపఁబడిన మఠమున నుండుచు కాలత్రయ మున కనకసభ కేఁగుచు పద్యమాలికల నర్పించుచుండెను.

కొందఱు శివభక్తులు శీర్గాళికి నేఁగి సంబంధుఁడు చిదం బరములో నుండుటను శివపాదహృదయున కెఱిఁగించిరి. అతఁ డాప్తబంధువులతో చిదంబరమును సమీపించెను. సంబంధుఁడు వారి కెదురువోయి తోడ్తెచ్చెను. కతిపయదివసం బులు తండ్రితో నా నగరమందుండి యొకనాఁడు నటరాజునకు మ్రొక్కి 'యనుమతినంది తోణిపురేశ్వరుని దర్శింప నాశఁగొని

బయలుదేఱెను. మార్గమందలి శివక్షేత్రములఁగాంచుచు నా బాలుఁడు శీర్గాళిఁ జేరెను.

ద్వాదశాభిధానంబులఁ గీర్తిఁగాంచిన శీర్గాళిని దూర మందేగాంచి మ్రొక్కి "భ్రమరీ ఝుంకారకలిత పుష్పంబులచే నలంకృత కేశపాశంబులుగల పార్వతీ..." యను పదిహముఁ బాడుచు పొన్నపూవుల వాసనతో నిండిన యుద్యానవనంబు లను దాఁటి "శీర్గాళినిఁ చేరుఁడు..." అని ఘోషించు భక్తు లతో నగరిం జొచ్చెను. తోణియప్పరు పాదకమలంబులను స్మరించుచు గోపురమునుదాఁటి యాలయమును వలగొని యీశునకు మ్రొక్కి పెరియనాయకినిగాంచి సంతసమున నోల లాడి స్తుతించి గృహమునకేఁగి సుఖంబుండె.

తనవెంట వచ్చిన వైదికులకు మ్రొక్కి బంధువులను భక్తులను తగిన విధమున నుపచరించి, వారివారి యిండ్లకేఁగ ననుమతించి తల్లిదండ్రులఁ గూడియుండు నక్కాలమున తిరు మురుగ నాయనారు, తిరునీలనక్కనాయనారును, శీర్గాళి కేతెంచి సంబంధునిఁ గాంచిరి. సంబంధుఁడు వారితో శివమహి మలఁ గూర్చి సంభాషించుచుఁ గొంతకాలము గడపెను.

పరిణయ యత్నము:—

అక్కాలమున శివపాదహృదయుఁ డాతని బంధువులుఁ జేరి "ఇదియే సంబంధునకుఁ బెండ్లికిఁ దగుప్రాయము" అని తలంచి యాతనిఁజేరి "వేదవిధుల ననుసరించి యజ్ఞాదుల

నొనర్పఁ గన్య నొకదానిని వివాహమాడుము". అని తెల్పిరి. బంధు పాశాదులను విడిచి శివుని కరుణకుఁ బాత్రుఁడైన సంబంధుఁడు "మీరు పల్కినది సత్యమే యయినను నాకది తగదు" అని త్రోసిపుచ్చెను. వారు క్రమ్మఱ నాతనికి మ్రొక్కి "నీవు వేదమార్గమునకు వికాసముఁ గల్పించితివి. అయ్యది స్థిరముగ నిల్వ వేదవిధి ననుసరించి కల్యాణము నంగీకరించుట మేలు. గృహస్థాశ్రమము ఆశ్రమములలోకెల్ల నుత్తమము. దానిని నిరాకరించుట శ్రేయము గాదు" అనిరి. వైదికులు సద్ధర్మ నిరతులగుటకు వేదధర్మములను విశ్వవ్యాప్తమొనర్ప వారి ప్రార్థనను సంబంధుఁ డంగీకరించెను.

ఇదియు శివుని కరుణయ యని ఆతని తండ్రి సంతసించెను. బంధువులు "తిరుప్పెరుమణనల్లూరులో వైదికాగ్రేసరుఁడగు నంబాండారునంబి పుత్రిక మన సంబంధునకుఁ దగిన వధువు" అని తెల్పిరి. సంబంధుఁడు సంసారియై వేదధర్మముల నుద్ధరించి సుఖజీవితము గడుపుట మేలని వైదికులు భక్తులు భావించిరి. శివపాదహృదయుఁడు వైదిక వృద్ధులతో కన్య నడుగ పెరుమణనల్లూరున కేఁగెను. నంబివారి రాక నెఱింగి యెదురువచ్చి మ్రొక్కి "నేను భాగ్యవంతుఁడ నైతి" నని పల్కి కుశలంబడిగి తన గృహంబునకుఁ గొంపోయి యుపచరించెను.

వారా నంబిని గాంచి "జ్ఞాన క్షీరములఁ గ్రోలిన సంబంధునకు గుణశీలవతి యగు నీ పుత్రిక నడుగ వచ్చితిమి" అనిరి.

నంబి "మీ రివ్విధమున వచ్చి కన్య నడుగుట నా భాగ్యమే. మీరు నాపైఁ జూపు కరుణ నెట్లు పొగడఁగలను" అని పలికి శివపాదహృదయుని గాంచి "నీ వొనర్చిన తపఃఫలితముగ నవతరించి జగన్మాతయగు పార్వతి స్తన్యములఁ గ్రోలిన సంబంధునకు నా కూఁతు నొసఁగుట మా భాగ్యమే. అట్లే యొనర్తము" అని పలికి వారి నర్చించి సాగనంపెను. శివపాదహృదయుఁడు కొమరున కా నంబి యంగీకారముఁ దెల్పి యుద్వాహ యత్నము లొనర్పసాగెను. దైవజ్ఞు లొక శుభదినమున లగ్నము నిశ్చయించిరి. ఆహ్వాన పత్రికలను బంధువులకు కన్య వైపువారికి సుహృద్గణంబులకు భక్తులకు నంపిరి. శుభదినంబున పంచపాలికలను స్థాపించిరి. కొందరు విప్రోత్తములు కల్యాణ పత్రికఁ గైకొని నంబాండరు నంబికడ కేఁగి యొసంగిరి. అతఁడా పత్రిక నందికొని వారి గారవించి పెండిలికిఁ దగిన సన్నాహములను చేయఁజొచ్చెను.

బంధు మిత్ర భక్త బృందములు శీర్గాళిఁ జేరిరి. వివాహ దినమునకు పూర్వము మంగళవాద్య ధ్వనులు చెలరేగుచుండ పాలికలను పూజించి, వివిధ ధాన్యంబులను క్షీర సహితముగ నందుంచిరి. గృహము నలంకరించిరి. ముంగిట చిత్ర విచిత్రంబులుగ ముగ్గు లిడిరి. వీథుల నలంకరించి చందనపు కలయంపిని చల్లిరి. పచ్చని పందిరులను వైచి వితానములఁ గట్టిరి. రత్నదీపికల నెల్లెడల నిల్పిరి. పూర్ణ కలశమును స్థాపించి ధూపదీపాదులతో నర్చించిరి. సత్యదాసులు వైది

కులు సంబంధుని పాణిగ్రహణ వార్తను విని తండోపతండము లుగ రా సాగిరి. వచ్చినవారికి గొప్పగ విందులు జరుగు చుండెను. అపుడు మంగళ వాద్యధ్వనులు, వేద నినదంబులు సముద్ర ఘోషమును మించెను. భక్తులపార ద్రవ్యమును సంభారములఁ దెచ్చిరి. సకల ద్రవ్యజాతంబులు పర్వతోప మానంబులై యుండె. వివిధంబులగు భక్ష్యములు సిద్ధపఱుపఁ బడెను. కొందఱు వైవాహికోపకరణంబులను సిద్ధమొనర్చిరి. కొందఱు పూమాలలను కొందఱు సుగంధ ద్రవ్యంబులను సిద్ధపఱచిరి. ఆ కార్యములన్నియు శివుఁ డాజ్ఞాపించినటుల, శివుఁడే చేసినట్లుండెను.

కంకణధారణము :—

పెండ్లికిఁ బూర్వ దివసంబున వైదికులు భక్తులు చేరి శాస్త్రవిధిని కంకణముఁ బూజించిరి. స్త్రీలు మంగళగీత ములఁ బాడిరి. మండపమున వైదికులు సంబంధునిచే సమా వర్తనవ్రతాదులఁ జేయించి ధాన్యముపై స్వర్ణకలశమిడి పత్ర పుష్ప దర్భలతో నలంకరించిరి. సంబంధుని వస్త్రాభరణాదులతో నలంకరించి కల్యాణతిలకమిడి యాసీనుఁజేసి వేదమంత్రములతో నాతని హస్తమునఁ బ్రతిసరముఁగట్టి యాశీర్వదించిరి. ఆ రేయి సంబంధుఁడు బ్రాహ్మణోత్తములకు ధనకనకాదుల నొసఁగి యర్చించెను.

మతాంధకారము నడఁప సంబంధుఁ డవతరించి నటుల చండభానుఁడు తమస్సు నడఁచుచు నుదయించెను.

వేఁగుజాముననే సంబంధుఁడు నిద్రనుండి మేల్కొని కాల్యకృత్యంబులఁ దీర్చికొని, మంగళస్నాన మాచరించి యలంకరించుకొనెను. దిక్కులవారు తెచ్చిన వస్తు జాతంబులచే భూమి సప్రయోజనమయ్యె. వైవాహిక కృత్యముల నొనర్ప వారి ధ్వనులఁబోలె శంఖములు ధ్వనించెను. తానును సంబంధుని వివాహమున కేఁగ దలచినటుల, వైదికులు యాగకుండంబులందు హోమమొనర్పకముందే యగ్ని ప్రదక్షిణార్చిస్సులతో వెలింగెను. వాయుదేవుఁడు మకరంద విభూతిఁదాల్చి రుద్రాక్ష మధువ్రతంబులఁ గదల్చుచునేఁగు భక్తబృందములతోఁ గదల పుష్పవాసనలు వ్యాపించెను. ఆకాశము తెల్లని మేఘములతో నిండి శ్వేత వస్త్రవితానమా యన నుండెను.

అపుడు సంబంధుఁడు తోణియప్పరు నాలయమున కేఁగి వందన మాచరించి యనుమతినంది, వైదికులు భక్తులు ముందు నడువ శిబిక నెక్కి మంగళవాద్యములు మ్రోఁగుచుండ బయలు దేఱెను. బంధువులు వారివారికిఁ దగిన వాహనముల నారోహించిరి. మయూర పింఛములు ఆతపత్రంబులు వింజామర లాకసముఁ గప్పెను. శంఖ తార చిహ్న కాహళ తాళ వేణు వీణా మృదంగాదుల ధ్వనితో వేదధ్వనియుఁ జెలఁగెను. వనితామణుల మంగళ గానములతో నాశీర్వచనములు విస్తరిల్లెను. వేదాధ్యయన పరులగు శిష్యులు గురువుల వెంటఁగదలిరి. సోమయాజులు అగ్నులను వహించిన ఛాత్రులతో పత్నీసహితులై బయలుదేఱిరి. గాయకులు సంబంధ రచితమైన పాటలఁ

బాడసాగిరి. కామక్రోధాది విరోధిషట్కమును జయించిన మునులు శివయోగులు గుంపులు గుంపులుగ నేఁగిరి. విద్యాధర గరుడ గంధర్వ యక్షకిన్నరులు తమతమ విమానముల నెక్కి సంబంధుని వివాహముఁగాంచ రోదసి నిండిరి. ఇవ్విధంబున సంబంధుఁడు ముత్యాలగొడుగు నీడ నీయ శివుని పాదపద్మంబులను మనంబుననిడి తిరునల్లూరును సమీపించెను. అపుడా యూరి భక్తులు మంగళ వాద్యములతో నెదురు రా, వారితో నాలయముఁజొచ్చి జోతలిడి స్తుతించి వెలికివచ్చి యొక మఠముఁ బ్రవేశించెను.

అచట సంబంధు నొక పీఠముపై నాసీనుఁజేసి పన్నీట జలకమాడించిరి. శుభ్ర శ్వేతదుకూలంబులఁ గట్టనిచ్చిరి. కస్తురిమిళిత చందనమును దేహమువ నలఁదిరి. ముత్తెముల యందెలలను పాదములఁ దొడిగిరి. జటాబంధమునకు ముత్తెముల సరములఁ జుట్టిరి. బంగరు మొలత్రాఁటిని వెండి జన్నిదములను ధరింపఁ జేసిరి. కంఠమున ముక్తాహారములను వైచి వ్రేళ్లకు రత్నపు టుంగరములఁ బెట్టిరి. కర్ణంబుల మకరకుండలములను, నొసట విభూతితో తిలకమును ధరించిన సంబంధుఁడు శచీదేవిని వివాహమాడబోవు దేవేంద్రునిఁ బోలియుండెను. సంబంధుఁడు రుద్రాక్ష మాలికలకు విభూతికి మ్రొక్కి యవ్వానిఁ దాల్చెను. పిదప శిబిక నధిరోహింప శంఖములు మంగళ వాద్యములు పెల్లు గ్రమోఁగ నారంభించెను. అట్లుత్సవముతో వెడలి వివాహాగారముఁ జేరెను.

లోకదుఃఖము నశింప నవతరించిన సంబంధుఁడు కల్యాణ వేషమున వచ్చుచుండ నంబియాండారునంబి గృహమున మంగళ వాద్యములు మ్రోఁగెను. వధువునకుఁ గంకణముఁగట్టిరి. శిరమున బంగరు రత్నాల రావిరేకును, కంఠంబున రత్నహార ములను ధరించిన కన్య కల్పలతికవలె నుండెను. ముత్తైదువలు వైదిక బాలకులు సంబంధున కెదురేఁగి, పూవులఁజల్లిరి. వైదికులు పూర్ణకుంభోదకంబుల నాతనిపైఁ జల్లిరి. పుణ్య మూర్తియగు సంబంధుఁడు పుష్పాలంకృతమైన వివాహవేదికను సమీపించెను. అపుడు ముత్తైదువలు పుష్పమాలికలను చంద నాదులను హస్తంబులఁదాల్చి యాతని యుభయపార్శ్వముల వారలు దీరి నిలిచిరి. సంబంధుఁడు శివుని ధ్యానించుచు శివ జ్ఞానము పొంగి పొరలుచుండ స్వర్ణపీఠము నధివసించెను. స్త్రీలు పాటలు పాడుచు నాతనిముందు జలమును ధారగఁ బోసిరి. నంబాండారునంబి పత్నీసహితుఁడై వచ్చెను. అతని పత్ని జలంబులఁబోయ నతఁడు "శివుఁడితఁడే"యని సంబంధుని పాదములఁ గడిగి మధుపర్కమిచ్చెను. మహాసంకల్పానంతరము తమ కుల గోత్రంబులఁజెప్పి యతఁడు "ఇమాం పార్వతీస్వరూ పిణీం కన్యాం తుభ్యమహం సంప్రదదే"యని జలధారాపూర్వక ముగ సాలంకృత కన్యాదానమును సంబంధున కొసంగెను. కన్యను సంబంధుని దక్షిణ పార్శ్వమున నిలిపిరి. సప్తపదియు పాణిగ్రహణము అగ్నిసాక్షిగ విధ్యుక్తముగ సాగెను. తిరునీల

నక్క నాయనారు పురోహితుఁడై సకల కృత్యములను విధ్యుక్త ఘుగ జరిపించెను. వధువు హస్తమును వరుఁడు గ్రహింప "గార్హపత్య నిర్వహణార్థము నిన్ను దేవత లొసంగిరి" అను మంత్రమును నక్కనాయనారు పఠించెను. వధువుచేత పేలాల నిడి గృహ్యాగ్నియందు హోమము నొనర్పఁ జేసెను. అపుడగ్ని ప్రదక్షిణార్చిస్సులతో వెలుఁగ సంబంధుఁడు "అష్టమూర్తియగు శివుని రూపమే యిది" యని భావించెను. "గృహస్థ ధర్మము నన్ను బంధించినది గాన ఈమెతో శివుని పాదములఁ జేరె దను" అని యతఁడు మనంబున నిశ్చయించెను.

వెంటనే సంబంధుఁడు వధువు కరమును గ్రహించి బంధువులు భక్తులు వెంటరా సత్యజ్యోతిస్సునుఁ జేరఁగోరి తిరుమణలి యాలయమునకుఁ బోయెను. అచటి పరమేశ్వరునకు మ్రొక్కి "పరమేశా! నా యీ జన్మము తరింప బాల్యముననే దాసునిగ గ్రహించితివి. నన్ను నీ పాదపద్మములఁ జేర్చికొనుము". అని పాడెను. ఈ నా కల్యాణమునకు వచ్చిన జనులందఱు జన్మదుఃఖము వీడి తరించునటుల కరుణింపుము. నీ కరుణకై వేచియున్నాఁడ. దాసునిఁ గాపాడఁదగిన సమయమిదియే" యని విన్నవించెను.

అపుడు కైలాసపతి దాసుని ప్రార్థనను మన్నించి "ఓయీ! నీవు నీ భార్యతో నీ పెండ్లికై వచ్చిన సకలజనంబులతో నన్నుఁజేరరమ్ము" అని కరుణించి ముల్లోకములు

తన దివ్య ప్రకాశంబుతో నిండ జ్యోతిర్లింగముగఁ బ్రత్యక్ష మాయెను. ఆ దివ్య ప్రకాశమున నాలయ మదృశ్యమై యొక ద్వారముఁ గన్పించెను. సంబంధుఁ డా శివపరంజ్యోతికి నమో వాకము లర్పించెను. పిదప లోకము జీవించు మార్గము బోధింపఁ దలచి, "శివజ్ఞాన మార్గము నిచ్చునది 'నమశ్శివాయ 'యను పంచాక్షరీ మంత్రమే. అది స్మరించువారికి ముక్తినొసంగును. అయ్యదియే చతుర్వేదసారము. నాథుని స్మరింపఁదగిన మంత్ర రాజము నమశ్శివాయ యనునదియే." అని ఆరంభించు నమశ్శి వాయ పదిహముఁ బాడెను.

పిదప సంబంధుఁడు సకల జనులఁగాంచి, "జన్మదుఃఖము నశింప మీ రందఱీ జ్యోతిఃప్రకాశమునఁ బ్రవేశింపుఁడు" అని యాజ్ఞాపించెను. జనన మరణ దుఃఖసాగరపుదరిఁ గాంచఁజాలక పరితపించు జనులందఱా జ్యోతిస్సునఁ బ్రవేశించిరి. మహా భక్తులగు తిరునీలనక్క నాయనారు, మురుగ నాయనారు, తిరు నీలకంఠ యాల్పాణుఁడు, శివపాద హృదయుఁడు, నంబాండారు నంబి మొదలగువారందఱు తమతమ గృహిణులతో శివజ్యోతి స్సునుఁ జొచ్చిరి. బంధువులు, వైదికులు పెండ్లిఁగాంచవచ్చిన వైదేశికులును ప్రవేశించిరి. ముత్యాలపల్లకిని శివచిహ్నములను మోసినవారుఁ జొచ్చిరి. మునులు భక్తులు ఒకరననేల? ఆ బాలవృద్ధులు దివ్య జ్యోతిస్సును ప్రవేశించిరి. తిరుజ్ఞాన సంబం ధుఁడు వధువుతో నా జ్యోతిస్సునకు మ్రొక్కి ప్రవేశించెను.

అది వైశాఖ మాసము; మూలానక్షత్రము. ఇట్లు సంబంధుఁడు సాయుజ్యమునంద నా జ్యోతిస్సు అదృశ్య మయ్యెను. తిరు నల్లూరు కోయిల గన్పించెను. అట్టి భాగ్యము లభింపమికి కొందఱు దుఃఖించిరి. కౌండిన్య బాలుఁడు జ్యోతిస్సున లీనుఁ డగుటఁగాంచి బ్రహ్మాదులు శివుని కరుణఁ బొగడిరి.

"తవ స్తన్యం మన్యే ధరణి ధరకన్యే హృదయతః
పయః పారావారః పరివహతి సారస్వతమివ
దయావత్యా దత్తం ద్రవిడ శిశురాస్వాద్య తవ యత్
కవీనాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా"

(సౌందర్యలహరి.)

## 29. ఏయర్కోన్కలికామ నాయనారు

(కలికాముఁడు—సుందరమూర్తి)

దక్షిణదేశమందలి చోళదేశమున పెరుమంగళమను నగర రాజమొండు గలదు. అద్దాని మహోన్నత ప్రాకారము లందు శత్రు భయంకరంబులగు యంత్రము లనేకంబులు మృత్యుగహ్వరంబు లా యన నుండు. అందలి భవనములపై వారివాహములు సంచరించుచుండు. వీధులు నిత్యోత్సవ కలితంబులు. అందలి నర్తనశాలలు మృదంగ ఘోష సంకలితంబులై

యుండు ప్రజలు స్వధర్మనిరతులు శివభక్తులతో నిండిన యన్నగరరాజము శివపురియన నొప్పును.

అప్పెరుమంగళమున నేయర్కోన్కడ యను వంశ మొండు గలదు. ఆ వంశీయులు వంశానుగతముగ చోళ దేశ సేనాధిపతులుగఁ జేర్గాంచిరి. అట్టివారిలోఁ గలికాముఁ డొకఁడు. అతఁడు శివపూజా ధురంధరుఁడై భక్తజనసేవా రతుఁడై వాసికెక్కియుండెను. కలికాముఁడు తిరుప్పూంగూరను శివక్షేత్రమున ననేక సేవ లొనర్చి, విభూతియే పరధనమని భావించి సంతసమున జీవించుచుండెను.

తిరునావలూరు సుందరమూర్తి పరమశివుని తనప్రియురా లగు పరవనాచ్చియారుకడకు కుంటెన పంపెనను వార్త నీ కలి కాముఁడు విని "యిట్టి యకృత్యము నెవరొనర్తురు" అని సుందరమూర్తిఁగూర్చి హేయముగఁ బల్కెను. కలికామునకు సుందరునియెడఁ గల్గిన భావమును సమీకృత మొనర్ప శివుఁ డాతనిఁ జేరవచ్చిన వృత్తాంతమును శివుని కరుణాతిశయమునిఁక విచారింతము.

నావలూరు నాథుఁడగు సుందరమూర్తి "తిరుత్తొండ త్తొహ"యను పదిహముఁ బాడి తిరువారూరు త్యాగరాజు పాద కమలములను త్రికాలములందు భక్తితో నార్ద్రిభూత చేత స్కుఁడై మ్రొక్కుచు సేవించుచుండు కాలమునఁ కుండయూ రను స్థలమున నొక భక్తుడుండెను. అతఁడు సుందరమూర్తి

"వేలాల"



యందు భక్తిఁగలవాఁడై ప్రత్యహము ధాన్యాది భోజ్యపదార్థ
ములను పరవయూరు నింటికిఁ బంపుచుండెడివాఁడు.

శివుఁడు ధాన్యరాశి నొసఁగుట :—

కుండయూరు వేలాలభక్తుఁ డివ్విధమున సుందరుని
సేవించుచుండ వర్షాభావ మేర్పడెను. పైరుపంటలు నశించెను.
ఆ భక్తుఁడు సుందరునకు నాహారపదార్థముల నంపుట కాటంక
మేర్పడెను. నా సేవ కిట్టి ప్రతిబంధ మేర్పడెనే యని యాతఁడు
చింతతోఁ గలఁతఁజెంది యానాఁడు నిరాహారుఁడై నిద్రించెను.
కలలో బరమేశ్వరుఁడు గన్పడి "ఓయీ! దుఃఖింపకుము.
సుందరున కర్పింప నీకు నేను ధాన్య మొసఁగెద" అని కరు
ణించి కుబేరునకు ధాన్య మాతనికి నీయ నాజ్ఞ యొసంగెను.
కుబేరుఁడు శివాజ్ఞను శిరంబునఁ దాల్చి యాతని పెరటిని ధాన్య
ముతో నింపివైచెను. ఆ ధాన్య మొక పర్వతమా యనఁ
దోఁచె. నిదురనుండి లేచిన కుండయూరి భక్తుఁ డా ధాన్య
పర్వతముఁ గాంచి "యిది యే లోకమునఁ బండి వచ్చినది"
యని యాశ్చర్యపడి శివుని కరుణను నుతించెను. "ఈ ధాన్య
రాశిని సుందరు నింటికిఁ జేర్చువారెవరు? ఈ విషయము నాతని
కెఱిఁగింతు"నని తలఁచి తిరువారూరున కాతఁడు వేగముగ
పరుగిడెను. అతఁడు సుందరునిఁ గాంచుటకుఁ బూర్వమే పరమ
శివుఁడు తాను భక్తునకు ధాన్యమిచ్చిన వార్త నెఱిఁగించెను.

కుండయూరు భక్తుఁ డేతెంచి సుందరునిఁ గాంచి మ్రొక్కి—
"నేఁడు మీ సేవకు విఘాత మేర్పడి చింతించుచుండ కరుణా

నిధి శివుఁడు ధాన్యరాశి నొసఁగెను. దానిని తమ గృహంబునకుఁ జేర్ప మానవుల కసాధ్యము" అనెను. అంత సుందరుఁడు "ఓయీ! నీయందు శివుఁడు కరుణించెను. నీవు ధన్యుఁడవు" అని పల్కి వాని వెంటఁ గుండయూరున కేఁగెను.

ఆకాశమునంటు నా ధాన్య పర్వతమును సుందరుఁడు గాంచి యాశ్చర్యము నొంది మ్రొక్కి "దీనిని పరవయూరు నింటికిఁ జేర్పు నుపాయము నా శివుఁడే చూపవలయు" నని తలఁచి యచటికి సమీపముననున్న కోళలి యను క్షేత్రముఁ జేరి యాలయముఁ జొచ్చి భూతగణాధినాథునకు మ్రొక్కి "పద్మపత్రాయతాక్షీ పరవ కృశించి దుఃఖింపకుండఁ జేయుము. సదాశివా! నిన్ను ధ్యానింతు" (వాళినకణ్ మరవాళ్ వాడి వరుందామె...) అని పాడి స్తుతించెను. అంత నాకాశవాణి "సుందరా! నా భూతగణంబు లీ రాత్రి యా ధాన్యమును పరవ యింటఁ జేర్తురు" అని పల్కెను. అవ్వార్త వినిన సుందరుఁడు చంద్రచూడుని నుతించి తిరువారూరునకుఁ బోయెను. పరవయారుం గాంచి జరిగిన వృత్తాంతముఁ దెల్పెను. ఆ రాత్రి భూతగణములు కుండయూరిలోని ధాన్యముఁ దెచ్చి పరవ యింటియందే గాక తిరువారూరు నిండ నింపిరి. అరుణోదయమున మేల్కాంచిన జను లా ధాన్యముఁ గాంచి యాశ్చర్యము నంది సుందరుఁడు పరవయారునకై తెప్పించిన ధాన్యమనియు స్థలాభావముచే నది యూరంతయు నిండెనని తెలిసికొనిరి.

పరవయారు సుందరుఁడు తనకిచ్చిన ధాన్యముఁ గాంచి సంతసించి, "యయ్యాయి యిండ్లకడనుండు ధాన్యమును వారు వారు గైకొని భద్రపఱచుకొనుఁడు" అని చాటించెను. జను లట్లేసేయ సుందరుఁ డానందించి వల్మీకనాథుని స్తుతించెను.

తిరునాట్యత్తాన్కుడి కేఁగుట :—

కోట్పులియారుఁడను భక్తశిఖామణి తిరువారూరునకు వచ్చి సుందరమూర్తిని తన యూరున కాహ్వానించెను. సుందరుఁ డాతని ప్రార్థనను మన్నించి క్షేత్రదర్శనాభిలాషియై పయనమై యనేక క్షేత్రంబులను దర్శించుచు తిరునాట్యత్తాన్కుడిఁ జేరెను. కోట్పులియారు సుందరుని భక్తితో తన గృహంబునకుఁ గొంపోయి బంగరు పీటపై నాసీనుం జేసి యాతని పాదకమలములను శుద్ధజలంబులఁ గడిగి తజ్జలమును శిరమునఁ దాల్చి వస్త్రాభరణ చందనాదుల నొసఁగి గొప్ప విందుచేసెను. భోజనానంతర మాతఁడు తన కూఁతుండ్రను శింగడియారు, వనప్పహాయారులఁ బిలిచి "వీరు నా పుత్త్రికలు. వీరిని మీ కర్పించుచున్నాఁడ. వారిచే సేవలు గొని నన్ను కరుణింపుఁడు" అని ప్రార్థించెను. సుందరమూర్తి వారిని తన యంకతలమునఁ గూర్చుండఁబెట్టికొని శిరము మూర్కొని "వీరు నా పుత్త్రికలగుదురు" అని పల్కి వారిని పుత్త్రికాభావమున నాదరించెను. పిదప సుందరుఁ డాలయమున కేఁగి శివునకు నమోవాకము లర్పించి "సకలాభరణములు సర్పములే..." (పూణ్,

ఆణ్, ఆవదు ఓర్ అరవం...) అను పదిహము( బాడి యందు కోట్పులియారు సేవను ఆతని పుత్రికల నాదరించిన విధమును, శింగడియారునకు( దండ్రినైతినను భావము( దెల్పెను. అటనుండి వలివలమను క్షేత్రమును దర్శించి నుతించి తిరువారూరునకు వచ్చి వల్మీకనాథుని సేవించి పరవయారుతో సుఖంబుండెను.

పరవయారునకు బంగారము( దెచ్చి యీయ తిరుప్పుహలూరున కేగుట :—

అక్కాలమున తిరువారూరునందు ఫల్గున్యుత్సవము జరుగ నుండెను. అయ్యుత్సవ దర్శనాకాంక్షులై వచ్చు భక్తకోటికిఁ బరవయా రుపచరించి యాహారాదుల నొసఁగ సంకల్పించెను. అవ్విషయ మెఱిఁగిన సుందరుఁడు ధనము సమకూర్ప తిరుప్పుహ లూరున కేగెను. అచటి మహాదేవు నాలయంబు వలగొని మ్రొక్కి తాఁ దలఁచిన భావము( బొందుపఱచి "మిమ్ముఁ బొగడి ధనముఁ బొందనిచో విచారింతు..." అను పదిహ ముతో నుతించి యా రాత్రి యాలయముననే శయనింపఁ దలఁచి యచటి యిటుకలను తలాడగఁ జేసికొని నిద్రించెను.

ఉదయమున మేల్కాంచి చూడ నిటుకలన్నియు స్వర్ణే ష్టికలయి యుండెను. అది పరమశివుని కరుణ యని యెఱింగి శివునిఁ గాంచి మ్రొక్కి "పొగడిన నిచ్చువారు లేరుగదా..." (తమ్మయే పుగళింది...) అను పదిహము( బాడి స్తుతించి యా బంగారపు టిటుకల నెత్తించుకొని పోవుచు మార్గమున తిరుప్పన

యూరులో ఆనంద తాండవమాడు శివుని దర్శించి "అందమైన నాట్యశేఖరుఁ డితఁడే..." యని పాడి తిరువారూరుఁజేరె స్వర్ణవాహకులను పరవయూరు నింటికిఁ బంపి తా వల్మీకనాథుని దర్శించి స్తుతించి పరవయూరు నింటి కేఁగెను.

కొంత కాలము గడవ సుందరుఁడు శివునాజ్ఞఁబొంది క్షేత్రములను దర్శింప నేఁగుచు నన్నిలమందలి శివునకు మ్రొక్కి "శీతోష్ణ సమదేహా..." అను పద్యమాలిక నర్పించి తిరువీళిమిళనముఁ జేరెను. అచట భక్తులు పురము నలంకరించి సుందరునకు స్వాగత మొసఁగిరి. సుందరుఁ డచటి శివునకు మ్రొక్కి తిరునరయూరున కేఁగి యచటి చిత్రేశుని సేవించి పుత్తూరుఁ జేరెను. అచటి మహేశుని సేవించి పూర్వము పుగళ్తునై నాయనారునకు పడికాసుల నిచ్చి యనుగ్రహించిన వృత్తాంతమును పద్యములఁ బాడి యా స్థలమును వీడి తిరువావడుదురను గాంచి యచటి యాలయమును వలగొని మ్రొక్కి "వైదికాగ్రేసరా!..." యని మొదలిడు పదిహాము చెప్పి నుతించెను. అందు కోడ్చెంగచోళుని జన్మవృత్తాంతముఁ జేర్చి పాడెను. అటనుండి తిరువిడైమరుదూరును చేరెను. అచట మరుద వృక్షాశ్రయుఁడై వసించు నుమాధవుని మ్రొక్కి పద్యమాలిక నర్పించి తిరునాగేశ్వరముఁ జేరెను. అచటి నాగాభరణుని సేవించి తిరుశివపురమును, ప్రళయమున జీవులను ఘటమున దాఁచిన శాకోట్టను దర్శించెను. అచటి భవునిఁ బొగడి తిరుచోట్రుత్తురైలోని నీలకంఠునకు నమస్కరించి పది

హముఁబాడి, కండియూరు, తిరువయ్యారు, తిరుప్పూందురుత్తి మొదలగు క్షేత్రములను దర్శించి, తిరుఆలంపుళ్లై యను క్షేత్రముఁ జేరి యొక రాత్రి యట నిద్రించెను. సుందరుని స్వప్నమున శివుఁడు దోఁచి "పాడికి రాఁ దలంపులేదా!" యని పలికి తన బాల్యవేషముఁ జూపి కరుణించెను.

వెంటనే సుందరుఁడు మేల్కొని కావేరిని దాఁటి, పాడిని చేరెను. అచటి యాలయములోని కేఁగి నమస్కరించి, పులకితదేహుఁడై మనస్సు ద్రవింప "స్వర్ణదేహా! వ్యాఘ్రచర్మాంబరధరా!..." (పొన్నార్ మేనియనే పులిత్తోలై...) యను పదిహముఁ బాడి స్తుతించెను. అచ్చోట భక్తులతో కొన్ని దినములుండి తిరువానైక్కా (జంబుకేశ్వరము) అను పుణ్యస్థలముఁజేరి జంబుకేశ్వరునకు మ్రొక్కి "నాల్గు వేదములచేఁ గీర్తింపఁబడిన పరమేశా..." అను పదిహముఁ బాడి యా పద్యములందు "పూర్వ మురయూరు చోళుఁడు కావేరిలో స్నానమాడుచుండ నతని రత్నహారము-నీటఁబడ నతఁడు శివా! దీనిని నీవే గైకొమ్మన నది యభిషేక జలఘటమందుఁ జేర శివుడద్దానిని ధరించి రాజును కరుణించె"నను పూర్వ గాథను చేర్చి పాడెను.

తిరుప్పాచ్చిలాశ్రమమున స్వర్ణరాశి నందుట :—

పిదప సుందరుఁడు తిరుప్పాచ్చిలాశ్రమముఁజేరి యాలయమును ప్రదక్షిణించి సర్వమంగళాపతిని మ్రొక్కి ప్రవ్యాళ

అధికముగా దదర్థమై ప్రార్థించెను. శివుఁ డాతన్ని ధనకాంతఁ దీర్పకయుండ సుందరుఁడు భయభక్తులు పెనగొన భక్తులఁ గాంచి, తన కొఱఁతను చెప్పువానివలె "ఇతఁడుగాక వేరు దైవము లేడా! ప్రత్యహము కైలాసమునుండి భూమికేల రావలయు? నేనితనికి దాసుఁడనై యున్నాఁడఁగదా? ఈ శిరమును జిహ్వాను నాకితఁడేల యొసంగె? నేనేమి యితని దూషించితినా?" (ఇవరు అల్లారు ఇల్లయో పిరానార్...) అని పాడెను. శివుఁడా గేయమునకు మెచ్చి స్వర్ణరాశి నొసంగెను. అంత సుందరుఁడా పశుపతిని సేవించుచు నచటఁ గొంతకాలముఁ గడపెను.

అటనుండి కావేరీతీరమునంటి పోయి తిరుపైంగిలిని చేరి శివుని దర్శించి మ్రొక్క నచట కంకాళవేషమున శివుఁడు ప్రత్యక్షముగా "అరణ్యావాసా! దారుకావనమందలి మునిపత్నుల మనంబులు చలింప భిక్షుకవేషధారివై పోవ వారు నిన్ను కామించిరిగదా..." అని పొగడి, భక్తులతో తిరువీంగోయిమలై మొదలగు శివక్షేత్రములను దర్శించుచు కొంగునాఁడు చేరెను. అచట పాండికొడిముడిని దర్శించి శివునకు మ్రొక్కి "ఈ దేవుని మఱువఁజాలను. ఈతని పాదకమలములను నేను మఱచినను నా జిహ్వా సదా పంచాక్షరినే జపించు" నను పద్యమాలిక నర్పించి తిరునెరిమూరున కేఁగెను. అచట శివుడు కనకసభలోని తన తాండవ నృత్యరూపముఁ గన్పఱుప సాష్టాంగముగ మ్రొక్కి, యింద్రియాదుల కతీత

మగు బ్రహ్మానంద సాగరమున మునింగి యా క్షేత్రమునఁ గొంతకాలము గడపెను.

కనకసభలో నాట్యావసరమున నుద్ధృతమైన పాదకమలముతోడి నటరాజేశ్వరునిఁగాంచు భాగ్యము నందిన వానికిఁక పొందఁదగిన దేమియుండును?. సుందరమూర్తి యా స్థలమును వీడి పర్వతారణ్యములను నదీనదములను దాఁటుచు ననేక శివస్థలములఁగాంచి మ్రొక్కుచు తిరువెంజమాక్కూడలిని దర్శించి తిరువర్కుడిమలను చేరి, మహేశ్వరునకుఁ బ్రణమిల్లి పద్యమాలిక నర్పించి, తిరుమేట్రిళిని దర్శించి, తిరుఇన్నంబరు క్షేత్రమునకేఁగి పరమశివు నారాధించి, "వేదాదిపురుషా! యీ స్థలంబునకువచ్చి నిను మ్రొక్కువారు ధన్యులు" అని స్తుతించి తిరుప్పురంపయమను శివస్థలముఁ జేరెను. తిరువెణ్ణైనల్లూరులో శివుఁడు దాసునిఁగాఁ జేసికొనిన సుందరుఁడు వచ్చుచున్నాఁడని విని యచటి భక్తులాతనికి నెదురేఁగి మ్రొక్కి "మా పూర్వపుణ్యఫలమేమో! మిము దర్శించు భాగ్యము నందఁ గల్గితిమి" అని పొగడి యాహ్వానింప వారితో నతఁడచటి శివాలయమునకేఁగి భవలింగమునకు బుష్పాంజలి నర్పించి సాష్టాంగ మాచరించి, యా నీలకంఠుని కరుణకుఁ బాత్రుఁడై యుండెను.

పిదప సర్వవ్యాపియగు నుమాధవుఁడు సంతసమున నెలకొనియుండు ననేక క్షేత్రంబులఁ గాంచు నిచ్ఛతో బయలుదేరి భక్తులు వెన్నంటి రా, కొండగోఁగుఁ బూవులు మందారములు

మల్లియలు మొదలగు పూవులఁదాల్చు పరమశివుడుండు స్థలముల ననేకంబులఁ గాంచుచు నాట్యకర్తలగు లతాంగులకు నిలయమైన తిరుక్కుడలై యాత్రూరును చేరెను. కాని యా యూరిలోని కేఁగక వృద్ధాచల మార్గముఁ బట్టెను. అపుడు శంకరుఁడొక వైదిక విప్రవేషమున మార్గమున తటస్థింప నాతనిఁ గాంచి సుందరుఁడు 'వృద్ధాచలమునకు దారియెద్ది?' యన నతఁడు కుడలి యాత్రూరు మార్గముఁ జూపి కొంతదూరము వెన్నంటివచ్చి యదృశ్యుఁడాయెను. సుందరుఁ డాతనిఁ గానక "మార్గసాహాయ్యుఁడై వచ్చినవాఁడు శివుఁడే. నే నీ స్థలము నతిక్రమించుటను సహింపనివాఁడై యిటకుఁ జేర్చెను. అతని కరుణాతిశయ మెంత మహత్తర" మని యా స్థలముఁజొచ్చి శివునకు పద్యమాలిక నర్పించి వృద్ధాచలమున కేఁగెను.

అచటి గోపురమునకు మ్రొక్కి యాలయమును వలగొని లోని కేఁగి మ్రొక్కి "తనుమధ్యా..." (నంజియిడై...) యనిపాడి యా కైలాసపతికడ ధనముఁ బొందఁగోరి, "భస్మావలిప్త సర్వాంగా..." (మెయ్యెముత్రుప్పాడి...) అను పద్యముఁజెప్ప వృద్ధాచలేశ్వరుఁ డాతనికి పండ్రెండువేల బంగారు నాణెముల నొసంగెను. సుందరుఁడా ధనముఁగాంచి మనం బలర "స్వామీ! దేవర యొసఁగిన నీ స్వర్ణరాశిని తిరువారూరు జనులు గాంచి యాశ్చర్యపడునట్లొనర్పవలయు" నని విన్నవించెను. అపుడు శివుడు "ఓయీ! ఈ ధనము నిచటి మణిముక్తానదిలో వైచిపోయి, తిరువారూరు కమ

లాలయ మ్మందలి సరోవరంబునఁ బొందుము" అని యశరీర వాణి మోదముగ ననుగ్రహించెను.

ఆకాశమునుండి వీతెంచిన యీ మధురవాక్కులు వీనులు సోకగ సుందరుఁడొక నాణెమును మచ్చునకై తనకడ దాఁచికొని మిగత బంగారము నంతటిని మణిముక్తానదికి నెత్తికొనిపోయి "ఆనాఁడు నను దాసునిగాఁ జేసికొనిన తత్త్వము నిపు డెఱింగెద" ననుచు నందుఁ బడవైచెను. పిదప నటరాజుఁ గాంచఁ దలఁచి భక్తులతో చిదంబరమున కేఁగెను.

చిదంబర దర్శనము :—

సుందరుఁడు మార్గ మధ్యమునఁగల శివస్థలములకు మ్రొక్కుచుఁ గడయూరును దర్శించి చిదంబరముఁజేరి వీధికి వందనమాచరించి ద్వారప్రదేశముఁజొచ్చి మ్రొక్కి యాలయముఁ జుట్టివచ్చి శిరమునఁ గరములఁ గీలించి, లోనికేఁగి నేత్రములనుండి యానంద బాష్పములు జలజల రాలుచుండ మాటలు తడంబడ నేనుఁగుమెట్టును సమీపించి నటరాజు దివ్య పాదపద్మంబులకు మ్రొక్కి తిరుప్పేరూరులోఁ దాను గాంచిన దృశ్యమును స్మరించి "నాకుఁదప్ప నితరులకుఁ జూపని పదసరోజములుఁగల శివా..." యను పదిహముఁబాడి యా పద్యములందు "శైవసన్మార్గగాములు యమునిఁ గాంచరు. నరకాదులు వారికుండవు. దాసున కంతటను దర్శనమిచ్చితివి" అను భావమును పొందుపఱచి పాడెను. పిదప నచటి వైదిక

దీక్షిత బ్రాహ్మణులు తన్ను సేవింప నచట కొన్నిదినంబు లుండెను.

సుందరుఁడు చిదంబరమును వీడి యనేక క్షేత్రంబులను గాంచుచు కరిప్పూరియలూరునకు వచ్చి యందలి తిరుక్కాఱూడి యాలయముఁ జొచ్చి శివునకు మ్రొక్కి గీతములఁబాడి పోవుచు మార్గమునఁగల కాళిపుత్తూరుఁగాంచి, నాట్టుముల్లూరున కేఁగు చుండ మార్గమున త్ర్యంబకుఁడు దర్శనమీయఁగాంచి "నీ యరుణారుణ పాదకమలములఁ జూపి కరుణించితివి. చంద్రకళా ధరా!" యని పాడి తిరుపదిరోక్కల్పాడినిఁజేరి "మత్తేభమద విదళనా......" యని యారంభించు గీతముఁబాడి యాల యములోని కేఁగి మ్రొక్కెను. పిదప వేల్వీక్కుడినిచేరి ముక్తి ప్రదాతయగు ముక్తీశ్వరునకు మ్రొక్కి తిరుత్తిని దర్శించి యచట సదాశివుని కల్యాణవేషముఁ గాంచి, స్తుతించి తిరువా రూరుఁ జేరెను.

నదిలోవైచిన స్వర్ణమును సరస్సులో వెదకుట :—

దేవేంద్రాది దేవసేవితంబగు తిరువారూరు గోపురమును సమీపించి వందనం బాచరించి యాలయములోని కేఁగి మూల స్థానేశ్వరుని స్తుతించి వెలికివచ్చి, పరవయారు నింటి కేఁగ, తామరసాక్షి, బింబాధరోష్ఠియగు పరవయారు వచ్చి సుంద రుని పాదములకు మ్రొక్కి "ఇన్నాళ్లకు మాపై దయగల్గెనా! మీ దయకు మేమిపుడు పాత్రులమైతిమి" యని మధుర

వాక్కులఁబల్కి గృహంబులోనికిఁ గొంపోయెను. సుందరుఁ డాయమతో సుఖించుచు నొకనాఁడు "వృద్ధాచలేశ్వరుఁడు కరుణతో నిచ్చిన బంగారమును మణిముక్తానదిలోఁ బడవైచితి. ఇపుడు కమలాలయమున కేఁగి దానిని తెచ్చుకొందము. నా వెంటరమ్ము" అన నామె యాశ్చర్యముతో "నదిలో వైచుట యేమి? గుంటలో వెదుకుట యేమి?" అని మందహాస మొనర్చెను. అంత సుందరుఁడు "సుందరీ! ఇది పరిహాసము గాదు. విశ్వనాథుని కరుణచే కమలాలయమునుండి బంగార మెత్తి నీకిత్తు. రమ్ము" అని యామెను వెంటఁగొని వల్మీక నాథుని సేవించి కమలాలయమునకుఁ బోయి తత్తీరమున పరవ యారును నిలిపి, సరోవర జలంబుల బంగారమును వెదుకఁ జొచ్చెను. అపుడు శివుఁడు సుందరుని మధురగీతి విన నాశించి బంగారము లభింపకుండఁ జేసెను.

పరవయారు సుందరుని గాంచి "ఓ యయ్యా! ఏటిలో వేసి గుంటలో వెదకిన దొరకునా!" యనెను. అంత నతఁడు "పరమేశా! పరవ పరిహసింపని విధమున బంగారము నొసఁగుము" వృద్ధగిరీశ్వరా! వృద్ధాచలమున స్వర్ణమిచ్చి యిచట గ్రహింపుమంటివి. పరవ యెదుట నన్నవమానింపకుము". (పొ్న్ శెయిద మేనియ నీర్...) అను పదిహాము బాడి ప్రార్థించెను. కాని బంగారము లభింపలేదు. సుందరుఁడు వ్యసన పరీతుఁడై "నిన్ను స్తుతింపక నే నెపుడు నుండఁగాదే..." (ఏత్తాదు ఇరుందు అరియేన్...) అను పదిహాముఁ బాడెను.

వెంటనే శివుని దయచే బంగారపు మూట లభించెను. అతఁడద్దానిఁ దీరముఁ జేర్ప నచటి జనులు "ఇట్టి భాగ్యమెవరికిఁ గల్గు"నని పొగడి మ్రొక్కిరి. సుందరుఁడు మున్ను తనకడ దాఁచిన మచ్చు తునుకతో నది సరియగునా యని చూడ నపుడు లభించినది తక్కువవన్నె బంగారముగఁ గన్పింప "దాసుని తప్పేమి? ఇట్లేల చేసితివి?" అని ప్రార్థింప నా గీతికను విని సంతసించి శివుఁడా బంగారమును మేలిమి బంగార మొనర్చెను. సుందరుని కవితను విన నీలకంఠుఁడెంత యాశపడుచు నుండెనో గదా! పిదప నా స్వర్ణరాశిని పరవయారు నింటికిఁ బంపి తాను వల్మీకనాథుని సేవింపఁబోయెను. వల్మీకనాథాలయమున కేఁగి మ్రొక్కి "నీ దాసాను దాసుండ..." అని పదిహాముతో స్తుతించి పరవయారు నింటికేఁగి సంతసంబున నుండెను.

స్థలయాత్ర :—

కొంత కాలమట్లు గడపి మరల శివక్షేత్ర దర్శనాభిలాషియై సుందరుఁడు త్యాగరాజు ననుమతినంది తిరునల్లారుఁ జేరి శివుని సేవించి, తిరుక్కడయూరునకుఁ బోయి త్రిపురాంతకుని దర్శించి "భస్మావలిప్త దేహా...(కొడియాన్ మేనియనే ...) అను పద్యమాలిక నర్పించి సుదృఢమైన ప్రాకారముచేఁ జుట్టఁబడిన తిరువలంపురముఁ జొచ్చి శివునకు మధురభావోపేతములగు గీతంబులఁ గానుకయిడి, రత్నంబులను ముత్తియంబులను తన తరంగహస్తములనెత్తి సర్వకాలములందు సముద్రుఁడు పూజించు మహాదేవుఁడు వేంచేసియున్న తిరుచ్చాయకాడూరు

శివుని మ్రొక్కి తిరువెంగాడు, తిరుననిపల్లి, తిరుచ్చెంబోన్పల్లి మొదలగు శివక్షేత్రంబులను సేవించి, తిరునన్నియూరుఁ జేరెను. సుందరుఁ డచటి యాలయముఁజొచ్చి పార్వతీపతికి వందనం బాచరించి, మనంబు ద్రవింప పూర్వము తిరునావుక్కరసు శివునిపై జెప్పిన చతుస్సహస్రాధిక గీతములఁ బొగడుచు పద్య మాలికఁ జెప్పెను. అచట కొంత కాలముఁ గడపి, తిరునీడూరుఁ గాంచి, తిరుప్పూంగూరును సేవించి, నందన వనావృతంబగు తిరుకోలక్కాను చేరఁబోవ శివుఁడా పురిబాహ్య ప్రదేశ ముననే దర్శన మొసంగెను. "కోలక్కాలో నినుఁగంటి శివా" అను మకుటముఁగల పద్యమాలికఁ బాడుచు నాలయ ముఁజొచ్చి, పూర్వము జ్ఞానసంబంధుఁ డచట చేతులతో తాళము వేయుచుఁ బరవశుఁడై పాడ, నాతనిఁ గరుణించి బంగరు తాళముల నొసఁగిన కరుణాతిశయముఁగూర్చి పాడి స్తుతించెను, పిదప ముత్తమిళ పండితుఁడగు జ్ఞానసంబంధుని జన్మముచేఁ బవిత్రమైన శీర్గాళిఁజేరి మ్రొక్కి తిరుకురుహా వూరును దర్శింప నేఁగెను.

శివుఁడు పాథేయ మొసగుట:—

సుందరుఁ డిట్లు అనవరత ప్రయాణములచే నలసిపోవుచు క్షుత్పిపాసాకులితుఁడై మార్గమున వెతఁజెందెను. భక్తుని బాధనెఱింగిన భవుఁడు జలపూర్ణ కలశమును, అన్న పుమూటను గైకొని సుందరుఁడు వచ్చు మార్గమున శ్రోత్రియ బ్రాహ్మణ రూపమున నతనిరాక నెదురుసూచుచుండెను. భక్తజనుల

శ్రమాపనోదమునకై యచట నొక చలిపందిరిని ఒక సరోవరంబును సంకల్ప మాత్రమున నిర్మించియుండెను. సుందరుఁడు భక్తులతో నా శాలఁ బ్రవేశించి యటఁ గన్పించిన వైదికుని పాదములకు మ్రొక్కి "శివాయనమః" అని పల్కి యాతని సమీపమునఁ గూర్చుండెను. ఆ పాఱుఁ డాతనిఁ గాంచి "ఓయీ! అధ్వశ్రమపీడితుడ వైనయట్లున్నాఁడవు. నాకడ జలాహారములు గలవు. వీనిచే నాఁకలి దప్పులు దీఱును" అనఁగ నతఁడు వేదవిదుఁడిచ్చు దానిని తిరస్కరింప నేల? యని గ్రహించి భక్తులతో తాను నారగించి నీటిఁద్రావెను. వైదికుని కరుణచే నన్నము మిగిలియుండఁ గాంచి యచట నుండు జనుల కందఱ కా యాహారము నిడి సంతసించెను. జఠరాగ్ని కింత యన్నమిడిన అన్నపూర్ణాపతిని మనసార స్తుతించెను. కడుపునిండఁ దినుటచే సుందరునకు నితర్భులకును మత్తెక్కినటుల నిద్రాదేవి యావహించెను. వారు నిద్రించుచుండ వైదికవేషధారి యా పందిరితో మఱగిపోయెను.

సుందరుఁడు శివాధీన మనస్కుఁడై కొంతవడి న్నిదించి. మేల్కాంచిచూడ పందిరి లేదు. వైదికుఁడు గన్పింపఁ డయ్యెను. అది లోకావన దీక్షాపరుఁడగు దాక్షాయణీపతి కరుణయని యెఱిఁగి సుందరుఁడు "ఇట్టి నీ మహిమ నెఱుంగనైతి..." అని పాడుచు తిరుకరుహావూరుఁజేరి యందలి వెల్లడ యను నాలయముఁ బ్రవేశించి వలగొని యమృతేశ్వరునకు మ్రొక్కులిడి స్తుతించెను. పిదప జటాధారి శివ్వుఁడుండు ననేక

శివస్థలంబులఁగాంచుచు తిరుక్కళిపాలును, దర్శించి తిరుత్తినై నగరమున కేఁగి విశ్వనాథున కేటికోళ్లు సమర్పించి తిరునావలూరున కేఁగెను. అచటి భక్తులు సుందరునిరాక విని నగరము నలంకరించి "నేఁడు పర్వదినము. పుణ్యమూర్తి యేతెంచుచున్నాఁడు" అని పల్కుచు నెదురువచ్చి స్వాగతమువల్క వారితో నాలయమున కేఁగి శివునిముందు నిలిచి యగమ్యగోచరుఁడగు పశుపాశ విమోచకుని పద్యములతోఁ గీర్తించి యచ్చోట కొన్ని దినంబులుండెను.

తొండమండలముఁ జొచ్చుట :—

సుందరుఁడు తొండమండలముఁజొచ్చి యందనేక పుణ్యస్థలములనుఁ గాంచుచు, ననేక నదీతీరములను పుష్పోద్యానములతో నిండిన వనములను పర్వతంబులఁదాఁటి తిరుక్కళుక్కుంద్రముఁ జేరెను. అచటి భక్తులు సుందరుని భక్తితో నాహ్వానింప వారితో నాలయముఁజొచ్చి, శివునకు సాష్టాంగమాచరించి రాగ తాళ లయ యుక్తంబుగ మధురగీతిఁబాడి స్తుతించి యటకొన్ని దినంబులు గడపెను. పిదప తిరుకచ్చూరున కేఁగి చంద్రమౌళినిఁగాంచి మ్రొక్కి స్తుతించి వెలికివచ్చెను. అది మట్టమధ్యాహ్నము. భుజించు వేళ, భగవన్నివేదనముఁ దెచ్చు పరిచారకులు రానందున సుందరుఁడు భక్తులతో తపించుచుండెను.

శివుఁడు భిక్షాటన మొనర్చి యన్నమిడుట :—

కొండపై నుండు నోషధీశ్వరుఁడు సుందరుని క్షుద్బాధఁ దీర్పఁగోరి వైదిక బ్రాహ్మణ వేషధారియై భిక్షాపాత్రఁ గైకొని సుందరుని సమీపించి "ఓయీ! నీ వాకలితో నటమటలాడు చున్నాఁడవు. నేను నీకై భిక్షమెత్తి తెచ్చెద. నే వచ్చువఱ కిందే యుండునది" యని పలికి, తిరుక్కచ్చూరులోని వైదికుల యిండ్ల "భవతీ! భిక్షాందేహి" యని యడుగ గృహస్థులు విభూతి ప్రకాశముతో యజ్ఞోపవీతధారియై యెఱ్ఱనైన పద సరోజంబులతో వచ్చిన వైదిక శ్రేష్ఠుని గాంచి లేదనక యన్న మిడిరి. ఆ భిక్షాన్నముతో వచ్చి సుందరునిముందు నిలిచి "భక్తాగ్రేసరా! శాకపాకంబులతోడి యీ మధురాన్నము భుజింపుము" అనెను. అతఁడా వైదికుని ప్రేమకు వందన మాచరించి భక్తులతో నారగించుచుండ వైదికుఁ డంతర్ధానముఁ జెందెను. సుందరుఁ డాతనిఁ గానక "పరమేశా! యీ దాసునకై యీ నట్టెండలో భిక్షమెత్తి కాపాడిన నీ కరుణను నే నెట్లు పొగడఁగలాఁడ..." అని వేవిధముల స్తుతించి యానంద బాష్పములతో సాష్టాంగ ప్రణామము లొనర్చెను.

కాంచీపురమున స్వర్ణమునందుట :—

పిదప సుందరమూర్తి యోషధీశు ననుమతినంది బయలు దేఱి, యనేక శివస్థలములందలి ముక్కంటికి వందనమాచరించి పద్యమాలికల నర్పించుచు నేకామ్రేశ్వరుని సదావాసమగు

కాంచీపురిని సమీపించెను. కాంచీపురియందలి భక్తులు తిరువెణ్ణైనల్లూరులో శివునిచే దాసునిగా గ్రహింపబడిన సుందరుఁడు వచ్చు వార్తను విని సంతసమున పురము నలంకరించి పూర్ణ కుంభములతో ధూపదీపములతో భవనములను సుగంధ వాసితములఁజేసి. తిరునావలూరు సుందరున కెదురేఁగి భక్తి మ్రొక్కి యాహ్వానించిరి. సుందరుఁడు వారికిఁ బ్రత్యభివాదన మాచరించి గగనమంటు ప్రాకారములను గోపురముల నధిగమించి, యేకామ్రేశ్వరు నాలయముఁజొచ్చి ప్రదక్షిణత్రయ మాచరించి లోని కేఁగి, గర్భాలయముఁజొచ్చి శిరమున కరముల గీలించి శ్రీ కామాక్షీ సేవితుఁడగు నేకామ్రనాథునిఁ గాంచి ప్రణమిల్లెను.

భక్తి భావాతిశయమునఁ బరవశుఁడై పాడి స్తుతించెను. పిదప నా నగరమందు వసించి యహరహము నేకామ్రనాథుని సేవించుచు పద్యమాలికల నర్పించుచు నొకనాఁడు స్వర్ణమునకై ప్రార్థించి యిచ్ఛాపూర్తి నందెను.

అటనుండు కాలమున తిరుకచ్చికావదమును దర్శించి వచ్చెను. పిదప తిరునంగాట్టూరున కేఁగి జన్మదుఃఖ నివారణమునకై ప్రార్థించి, తిరుమాక్వలూరు, తిరువల్లములను గాంచి మేఘములు సంచరించు శిఖరములుగల శ్రీ కాళహస్తిని చేరెను. కన్నప్ప దుఃఖముఁ బోఁగొట్టిన శ్రీ కాళహస్తీశ్వరునకు మ్రొక్కి కన్నప్ప కొండ నెక్కి తిన్నని సేవను పొగడుచు పద్యములు

చెప్పి యట కొన్ని దినంబు లుండెను. పిదప అటనుండియే భ్రమరాంబా మల్లికార్జునుల నిలయమగు శ్రీశైలమును కేదారము మొదలగు స్థలములను ప్రత్యక్షముగఁ గాంచినటుల భావించి మ్రొక్కి పదిహములఁ బాడెను.

తిరువొత్తియూరుఁ జేరుట :—

శ్రీ కాళహస్తిలోఁ గొన్ని దినములు గడపి పిదప సుందరుఁడు తరంగ ఘోషములతో నిండి ధరణికిఁ దిగిన శివలోకమో యన నుండు తిరువొత్తియూరుఁ జేరెను. అచటి భక్తులు సుందరుని రాకను విని, వీథులందు అరఁటి స్తంభములను క్రముక వృక్షములను నిలిపి సుగంధ జలములను చల్లి పూర్ణకుంభములనిడి, యా భక్తవరేణ్యున కెదురేఁగి యాహ్వానించిరి. మంగళవాద్యములు ఘోషింప దేవకాంతలు పూవులఁ జల్లుచుండ, నాట్యకత్తెలు నటనమాడ, సుందరుఁడు భక్తులతో నగరముఁ బ్రవేశించెను. భక్తుల జయజయధ్వానములు సాగరఘోషము నధఃకరించుచుండ నతఁడు త్యాగేశునాలయ ద్వారముఁ జేరెను. గగనమునకు మానదండమో యన విలసిల్లు గోపురమునకు మ్రొక్కి యాలయమును వలగొని, హృదయము ద్రవింపఁ గరములను శిరమున గీలించి, త్యాగేశునకు సాష్టాంగ మాచరించి మధురగీతములతో వినుతించెను. పిదప నచట నివసించుచు షట్కాల పూజావసరములందు నీశుని దర్శించుచు, మధురగీత మాలికల నర్పించుచుండెను.

శంగిలియారు చరితము :—

పార్వతి చెలియగు అనిందిత శివుని కరుణచేఁ గైలాసము వీడి న్యాయరు గ్రామమున వేళాలకులమున శీలవంతుఁడగు న్యాయరుకిళారను కర్షకున కేకైకపుత్రికగా జనించెను. ఆమె శంగిలియారను పేరున నొప్పుచు భవానీపద సరోజములను మఱువక పూర్వజన్మ వాసనావాసితయై భక్తితో స్మరించుచుండెను. క్రీడలలోఁగూడ భవుని సేవించుచు యౌవనవతి యాయెను. ఆయువ సౌందర్యము లోకోత్తరముగ నుండె. లోకులామె దేవభావముఁ దలఁచి ముగ్ధులగుచుండిరి. రంభాద్యప్సరో వనితలను మించి యామె యందము నవనవోన్మేషము నందుచుండెను.

తండ్రి యామె వయఃపరిణతిం గాంచి, భార్యతో "మన శంగిలియారు సద్గుణరాశియై పెండ్లియీడు నందినది." అన నామె "మన కులగోత్రములకుఁ దగిన వరుని వెదకి పెండ్లిగావింపుఁడు" అనెను. ఆ మాటలు వినుచుండిన శంగిలియారు "వీరిట్లాడుట తగదు. నేనొక శివభక్తునకుఁ దగినదానని వీరెఱుఁగకున్నారు. శివుని కరుణాపాత్రుఁడు గానివాఁడు నాకు భర్త గాఁజాలఁడు," అని తలంచుచు మూర్ఛిల్లెను. తండ్రి కలఁతపడి యేమి సంభవించె? నని దురపిల్లుచు శీతలోదకములను మోముపైఁజల్లఁ గొంతవడి కామె మూర్ఛనుండి తేఱెను. తండ్రి "కుమారీ! ఇట్లేలయైతివి?" యన నామె "మీరు నా వివాహముఁగూర్చి మాటలాడితిరి. నేను శివభక్తేతరుని పరి

ణయ మాడఁజాలను. నేనిఁక త్యాగేశు నమ్నసరింతు" నని పల్కెను. ఆనాఁటినుండి శంగిలియారు తలిదండ్రు లామె మాట లొరులెఱుంగని విధమున దాఁచియుంచిరి.

అపుడు సన్నిహిత బంధువులలో నొకఁడు శంగిలియారు భావము నెఱుఁగక యామెను పెండ్లియాడఁగోరి కులవృద్ధుల నామె తండ్రికడ కంపెను. వారు కన్యనడుగ న్యాయరుకిళారు యుక్తియుక్తముగ మాటలాడి వారిని పంపివైచెను. పెద్దలు నిరాశాహతులై పోవునప్పటికి నా వరుఁడు భక్తురాలి కపకార మొనర్చినవానివలె యమసదనమున కేఁగెను. శంగిలియారు తండ్రి యా వార్తనెఱింగి "జీవింప గోరువారు శంగలియారు వివాహ విషయముఁ బల్కరాదని విధినియమేమో! లోకు లీ విషయమెఱుఁగ శివుఁడిటు చేసెనేమో" అని భావించి కుల వృద్ధుల కా సంగతిఁ దెల్పెను. వారు శంగిలియారు దైవాంశ సంభూతురాలని భావించిరి. శంగిలియారు శివస్మరణలో నిమగ్నురాలాయెను. తలిదండ్రు లామె మనోభావ మెఱింగి యామెను తిరుఒట్రియూరుఁ జేర్ప నిశ్చయించిరి.

ఒకనాఁడు తలిదండ్రులు బంధువులు శంగిలియారుఁ గాంచి "నేఁటినుండి నీవు కన్యకామఠమున నివసింపుము" అని పల్కి యామెను తిరుఒట్రియూరునకుఁ గొంపోయి కన్యకా మఠము నొకదానిని నిర్మించి, భోజనాది వసతులఁ గల్పించి "అమ్మా! నీవిట శివుని సేవించుచుండుము" అని మ్రొక్కి కన్నీరు కాల్వలుఁగట్ట నేడ్చి యామె నచట విడిచిపోయిరి.

పరమశివ పాదారవింద సేవాసక్తయగు శంగిలియారు అహరహము పూజావసరములం దాలయమున కేగుచు, పుష్ప మండపమున తెరగట్టించి యందు చెలులఁగూడి పూర్వము తాను కైలాసమున నొనర్చుచుండిన మాలాకార వృత్తి నవలంబించి యయ్యాయి కాలములందు శివున కలంకరింపఁదగు మాలికలను చిత్రవిచిత్రముగ కలానైపుణ్యముతోఁగూర్చి యర్పింప సాగెను.

సుందరుఁడు శంగిలియారుఁ గాంచుట :—

శంగిలియా రివ్విధమున సేవించుచుండు కాలమున నొక నాఁడు సుందరమూర్తి త్యాగేశుని సేవింప నాలయమునకు వచ్చి త్యాగేశునకు మ్రొక్కి పద్యమాలిక నర్పించి, భక్తుల వివిధ సేవలఁ గాంచుచు పుష్పమండపముఁ జొచ్చెను. అట ప్రేమయే దారముగ పంచాక్షరినే పుష్పములుగ భావించి శివుని స్తుతించుచు మాలికలఁగట్టు భక్తులఁగాంచి సుందరుఁడు వందన మాచరించి పోవుచుండఁ దాఁ గట్టు మాల పూర్తియగుటఁ దెర దొలఁగించి వెలికి వచ్చుచు తన్నుఁ గాంచి మెఱపు మొయిలు సొచ్చినటుల తెర వెనుక కేఁగిన శంగిలియారుఁగాంచి జన్మాంతరవాసన గుభిల్లుమన సుందరుఁడు చలించెను. రమ్యమైన వానిఁ గాంచియు, మధుర శబ్దములను వినియు, జనుఁడు సుఖుఁడయ్యు పర్యుత్సుకుండగు. భావమందు స్థిరమైన జన్మాంతర సౌహార్దములను మనంబునఁ దలంచుటయే యాతని యాత్సుక్యమునకుఁ గారణమని కాళిదాసు నుడివెనుగదా!

దారమునఁ గూర్పని ముత్తియము, తుమ్మెదలానని పుష్పమునగు శంగిలియారుఁ గాంచిన సుందరుని మనము కళ్లెము తెగిన యశ్వమువలె పరుగిడసాగెను. అతఁడు పుష్పచాపుని బాణ పరంపరకు గుఱియయ్యె. ఆ కుసుమాయుధుని దెబ్బల కోర్వలేక యతఁడు వెలికి వచ్చి యచటివారిఁ గాంచి "బంగారమునఁ బొదిగిన రతనమువలె, బాల చంద్రరేఖవలె, మెఱపు తీఁగయోయన మెఱసి, నా మనంబుతోఁబాటు తెరలోని కేఁగిన కాంతామణి యెవతె" యని యడిగెను. వారు "ఆమె శివపాదారవింద సేవాసక్తయగు శంగిలియారను కన్యక" యని తెల్పిరి. అంత సుందరమూర్తి "మన్మథాంతకు డిరువురిపై కరుణఁ జూపి యీ జన్మలఁ బ్రసాదించెను. ఒకతె పరవియారు. వేఱొకతె యీమె. ఈమె నా జీవమును పూవులతోఁ జేర్చి బంధించినది. శివుని కరుణతో నీమెను పొందెద"నని మరల శివాలయములోని కేఁగెను.

శంగిలియారు నిమ్మని శివు నర్థించుట:—

సుందరుఁడు త్యాగేశునకు సాగిలపడి మ్రొక్కి చేతులు జోడించి "త్యాగేశా! వామభాగమునఁ బార్వతిని శిరమున గంగను దాల్చియున్నాఁడవు గావే! పుష్పమండపమునఁ బుష్పమాలాకారిణియై నిన్ను సేవించు నీ శంగిలియారును నా కొసఁగి నా తాపముఁ దొలగింపరాదా!" అని వేఁడి వెలికివచ్చి "శివా! నీ దాసుఁడనగు నాకీ తలఁపుఁ గల్గినది. ఇది నీ సేవాభాగ్యమే. నా హృదయమున నిట్టి సంచలనము గలుగ హేతువేమో!

కరుణించుము" అని తలంచుచు నుండెను. అపుడు వివస్వంతుఁడు సుందరుని మనస్తాపముఁ గాంచఁ జాలనివానివలె పశ్చిమాద్రిఁ జేరెను. చంద్రోదయ మాయెను. అంత సుందరుఁడు 'శివుఁడు నాపైఁ గరుణించునా! యా దాసురాలి నొసఁగునా!' యని దుఃఖింపసాగెను. అపుడు శివుఁడు సుందరున కక్షిగోచరుఁడై "దాసబాలా! తపస్వినియగు శంగిలియారును నీ కొసఁగుచున్నాను" అని పలికెను. సుందరుఁడు "ఆనాఁడు తిరువెణ్ణైనల్లూరులో నన్ను దాసునిఁగ గ్రహించి ఇంత గొప్పఁదనము నాపాదించితివి. ఇపుడు నా జీవములను నిల్ప నీమె నొసఁగి కరుణించితివి. నీ దయ నేనెట్లు పొగడగలను?" అని పలికి యా భక్తావన దీక్షితున కెఱఁగెను.

శివుఁడు శంగిలియారు స్వప్నమునఁ దోఁచుట:—

త్యాగేశుఁడట్లు సుందరునకు సంతసముఁగూర్చి, విప్రవేషధారియై యర్ధరాత్రమున కన్యకా మఠమున శంగిలియారు స్వప్నమునఁదోఁప యామె మ్రొక్కి "దాసురాలిపై కరుణఁ జూపితిరి. దేవర కేమి సేయఁగలదాన" నని పల్కెను. శివుఁ డంత "తపస్వినీమణీ! సమధిక తపశ్శాలియు మాకు దాసుఁడు నగు సుందరుఁడు నిన్నుఁగోరి నన్ను యాచించుచున్నాఁడు. నీ వా భక్తుని పాణిగ్రహించి సుఖింపుము" అన నామె మ్రొక్కి "దేవా! మీ రనుగ్రహించిన భక్తవతంసునకు నేఁదగిన దానను. కాని నన్నాతఁడు పెండ్లియాడినను తిరువారూరును

మఱచునా! దీనిఁదలఁచి కరుణింపుఁడు" అని విన్నవించెను. త్యాగేశుఁడు శంగిలియారుఁగాంచి "సుందరుఁడు నిన్ను వీడ కుండ శపథమొనర్పఁ జేసెదను" అని పల్కి, సుందరుని సమీ పించి "ఓయీ! నీవు శంగిలియారుం గోరుచో నామెను వీడ కుండునట్లు శపథ మొనర్పవలయు" ననెను. అతఁడు "దేవాది దేవా! మీయానతి శిరంబునఁ దాల్తును. ఎట్లేని యిక్కా-ర్యము సాధించి దాసుని ధన్యుని గావింపుఁడు" అన త్యాగే శుఁడు నవ్వి "శపథ మొనర్పఁదగిన వాఁడవు నీవు. నే నిందేమి చేయనగును?" అనెను. అంత సుందరుఁడు "అనేక స్థలము లందు భక్తుల ననుగ్రహించిన నీ రూపముఁగాంచ నభిలషించు నా కీ శపథము మహదవరోధమగును గదా! దేవా! నేను శంగిలియారు వెంటవచ్చి నీ యెట్టయెదుట శపథమొనర్చు వేళ దేవర స్వస్థానము వీడి యాలయము వెనుకనున్న పొగడచెట్టు కడ కేఁగ వలయు" నన శివుఁ డట్లే యనెను.

ఆ జటాధారి సుందరునికడ యొక క్రీడఁజూపఁదలఁచియో శంగిలియారు నర్చన సేవాతిశయముఁ దలఁచియో వెంటనే యామెను సమీపించి "పుత్రీ! సుందరుఁ డాలయములో శపథముచేయుదు ననును. నీ వట్లుగాదు పొగడచెట్టుకడ చేయుము అనుము" అని పల్క నామె "బ్రహ్మేద్యగమ్యా! తండ్రీ! ఈ రహస్యముఁ దెల్పి నన్ను దాసురాలినిగ గ్రహిం చితిరి. నా భాగ్య మేమనందు" అని యానంద బాష్పములను విడచెను. శివుఁడా స్థలమును వీడెను. వెంటనే యామె చెలు

లను లేపి తన్ను శివుఁడు కరుణించిన విధము నంతయుఁ దెల్పెను. వారు సంభ్రమాక్రాంతలై యామెకు మ్రొక్కిరి.

సుందరుని శపథము :—

సుప్రభాతమునకుఁ దగిన మాలికలఁగూర్ప సమయ మాయెనని శంగిలియారు చెలులతో నవ్వాని సిద్ధపఱచి వారితో నాలయములోని కేఁగెను. సుందరమూర్తియు శివాజ్ఞ ననుస రించి లోనికేఁగి శంగిలియారు రాక కెదురు సూచుచుండెను. మెల్లమెల్లఁగ పదములిడుచు వచ్చు నామెను సమీపించి పర మేశ్వరుఁడు దయతో తనకుఁ దెల్పిన వార్తలను చెప్పెను. శివు నాజ్ఞను సమ్మతించిన శంగిలియారు మాఱుపల్కక చెలులతో లోనికేఁగెను. అంత సుందరుఁడు వారి నుద్దేశించి "లతాంగు లారా! నేనీ వనితామణిని వివాహమాడి యీ యూరిని వీడి పోనని శివునాజ్ఞచే శపథమొనర్పఁ దలఁతిని. మీరు శివసన్ని ధానమునకు రండు" అనెను. వారంతకుముందే శంగిలియారు వలన వృత్తాంత మెఱింగినవారు; కాన ఆ చెలులు "మహాత్మా! శివునకుముందు శపథము సేయరాదు" అనిరి. సుందరుఁ "డట్లగుచో నేనెచట శపథమొనర్చవలయు" ననెను. వారు "పొగడచెట్టుకడ" అనిరి. ఆ పల్కులు సుందరుని విభ్రాంతు నొనర్చెను. వారి యభీష్టము నొనర్పనిచో కార్యము చెడు"నని "అట్లే యొనర్తు రండు" అని పల్కి వారితో వృక్షముఁజేరి మువ్మాఱు ప్రదక్షిణ మాచరించి "తిరుఒత్రి

యూరును వదలి నేనెచటకు నేగను" అని శపథ మొనర్చెను. శంగిలియా రాతని ప్రతినను విని "నేనెంత పాపిని. ఈతని శపథమునకు నేఁ గారణమైతిఁ గదా" యని చింతించెను. సుందరుఁడు వారిని వీడి యాలయముఁజొచ్చి మ్రొక్కి "దేవా! నీ కరుణాస్వభావ మెంత సొగసుగ నున్నది" యని పల్కి శివుని మనంబున ధ్యానించుచుండెను.

శంగిలియూరు కల్యాణము:—

త్యాగేశుఁ డా యిరువురి వైవాహిక కృత్యము నెఱవేర్పఁబూని యయ్యూరనుండు భక్తులకలలోఁ గన్పించి" మీరు శంగిలియూరునకు సుందరునకు విధ్యుక్తముగఁ గల్యాణముఁ గావింపుఁడు" అని యానతి నిచ్చి యంతర్ధానమందెను. వారు శివునాజ్ఞఁ దల దాల్చి సకలవస్తువులను సిద్ధపఱచి మంగళవాద్యములు మ్రోఁగుచుండ వారిరువురకు కల్యాణ మొనర్చిరి. సుందరుఁడు దివ్యకాంతలను మఱపించు నా దివ్య సుందరియగు శంగిలియూరుఁ జేపట్టి యామె యందమును కన్నులారఁ గ్రోలుచు, నామె మధురవాక్కులకు సొక్కుచు, ప్రణయ కలహానంతర సుఖభోగాదులచే నొడలు మఱచుచుండెను. కాని యతఁడు శివుని పాదపద్మములను మఱువక శివానందాబ్ధిలో మునింగి యుండెను.

సుందరుఁడిట్లు లౌకిక సుఖభోగాసక్తుఁడై యుండ మధుమాస మేతెంచెను. అగస్త్యాద్రినుండి మెల్లఁగ చల్లఁగ మలయ

మారుతము వీవసాగెను. ఆ పిల్లగాలులు దక్షిణదిశయందలి చందనోద్యాన వనములఁజొచ్చి యతిశీతల చంధన గంధ వాసనా వాసితంబులై సెలయేటి నీటితుంపురులఁగూడి వీతెంచి దంపతుల మనంబులఁ గలఁతపఱుప సాగెను. ఆ గాలి సోఁకగనే సుందరునకు తిరువారూరులో నక్కాలమున జరుగు వల్మీక నాథుని వసంతోత్సవము కన్నులకుఁ గట్టినట్లుండెను. ఆ యుత్సవ సమయమున పరవయా రొడలుమఱచి చేయు నాట్యము భక్తులతో మున్ను తానా యుత్సవమునఁ బాల్గొనుటయు స్మరణకు రా వల్మీకనాథునకు దూరుఁడనైతినే యని దుఃఖించెను. "తిరువారూరు వల్మీకనాథా! నిన్నెన్నాళ్లు విడచియుందు? నా దైవమా..." (ఎత్తనై నాళ్ పిరిందిరుక్కేన్ ఎన్నారూర్ ఇఱైవనయే...) అను పదిహాముఁ బాడెను.

వల్మీకనాథ దర్శనోత్సుకత క్షణక్షణ మతిశయింప నిలువఁజాలక త్యాగేశు నాలయమున కేఁగి భక్తితోఁ బ్రణమిల్లి యా యూరును విడిచిపో నుద్దేశించి యెల్లనుదాఁటి యడుగిడెను. శంగిలియారునకుఁ దాఁజేసిన శపథాతిక్రమణ దోషము ఆవహిల్ల సుందరుని దృష్టి నశించెను. కన్నులు గానక మూర్ఛనంది యేమిసేయఁదోఁపక చలించెను. తనతప్పునెఱిఁగి "ఈ మనిన దేహము" అను పదిహాముఁబాడి శివుని దాసుని తప్పు మన్నింపుమని వేడెను. ఎంత వేడినను ఫలితముఁ గానక తిరువారూరే శరణ్యమని భక్తులు దారిసూప పయనించుచు తిరుముల్లైవాయిలిని చేరి యచటి శివునకు మ్రొక్కి "శంగిలి

యూరునకై నా కన్నులు దీసితివి. ఈ దాసుని దోషమును మన్నింపరాదా..." యని పాడి తిరువెణ్బాకమునఁ జేరెను. అచటి దేవదేవునకు వందనమాచరించి "సా ప్రభు వీ యాలయమున నున్నాఁడో..." అను పదిహముతో స్తుతించెను. అంత శివుఁడు "మేమున్నాము" అని పల్కి యతనికి నూఁతగనుండుటకై చేతికఱ్ఱ నొకదానిని ప్రసాదించెను. "ఇచట శివుని కరుణ యింతియ యని యతఁడు భావించి పయనమై కారైక్కాలమ్మయారు శిరముతో నడచిన స్థలమగు తిరువాలంగాడును చేరి "భస్మాభ్యక్తదేహా! ముక్తిప్రదాతా! భవరోగ నివారకా!" యని నుతించి కాంచీపురమున కేఁగెను.

సుందరుఁడు వామనేత్ర దృష్టి నందుట:—

నందనోద్యానావృతమగు కాంచీపురిలో దయతో జీవులను రక్షించుచు ధర్మమును పోషించు కామాక్షీదేవిని దర్శించి సుందరుఁ డా జగన్మాతకుఁ బ్రణమిల్లి పిదప అనాదినిధనుఁడగు నేకామ్రనాథున కేటికోళ్లు సమర్పించి "దేవా! హాలాహలమును మ్రింగి దేవతల కమృత మొసఁగితివిగదా! కామార్తుఁడనై నైచ్యవర్తనకు దిగిన నా దోసమును మన్నింపరాదా! మన్నించి కరుణించి, యీ దాసుఁడు నిన్ను కన్నులారఁగాంచు భాగ్యము నొసంగవే" యని ప్రార్థించెను. "నీవు ముక్కంటివై యుండ నేను కన్నులు లేనివాఁడనై యుండుటను నీ వోర్వఁగలవా! తండ్రీ!" యని వాపోయెను. శ్రీ కామాక్షీప్రియుఁడు భక్తుని మొఱనువిని మన్నించి యెడమకంటిచూపు నొసఁగి తన

దివ్యరూపము గాంచు భాగ్యమును సుందరున కొసంగెను. పరమేశ్వరుని కృపచే నొక కన్నైన లభించెఁగదా యని యాతఁడానంద పరవశుఁడై యాడిపాడి స్తుతించెను. పిదప నా కామకోటను వీడిపోవుచు "వల్మీకినాథు నెపుడు గాంతు" నని పాడుచు తొండమండలమునుదాఁటి చోళదేశముఁ బ్రవేశించి "తిరునెల్వాల్, ఆరత్తురై, దర్శించి కావేరియందు గ్రుంకులిడి తిరువానడుదురైను చేరెను. ఆక్షేత్రవాసులు సుందరునకు స్వాగత మొసంగ వారితో నాలయముఁజొచ్చి మ్రొక్కి "గంగాధరా! ఒక కన్ను లేదు. ఇట నాకు బంధువు లెవరు?" అను పద్యమాలిక నర్పించి తిరుత్తూరి కేఁగి అచటి హైమవతీపతికి వందన మాచరించి "ఈ దాసుని వ్యాధిని నివారింపు" మని వేఁడెను. "ఇచటి కొలనిలో స్నానమాడుము" అను అశరీరవాణిని విని యట్లే యొనర్చి నీరోగియై వెలికివచ్చి కైలాసపతిని వినుతించి పయనమై తిరువారూరుఁ జేరెను.

సుందరమూర్తి దక్షిణనేత్ర దృష్టి నందుట :—

సుందరుఁడొక కంటితో తిరువారూరును గాంచి, వసుధపై వ్రాలి మ్రొక్కి నిట్టూర్పులు విడచెను. ఉషఃకాలమున భక్తు లెదురురా, వారిఁగాంచి నాయికానాయకభావముతో కవిత సెప్పి దేవాశ్రయ మండపముఁజేరి మ్రొక్కి యాలయములోని కేఁగి వల్మీకనాథుని గాంచి "దుఃఖసాగరమున మునిఁగి దరిగానకున్న దాసుని కరుణింపు దేవా! ఈ కుడికంటి నొసంగి నీ భక్తావన దీక్షను ప్రకటింపు దేవా!" యని దాసభావముతోఁ బాడి

మ్రొక్కెను. అపుడు వల్మీకనాథుఁడు తన ప్రియదాసుని కరుణించి దృష్టి నొసఁగెను. సుందరుఁడు దృష్టింబొంది మనోవాక్కుల కందరాని యానందముఁ బొంది నమస్కరించి యాడి పాడెను. వేయిసారులు మ్రొక్కులిడెను. కన్నులార దేవదేవుని దర్శించి బ్రహ్మానంద మందెను. యామపూజ ముగియువఱకునుండి యాలయమును వలగొని వచ్చి దేవాశ్రయ మండపమున నుండెను.

సుందరమూర్తి పరవయారును విడిచి తీర్థయాత్రాచణుఁడై యేఁగినపిదప నామె యాతని విరహము సహింపలేక కృశించెను. క్షణ మొకయుగముగఁ గడపెను. సుందరుఁడు శంగిలియారును పెండ్లియాడుటను విని దుఃఖించెను. పిదప దుఃఖము కోపముగ మాఱెను. ఆనాఁటినుండి యామెకు పూలసెజ్జ నిప్పులరాశి యాయెను. నిద్ర నశించెను. పరుండఁ జాలక యాసనమునఁ గూర్చుండలేక నడవనులేక యెచటకు నేఁగఁ జాలక వగలకు కొలువిచ్చెను. అది విరహబాధయా! క్రోధోద్రేకమా! అసూయయా! ఏమియో! ఎవరునెఱుంగని విధమున నామె తపించెను. ప్రియుఁడు పరాయత్తుఁడుగా నెవతె యోర్వఁగలదు? పరవయారు శోకసాగరమున మునిఁగి గృహకృత్యములందు విముఖయై గుండె వ్రీలునటుల దుఃఖించుకాలమున సుందరుఁడు తిరువారూరునకు వచ్చెను. అతని పరిజనులు యథాపూర్వ మామె సౌధములోనికిఁబోవ నామె వారింగాంచి సుందరునిపైఁ గోపమున వారి నిలువెడల నడచెను. వారిలోఁ

గొందఱు సుందరునికడ కేఁగి "అయ్యా! మీరు శంగిలియారును పరిణయమాడిన విషయమును పరవియారెఱిఁగి మమ్ము లోనికి రానీయక గెంటించినది" యని చెప్పిరి. సుందరుఁడు వారి మాటల నాలించి కళవళ మంది "ఇఁక దీనికి నుపాయ మేమి?" యని చింతించి లోకజ్ఞులైన కొందఱి నామె కోపము నివారింపఁ బంపెను. వారు పరవియారుఁగాంచి, "అమ్మా! నీ సచ్ఛీల మున కిది తగునా? కోపముతో నాథునిత్రోసిరా జనుట న్యాయముగాదు." అని యనేక లోకోదాహరణములఁ జూపి సుందరునిఁ బ్రియమార నాహ్వానింపుము" అని చెప్పిరి. అగ్నిలో నాజ్యము పోసినటుల వారి మాటలు ఆమె కోపము నినుమడింపఁ జేసెను. ఆమె దుఃఖముతో నెలుఁగురాల్పడ "అయ్యలారా! నాకింతవంతఁ గూర్చిన సుందరుని మాట నా కడ నెత్తకుఁడు. మీరిఁక నేమేని పల్కిన నా ప్రాణములు నిలువవు. మీరు వచ్చిన దారిఁ బొండు" అనెను. వారు భీతితో వెడలి సుందరున కా విషయముఁ దెల్పిరి.

పరవయారు మాటలను వినిన సుందరుఁడు మిక్కిలి సొక్కెను. తన్నా దుఃఖసాగరమునుండి తరింపఁజేయువా రెవరా యని యా యర్ధరాత్రమున చింతాక్రాంతుఁడై యుండ నతని వెంట నుండువారు గాఢ నిద్రాముద్రితులైరి. రాత్రి పూజలు ముగియుటచే జనసంచారము లేకుండెను. రాత్రించరులు సంచరించు నా యర్ధరాత్రమున సుందరుఁ డొక్కరుఁడే మేల్కని యుండెను. అపుడతఁడు శివునిఁ దలఁచుచు "దేవా! నన్ను

బాల్యమునందే దాసునిగ గ్రహించితివి. జన్మాంతరఫలముగ నన్నుఁజేరిన పరవయారు నన్నే తిరస్కరించుచున్నది. ఆమె నన్నాదరించునట్లు చేయ వేఁడెద. ఈ నిసియందే కరుణఁ జూపి పరవియారు కోపము నివారించిన నా జీవములు నిలుచును. లేకున్న తొలఁగును'' అని దీనముగ ప్రార్థించెను. భక్తుల బాధను కొంచెమైనను సహింపని భవుఁడు తన ప్రియ భక్తుని మనస్తాపముఁ బోఁగొట్టకుండునా! బ్రహ్మాదుల కగమ్యములగు పదసరోజములను వసుంధరపై మోపి సుందరుని కడకా కరుణాసముద్రుఁ డేతెంచెను.

సుందరుఁడు తన్నుద్ధరింప నేతెంచిన వల్మీకనాథుఁ గాంచి సంతసించి పులకాంకితుఁడై మ్రొక్కి స్తుతించెను. శివుఁడు సుందరునిఁ గాంచి, ''నీకేమి సంభవించె''నన ''నేనే యొనర్చిన తప్పిదమిది: దాసుఁడు దోషియైనను క్షమించుట దేవర ధర్మము. నీ కరుణచే నేను తిరుఒట్రియూరులో శంగిలియారుఁ బెండ్లియాడిన వార్త పరవయారెఱిఁగి నాపై కోపించి యున్నది. నేనామె యింటిని మెట్టిన ప్రాణములను విడుతు ననుచున్నదఁట. నేనేమి సేయఁగలాఁడ? తల్లియు దండ్రియు గురువు మిత్రుఁడు నాకు మీరే. దాసుని మన్నింపఁ దలంచిన దేవర యీ నిశియందే పరవయారుఁ గాంచి యామె కోపమును తీర్పవలయునని ప్రార్థించెద''నని కన్నీరు మున్నీరుగ దేవదేవుని పాదములపై వ్రాలెను. ప్రేమమూర్తియగు భవానీపతి భక్తునియార్తిఁ దీర్పఁదలఁచి ''పుత్రా! దుఃఖింపకుము.

పరవయారుకడకు నీ దూతనుగ నేగి కార్యము సాధింతు'' ననెను.

శివుని చాతుర్యము :—

దేవహితార్థమై హాలాహలమును మ్రింగిన నీలగళుఁడు సుందరునకు దూతగ పరవయారు నింటికేఁగెను. దేవాశ్రయ మండపములోని భూతగణనాథులు, మహర్షులు, యోగులు శివునకు ముందు పోయిరి. నందీశ్వరునితో కుబేరాదులు వెన్నంటిరా, రాజమార్గము ననుసరించి పోవ నా గంగాధరుని జటాబంధములోని నాగరాజులు పడగలు విప్పి యాడెను. చంద్రచూడుని శిరమునఁగల చంద్రుని పార్శ్వమునఁగల మందార పుష్పములందలి భ్రమరములు ఝుంకారము లొనర్చుచు నేఁగెను. వెంటవచ్చినవారిని ముంగిట నిల్పి శివుఁడు వైదిక బ్రాహ్మణవేషముఁ దాల్చి యొంటరిగఁ బోయి ''పరవా! తలుపు దీయుము'' అనెను.

నిద్రలేక మేల్కొని విరహాగ్నిచే ఁ మ్రగ్గుచున్న పరవయారు శివభక్తుఁడెవఁడో పిలుచుచున్నట్లున్నది. ఈ నట్టనడు రేయి వచ్చుటకుఁ గతమేమో అని తలఁచుచు వచ్చి ద్వారముఁ దెఱచి యా వేషధారిని గాంచి మ్రొక్కి ''లోకమంతయు నిద్రించు నికాలమున నిచటికేల వచ్చితిరి?'' అని ప్రశ్నించెను. అపుడాతఁ డామెను గాంచి ''నారీరత్నమా! నామాటలు త్రోసిపుచ్చక యంగీకరింతువేని చెప్పెద''నని ఆమె ''తాము

వచ్చిన కార్యము తెలియక నేనెట్లు మీకు సమ్మతిఁదెల్పఁ గలను? అది తెలిసిన నంగీకరింపఁ దగినదియగుచో నట్లే యొనర్తు” ననెను. అపుడతఁడు “వనితామణీ! సుందరు నిచటకుఁ జేర్చుటయే నాపని” యనెను. అంత నామె “మేలు మేలు. నా దౌర్భాగ్య మిట్లున్నది. సుందరునికై యెదురు సూచి కన్నులు కాయలు గాచినవి. అతఁడు వేఱొకతెఁ బ్రేమించి పెండ్లి యాడెను. అట్టివానికి నాతో పనియేమి? దీనికై దేవర వచ్చుట మేలుగాదు” అనెను. అంత నతఁడు “సుందరీ! సుందరుని మన్నించి స్వీకరింపుమని తెల్పుటకే కదా నా రాక. వృద్ధుఁడనైన నా మాటవిని కోపము వీడి యాతనిఁ బరిగ్రహింపుము. మముఁబోటి వారిమాటత్రోసి రాజనఁ జనదు” అని పల్క నామె భగ్నభ్రుకుటియై “మీరు నా యింటికివచ్చి యిట్లాడుట తగదు. తిరుబట్టియూరును విడువ ననిన సుందరుని నే నంగీకరింపఁ జాలను. దయయుంచి మఱుమాటాడక వెడలి పొండు” అని కవాటము బంధించెను.

శివుఁడు లోన నవ్వికొని సుందరుని యావేగముఁగాంచ దలఁచి తన నిజరూపము నామెకుఁ జూపక సుందరునికడ కేఁగెను. శివుఁడు కార్యము సాధించివచ్చునని భావించిన సుందరుఁడు “నే నెంత దుష్కార్య మొనర్చితిని. మతివి హీనుడనై ప్రియురాలి ననునయింప పరమశివుని దౌత్య మొనర్ప వేఁడితి”నని దుఃఖించెను. “ఎట్లు నా నాథుఁడామెను తేర్చగలఁడో! యేమిచేసెనో! శివుని మాటను కాదనఁగలదా?

నా వంత నెఱిఁగిన శివుఁ డూరక తిరిగి రాఁడు" అని పరిపరివిధ ములఁ దలపోయుచు శివుఁడు వచ్చుచున్నాఁడని కొంతదూర మేఁగును. కానక నిట్టూర్పులు విడుచుచు వెనుదిరుగును. ఏమియుఁ దోఁపక నిలుచును. శివుఁడింకను రాఁడాయెనే యని పరితపించును. మూరుని తూపుల కారికి తాళలేక యొదిగి నిలుచును.

సుందరుఁడిట్లనేక విధముల వెతలొందుచుండ శివుఁడు విప్రవేషమును వీడి దిక్కులను తనదివ్య తేజముతో వెలిఁగించుచు వచ్చెను. సుందరుఁడు శివునిఁగాంచి కట్టను త్రెంచుకొని పాఱు నదీవేగమువలె సంతసము పొంగిపొరల నెదురేఁగి మ్రొక్కి, శివుని మోమున గన్పించు చిఱునగవునుగాంచి యది యాతని క్రీడగ నెఱుఁగక కోసముఁ దీర్చి వచ్చెనని తలంచి "దయామయా! ఎంత మేలుచేసితిరి" అనెను. అంత నా మదనాంతకుఁడు "ఓయీ! నే నా భామిని కోపముఁదీర్ప నెంతయో యత్నించితి. కాని యా కోపన తిరస్కరించినది" అనెను. సుందరుఁ డా వార్తవిని వడఁకుచు "ఈ దాసునిపై దేవరకు దయలేదని యిపుడెఱిఁగితి. దేవతలు జీవింప విషముఁ దింటివి. త్రిపురాంతకుఁడవని ప్రసిద్ధిఁ గాంచితివి. మార్కండేయు నుద్ధరింప జముని కాలఁ ద్రొక్కితివి. ఇట్టి నీకు నీ దాసుఁడు కరుణింపరాని వాఁడని తోఁప తిరిగిరాక యేమిచేయుదువు? నన్నా నాఁడు దాసునిగ గ్రహించుట యెందులకు? పరవయారుకడకుఁ జేర్పకున్న నా జీవము నిలువదు. కరుణింపవా! పరాత్పరా!" యని శివుని పాదములపైఁబడి యేడ్చెను.

శివుఁడు మరల దూతగ నేఁగుట :—

పదసరోజములపై వ్రాలిన సుందరు నోదార్చి శివుఁడు మరల పయనమాయెను. సుందరుఁ డాతని వెంట కొంత దూర మనుగమించి వెనుదిరిగెను. వైదీక బ్రాహ్మణుఁడు పోయిన పిదప వచ్చినవాఁడు పరమశివుఁడే యై యుండునని పరవయారెటిఁగి భీతిగ్రస్తయై "అయ్యో! కాత్యాయి నీకాంతున కెదురాడితిని." అని చింతించుచు ద్వారము కడ నిలిచి యుండెను. అపుడు పశుపతి స్వరూపము తెలియునటుల భూతగణంబులతో వచ్చుచుండ నామె చూచి చకితయై వేగ ముగ నేఁగి యా దేవదేవుని పాదములపైఁబడి మ్రొక్కెను." శివుడామెనుగాంచి "సుందరప్రియా! పూర్వమువలె తిరస్క రింపక సుందరు ననుగ్రహింపుము" అన నామె కరములు ముకు ళించి "దాసురాలిభాగ్య మెట్టిదియో! దేవర శ్రమవహించి పాద తామరసములు కసుగంద నడచి వచ్చి నా గృహంబును పావన మొనర్చితిరి. మీ యాజ్ఞను తలఁదాల్ప కెల్లుందు" ననెను. అంత శివుఁడు "నారీశిరోరత్నమా! నీ శీలమునకుఁ దగినటుల పల్కితివి." అని మన్నింప నామె మ్రొక్కి గృహము లోని కేఁగెను.

భవునకు భక్తునిపైఁగల వాత్సల్యముఁగాంచి భూతగణము లాడి పాడెను. శిరమునందలి గంగాజలము తొణికిసలాడు చుండ వేగముగ శివుఁడు నడచి వ్యగ్రచిత్తుఁడైన సుందరుని సమీపించెను. సుందరుఁడు "దేవా! నన్ను వెతలపా లొన

రించు పరవయారునుండి యేమని వార్త దెచ్చితిరి" అన శివుఁడు "ఓయీ! ఆమె కోపము శాంతించినది. పోయి,సుఖముండుము" అనెను. సుందరుఁ డత్యానంద భరితుఁడై "దేవా! భోగ మోక్షముల నిచ్చు దాతవు నీవే యని లోకములఁ జాటితివి. ఇఁక దాసుఁడు జీవించె"నని మ్రొక్కెను. ఆర్తార్తిహరుఁడు "పరవయారునింటి కేఁగుము" అని పల్కి యంతర్ధాన మందెను.

సుందరుఁడు పరవయారు నింటి కేఁగుట :—

సుందరుఁడు శివుని కరుణాకృత్యముఁ దలంచి సంత సించుచు పరవయారు గృహంబున కరిగెను. పరిజను లాతనికి మ్రొక్కిరి. పరవయారు భవనము నలంకరింపఁజేసి దాసదాసీ జనములతో సుందరున కెదురువచ్చి స్వాగత మొసంగెను. ఆమె లజ్జాభయసంభ్రమములతో వినమ్రురాలై యాతని పాద ములకు మ్రొక్కెను. సుందరుఁడు తన మృదుహస్తములతో నామెను లేవనెత్తి యామె చేతిని గ్రహించి లోని కేఁగెను. ఇరు వురు దౌత్యము నడపిన శివుని మహిమను కీర్తించిరి. వారి మనంబు లొకటి యయ్యెను.

ఏయర్కోన్ కలికాముఁడు కుపితుఁడగుట :—

సుందరుఁడు కొంచెమైనను భీతిలేక శివుని నొక స్త్రీ కడకు దూతగ పంపెనను వార్తను కలికాముఁడు విని దుఃఖిం చెను. "నాథున కాజ్ఞ నిచ్చి దౌత్యము నడుపుమని దాసుఁడు

కోరుట తగునా! ఇట్లాచరించినవాఁడు దాసుఁడా? భక్తుఁడా! ఇది సహింపరాని దోషము. దీనిని వినిన నా జీవము పోకయున్నదే. ఒక కాముకుఁడు గోర వాని యభీప్సితముఁదీర్ప శివుఁడొక రాత్రియంతయు పాదములెటుపెక్క నాకాంత యింటికి నడచుటయా! బ్రహాదుల కగమ్యుఁడగు శివుఁడు దౌత్యమున కంగీకరించినను దాసుఁడు పరమేశ్వరున కాజ్ఞయిడుటయా! అట్లొనర్చిన పాపిని నేను చూచుట సంభవించిన నేమి యగునో!" యని కలికాముఁడు కోపముతో సంచలించెను.

భక్తాగ్రేసురుఁడగు కలికాముఁడు తనపై కోపించెనని సుందరుఁడు విని తాఁజేసినది తప్పని యెఱిఁగి ప్రత్యహము శివుని దర్శించుచు తనదోషమునకు పరిహారము దెల్పుమని ప్రార్థించుచుండెను. శివుఁడా సుందరుని ప్రార్థనను విని యా భక్తుల నొకటిగఁజేయ సంకల్పించి కలికామునకు భరింపరాని శూల వ్యాధిని కల్పించెను. అతఁడా వ్యాధితో బాధపడ సాగెను. అతఁడొకనాఁడు "దేవాదిదేవా! దీనిని నేను భరింపఁజాలను. కరుణింపుము" అని ప్రార్థించెను. అంత శివుఁడు "నీ వ్యాధిని సుందరుఁడే నివారింపఁగలఁడు. వేఱు విధమున నిది నశింపదు." అనెను. అంత కలికాముఁడు "తండ్రీ! మా పితృ పితామహాదులనుండి వంశ పారంపర్యముగ నిన్ను గొల్చుచున్నారము గదా! అట్టి యీ దాసుని బాధను క్రొత్తగా దాసుండైన యొకఁడు వచ్చి పోగొట్టు ననుట న్యాయమా! అతఁడు వచ్చి దీనిని నివారించుటకంటె నేను మరణించుటయే మేలు. మీ భావ

మెవరెఱుంగఁగలరు? అతనికింత గొప్పదనము గల్పించితిరి." అనెను. శివుఁడు మాటాడక యదృశ్యుఁ డాయెను.

అపుడు శివుఁడు సుందరునకుఁ గన్పించి "నేఁడు నా యాజ్ఞఁజేసి కలికాముఁడు శూలతో కృశించుచున్నాఁడు. నీవేఁగి యాతని బాధను తొలఁగింపుము" అని కరుణించెను. సుందరుఁ డా మహాదేవునకు మ్రొక్కి తన రాకను కలికాము నకుఁ దెలియఁజేసి బయలుదేఱెను. సుందరుని రాక వినిన కలికాముఁడు "దేవదేవుని దూతగఁబంపిన సుందరుఁడు రాక ముందే, నా యుదరముఁ జీల్చికొని జీవములతో వ్యాధిని పోకార్చుకొందు"నని తలంచి కత్తితో నుదరముఁ జీల్చికొని మరణించెను. కలికాముఁడట్లు మరణింప నతని సతి సహగమన మునకు నుద్యుక్తురాలగుచు, సుందరుఁడు వచ్చెనను వార్త విని దుఃఖమును దిగమ్రింగి భర్తృమరణవార్త బయలుపొక్క నీక గృహంబు నలంకరించి సుందరు నాహ్వానించెను. విధ్యుక్త ముగ నాతని నర్చించెను. అతఁ డామెను గాంచి "కలికాముని బాధను తొలఁగించి యాతనిఁ గలిసియుండ వచ్చితిని" అనెను. అంత నా సతి యాజ్ఞఁగొని యొక సేవకుఁడు "అయ్యా! కలి కాముఁడు లోన నిద్రించుచున్నాఁ" డనెను. సుందరుఁ డాతని గాంచఁదలఁచి లోనికేఁగి చూడ కలికాముఁడు ప్రేగులుతెగి రక్తపుమడుఁగులో మునిఁగియుండుటఁ గాంచి "ఇదియిట్లు జరి గెనా! నేనిట్లే యొనరింతు"నని కత్తిని చేఁబట్టెను. అంతలో పరమేశ్వరుని దయచే కలికాముఁడు నిద్రనుండి లేచినట్లు లేచి

సుందరుని హస్తముఁ బట్టి నతఁ డాతనికి మ్రొక్కెను. దేవతలు పుష్పవర్షము గురిపించిరి. వారొకరి నొకరాలింగన మొనర్చుకొని తిరుప్పుంగూరు కోయిలకేఁగి శివుని స్తుతించిరి.

సుందరుఁడు కలికామునితోఁ గొన్ని దినంబులుండి యాతనితో తిరువారూరునకు వచ్చి వల్మీకనాథుని సేవా నిమగ్నుఁ డాయెను. కలికాముఁడు సుందరునితోఁ గొంత కాలము గడపి యతని యనుజ్ఞ నంది స్వగ్రామముఁ జేరి శివసేవ సేయుచు చివరకు శివ శ్రీపాదములఁ జేరెను.

"భవుని భావము భక్తులకే యెఱుక."

## 30. తిరుమూల నాయనారు

కైలాసమున శివావాసమునకుఁ గావలియుండు గణములకు నధ్యక్షుఁడును, బ్రహ్మాదులకు శివతత్త్వము నుపదేశించు భాగ్యము గల నందిదేవునివలన నుపదేశము నందినవాఁడు, చతుర్వేద నిష్ణాతుఁడునగు శివయోగి యొకఁడుండెను. అతఁ డణిమాద్యష్టసిద్ధుల నందిన సిద్ధుఁడు. అగస్త్యుని మైత్రి నలరువాఁడగుటఁ జేసి యాతనితోఁ గొంత కాలము గడపఁ దలఁచి కైలాసమునుండి తమిళభాషకు స్థానమగు పొదియమలకు పయనమాయెను. మార్గమున నతఁడు కేదారేశ్వరునకు

మ్రొక్కి నేపాళ దేశమునందలి పశుపతీశ్వరునకు వందనం బాచరించి యవిముక్తక్షేత్రమగు వారాణసిఁ గాంచి విశ్వనాథుని స్తుతించి శ్రీశైలము, కాళహస్తి, తిరువాలంగాడు, కాంచీపురము, తిరువదిహావీరస్థానములను సేవించి చిదంబరముఁ జేరెను. సంతసముతో కనకసభలో నటరాజు తాండవముఁగాంచి కావేరీ నదిని దాఁటెను. చంద్రకళాధరునకు నమృతమీయక విషమొసఁగిన సముద్రమును తన మధుర జలములతో నింపక తీరభూములను సస్యశ్యామల మొనర్చు కావేరియం దాతఁడు గ్రుంకులిడెను.

పరకాయ ప్రవేశము :—

బాలవత్సవేషమున నుమాదేవి శివునిఁగూర్చి తపమాచరించిన తిరువావడుదురై యను క్షేత్రమును దర్శించి దానిని వీడిపోవ మనంబు రాక యట నుండెను. ఒకనాఁడా సిద్ధుఁడు కావేరీ తీరమునఁ దిరుగాడుచుండ పశువుల యంభారావమును వినెను. ఆ యాలకాపరి శాత్తనూరులో జన్మించిన యాదవుఁడు. ఆతని పేరు మూలుఁడు. అతఁడొంటరిగ నాలమందలను మేఁపుచుండువాఁడు. ఆనాఁ డాతఁడు సర్పదష్టుఁడై మరణించెను. మందలోని పశువులు వానిచుట్టుఁ జేరి మూర్కొనుచు దుఃఖించుచు నంభారావము నొనర్చుచుండినవి. శివయోగి వాని యఱపులను విని శివుని కరుణచే "ఈ పశువుల దుఃఖముఁ బోఁగొట్టెద ఈ యాదవుఁడు జీవింపనిచో వీని దుఃఖము తఱుఁగదు" అని చింతించి తన ప్రాకామ్య

శక్తిచే వాని నుత్థితుఁ గావింప, తనదేహము నొకచో భద్ర పఱచి తన జీవము నామూలుని దేహమ్మునఁ బ్రవేశపెట్టి తిరు మూల దేవుఁడాయెను.

తమకాపరి లేచుటఁగాంచిన పశువులు వానిని మూచూచి సంతసముతో తోఁకలనెత్తి పరుగిడుచు తమ యానందమును వెలివఱచెను. తిరుమూలుఁడు వాని యానందముఁ గాంచి మేఁప సాగెను. సాయంసమయముకాఁగ నవి తమంత తామే గ్రామ మునకుఁబోవ నతఁడు వానిని వెన్నంటి పోయెను. గోవులు మెల్లఁగ నడచుచు తమతమ గృహంబుల కేఁగెను. శివయోగి యైన తిరుమూలుఁడు వాని వెనుకనేఁగి యా యా గృహాంగణ ముల నిలువఁ దొడఁగెను.

మూలునిభార్య ప్రొద్దువోయినను భర్త యింటికి రానం దులకు దురపిల్లుచు వెదకుచు వచ్చి తనభర్త రూపముతో నున్న యోగిని గాంచెను. కాని యతఁడు తనతో మాటలాడ కుండుటఁగాంచి నివ్వెఱఁజెంది "యితనికి బాధగల్గెనా! భూత మావేశించినదా!" యని భావించి చేఁదట్టి పిలిచెను. ఆయువ హస్తస్పర్శ నాతఁడు భరింపఁజాలనివాఁ డయ్యెను. అంత నా యువతి "యిట్లేల యున్నాఁడవు? నీ కేమి వచ్చినది" యని యడిగెను. ఆ శివయోగి "నీ వెవతెవు? నాకు నీకు సంబంధ మేమి? నన్నేల స్పృశించెదవు" అని పలికి సమీపమున నుండు మఠమున కేఁగి సమాధినిష్ఠుఁ డయ్యెను.

మూల్లుని భార్య యారేయి దుఃఖముతో గడపి, యుదయమ్మున గ్రామమందలి పెద్దలకడ కేఁగి తన భర్తృవృత్తాంతము దెల్పి దుఃఖించెను. వా రామెతో మఠమున కేతెంచి తిరుమూలుఁడు సమాధి నిష్ఠుఁడై యుండుటఁగాంచి "యితనిని భూత మావేశింపలేదు. ఉన్మత్త స్థితియుఁగాదు. శివయోగమున నున్నాఁడు. జ్ఞానోపదేశమునంది శివాద్వైతము వహించి జీవన్ముక్తుఁడై శివపాదములను స్మరించుచున్నాఁడు. ఇఁక నితఁడు సంసార బంధమునఁ జిక్కఁడు." అని నిశ్చయించి యామెతో నా స్థలమును వీడిపోయిరి.

శాత్తనూరు మఠమున యోగమున నుండిన తిరుమూలుఁడు యోగమును వీడి యూరి వెలుపల తాను దాఁచిన తన దేహమును వెదక నది గన్పింపదాయెను. అంత నతఁడు తన కళేబరమేమాయె నని యోగదృష్టితోఁ జూచెను. శివుఁడు తా బోధించిన శివసత్య ధర్మములను భూలోకమునఁ జాటుమని భవుఁడే తన దేహమును దాఁచెనని యెఱింగెను. "ఇదియు శివుని కరుణయే" యని భావించుచుండ గొల్లవాని బంధువులు వచ్చి "ఇట్లేల యైతివి?" యని యడుగ, నతఁడు వారికి తన పరకాయ ప్రవేశ వృత్తాంతము నెఱిఁగించెను. వారు నిరాశతో వెడలిపోయిరి. అతఁడు శివుని పాదపద్మములను స్మరించుచు తిరువావడుదురకు వచ్చెను.

తిరుమంత్రమాల :—

అతఁడచటి యాలయముఁజొచ్చి శివుని ప్రమొక్కి యాలయమునకుఁ బశ్చిమముననున్న యశ్వత్థవృక్షముక్రింద

నాసీనుఁడై రాజయోగమున మనమును శివునియందుఁజేర్చి సమాధి నిష్ఠుఁడయ్యెను. లోకమనెడి విషమును వీఁడి జ్ఞాన, యోగ, క్రియా, చర్యలనెడి చతుర్యోగమును విస్తారముగఁదెల్పు తిరుమూల మంత్ర మాలను చెప్పఁ దొడఁగెను. సంవత్సరమున కొక పద్యమాలవంతున త్రిసహస్ర వర్షంబు లీలోకమున నుండి మూఁడు వేల పద్యముల ననుగ్రహించెను. పిదప శివుని కారుణ్య విశేషముచే శివలోకమునకేఁగి మహేశుని పాద చ్ఛాయఁ జేరెను.

# 31. దండియడిగళ్ నాయనారు

తిరువారూరులో దండియడిగళుఁడను శివభక్తాగ్రేసరుఁ డుండెను. అతఁడు గొప్ప తపశ్శాలి, దేవర్షుల వేదగానములతో నానందతాండవమాడు శివుని పాదముల నెల్లవేళలఁ గాంచుచు సంతసించువాఁడు. అతఁడు పుట్టుగ్రుడ్డియయ్యు నాబాల్యము శివుని సేవయే జన్మతారకమని భావించియుండెను. సకల సంపత్సమృద్ధంబగు తిరువారూరులో నుండు త్యాగేశునిఁ బ్రత్యహము సేవించుచు స్తుతించుచు సంతసించుచుండెను. దేవాశ్రయ మండపమునకేఁగి యందాసీనుఁడై భక్తితో శివ పంచాక్షరిని జపించుచుండెను. ఇట్లెన్నియో యేండ్లు పూండ్లు గడచెను.

సరోవరము ద్రవ్వుట :—

ఆలయమునకుఁ బశ్చిమమునఁగల కమలతటాకంబు తీరమున శ్రమణులు స్థిరనివాస మేర్పఱచికొని క్రమముగ నా కొలని మంటితోఁ బూడ్చుచుండిరి. అది దినక్రమమున తఱుఁగుచుండెను. దండి యా విషయ మెఱిఁగి యద్దానిఁ ద్రవ్వి విశాలమొనర్ప సంకల్పించెను. అంధుఁడగు తాను త్రవ్విన మంటి నెట్లు తీరముఁ జేర్చుట యని యాలోచించి, తీరమున నొక కంబమును, నీట నొకదానిని నాఁటి యా రెంటికి నొక త్రాటిని కట్టి, యొక పుటికఁ దెచ్చి త్రాటి సాయమున తటాకముఁ జొచ్చి పుటికను మంటితో నింపి మరల త్రాటి నాధారముగ తీర మెక్కి మంటిని పాఱవేయుచుండెను. పంచాక్షరిని జపించుచు నీ సేవా కృత్యము నొనర్ప సాగెను. సరస్సు దినదినమువకు విశాలమగుచుండెను.

శ్రమణుల ప్రతిబంధము :—

శ్రమణు లసహనశీలురై యొకనాఁ డాతనిఁ జేరి "ఓయీ! నీవు మంటిని తీయుచుండ ప్రాణికోటులు లెక్కకు మించి మడియుచున్నవి. ఇది పాపకార్యము. నీ వీ పనిని చాలించి గృహమునకేఁగు" మనిరి. దండి వారి నీచబుద్ధికిఁ జలించి "మతివిహీనులారా! పరమశివుని సేవ యెట్టిదియైనను పుణ్యకార్యమే. అయ్యది దోషరహితమని పెద్దలు పల్కుదురు. నా చేయుపని పాపరహితమని మీ రెఱుఁగరు" అనెను.

అంత వారు "మేము చెప్పిన పరమధర్మమును నీవు వినుట లేదు. నీ కన్నులతోఁ బాటు చెవులుగూడ నశించినవా?" అని పరిహసించిరి. దండి "ఓ శ్రమణులారా! జ్ఞానేంద్రియ చక్షురింద్రియ శ్రవణేంద్రియములు మీకే నశించినవి. మీరు గతిబుద్ధిప్రత్యయ రహితులరు. నేను త్రిపురాంతకుని పాదములఁ గాంచుచున్నాను. ఆ తత్త్వ మెఱుఁగు శక్తి మీకు శూన్యము. నా మనోనేత్ర మెపుడును వివృతమై యున్నది. మీ దృష్టి సంకుచితమై సంవృతమై యున్నది. లోక మెఱుఁగ నా బాహ్య నేత్రములఁ దెఱచిన మీరేమి చేయగలరు?" అని ప్రశ్నించెను. వారు "నీవు నీ దేవునివలన దృష్టిని పొందిన మే మీ యూరు విడుతుము." అనిరి. పిదప వారా కంబములఁ దీసివైచి బుట్టను తగులఁబెట్టిరి. యాతా యాతముల కాధారమగు త్రాటిని తుంటలు చేసిరి.

దండి శ్రమణుల క్రూర కృత్యముల కాయాసపడి కుపితుఁడై యాలయమున కేఁగి మ్రొక్కి "శివా! నేఁడు శ్రమణులు నన్నవమానించి నా సేవకు విఘ్నమాచరించిరి. కరుణింపు"మని విన్నవించెను. పిదప మఠమున కేఁగి చింతతో నిద్రించెను. అర్ధరాత్రమున శివుఁడు దండి స్వప్నమునఁ గన్పించి "భక్తాగ్రేసరా! దుఃఖింపకుము. నీకు దృష్టి నొసఁగుచున్నాను. శ్రమణులంధులగుదురు" అని కరుణించెను. వెంటనే చంద్రచూడుఁడు చోళరాజు స్వప్నమునఁ దోఁచి, "ఓయీ! దండి మాకొఱకు కొలను ద్రవ్వుచుండ శ్రమణు లోర్వఁ జాలనివారై విఘ్నమాచ

రించిరి. అతఁడు దుఃఖసాగరమున మునిఁగియున్నాఁడు. నీవాతని సేవ నిరాటంకముగ సాగునట్లు చూడుము'' అని యాజ్ఞాపించి పోయెను. చోళరాజు వెంటనే మేల్కొని శివునకు వందన మాచరించి యుదయమున దండికడకేఁగి తన స్వప్నముఁ దెల్పెను. దండి "రాజా! శ్రమణులు నా సేవ నడ్డగించుటయే గాక యూఁతకఱ్ఱలను తీసివైచి త్రాటిని త్రెంపి బుట్టను తగులఁ బెట్టిరి. గ్రుడ్డితనమేగాక చెవులుగూడ వినరావా?'' యని యాక్షేపించిరి. నేను శివుని కరుణచే దృష్టి నందిన మీరే మగుదురు?'' అన వారూరు విడిచి పోవుదు మనిరి. ఇందలి సత్యా సత్యములను విచారించి న్యాయమొనర్పుము'' అనెను.

వెంటనే రాజు శ్రమణులఁ బిలిపించి యడుగ వారు దండి చెప్పినట్లే పల్కిరి. అంత రాజు దండితో సరోవర తీరముఁజేరి "దండీ! నీవు దృష్టిని పొందిన నేను వీరిని వెడలఁ గొట్టింతు'' ననెను. దండి శివుని మనంబున ధ్యానించి "త్రినేత్రా! నేను నీ సత్యదాసుఁడనగుచో నాకు దృష్టి నిచ్చి యీ శ్రమణుల నంధుల నొనర్పుము'' అని ప్రార్థించి పంచాక్షరిని జపించుచు నా గుంటలో మునిఁగి లేచెను. అపుఁడు దండి కన్నులు వికసిత పుష్పములాయెను; దివ్యకాంతితో వికసించెను. వెంటనే శ్రమణు లంధులైరి.

ఆ దృశ్యముఁ గాంచిన చోళరాజు "శ్రమణులు పాప కర్ములు. వీరి నిటనుండి తఱుముఁ''డని సేవకుల కాజ్ఞ యిడెను. వెంటనే రాజభటులు శ్రమణులఁ గొట్టి తఱిమిరి;

అంధులగు వారెటుపోవ దారిఁ గానక కొందఱు కొలనిలోఁ బడిరి. కొందఱు దారి తెలియక ముండ్ల పొదలలోఁ బడిరి. వారు కట్టిన చాఁపలు వీడి నొకరిపై నొకరు పడుచు బండలపై దొరలుచు శ్రమఁజెంది తిరువారూరును విడిచి పోయిరి.

చోళుఁడు వారి నట్లు వెడలఁగొట్టించి వారి మఠముల నిండ్లను నేలమట్టము గావించి యా కమల సరోవరమును విశాల మొనర్పఁజేసి దండి మనంబునకు సంతసము గల్గించి పోయెను. దండి పంచాక్షరీ మహామంత్రమును సదా జపించుచు కొంత కాలము జీవించి కాలము సమీపింప శివపాదచ్ఛాయఁ జేరెను.

"అజ్ఞానాంధకారమునఁ బడిన వా రంధులే యగుదురు."

## 32. మూర్ఖ నాయనారు

పంటపొలములతో నిండిన తొండమండలమున ముత్తి యంబులను తీరమునకుఁ జేర్చు తరంగములుగల పాలి నదీతీరమున తిరువేర్కాడను పుణ్యస్థలము గలదు. అచటి తటాకంబు లలో రాజహంసలు విహరించుచుండు. అచట నుత్సవ సమయములందు మెఱపుఁదీఁగలవంటి వనితలు నాట్యశాలలందు నాట్యమాడుచుందురు. భవనములపైని ధ్వజము లాకాశము నంటుచుండును.

స్వర్ణప్రాకారావృతంబగు తిరువేర్కాడునందు వంశాను గతముగ శివుని సేవించు వేళాలకులమున నొక శివభక్తుఁడుండెను. అతఁడు వేళాలజాతికి నాయకుఁడు. శ్రేష్ఠ కులాభిజాత్య సంపన్నుఁడగు నాతఁడాబాల్యము విభూతిని సత్యద్రవ్యముగ భావించి శివభక్తులను సేవించుచు వారి కాహారమిడి తాను భుజించెడివాఁడు. భక్తసేవకుఁడగు నతఁడు ప్రతిదినము శాల్యన్నమును రుచ్యంబులగు పదార్థములను వండించి తన గృహంబునకేతెంచు భక్తులకు మ్రొక్కి యుపచరించి మధురవాక్కులఁ బల్కి తృప్తిగ నాహారమిడి కోరిన ద్రవ్యమిచ్చి యాదరించి పంపెడివాఁడు. నానాఁటికి భక్తుల సంఖ్య పెరుగుచుండెను; లేదనక యిచ్చుటచే నాతని ద్రవ్యమంతయు నశించెను. వస్త్రాభరణాదుల నమ్మి కొన్ని దినంబులు భక్తుల కన్నమిడెను. అట్లెన్ని దినములు గడచును?

అతనికి నయ్యార నెట్టి సాయము లభింపమికి చింతించెను. తన నియమమును వీడలేక బాల్యమున నేర్చిన ద్యూతము వలన ద్రవ్య మార్జింప నిశ్చయించెను. అచట ద్యూతకాండ్రు లేనందున, అటనుండి బయలుదేఱి యనేక క్షేత్రములను దర్శించుచు, జూదమాడి ధనమార్జించుచు భక్తుల నా ధనముతోఁ దృప్తిపఱుచుచు కొన్నిదినంబులకు కుంభకోణముఁ జేరెను. అచటి ద్యూతశాలల కేఁగి యాడి జయించి లభించిన ధనముతో భక్తులకు సంతర్పణ మొనర్చుచుండెను. అతని యాట విచిత్రమైనది. ఆడునప్పుడు మొదటి యాటలో ప్రత్యర్థులు

జయించునట్లాడి వారికి ధనాశఁ గల్పించి పిదప న్నాటల నన్నింటిని జయించి ధనమంతటిని గైకొనును. ఎవరేని అసంబద్ధముగ మాటలాడిన చురకత్తిని చూపి బెదరించును. వా రన్యాయముగఁ బ్రవర్తించిన పొడిచివేయును. అందువలన నతనికి ధూర్తాగ్రేసరుఁడని మూర్ఖుఁడనియు పేరు వచ్చెను.

అతఁడు పాచికలాడి జయించిన ధనము నెప్పుడు హస్తమున ముట్టి యెఱుఁగఁడు. పార్శ్వస్థ జనంబులచే దానిఁ దెప్పించి భక్తుల కాహారాదులకై వెచ్చించును. భక్తులతో తాను చివరి పంక్తిలోఁ గూర్చుండి భుజించును. ఇట్లహరహ మాతఁడు భక్తుల కన్నదానముఁ జేసి పాపరహితుఁడాయెను. అద్దాన నతఁ డంత్యకాలమున శివసేవాభాగ్యముచే శివలోకముఁ జేరి యానంద నృత్యకరుఁడగు నటరాజు పాదచ్ఛాయలో నానందించెను.

"భక్తరక్షణకై చేయు కార్యంబు లెట్టివైనను
పుణ్యకార్యంబులే యగు."

## 33. సోమాసిమార నాయనారు

మామిడితోఁపులతోఁ బుష్పోద్యానంబులతో నిండిన చోళదేశమున తిరువంబరు అను నగరమున సోమాసిమారుఁడను శివభక్తుఁడుండెను. అతఁడు శుద్ధ శ్రోత్రియ కుటుంబ

మున జనించినవాఁడగుట శివభక్తుల కాహారముఁ బెట్టుచు, శివుని ధ్యానించుచు శివయాగములను విస్పష్టముగ నెఱవేర్చు లోకహితకారియైయుండె. తనకడకు వచ్చు శివదాసు లే జాతివారైనను ఎట్టి స్వభావముగలవారైనను వారికిఁదాను దాసుఁడనని భావించు జ్ఞానియై యుండెను. నిశ్చలచిత్తముతో నతఁడు సదాశివ పంచాక్షరిని స్మరించుచుండెను.

సోమయాజియైన మారుఁడు సుందరమూర్తి దివ్యచరితమును విని యాతనియందలి భక్తితో నాతనితోఁగూడ వసింపఁ దలఁచి తిరువారూరున కేఁగెను, త్యాగేశుని ప్రియదాసుఁడగు సుందరునితో మైత్రియొనర్చి యాతని పాదములే తనకు గతియని యా భక్తావతంసుని సేవింపసాగెను. కామాద్యరిషడ్వర్గంబులను జయించినవాఁడై సుందరుని పాదములనే శివపాదములుగఁ దలఁచి ధ్యానించుచుండెను. అట్లు సేవించుచు చివరకు శివలోకముఁజేరి పునరావృత్తిరహిత శాశ్వతస్థితి నందెను.

"భక్తుల సేవయే భవుని సేవ."

# 34. శాక్య నాయనారు

తిరుచంగమంగయను క్షేత్రమున వేళాల జాతిలో నొక భక్తుఁడుండెను. అతఁడు సత్యవస్తువు నెఱిఁగినవాఁడు. కరుణాశాలియై యతఁడు జీవజాలముపై దయఁగొని యుండెను. జన్మ

జరామరణముల నంటకుండు మార్గము నందఁదలఁచి యతఁడు తన గ్రామమును వీడి మహోన్నత ప్రాకారావృతంబగు కాంచీపురముఁ జేరెను. అచటి బౌద్ధులు సత్యజ్ఞానముల నొసఁగునది తమ మతమేయని చెప్పుట విని జ్ఞానార్థి గావున వారిఁగలిసెను. బౌద్ధ ధర్మముల ననుష్ఠించుచు వారి శాస్త్రములఁ జక్కఁగఁ బఠించెను. దీర్ఘకాలము బౌద్ధము నాశ్రయించినను జ్ఞాన మార్గము లభింపనందున మతాంతరమందలి సత్యము నెఱుఁగ గోరెను. ఇంతలో శివుని కరుణామృత మాతనిపైఁ బ్రసరించెను. కావున నతఁడు సార్వకాలికము అనశ్వరము శైవమే యని గ్రహించెను. "చిత్స్వరూపుఁడు శివుఁడు. అతఁడాత్మ స్వరూపుఁడు. జీవాత్మ లొనర్చు పుణ్యపాపాత్మకమగు కర్మలచే సుఖదుఃఖ ప్రయోజనములు గల్గును. ఆ ప్రయోజనముల నొసఁగునది చిదాత్మ" యని తెల్పునది శైవము. అట్టి జ్ఞాన మితర మతములందుఁ గన్పింపమి యెఱిఁగి జన్మాంతర సుకృత వాసనచే శైవమే సత్యమార్గమని విశ్వసించి యతఁడు శివసేవా సక్తుఁడయ్యెను.

ఏ స్థితిలోనైనను ఏ వేషముతోనైనను శివుని శ్రీపాదములను మఱువకుండుటయే పరసత్యమని శాక్యనాయనారు భావించెను. కాన తాను మొదటినుండియు ధరించిన బుద్ధ వేషమును వీడక కాషాయములను ధరించియే శివపూజారతుఁడయ్యెను. బౌద్ధవేషముఁ దాల్చియు బ్రహ్మాదులచే దర్శింపరానిదియు ఆద్యంతములులేక అగ్నిస్తంభమై బ్రహ్మాదులను చీకాకు

పఱచి కన్పట్టిన శివరూపమగు లింగమే శివుఁడని భావించి తద్దర్శనానంతరమే భుజింప నిశ్చయించెను.

ఒకనాఁడు శాక్య వేషధారియగు నతఁడు గ్రామమునకు వెలుపల మిట్టపై శివలింగముఁగాంచి మైమఱచి తానొనర్చున దెట్టిదియని గ్రహింపక యచటి శిలాఖండములఁ బుష్పంబులుగ దలంచి చేతనెత్తి లింగముపై వైచుచు నర్చింపసాగెను. తన యు లకృత్యంబులఁజేయ సంతసించు తల్లిదండ్రులవలె, పరమేశ్వరుఁ డా శాక్యుని స్థిరభక్తినిగాంచి యానందించెను. శాక్యుఁడట్లు శిలాఖండములతో బూజించి పోయి రెండవనాఁడు నచటి కేఁగి 'ఱాలతో పూజించు భావము నొసఁగినది శివుఁడే' యని తలఁచి మరల ఱాలతో పూజించిపోయి భుజించెను. పూజకు భావము ప్రధానముగాని వస్తుజాతముగాదు. కాన శాక్యుని పూజను శివుఁడు ప్రీతితో గ్రహించుటలో వింతయేమి? ఈ పరమార్థ మెఱుఁగని మూర్ఖులు శాక్యుని పూజ ఱాలపూజ యనినను అది మహేశునకుఁ బారిజాత సుమ పూజయే యాయెను.

ఇట్లు శాక్యుఁడు పూజ సేయుచుండ నొకనాడు శివుని శోధనచే నాతఁడు పూజను మఱచి భుజింపఁ బోవుచుండెను. కొంతదూరమేఁగి "అయ్యో! నేఁడు శివుని పూజ మఱచితినే" యని వేగముగ మరలి లింగముకడ కేఁగి నిశ్చల భక్తితో ఱాల నెత్తివైచెను. అవి లింగముపై బడునంతలో నా పరమశివుఁ డాతని భక్తిమెచ్చి పార్వతీసహితుఁడై దర్శన మొసఁగెను.

అతఁ డా తేజోరాశియగు సాంబునిఁగాంచి సాష్టాంగముగ మ్రొక్కెను. కరుణానిధియగు శివుఁ డాతనికి కైలాసావాసము నొసఁగెను. అతఁడు వెండికొండఁజేరి దాసభావమున ననంత కాలము సుఖించుండె.

"చిత్తము శివునిపై నుండిన పూజ లెట్టివైనను
స్తుత్యార్హములే."

# 35. శిఱుప్పులి నాయనారు

కావేరీనదీ జలములచే పచ్చని పైరు పంటలతో విల సిల్లు చోళదేశమునఁ దిరు ఆక్కూరను గ్రామమొకటి గలదు. అందు సదయాంతఃకరణులగు విప్ర కుటుంబము లనేకముల్లు గలవు. వారు నాస్తి యనక యిచ్చువారు. అట్టివారిని జ్ఞాన సంబంధుఁడు తన కవితచే స్తుతించియున్నాఁడు. ఆ విప్రుల వేదఘోషలు మేఘగర్జనముల నధఃకరించుచుండును. ధూప ధూమములను మించి యాగాగ్ని ధూమములు వెల్లుగఁ జెల రేగుచుండును. అచట పుండ్రేక్షువనములు క్రముకవనములు పెక్కులు గలవు. అట్టి యా గ్రామమున వేదాధ్యయనపర మగు బ్రాహ్మణకుటుంబమున శిఱుప్పులియారను నొక భక్తుఁ డుండెను. అతఁడు నీలకంఠపాద సేవారతుఁడు. ధార్మికుఁడు

గాన తనకడకు వచ్చు శివభక్తులను ప్రియమారఁ బూజించి మధురవాక్కుల నాదరించి షడ్రసోపేతమగు భోజనమొసఁగి వారర్థించుదానిని మేఘుఁడు జలముఁబోలె నొసంగుచు విశ్వవ్యాప్తమైన కీర్తి వందెను.

అతఁడు నిత్యాగ్నిహోత్రియయ్యు శివపంచాక్షరీ మహామంత్రమును సదా ధ్యానించుచుండెను. శివయాగములను దీక్షతో నిర్వహించుచు ననేక పుణ్యకార్యముల నొనర్చి చివరకు శివపాదచ్ఛాయఁజేరి శాశ్వతానందసాగరమున మునిఁగెను.

"మంత్రములలోఁ బంచాక్షరి యత్యుత్తమము."

# 36. చిఱుతొండ నాయనారు B.

దక్షిణ భారతమునకుఁ దిలకాయమానమైన చోళదేశమునఁ బైరుపంటలతో విలసిల్లు నది తిరుచ్చెంగాటం గుడి. అయ్యది మన్మథుని భస్మావశిష్టునిగఁ జేసిన ముక్కంటికి నివాసస్థానము. అచట మహామాత్య బ్రాహ్మణవంశమునఁ బరంజ్యోతి యనువాఁడుండెను. అవ్విప్రోత్తముఁడు విభూతిపైఁ బ్రేమఁగలవాఁడై సకల జీవములందు కరుణాళువై యుండెను. అతఁడు బాల్యముననే షట్ఛాస్త్రములను ఆయుర్వేదమును

నేర్చి రణవిద్యయందు నిపుణుఁడాయెను. గజాశ్వారోహణాది విద్యలం దప్రతిమానుఁడని పేర్గాంచెను. తాఁ జదివిన శాస్త్రము లందలి పరమార్థము ననుభవపూర్వకముగ గ్రహించుటచేఁ బరతత్త్వము "సత్యం శివం" అని యెఱిఁగి శివపాదపద్మ సేవయే జన్మతారకమని "నాతఃపర"మ్మని మనసార నమ్మెను. పల్లమున కేఁగు నీటివలె నాతని హృదయము పార్వతీపతి పాదములపై వెల్లి విరియసాగెను. శివభక్తులెందఱెప్పుడు వచ్చినను వారిని తృప్తిపఱచుచు సేవించుచుండెను. అక్కాలమున నా దేశమును నరసింహవర్మ పల్లవుఁడు పాలించుచుండెను. పరంజ్యోతి నరసింహవర్మకుఁ గూడ్చనెచ్చెలియై యాతని కోరిక ననుసరించి గజాశ్వ సైన్యములను వెంటఁ గొని పోయి యనేక రాజ్యములను జయించి రాజు నాదరంబుఁ జూఱఁగొనెను.

వాతాపిని జయించుట :—

పరంజ్యోతి చతురంగ సైన్యములతో నేఁగి వాతాపిని (బాదామి) జయించి యా నగరమును నేలమట్టముఁ గావించెను. అందుండి రత్నరాసులను గజఘటలను, తురంగ సహస్రంబులఁ దెచ్చి పల్లవరాజునకు నొసఁగెను.

రాజాతని విజయపరంపరలకు శౌర్యాతిశయమునకు వ్యూహరచనా నిపుణతకుఁ గరము ముదితుఁడై నిరుపమానముగ గారవించెను. అపుడితర మంత్రులాతఁడు శివభక్తాగ్రేసరుఁడగుటచేఁ శివసేవాభాగ్య ప్రాప్తమైన బలపరాక్రమము

లాతని విజయ హేతువులనియు, నీతని నెదిరించి ప్రాణములతోఁ బోవు వారీ లోకమున లేరని పల్కిరి. రాజు వారి సమ్యగ్భాషితములను విని "పరమ భాగవతోత్తముఁ డీతఁడని యెఱుఁగక హింసా పూరితమైన యుద్ధభూమికి నంపి పాపినైతి. శివా! యీ నా దోషమును మన్నింపుము" అనిపల్కి పరంజ్యోతి పాదములపై వ్రాలి మ్రొక్కెను.

పరంజ్యోతి రాజునకుఁ బ్రత్యభివందన మాచరించి "రాజా! నా కర్తవ్యమైన పనినే తమ రాజ్ఞాపించితిరి. ఇందు దోసమేమి గలదు? అయ్యది యకృత్యకరణముగాదు. ఇద్దాన నే పాపముఁ గల్గదు. పరపురంజయులు రాజులు. అది క్షత్ర ధర్మము" అనెను. పల్లవరా జాతనికి మడిమాన్యముల నపారంబులుగ నొసఁగి తృప్తి నందక యనేకవిధములగు సంపదల నిచ్చి "మహాత్మా! నీ శివసేవాదీక్ష నెఱుఁగఁజాలక యింత వఱకు నిన్ను సామాన్యునిగఁ దలఁచి యుద్ధములకుఁ బంపితిని. ఇఁక మీరు సేనాధిపత్య భారము నుజ్జగించి శివసేవఁ జేయుచు మమ్మును దేశమును లోకము నుద్ధరింపుఁడు. శివసేవయే లోకోద్ధరణ హేతువని లోకమునఁ జాటుఁడు." అని ప్రార్థించెను. పరంజ్యోతి రాజునమతి నంది స్వస్థలమగు గణపతీశ్వరముఁ జేరి యథాపూర్వము శివుని సేవింపసాగెను. సద్వంశ సంజాతయు శ్లాఘ్యచరిత్రయునగు తిరువెణ్గాట్టునంగ యను సతీమణిఁగూడి భక్తితో ధర్మముఁ దప్పక గార్హస్థ్యమును నిర్వహించుచుండెను.

చిఱుతొండఁడను పేరు నందుట :—

పరంజ్యోతి పశుపతి భక్తులకు భోజన మిడక తా భుజించు వాఁడుగాఁడు. అది యాతని నియతాచారము. అతఁడహరహము పాయసాపూపములతోడి రుచిరాన్నమును భక్తులకు నిడుచుండుటచే వారు లెక్కకు మిక్కుటముగా వచ్చి యన్నముఁ గొని సంతసముతో నేఁగుచుండిరి. భక్తజన పాదరేణువుగ తన్ను భావించి యతఁడు కాలము గడపుటచే నందఱతని చిఱుతొండఁడని పిలువఁజొచ్చిరి.

పుత్రభాగ్యము :—

చిఱుతొండఁడు గణపతీశ్వరుఁ గొలుచుచుండ నా యుమాపతి యనుగ్రహమున నంగ గర్భముఁ దాల్చి నవమాసంబులు నిండ నొక శుభలగ్నమున నొక పుత్త్రుని గనెను. అలభ్యలభ్యంబగు రత్నముఁ గాంచినటు లా పరంజ్యోతి మహదానంద మందెను. బంధుమిత్రు లానందించిరి. పుత్రముఖసందర్శనభాగ్యము నందిన చిఱుతొండఁడు అనేక దానముల నొనర్చెను. విధ్యుక్తముగ జాతకర్మాదుల నొనర్చి దశరాత్రములు గడువ నామకరణముఁ జేసి సీరాల దేవుఁడని పేరిడెను. పుణ్యాహముఁ గొనియాడిన యా దినము పుణ్యాహమే యయ్యెను. బాలునకు దేహము నిండ నలఁది విభూతిమంతు నొనర్చిరి. ఆ యా కాలములఁ జేయఁదగు కృత్యంబులను విధ్యుక్తముగ నిర్వహించుచుండ నా బాలుఁడు సితపక్షచంద్రరేఖవలె నభివృద్ధినందుచుండెను.

జ్ఞానసంబంధుని సంధించుట :—

ఆ దినములలో తిరుజ్ఞానసంబంధుఁడు తిరుచ్చెంగాటం గుడికి వచ్చెను. శీర్గాళి బాలుఁడు వచ్చుచున్నాఁడని విని చిఱుతొండఁ డెదురుపోయి మ్రొక్కి తన గృహంబునకుఁ దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి యుపచరించెను. సంబంధుఁడు చిఱుతొండని యింటఁ గొన్ని దినంబులుండి యాత్రనికి మునమొడఁగూర్చెను. సంబంధుఁ డొకనాఁడు చిఱుతొండని సేవాభాగ్యమును పొగడుచు పద్యమాలికఁ జెప్పెను. పిదప సంబంధుఁ డాతని మైత్రినిఁ గొనియాడుచు తీర్థయాత్రాచణుఁడై పోవ చిఱుతొండఁడు స్వధర్మమును నిర్వహించుచు శివుని సేవించుచుండెను.

శంకరుఁడు భైరవ జంగమవేషమున నేతెంచుట :—

చిరుతొండని సేవామహిమ కైలాసపతి పాదములకడ జేరెను. శివుఁడా భక్తుని సత్య భక్తినిఁ బరీక్షించి కరుణింప భైరవ జంగముని వేషముఁదాల్చి కైలాసమునుండి బయలుదేఱెను. మందారమాలలచే నలంకృతంబై కాలమేఘమువలె నుండు దీర్ఘజటాబంధమును ముడివైచి, మేఘమధ్యస్థ తారకలవలె పుష్పము లలరారుచుండ చంద్రరేఖను విభూతిఁదాల్చెను. మోము సూర్య చంద్రాగ్నుల కాంతితో వెలుఁగుచుండ కర్ణముల శంఖ కుండలములు గండభాగద్యుతులను మించ, క్షీరసాగర మథనసమయమున లోకాలోక భయంకరముగ

నుద్భవించిన విషము కంఠమున నీలచ్ఛాయలు నీనుచుండ నద్దానిఁ గప్పిపుచ్చుచు నమృత బుద్బుదమోయన వజ్రమాల కంఠమునఁ బ్రకాశించుచుండ, సంజ కెంజాయలఁ గప్పుచు నంధకారము వ్యాపించునటుల సుందర శరీరమున నల్లని గజచర్మ మొప్పుచుండ, భక్తుల ప్రేమయే యాతని శరీరమున వెలుఁగు చున్నదాయన, కంఠమున కపాలమాలయు జయమాలయు చేత కంకణము, నడుమున మొలత్రాడు, కాళ్లనందియలు ఘల్లుమనుచుండ చిఱుతొండనిఁ గరుణించు భావముతో వెడ లిన యా కృపామూర్తిని ధ్యానింపుఁడని వేదములు ఘోషించు చున్నవా యన నుండెను. వామహస్తంబునఁ దాల్చిన బ్రహ్మ కపాలముతో త్రిశూలము, దక్షిణహస్తమున డమరుక మొప్పుచుండ భూదేవి యొనర్చిన తపఃఫల మా యన నా పర మేశ్వరుని పదసరోజము లరుణారుణకాంతుల నీనుచుండ భైరవ జంగముఁడై శివుఁడు చిఱునవ్వు కాంతులు దశదిశలు నిండు చుండ నడచుచు, ముల్లోకవాసులు నుతించుచూడ ద్రవిడదేశ మందలి తిరుచెంగాటం గుడికి నేతెంచెను.

అతఁడు బుభుక్షాపీడితునివలె సోలుచు వీధివెంట నెదురు వచ్చువారిని "చిఱుతొండని గృహమెచట?" యని పృచ్ఛిం చుచు నతని గేహము సమీపించి "లేదనక భక్తుల కన్నమిడు చిఱుతొండని యిల్లిదియే యగునా" యనెను. వెంటనే దాది యగు చందనిక "యాతఁడు తపస్వి" యని యెదురువచ్చి మ్రొక్కి "అయ్యా! మా యజమానుఁడు భక్తులను వెదుకఁ

బోయెను. ఇప్పుడే రాఁగలఁడు. లోనికివచ్చి విశ్రమింపుఁడు” అని మనవిచేసెను. దాని కా వేషధారి “స్త్రీ లుండుచోట నేనుండఁ జాలను” అనుచుండ నా మాటలను వినిన తిరువెణ్గాట్టు నంగ “ఈ భక్తుఁడు వెడలిపోవు నేమో!” యని భీతి గ్రస్తయై వచ్చి “దేవా! నా నాథుఁడు భక్తులు పంక్తిలో లేనిచో భుజింపఁడు. నేఁ డది యేమి మాయయో! యొక భక్తుఁడు గన్పింపమి వెదుకఁబోయి యున్నాఁడు. అభినవాగంత కులగు మిమ్ముఁ గాంచిన వా రత్యంతానందభరితులు గాఁగలరు. ఇపుడే వత్తురు. మీరిట నాసీనులు గండు” అని ప్రార్థించెను.

భైరవజంగముఁ డా యువిదను గాంచి “ఓ శీలవతీ! నే నుత్తర దేశవాసిని. చిఱుతొండనిఁగాంచ వచ్చితి. అతఁడు లేని సమయమున నే నిట నుండఁజాలను. గణపతీశ్వ రాల యము వెనుకనుండు మందారపు చెట్టుకడనుందు” నని పలికి పోయి యా వృక్షచ్ఛాయయం దాసీనుఁడై యుండె.

చిఱుతొండఁడు భక్తులను వెదకి వెదకి వేసారి యలసి చింతాక్రాంతుఁడై మరలివచ్చి భార్యతోఁ జెప్పి దుఃఖించెను. ఆమె భైరవ జంగమునిరాకఁ దెల్ప దాసుఁడు జీవించె. ఆ భక్తుఁడెచట నున్నాఁడని యడుగ, నామె వచ్చిన జంగముఁడు శూలముఁ గపాలమును డమరకమును దాల్చియున్నాఁడు. తా నుత్తర దేశ వాసియఁట. మే మాభక్తు నెంత ప్రార్థించినను నిట నుండఁజాలననియు గణపతీశ్వరాలయములోని మందార వృక్షముకడ నుందునని పల్కి-పోయెను” అనఁగనే యతఁడు

వేగముగఁబోయి భైరవునిఁగాంచి వందనం బాచరించి, వినయ వినమితోత్తమాంగుఁడై నిలిచెను. ఆ జంగముఁ డాతనిం గాంచి "చిఱుతొండఁడను వాఁడవు నీవే యగుదువా!" అనెను.

చిఱుతొండఁ డాతనిఁ గాంచి "విభూతిధారులను భక్తుల నుతింప నర్హతలేనివాఁడను. ఇచటి భక్తులు నన్నా పేరునఁ బిలుచుచున్నారు. మీరడిగిన పేరుగలవాఁడను నేనే. నేఁడు నా వ్రతమునకు భంగము వాటిల్లు నట్లున్నది. ఊరంతయు గాలించిన నొక శివభక్తుఁడు గానరాఁడయ్యె. అదేమి చిత్రమో! నా పూర్వ సుకృతమున మిమ్ముఁ గాంచఁగల్గితి. దేవర యాగమనముచే నా గృహము పావనమగుగాక. తామేతెంచి భుజింప ప్రార్థన" అని విన్నవించెను. వేషధారి యగు కైలాసపతి "భక్తాగ్రేసరా! నే నొత్తరాహుఁడను. నిన్నుఁ గాంచ వచ్చితి. నాకాహార మిడుట నీ కసాధ్యము; దుర్లభము" అనెను.

అంత చిఱుతొండఁడు "మీ యుద్దేశముఁ దెలియక యేమి సెప్పగలాఁడ. యోగివరేణ్యా! మీ రాహారించు విధమును దయన్దెల్పుఁడు. అలభ్యులగు భక్తులు లభింప నసాధ్య మేమి యుండును" అనెను.

జంగముఁడు నరపశువుఁ గోరుట:—

అతఁడాతనిఁగాంచి "ఓయీ! నే నాఱునెలలు గడచి నను పశువును వధించి తిను నియమముఁ గలవాఁడను. అట్లు

లభింపనిచో నా దినములను నిరాహారుఁడనై గడపుదు. అవ్విధ మున నా కాహార మిడుట నీకు దుస్సాధ్యము" అనెను. ఆ మాటలనువిని యతఁడు "నాకు మూఁడు విధములగు మంద లున్నవి. నాకే కొఱఁతయు లేదు. మీకే పశువు కావలెనో యానతిండు. వేగముగ నేఁగి యా పశువును వండింతు" నని కరములు జోడించి పల్కెను.

అతని దాసభావమునకు మెచ్చి జంగముఁడు "భక్త దాసా! నేఁ గోరు పశువు నరపశువు. అది యయిదేండ్ల ప్రాయము గల్గి యవయవలోపరహితముగ నుండవలయు. మఱియు చెప్పఁదగిన దొకటి గలదు. అది పుంటిలో గ్రుచ్చిన బాణమటుల దుఃఖహేతువు కాఁ గలదు." అనెను. అంత చిఱుతొండఁడు "దాసునకుఁ జేయరాని దేదియు లేదు. శీఘ్ర ముగ సెలవిండు" అన నతఁడు "ఆ పశు వొకే గోత్రమున కేకపుత్త్రుఁడై యుండవలయును. తల్లి సంతసముతో నా బాలుని పట్టియుండఁ దండ్రి యాతని ఛేదించి వండి యిడిన నే భుజింతు" ననెను. చిఱుతొండఁడు "మహాత్మా! తాము భుజింప సిద్ధపడుచో దాసునకు మీ యిచ్ఛఁ దీర్ప నసాధ్యము గాదు." అని పల్కి యాతని యుత్తరువు నంది మ్రొక్కి వేగ ముగ నింటి కేఁగెను.

పతివ్రతాతిలకమగు నంగ భర్త రాక కెదురు సూచు చుండెను. సంతోషాతిశయమున మోముఁదమ్మి వికసింప వచ్చు భర్తను గాంచి యామె మ్రొక్కి "ముని యేమి సెప్పె?"నని

యడుగ నతఁడు "ఒకే కులమున నేక పుత్త్రుఁడు పంచశర ద్వయస్కుఁడు దోషరహితుఁడు గావలయు. అతని తల్లి పట్టి యుండ తండ్రి వధించి వండించి పెట్టిన మాంసమును సంతస మున భుజింతు ననెను." అని పల్కనామె "అట్టివాఁ డెచట లభించును?" అనెను.

చిఱుతొండఁడు "నాయకీ! వలసినంత ద్రవ్య మిచ్చిన పుత్త్ర నొసఁగువారుందురు. కాని యా బాలుని పట్టి నఱకు మాతా పితలుండరు. కావున కాలహరణ మొనర్పక నిన్ను జీవింపఁజేయఁబుట్టిన పుత్త్రుఁడుండ చింతింపనేల? వానిఁ బిలిపిం తము" అనెను. వెంటనే నంగ యా మాటలకు సంతసించి యట్లే యొనర్తము. బాలుని పాఠశాలనుండి పిలిచికొని రండు" అనెను.

చిఱుతొండఁడు భాగ్యమపుడే గల్గినటు లానందించి బాలుని గొని రా నేఁగెను. తండ్రినిగాంచిన బాలుఁడు కాలి యందెలు గల్లుగల్లుమని ధ్వనింప పరుగిడి వచ్చి కౌఁగలించెను. అతఁడాతని నరకడనుంచికొని గృహమునకు వచ్చెను. నంగ వాని కెదురువోయి యెత్తికొని, శిరము మూర్కొని వెండ్రు కలను సవరించి కర్ణాభరణములమీఁది దుమ్మును దుడిచి వెంటనే నీరాడించి, యలంకరించి బాలుని భర్తచేతఁ బెట్టెను. తండ్రి యా బాలుని ముద్దిడెను.

భైరవ జంగమున కాహార మిడ మనఁబు త్వరపఱుప నేకచిత్తుఁడై రహస్య స్థలమునకు బాలునిఁ గొనిపోయెను.

నంగ పాత్రములను శుద్ధమొనర్చి తెచ్చెను. తండ్రి కుమారుని శిర మెత్తిపట్టెను. తల్లి యేమాత్రము చలింపక యందెలతోడి పాదములను మడిసందున నడచిపట్టి చేతులను తన హస్తములతో గట్టిగఁ బట్టెను. బాలుఁడు తల్లిదండ్రుల సంతసముఁ గాంచి నవ్వసాగెను. చిఱుతొండఁడు ఖడ్గముఁ జేఁదాల్చి "వీఁడు నాకు సత్యస్వభావ మిచ్చె" నని సంతసించెను. తల్లి "నా నాథుని కోర్కెదీర్చు నీ పుత్త్రుఁడు నాకుఁ గల్గె" నని యానందించుచుండ చిఱుతొండఁడు చేయఁదలఁచిన కార్యమును ముగించెను.

శిరోమాంసము భుజింప ననువుగాదని తలఁచి నంగ యద్దానిని చందనికకు దాఁచనిచ్చి, మిగిలిన యవయములందలి మాంసమును ఛేదించి, రక్తమును మజ్జను చేర్చి తగిన వస్తువులతో వివిధ రీతుల పక్వము గావించెను. అన్నాదులను రుచ్యముగ వండి వంట సిద్ధమాయెనని విని సంతసించి మందార వృక్షము కడ కేఁగి మ్రొక్కి "దాసునను గ్రహించి భుజింప రండు. మీ కోరిక మేర కంతయు సిద్ధమాయెను" అని విన్నవించెను. మూఁడవ కంటిని దాఁచిన భైరవుఁ డాతనిఁగాంచి భక్తా! వెడలుదము" అన, పెన్నిధిఁగన్న పేదవలె చిఱుతొండఁ డాతనిఁ దోడ్తెచ్చెను.

నంగ భైరవ జంగమున కెదురువచ్చి మ్రొక్కి, వాసన ద్రవ్యములతో నలంకరింపఁబడిన గదిలోనికిఁ గొనివచ్చి యాసన మిడి కమండలువు జలముఁబోయ చిఱుతొండఁ డాతని పాద

ములంగడిగి యా పాదోదకమును శిరముపైఁదాల్చి, భార్య శిరమునఁ జల్లి గృహమునం దంతట ప్రోక్షించెను. పుష్పంబుల నాతనిఁ బూజించి ధూప దీపముల నిచ్చి యథావిధి నర్చించెను.

తిరువెణ్గాట్టునంగ యాతనికి మ్రొక్కి "పదార్థముల నే క్రమమున వడ్డింపనగు"నని వేఁడెను. అతఁడు "అన్నముతో మధురపదార్థముల నొకటిగ వడ్డింపుము" అనెను. ఆమె ముక్కాలిపీట నిడి దానిపై శ్వేతవస్త్రముఁ గప్పి పత్రపాత్ర నిడి యాతఁడు సెప్పినటుల అన్నమును పదార్థములను మాంస మును వడ్డించెను. జంగముఁడు "నేను చెప్పినట్లు నరపశువు నంగముల నన్నింటిని రుచిగ వండితివా!" యన, నంగ "శిరో మాంసము రుచిగ నుండదని దానిని తొలఁగించితి" ననెను. భైరవుఁడు "అదిగూడ నేఁ దినఁదగినదే" యన వారు భయ ముతో వడఁకిరి. అపుడు దాది చందనిక "దానిని భక్తుఁడు కోరునని ముందే తలఁచి వండియున్నాను" అని దానిని తెచ్చెను. ఆ మాంసమును నంగ గైకొని భైరవున కొసఁగెను.

అంత భైరవుఁడు చిఱుతొండనిఁ గాంచి "నే నొంటరిగ భుజింపఁజాలను. శివభక్తుల నాతో భుజింప నాహ్వానింపు" మనెను. చిఱుతొండఁ డా పల్కులకు క్లేశపడి యిది యొక యాటంకమా యని వెలికేఁగి భక్తులను వెదకెను. వెదకి వెదకి వేసారి యెవ్వరిఁ గానక మోముఁ దమ్మి వాడ వచ్చి మ్రొక్కి "ఇహపరసాధకులగు భక్తులకై తిరిగితిని. ఎవ్వారు లభింప రైరి. విభూతిధారులే కఱవైరి" యన, నతఁడు "నీకంటె

460 B




నంగ సీరాలునిఁ బిలుచుట

విభూతిధారు • లెవ్వరున్నారు? నీవే నాతో భుజింపుము" అని పల్కి నంగను గాంచి "యీతనికి వడ్డింపుము. నా పాత్ర నుండి కొంత యన్నమును మాంసముఁ దీసి యాతనికిఁ బెట్టు" మన నామె యట్లేయొనర్చెను.

పంక్తికి పుత్త్రు నాహ్వానింపు మనుట :—

చిఱుతొండఁడు భక్తునకుఁ గాలాతిక్రమణ మగునని వేగ ముగఁ దా నాహరింపఁ బూనెను, అపుడు జంగముఁ డాతని నాఁపి "నే నాఱు నెలల కొకసారి తిందును. నీవు ప్రతిదినము తిందువు. నీవేల వేగిరపడుచున్నాఁడవు? నీకుఁ బుత్త్రుఁడుండిన మనతో భుజింపఁ బిలువుము" అనెను. చిఱుతొండఁడా కపట వేషధారిఁ గాంచి "యతఁడిప్పుడు రాలేడు" అనెను. అంత భైరవుఁడు "నీ కొమరుఁడు రాకున్న నే భుజింపను. అతనిని వెదకి పిలిచికొని రమ్ము" అనెను. చిఱుతొండఁడు "ఇతఁడేమి చేసినను భుజింప కున్నాఁడు" అని క్లేశపడి భార్యను సీరాలునిఁ బిలువు మనెను. నంగ శివుని మనంబునఁ దలఁచుచు సీరాల్గా! రా! భక్తుఁడు నినుఁగూడి భుజింప నిన్ను పిలుచు చున్నాఁడు. తండ్రీ! రా!" అని పిలిచెను.

సీరాలుఁడు సజీవుఁడై వచ్చుట :—

అపుడు మృత్యుంజయుని కరుణచే సీరాలుఁడు పరుగిడి వచ్చెను. నంగ అతని నెత్తి ముద్దిడి భర్త చేతికిచ్చెను. అంతలో భైరవ జంగముఁడు అంతర్ధానమందెను. చిఱుతొండఁ డాతనిఁ

గాంచక మూర్ఛిల్లెను. పాత్రమున మాంసము గన్పింపదయ్యె. అతఁడు భైరవుఁడు భుజింపక యెచట దాఁగెనో యని వెదుక వెలికి వచ్చెను.

పరమశివుఁ డుమాసహితుఁడై షడాననునితో వృషభ వాహనారూఢుఁడై యాకసమునఁ బ్రత్యక్షమాయెను. దేవ ఋషులు విద్యాధరాదులు స్తుతించుచుండ చిఱుతొండనికి దర్శన మిచ్చి సోమాస్కందుఁడు భక్తశ్రేష్ఠులైన చిఱుతొండని నంగను చందనికను కరుణాదృష్టిఁ గాంచెను. వారందఱా దేవదేవునిఁ గాంచి భూమిపై సాష్టాంగ మాచరించి స్తుతించిరి. శివుఁడా నలువురను కరుణించి తన్ను విడువక సేవించు భాగ్యము నీయఁ దలఁచి వారిని తన వెంట శివలోకమునకుఁ గొంపోయెను.

"మమకారము వీడి నిశ్చల భక్తితోఁ గొల్చువారిని
శివుఁ డనుగ్రహించును."

# 37. చేరమాన్ పెరుమాళ్ నాయనారు

(కళఱిత్రరివాళ్ నాయనారు)

పురాతనమై లక్ష్మీనివాసంబగు మలయాళ దేశంబు తమిళ పద్యంబుల నుతికెక్కినది. ఆ దేశమును వంశపరంపరగ చేర రాజులు న్యాయముగఁ బాలించుచుండిరి. దానికి ముఖ్య నగరము కొడుంగోళూరు. అయ్యది పుణ్యాత్ములకు మహా

వీరులకును నివాసస్థానము. అన్నగరిలో తిరువంజైకళమను ప్రసిద్ధ శివాలయంబొండు గలదు. కొడుంగోళూరు ప్రాతః కాలమందు నిత్యాగ్నిహోత్రులు పఠించు వేదఘోషలతో గజఘటల ఘీంకారధ్వనులతో వీణానాదములతో నాటపాట లకుఁ దగినటుల ప్రయోగింపఁబడు మృదంగధ్వనులతో నిండి సముద్రఘోషము నధఃకరించుచుండు. సంపన్నుల గృహంబు లలో సంసార సుఖంబు లతిశయించియుండును. ప్రజలు ధర్మ మార్గముఁ దప్పక యుందురు. మఠములందు శైవశాస్త్రము లుపదేశింపఁ బడుచుండును. అట్టి నగరిలో వేదమార్గము ననుస రించు త్రివర్ణములవారు వాసి కెక్కియుండిరి. ఇతరులు తమ తమ కులాచారంబులఁ దప్పక సన్మార్గగాములై యుండిరి. చేరరాజులకు కోదయను పేరు గలదు. వారు పాలించు నా నగరిని సకల పుష్పోద్యానము లావరించి హృదయానందదాయ కములై యుండును.

పెరుమా కోదయారు :—

సుభిక్షమైన యా దేశమును కలిపురుషుని పాఱఁద్రోలి ధర్మమును పోషించుచు శైవమును వృద్ధిఁగావించుచు చతురంగ బలయుతులగు చేరరాజులు పాలించిరి. వారి వంశమున లోక తపఃఫలముగ పెరుమా కోదయారనువాఁ డవతరించెను. వాని జన్మకాలము జనుల కానందముఁ గల్పింప, వారంద అభ్యంజన స్నాన మాచరించి దేవదేవునిఁ గీర్తించిరి. అపుడు దేవతలు పుష్పవర్షముఁ గురియించిరి. దేవదుందుభులు ప్రమోగెను.

ప్రాణిలోకము సంతసించెను. అతఁడు పెరిగి పెద్దవాఁడై యువరాజయ్యెను. కాని యతఁడు రాజకీయములందుఁ బాల్గొనక జన్మాంతర సుకృతవిశేషమున శివపాదారవింద సేవకుఁడై విలసిల్లెను. అతఁ డచటి శివాలయమునకు సమీపమున గృహమును నిర్మింపఁజేసికొని లోకజీవనము రాచఱిక మనిత్యమని భావించి శివునిఁ గొల్చుచుండెను.

పెరుమాకోదయారు ప్రత్యహ ముషస్సున నిద్రనుండి లేచి స్నానమొనర్చి విభూతిఁ దాల్చి పుష్పోద్యానమున కేఁగి, పూవులఁ దెచ్చి, మాలికలఁ గట్టి యర్పించును. అభిషేక జలములఁ దెచ్చి యొసఁగును. ఆలయమును శుద్ధమొనర్చి నీటిఁ జల్లును. ఇట్లనేకసేవలఁ జేయుచు శివుని స్తుతించి గృహమున కేఁగుచుండు.

ఇట్లాతఁడు సేవానిమగ్నుఁడై కాలము గడపుచుండ కొడుంగోళూరు పాలకుఁడు శెంగోల్పొరయ ననువాఁడు వృద్ధుఁ డగుటఁజేసి ధార్మిక జీవనముఁ గడుప రాజ్యమును వీడి తపంబు సేయ నడవికిఁ బోయెను. అది రాజులేని రాజ్యమాయెను. నీతిశాస్త్ర పారంగతులగు మంత్రు లాలోచించి, జన్మాంతర సంస్కారముచే శివుని సేవించు పెరుమాకోదయారు రాజ్యముఁ బాలింప నర్హుఁడని నిశ్చయించిరి. వారు తిరువంజికళమను శివాలయముఁ జేరి పెరుమాకోదయారునకు మ్రొక్కి, "మలయాళ రాజవంశ మర్యాద ననుసరించి తాము పట్టాభిషిక్తు

లయి కిరీటముఁదాల్చి మీ పూర్వులవలె రాజ్యముఁ బాలింపుఁడు" అని ప్రార్థించిరి.

పెరుమా కోదయ్యారు శివుని వేఁడుట :—

మంత్రుల పల్కులను వినిన యా యువరాజు "శివ సేవలో సుఖింప నభిలషించుచుండ వీరు నా కడ్డంకులఁ దెచ్చుచున్నారు" అని తలఁచి "భక్తి సెడకుండ రాజ్యముఁ బాలించు కరుణ లభించునా యని శివునకు విన్నవించి తెలిసికొందును" అని పల్కి యాలయముఁ జొచ్చి శివునకు విన్నవించెను. అంత శంకరుని కరుణచే భక్తిమార్గమును వీడక రాజ్యమును పాలించు శక్తిని, నెవరేది సెప్పినను తలంచినను, వారి మనోభావము నెఱుఁగు మహిమమును, పరాక్రమమును, ధర్మభావమును రాజులకుఁదగిన సైన్యాద్యంగములను వరముగఁ బొంది వెలికి వచ్చెను. పట్టాభిషిక్తుఁడవగుమని వేఁడిన యమాత్యులఁ గాంచి "రాజ్యపాలనము శివసేవాభాగ్యమునకు ప్రతిబంధకమయ్యు శివుని కరుణచే నే నద్దానికి నంగీకరించుచున్నాఁ"డనని పల్కెను. వారు సంతసముతోఁ బట్టాభిషేకమునకు వలయు కృత్యములఁ గావింప నేఁగిరి.

పట్టాభిషేకము :—

మంత్రులు నిశ్చయించిన దినమున సులగ్నమునందు ధర్మ పరిపాలనార్థమై కళరిత్రవాళ్ అని ప్రసిద్ధినందిన పరమా కోదయారు పట్టాభిషక్తుఁడై రత్న కిరీటముఁ దాల్చెను. పిదప

చేరమాన్ పెరుమాళు నాలయమునకేఁగి వలగొని, శివుని ముందు సాష్టాంగ మాచరించి లేచి, యా దేవదేవుని పాద కమలములను స్తుతించి భద్రగజము నధిరోహించెను. పరిజనులు శ్వేతాతపత్రముఁ బట్టిరి. వింజామరలను వీచిరి. అట్లాతఁడు రాజమార్గమున నుత్సవముతో నేఁగెను.

విభూతి విశ్వాసము :—

అట్లు ఏతెంచుచు నతఁడు భుజము చవిటిమంటి మూఁటను మోయుచువచ్చు నొక చాకలినిఁ గాంచెను. వానచే నామన్ను కరగి యాతని దేహమునకుఁబట్టి తెల్లగ నుండెను. ఆరాజాతని దేహమునందలి శ్వేతవర్ణముఁ గాంచి, విభూతిఁదాల్చిన శివభక్తుఁడని తలఁచి వెంటనే గజము నవరోహించి వేగముగ నాతని సమీపించి భక్తితో మ్రొక్కెను. రాజట్లు తన్ను మ్రొక్కుట కా చాకలి భయపడి రాజునకు మ్రొక్కి యతని పాదములఁ బట్టి "దేవర యీ దాసు నెవఁడని తలఁచితిరి? దాసుఁడు మైలబట్టల నుదుకు చాకలి" అని వడఁకుచు నుడివెను. రాజు "నీ వేషముచే భక్తుఁడని తలఁచితిని. చింతించక పొమ్ము" అనెను. మంత్రులు సేవకులు రాజునకుఁ గల విభూతిపైఁ బ్రేమ కాశ్చర్యపడి యంజలించిరి.

పిదప చేరమానుఁ డా గజమునెక్కి రత్నధ్వజములచే నలంకృతమైన పట్టణముఁజొచ్చి సుధాధవళితంబగు నంతః పురమును, ప్రవేశించి సభామండపమున నుండు రత్న సింహా

సన మధిష్ఠించెను. శ్వేతాతపత్ర చ్ఛాయలో వనితామణు లాతనికి వింజామరలు వీచిరి. ముత్తైదువలు పుష్పలాజలఁ జల్లిరి. ధర్మన్యాయములఁ దప్పక యతఁడు రాజ్యమును పాలింప సాగెను. చేరచోళపాండ్యరాజు లాతనికి మిత్రులై యుండిరి. అనంత సంఖ్యాకులు సామంతులు కప్పముల నొసఁగిరి. చేరుఁ డంతర్బాహ్య వైరములను మఱచి విభూతి తత్త్వము వ్యాపింప వేద ధర్మముల ననుసరించి మనునీతిఁ దప్పక పాలించెను.

అందెల ధ్వని :—

రాజభోగములు ధనాదులు నటరాజేశ్వరుని కుంచిత పాదచ్ఛాయలే యని భావించి, ప్రతిదిన మాతఁడు శివు నభిషేకించి, షోడశోపచారంబులఁ బూజించి తృప్తి నందుచుండెను. ఆ పూజకు సంతసించిన శివుఁడు ప్రత్యహ మాతని పూజాంతమున తన కుంచితపాదమందలి యందెలధ్వని నాతని శ్రవణగోచరమగునట్లు సేయుచుండెను. చేరమానుఁడు భక్తులకు నిఱు పేదలకు యాచకులకు బంగారము నిచ్చుచుండెను. దేవతలానందించునటు లనేక శివయాగముల నొనర్చెను.

సోమసుందరుని శ్రీముఖము :—

చేరమానుఁడు ధర్మపాలన మొనర్చు కాలమున పాండ్య దేశపు ప్రధాన నగరమైన మధురలో సదా వసించు సోమ సుందరేశ్వరుఁడు తన్ను భక్తితో మధురగీతంబులి స్తుతించు

పాణభద్రుఁడను భక్తుని దారిద్ర్యముఁ దీర్ప ధన మీయఁదలఁచి యొకనాఁటి రాత్రి యాతని స్వప్నముఁనఁదోఁచి "భద్రా! నే నొక శ్రీముఖ మిచ్చుచున్నాను. దీనిని నా భక్తుఁడగు చేరమానున కొసఁగిన నీ కాతఁడు రత్న ధన ధాన్య వస్త్రాదుల నొసఁగును. వెంటనే నీవేఁగి యాతఁడిచ్చు ద్రవ్యంబులఁ దెచ్చి కొనుము" అని కరుణించి శ్రీముఖ మిచ్చెను. అందు "మధుర వాసియగు సోమసుందరుఁడు భక్తుఁడగు చేరమానునకు వ్రాయు లేఖార్థమేమన, సస్యములవంటి పండితులకు యాచింప కయే వర్షించు మేఘమా! స్వకిరణజాలంబుల లోకానందకరుఁ డగు శీతమయూఖు నెన్ని నిన్నెన్నినంజాలు. వీణావాదకుఁడగు నీ పాణభద్రుఁడు నా భక్తుఁడు. నిన్నుఁ గాంచవచ్చుచున్నాఁడు. ఈతనికి ధనమిత్తువుగాక" అని వ్రాయఁబడి యుండెను.

తమిళపండితుఁడగు శివుఁడు కరుణించిన లేఖను పాణ భద్రుఁడు శిరమున దాల్చి యానందముతోఁ బయనమై కొడుం గోళూరుఁజేరి మేఘములనంటు మేడలుగల అంతఃపురమును సమీపించి రాజునకుఁ దనరాకఁ దెలియఁజేసెను.

పాణభద్రునిరాక నెఱిఁగిన చేరమానుఁ డానందబాష్ప ములు స్రవింప శిరమునఁ గరములు గీలించి ద్రవీభూత మన స్కుఁడై వచ్చి వీణాపండితుని పాదములకు మ్రొక్కి "దాసుని పై దయఁదలఁచి శ్రీముఖముఁ దెచ్చితిరా" యనెను. అతఁడా శ్రీముఖము నాతనికి నొసఁగెను. రాజు దాని నందికొని యానంద తాండవ మొనర్చెను. అతడు కన్నులనుండి కాఱు నానంద

బాష్పములు వక్షమునఁ బడుచుండ సాష్టాంగమాచరించి భక్తితో నా శ్రీముఖమును విప్పి, పఠించి శివుని కరుణను నుతించెను.

సంతోషాతిశయమున నా రాజు లోనికిఁ బరుగెత్తి బంధువుల నాహ్వానించి పాణభద్రునకు మ్రొక్కఁజేసెను. వెంటనే యమాత్యులఁగాంచి "మన ద్రవ్యాగారములోని ధనాదుల నన్నింటినిఁ దెండు" అని యాజ్ఞయిడెను. వారట్లే తెచ్చి రాజు సమ్ముఖమున నుంచిరి. వాని నాతఁడు బరీక్షించి పాణభద్రునిఁగాంచి ధనమును చూపి "దీనిని గజాశ్వాదులను నా రాజ్యముఁ గైకొనుము" అని విన్నవించెను.

పాణభద్రుఁడు చేరమానుఁడు సూపిన ద్రవ్యంబులఁ గాంచి సంతసించి "దాసునకుఁ గావలసినంతయే గ్రహింపుమని శివునాజ్ఞ; కాన రాజ్యమును రాజ్యాంగములను మీరే యుంచుకొనుఁడు" అని పల్కెను. రాజు శివునాజ్ఞమీఱి భయంపడెను. పాణభద్రుఁడు భూమి క్రుంగునట్లు ద్రవ్యమును గజాదులపై నెత్తించుకొని తానొక భద్రగజ మెక్కి మధురకుఁ బోయెను. రాజు అత్యంతానందముతో నాతని వెన్నంటి కొంతదూరము సాగనంపి మరలివచ్చెను. శివుఁడు దాసులను మన్నించు రీతు లనూహ్యములు. జీవులు తలఁచుదాని నెఱుఁగుచు వారి దుఃఖములఁ బోగొట్టుచు హింసా చోర భయాదులు లేకుండ చోళ పాండ్యుల మైత్రితో జనుల నాతఁడు రక్షించుచుండెను.

అందెల రావము వినక దుఃఖించుట :—

చేరమానుఁ డొకానొక దినంబున శివపూజాంతమున వినఁబడు అందెల శబ్దమును వినమి దుఃఖించెను. దాసుఁ డేదోస మొనర్చెనని చింతించి యేడ్చి యిఁక నీ శరీరముతో నేమి? యని ఖడ్గము నెత్తి వక్షమునఁ గ్రుచ్చుకొనఁబోవ శివుఁడు వేగ ముగ నందెలరవళిని వినిపింపఁజేసెను. ఆ మధురధ్వనిని విని చేర మానుఁడు కత్తిని క్రిందవైచి చేతులు జోడించి "తండ్రీ! పర మేశా! తా మింతకుముందు కరుణింపని కారణమే" మనెను. అపుఁడాతనికి సుందరమూర్తిని స్మరణకుఁ దెచ్చుటకై తన రూపముఁ జూపక యశరీరవాణితో "ఓయీ! సుందరుఁడు నేఁడు కనకసభలో నా తాండవమును దర్శించి యేకాగ్ర చిత్తుఁడై భావోపేతముగఁ బాడి నుతించెను. దానిని విను చున్నందున నాలస్యమాయె" అని పల్కఁ నా రాజు విని "నా తండ్రికి భక్తులపైఁగల ప్రేమ కొనియాడ సాధ్యముగాదు". అనుచు మ్రొక్కి "నేను చిదంబరమున కేఁగి కనకసభలోని శివతాండవమును దర్శించి సుందరుని సేవింతు" నని నిశ్చయించి మంత్రులకు తన కోర్కెఁ దెల్పి ప్రయాణ సన్నాహముల నొనర్ప నాజ్ఞయిడెను.

చిదంబర దర్శనము :—

మంత్రులు తీర్థయాత్రకై వలసిన సన్నాహముల నొనర్చిరి. శూరులు విలుకాండ్రు ప్రజలు వంజినగరమున గుంపు

లుగఁ గూడిరి. శుభలగ్నమున రాజు తిరువంజికళములోని శివునిఁ బ్రదక్షిణీకరించి మ్రొక్కి యనుమతినంది భద్రేభము నధిరోహించి గజసైన్యమును వెంటఁగొని పోవుచుండ మలదేశ మందలి పర్వతములు పయనించుచున్నవా యనఁదోఁచె. వన ములే యేఁగుచున్నవా యన ధ్వజపతాకలతో సైన్యములు వెన్నంటెను. వల్లదశ్వములు సముద్రపుటలల భ్రాంతిం గల్పించెను. సైన్యభారముచే ధరణి క్రుంగసాగెను.

అతఁడు మలదేశపుటెల్లను దాఁటఁగనే యమాత్యులను వెనుకకుఁబోఁబల్కి కొలఁది సైన్యమును పరిజనులను వెంటరా నియమించి తదితరులను వెన్కకంపెను. పిదప కొంగుదేశమును దాఁటి కావేరీనదీ జలములచే సుభిక్షమైన చోళదేశముఁ జొచ్చెను. మార్గమందలి శివభక్తు లెదురువచ్చి నుతించుచుండ పర్వతముల నరణ్యముల నధిగమించుచుండ సామంత భూపతు లచట సకలవసతులను గల్పించిరి. అతఁడరుగుచు శివక్షేత్రములకు మ్రొక్కుచు కావేరీ దక్షిణతీరమును సమీపించెను. అందు స్నానమాడి యుత్తర తీరమెక్కి చిదంబరమును దర్శింప నువ్విళ్లూరుచుఁబోయి చిదంబరపుటెల్లను గాంచి మ్రొక్కెను.

నటరాజ సందర్శనము :—

చేరమానుని రాక విని చిదంబర దీక్షితులు భక్తబృందములతో నెదురువచ్చి మ్రొక్క, వారికాతఁడు ప్రత్యభివాదన

మొనర్చి నగరిం జొచ్చెను. కరములు శిరమునఁ జేర్చి గోపుర మునకు మ్రొక్కి యానందబాష్పములను విడుచుచు నాల యముఁ జొచ్చి వలగొని వృద్ధసభకు మ్రొక్కి బ్రహ్మాండము లను సృష్టించిన నటరాజు, ఆనందతాండవ మొనర్చు కనకసభఁ జేరి నమస్కరింప నటరాజు తన యుత్థితపాదము నాతనికిఁ గన్పఱచెను. చేరమానుఁడు నిరతిశయానందభరితుఁడై యా దృశ్యమును గన్నులారఁ గాంచి మ్రొక్కెను. హాలాహలము మ్రింగి దేవతల కమృతమిచ్చుటయే గాక కనకసభలో భక్తు లకు నటనామృతమిచ్చు కరుణఁగాంచి యానందసాగరమున మునిఁగి తా రచించిన "పొన్వణ్ణత్తిరువందాది" అను ప్రబంధ మును పంచాక్షరీ సోపానముకడ నుంచి పాడెను. ఆ పాట లకుఁ దగినటుల లయయుక్తముగ తన యందెల ధ్వని నాతనికి విన్పించెను. చేరమానుఁ డా దేవదేవుని కరుణకెంతయు నానందించి వెలికివచ్చి యన్నగరరాజమునఁ గొన్ని దినము లుండి సేవించెను.

తిరువారూరుఁ జేరుట :—

చేరమానుఁడు సుందరమూర్తిఁ జూడ నభిలాష మెందు కొన నొకనాఁడు నటరాజు ననుమతినంది జ్ఞానావధియగు చిదంబరపుటెల్లకు మ్రొక్కి శివుని పాదపద్మములను స్మరించుచు నేఁగి జ్ఞానసంబంధుఁ డవతరించిన శీర్గాళిఁ జేరి నమస్కరించి పిదప శివుని దివ్య స్థలములను సేవించుచు నేఁగి యుగాంత కాలమునను నశింపని తిరువారూరును సమీపించెను.

సుందరుఁడు నాగకోణమున కేఁగియుండి శివునివలన బంగారమును నవరత్నాదులను అశ్వములను సువర్ణ ఛురికముఁ బొంది తిరువారూరునకు వచ్చియుండెను. సుందరుఁడు చేర మానుని యాగమనమును విని సంతసించి యెదురేఁగి స్వాగత మీయ నాతఁడు మ్రొక్కెను. సుందరుఁ డాతనికి మ్రొక్కి యాలింగన మొనర్చెను. ఇరువురు కొంతకాలము ప్రేమసాగ రమున మునిఁగిరి. వారి శరీరము లేకమాయెను. ఆనాఁటినుండి సుందరునకు చేరమాన్మిత్రుఁడని పేరువచ్చెను. వారు కొంత సేపు భాషించి యొకరికరంబు లొకరు పట్టికొని త్యాగేశు నాలయముఁ జొచ్చిరి. చేరమానుఁడు దేవాశ్రయ మండపముఁ గాంచి మ్రొక్కి యాలయము వలగొని, యేకాగ్రచిత్తుఁడై శివుని ధ్యానించి నమస్కరించెను. పిదప 'తిరుముమ్మణికోవ' యను ప్రబంధముఁ బాడి కీర్తించెను.

పిదప శివుని కరుణను పొంది సుందరుఁడు చేరుని వెంటఁ గొని పరవయారు నింటికిఁ బోయెను. పుష్పమాలికలను పూర్ణ కుంభములను దివ్వెలను పరిచారికలు గొని రా పరవయారు వారి నెదుర్కొని స్వాగతముఁ బల్కెను. నాథుని చేరమానుని బంగరుపీఁటలపై నాసీనులఁ జేసి పూజించెను. సుందరుని యాజ్ఞఁ గొని యామె రసోదంచిత శాకపాకంబులతోడి యన్నమును రాజునకుఁ దగినటుల సిద్ధమొనర్చెను. పిదప సకల పరిజనులతో రాజునకు విందుబెట్టెను. సుందరుఁడు తనతోఁ జేరి భుజింపు మన రాజు వడఁకెను. అతఁడా రాజు హస్తముఁబట్టి పిలువ నాతఁ

డంగీకరించెను. పరవయారు వడ్డింప వారు భుజించిరి. పరిజనులు తృప్తినందిరి. పిదప గంధపుష్పాదులను చెలులందింప పరవయారు వారికి కర్పూరమిళిత తాంబూల మొసఁగెను. ఇట్లు పూజ నంది విభూతిఁ గైకొని చేరమానుఁడు సుందరుని పాదములకు మ్రొక్కెను. అతఁడు సుందరునితో ననేకదినంబులుండి వల్మీకనాథుని సేవించెను.

మధుర కేఁగుట :—

ఇరువురు శివానందసాగరమున మునిఁగియుండుకాలమున సుందరుఁడు పాండ్యదేశమునందలి శివక్షేత్రములను దర్శింపఁ గోరెను. చేరమానుఁడాతని విడువలేక తనకు శ్రీముఖ మంపిన సుందరేశుని దర్శింపఁ దలఁచి యాతనితో నేఁగ నిశ్చయించెను. వారిరువురు త్యాగేశునకు మ్రొక్కి పరిజనులు బంధువులు వెంటరా బయలుదేఱిరి.

వారు సుందరోద్యానములను శాలిక్షేత్రములఁ గాంచుచు కడువేళూరుఁ జేరి శివునకు నుతులొనర్చి నాగపట్టణముఁ గాంచి మ్రొక్కిరి. అపుడు సుందరుఁడు తిరుక్కోణేశ్వరా...అను మకుటముగల పద్యమాలిక నర్పించెను. అచటినుండి సముద్రము నంటియుండు వేదారణ్యముఁ జేరి, జ్ఞానసంబంధ వాగీశులు పాడి మూసికొనునట్లు తెఱచుకొనునట్లొనర్చిన ద్వారముఁ గాంచి మ్రొక్కి, శివుని సేవించిరి. చేరమానుఁడు "ఖౌన్వాణ్ణత్తం" అను ప్రబంధమునుండి కొన్ని శివ

స్తుతులను గానమొనర్చెను. అట కొన్నిదినములుండి తిరు కోడికళమును జేరి యచట జనులు లేకుండుటం గాంచిరి. సుంద రుండు శివునకు మ్రొక్కి కన్నీరు విడుచుచు పరమశివుండు వన దుర్గతోం జేరియుండునట్లు వర్ణించుచు పదిహామును బాడెను. మరల వేదారణ్యమునకు వచ్చి, యటనుండి పాండ్యదేశమును జేరి తిరుప్పూత్తురును దర్శించిరి. పిదప నాకసమంటు మేడలు గల మధురం బ్రవేశించిరి.

సుందర చేరమానులు ఆలవాయి సుందరేశునిం గాంచ వచ్చుచున్నారని పాండ్యరాజెఱింగి పట్టణము నలంకరింపంజేసి వచ్చినవారికి స్వాగతమొసంగెను. పాండ్యుని పుత్రిని బెండ్లి యాడి యచటికి వచ్చియుండిన చోళరాజును వారి నాహ్వా నించెను. వారందఱాలయముం జొచ్చిరి. సుందరాదు లాలయ మును వలగొని చొక్కలింగేశునకు వందన మాచరించిరి. చేర మానుండు వందనమొనర్చి తన్ను భక్తకోటిలోం జేర్చుకొని శ్రీముఖమంపిన ఆ సుందరేశుని కరుణాతిశయమును నుతించెను. చోళ పాండ్యరాజులు శివుని సేవించి ఆ భక్తాగ్రేసరులను అంతఃపురమునకుం గొంపోయి యుపచరించిరి. పిదప రాజులు వారికొక విడిది నేర్పఱచిరి.

సుందరుండు రాజత్రయమును వెంటనిడికొని తిరుప్పూ వనమునకేఁగి "వేదాదుల కందని శివా...యని యారంభమగు పదిహామును బాడెను. అటనుండి తిరువాప్పనము, తిరుపీడకము మొదలగు స్థలములను దర్శించి మరల మధురకు వచ్చెను. పిదప

నా రాజులతో తిరుప్పనకుంద్రముఁ జేరి మ్రొక్కి "శివుని పాద దాస్యము తొలఁగకుండుగాక...యని యారంభమగు పద్యములఁ జెప్పెను. అందలి భావములను విని రాజు లానందించి తిరునావలూరు నంబికి మ్రొక్కిరి.

పిదప సుందరుఁడు చేరమానుఁడు ఇతర క్షేత్ర సందర్శనాభిలాషులుఁగా రాజులు వారికి వసతులఁ గల్పించిరి. వారు అనేక క్షేత్రములఁ గాంచుచు రత్నమయంబగు తిరుకుత్రాలముఁ జేరిరి. అచటి కూత్తరు పాదములకు మ్రొక్కి పదిహాములతో స్తుతించి తిరువల్వేలి కేఁగిరి. అచట విభూతి సౌందర్యముతో నొప్పు శివునిఁ గాంచి మ్రొక్కి స్తుతించి రామేశ్వరముఁ జేరిరి. అచట రామలింగేశుని సేవించుచు కొంత కాలముఁ గడపిరి. అటనుండి లంకలోని తిరుకేదీశ్వరమును మ్రొక్కి, తిరుచుళిని చేరి "సంసారావర్తమునఁ బడి మ్రగ్గువారి నుద్ధరించు శివునకు మ్రొక్కి స్తుతించి యచట నిద్రింప సుందరుని స్వప్నమున వింత వేషమున శివుఁడు ప్రత్యక్షమై "నేనుండునది కానప్పేరూరు" అని పల్కెను. వెంటనే సుందరుఁడు మేల్కని "ఆహా! శివునకు నాపై నెంత దయ" అని తలఁచి మ్రొక్కెను.

పిదపఁ దాఁగనిన కలను చేరునకుఁ దెల్పి యాలయమున కేఁగి నుతించెను. అటనుండి తిరుప్పనవాయిలూరుఁ జేరి "నా చిత్తము నీతోఁ జేరియున్నది..." అని పాడెను. పిదప కొండలను దాఁటి చోళదేశముఁ జొచ్చెను.

సుందరుఁడు చేరమానునితో తిరుప్పాంబు ఆణిమానగరములోఁగల పాతాళేశ్వరునకు మ్రొక్కి వేగముగఁ బయనించి తిరువారూరుఁ జేరెను. వారు త్యాగేశునకు మ్రొక్కి పరవయారు నింటి కేఁగిరి. సుందర చేరమానులు త్యాగేశుని సేవింపసాగిరి. అక్కాలమున రాజునకు వినోదార్థమై రణంబులను యుద్ధకూటములను కుక్కుటముల పోరాటములను పండితుల వాదములను నేర్పఱచి యచటివా రానందముఁ గల్పించిరి.

సుందరుఁడు చేర దేశమున కేఁగుట :—

చేరమానుఁడు సుందరుని తన దేశమునకు విజయము సేయుఁడని ప్రార్థించెను. సుందరుఁ డాతని కోరికను మన్నించి పరవయారు నొప్పించి చేర దేశమునకు బయలు దేఱెను. అప్పుడు రాజు తిరువారూరులోని భక్తుల నాహ్వానించి పూజించి ధనాదులతోఁ దృప్తిపఱచి సుందరునితో కోయిల కేఁగి మ్రొక్కి యనుజ్ఞవడసి పశ్చిమమునకుఁ బయనము సాగించెను.

సుందర చేరమానులు కావేరీ దక్షిణతీరము ననుసరించి పయనించుచు తిరుకండియూరుఁ జేరి శివుని సేవించి యుత్తరతీరమందలి తిరువయ్యారును దర్శింపఁగోరిరి. కాని యానాఁడు కావేరి యుభయకూలముల నొరసికొనుచు పూర్ణముగఁ బ్రవహించుచుండ చేరమానుఁడు "మన మెట్లీ నదిని తరించి శివుని గాంచఁగల" మనెను. సుందరుఁడు తెప్పలుగూడ నాడని ప్రవాహ వేగముఁగాంచి "పరవుం పరశుం..." అను పదిహముతో పంచన దేశుని స్తుతించెను.

అపుడు శివుఁడు వత్సము తప్పిపోయి పిలువఁ జలించి యంభాయని యఱచు ధేనువువలె "నిల్బు" మని చరాచరములు వినునట్లాజ్ఞయిడెను. వెంటనే ప్రవాహము రెండుగఁ జీలి మార్గముఁ జూపెను. ప్రవాహము రెండు పాయలై పర్వత ద్వయమువలె నిలువ మధ్య సైకత మార్గము గన్పించెను. ఆదృశ్యముఁగాంచి వారిరువురు చేతులుజోడించి శివుని మహిమను నుతించుచు పరిజనులతో నా సైకత మార్గమున నడచి యుత్తరతీరమెక్కిరి. వారు దరిఁజేరగనే ప్రవాహ మొకటియై యుప్పొంగెను. వారు పంచనదేశుని సేవించి స్తుతించి కేరళ దేశముఁ జేరిరి.

మలయాళదేశ ప్రజలు తమ రాజు సుందరునితో వచ్చుటవిని సంతసముతో నెదురువచ్చి స్వాగత మొసఁగిరి. మార్గమందలి గ్రామములను తోరణ ద్వారములతో నలంకరించి పుష్పాడిఁ జల్లిరి. మంత్రులు సైన్యములు గజములు రాజున కెదురువచ్చెను. ఆ గజఘటల ఘీంకారములనువిని సుందరుఁడు సంతసించుచు కొడుంగోళూనును చేరెను.

జనులు నగరమును చక్కఁగ నలంకరించిరి. వీథులను నక్షత్రములనంటు హర్మ్యములను ఉప్పరిగలను, చంద్రశాలలను నాట్యశాలలను రాజభవనములను రత్నమాలికలతో నలంకరించి, ప్రజలు వారికి స్వాగత మొసఁగిరి. చేరమానుఁడు సుందరునితో తిరువంజికళమను నాలయముఁ జొచ్చెను. సుందరుఁడా సౌందర్యరాశియగు నాలయమును వలగొని

భక్తితో శివునకు మ్రొక్కి "గంగాధరా! జటాధారీ..." అని యారంభించు పదిహ్యముఁబాడి స్తుతించెను.

పిదప చేరమానుఁడు శివుని సేవించి సుందరుని భద్రగజము నెక్కించి యాతనికి వింజామర వీచుచు రాజమార్గములం దుత్సవముగ గొంపోవుచుండ జనులు వారిని నుతింపసాగిరి. కొందఱు మనరాజిట్టి మిత్రునితోఁ జేరి రోహిణీకాంతుని గూడి మిత్రరాశిలోనున్న మిత్రునిఁ బోలియున్నాఁడని తలఁచిరి. మఱికొందరు వీరిఁగాంచ మనమేమి తపమొనర్చితిమో యని భావించిరి. మన దేశము పొందఁదగిన భాగ్యము వేఱేమిగల దని కొందఱు పల్కిరి. కొందఱు వారిపై పుష్పంబులను లాజలను చల్లిరి. ఇట్లు వారంతఃపుర ద్వారముఁజేరి గజమున వరోహించిరి.

చేరుఁడు మిత్రరత్నమైన సుందరుని లోనికిఁ గొంపోయి సింహాసనాసీనుఁజేసి దేవేరులు తెచ్చిన స్వర్ణకలశ జలముతో నాతని పాదములను బంగరు పళ్ళెరముననుంచి ప్రక్షాళన మొనర్పఁబూన అట్లు సేయవలదని సుందరుఁడు పాదములను వెనుకకు లాగ రాజు సాష్టాంగ మాచరించి "మేము భక్తిఁ జేయు పూజను తాము గ్రహింపవలయు"నని ప్రార్థించెను. సుందరుఁ డంగీకరింప రాజు విధ్యుక్తముగఁ బూజించి సంతసించెను. పిదప సుందరుఁ డా రాజన్యునితోఁ గలిసి భుజించెను. రాజాతని చందన రత్నాభరణాదులతో నలంకరించి యానందమునకై యాటపాటలను జలక్రీడాదులఁ గల్పించెను.

మఱియు నేనుఁగుల పోరాటములను మల్లయుద్ధములను కూటయుద్ధాది వినోదములచే నా భక్తవరేణ్యునకు సంతసమొడగూర్చెను.

ఇట్లు సుందరుఁడు రాజ కల్పితములగు వినోదములతో నానందించుచుండ నొకనాఁడు తిరువారూరు త్యాగేశుని పాదములు స్మరణకురా "ఆరూరినివాసా! నిన్ను మఱువ సాధ్యమా." అని యారంభించు పద్యమాలికఁ జెప్పి నచటికిఁబోవ నిశ్చయించెను. ఆ వార్తనెఱిఁగిన రాజు స్నేహార్ద్రీద్రవీభూతమనస్కుఁడై సుందరుని యెడఁబాటును సహింపలేక కన్నీరు విడుచుచు "నేనేమి చేయుదు" నని యాతని పాదములకు మ్రొక్కెను. అంత సుందరుఁడు "రాజా! చింతింపకుము. నీవు శత్రువిజేతవై యిట ప్రజలను న్యాయముగఁ బాలించుచుండుము" అనెను. రాజు "నీ పాద సందర్శనమే నాకు స్వారాజ్య ప్రాప్తి. మీ ప్రయాణమును నిలుప భయపడుచున్నాఁడ" ననెను. అంత సుందరుఁడు" నా జీవమునకు జీవనమైన త్యాగేశుఁడు నా మనంబు నపహరించెను. నేనెట్లిచట నిలువఁ గలాఁడను. నీవు శివుని కరుణచే రాజ్యమునందప్రమత్తుఁడవై యుండుము" అని పల్కి బయలుదేఱెను.

వెంటనే చేరమానుఁడు మంత్రులఁ బిలిచి "నేఁటివఱకు మనకోశాగారముఁ జేరిన ధనకనకాదులను మూటలుగట్టి తెండు" అని యాజ్ఞాపించెను. వారట్లే పలువగల ముడుపులఁ దెచ్చి యీయ సుందరుఁడు పరిజనుల నా మూటలనెత్తికొని ముందేఁగుడని చెప్ప రాజును గాఢాశ్లేషమొనర్చి పయనమయ్యెను.

చోరులు ధనము నపహరించుట :—

ధనవాహకులు ముందేగుచుండ సుందరుఁ డా దేశపు టెల్లనుదాఁటి తిరుమురుగన్పూండిని సమీపించెను. "తన్నడుగక పరులనుండి సుందరుఁడు ధనమును పొందెననియో, తానా ధనమును గ్రహించి మరల నిచ్చుటకో, యెందులకో" గాని శివుఁడు తన భూతగణంబులఁ బిలిచి "మీరు చెంచుల వేసముఁ దాల్చి సుందరుని ధనముఁ గొల్లగొట్టి తెండు" అని యాజ్ఞాపించెను. వారల్లేపోయి సుందరుని పరిజనుల నడ్డగించి "ధనము క్రిందఁ బెట్టుఁడు. లేనిచో మీ ప్రాణములు మీవి గావు" అని గర్జించిరి. ఆ భారవాహకులు భయపడి ముల్లెల బాఱవైచి కాందిశీకులైరి. కొందఱు సుందరునిఁ జేరి మ్రొక్కి జరిగిన దానిని దెల్పిరి. అతఁడు తిరుమురుగపూండిలోని యాలయముఁ జొచ్చి మ్రొక్కి "అడవిలోఁ గిరాతులు నాధన మపహరింప నీ విచట నేమిసేయుచున్నావు? నిను నమ్మి లాభ మేమి?..." అని యారంభించు పదిహముపాడి స్తుతించెను. వెంటనే శివునాజ్ఞ భూతగణము లా మూటలను గోపురముకడఁ బెట్టి పోయిరి. సుందరుఁడు వానిఁగాంచి శివుని కరుణను పొగడి యాద్రవ్యరాశితో పయనమై కొంగుదేశమునుదాఁటి మనోవేగమునఁ దిరువారూరుఁ జేరెను.

చేరమానుఁడు సుందరుఁడేఁగిన పిదప నాతని దివ్య పాదములను స్మరించుచు నీతిఁదప్పక రాజ్యమును పాలించుచుండెను.

"రాజులకు రాజు నటరాజు."

# 38. గణనాథ నాయనారు

చోళదేశమునందలి శీర్గాళిలో లోకరక్షకియయి లోకమాతయునగు నుమాదేవి స్తన్యమును పానముచేసిన జ్ఞానసంబంధుఁ డచట యవతరించుటఁ జేసి యయ్యది లోకవిఖ్యాతి నందెను. యుగాంత ప్రళయమునందును వినాశమందకుండుటచే నా నగరరాజము ఆదినగరమని ప్రసిద్ధికెక్కెను. అట్టి శీర్గాళిలో వైదిక బ్రాహ్మణ కులాభరణుండై గణనాథుఁడనువాఁడుండెను.

అవ్విప్రోత్తముఁడు శీర్గాళిలో నుండు తోణియప్పరునందు భక్తివిశ్వాసములు గలవాఁడై సేవించుచుండెను. తనచేనైనంతవఱకు శివభక్తులకు ననేక రీతులఁ దోడ్పడుచుండెను. ప్రత్యహ మాతఁడు పుష్పోద్యానమునకేఁగి పూవులఁ గోసి తెచ్చి వివిధహారములఁగట్టి శివునకర్పించుచుండెను. అంతియగాక యహర్నిశ లాలయమును శుద్ధమొనర్చుచు గోమయజలంబులఁ జల్లుచు, దీపములను వెలిఁగించుచు, శైవసిద్ధాంత గ్రంథములను వ్రాయుచు, జ్ఞానము నార్జించుచు శివదీక్షాపరతుఁడై యుండెను. అతఁడార్తుల యార్తిని దొలఁగించుచు గృహస్థాశ్రమమును చక్కఁగ నిర్వహించుచుఁ గాలము గడపుచుండెను.

శివసేవాసక్తుఁడగు గణనాథుఁడు తన విధులను నెఱవేర్చుచు జ్ఞానసంబంధుని పాదపద్మములను సదా సేవించు

చుండెను. తత్సేవాఫలముగఁ గొంత కాలమున కతఁడు కైలాసముఁజేరి శివగణనాథుఁడై శివసాన్నిధ్య భాగ్యము నందెను.

"శివసేవారతులకు శివసాన్నిధ్యము సులభము."

# 39. కూర్రువ నాయనారు

తిరుక్కళింద యను స్థలమున నొక సామంతరాజ వంశమున కూర్రువరుఁడను నొక వీరశిఖామణి యుండెను. అతఁడు శత్రుభయంకరుఁడయ్యు, పంచాక్షరీ మహా మంత్రజప పరాయణుఁడు. అతఁడు శివసేవాసక్తుఁడే గాక శివభక్తుల పాలిటి కల్పద్రుమమై యుండెను. సదా శివుని కృపామహిమచే నతఁడు విరోధి రాజులను జయించి, రాజ్యమును విస్తరింపఁజేసి ప్రజారంజకుఁడై పాలించుచుండెను. అతని కోశాగారములు ధనధాన్యసమృద్ధములై యుండెను. అతనికి భుజబలమే గాక చతురంగబలము నసంఖ్యాకముగ నుండెను. అతఁడు రాజయ్యు కిరీటధారి గాకుండెను. అది యాతనికి కొంత నైచ్యముగ దోఁచెను.

పట్టాభిషేకమునకై చిదంబర దీక్షితుల నర్థించుట:—

కూర్రువనాయనా రొకనాఁడు చిదంబరమున కేఁగి దీక్షితులఁగాంచి, "తన్ను పట్టాభిషిక్తుఁజేయుఁ"డని ప్రార్థించెను.

వారు మోమోటమిని వీడి "మేము చోళవంశీయులకుఁ దప్ప నితరులకుఁ బట్టము గట్టము" అనిరి. కాని పరపురంజయుఁడగు నతఁడు తమ కేమి ముప్పుఁ దెచ్చునోయని భయపడి చిదంబరము వీడిపోవ నిశ్చయించి యా రాజు తెచ్చిన రత్న కిరీటమును రక్షింప నొక కుటుంబమును మాత్రమట నిలిపి మిగిలినవా రందఱు రహస్యముగఁ జేర దేశమునకుఁ బోయిరి.

వారు వలసపోవుటను విని యాతఁడు సంచలించి దుఃఖితుఁడై కనకసభ కేఁగి మ్రొక్కి "దేవా! దీక్షితులు నన్నభిషేకింప నిరాకరించుటయే గాక దేశాంతరగతులైరి. ఇఁక దేవర పాదములను కిరీటముగఁ దాల్చు భాగ్యము నొసఁగి కరుణింపుఁడు" అని ప్రార్థించి యా రాత్రి నిద్రించెను. శివుఁడాతని స్వప్నమునఁదోఁచి తన పాదము నాతని శిరముపైఁ గిరీటముగనుంచి యనుగ్రహించెను. ఆనాఁటినుండి యాతఁడు శివపాద కిరీటధారియై రాజ్యమును పాలింప సాగెను. జను లాతని పాలనమందు సుఖించిరి; దేశమందంతట శివాలయములందు నిత్యోత్సవ పూజాదులు క్రమముగ సాగునటు లాతఁడు శాసించెను. ఆలయములకు మడిమాన్యముల నొసఁగెను. భక్తులకే కొఱంతయు లేనివిధము ననుసరించుచు రాజ్యమున ధర్మమును నాల్గు పాదముల నడపుటచే దేవతలు సంతసించిరి. చాలకాలమతఁడట్లు సేవలొనర్చి చివఱకు శివునిపాదములఁ జేరి నిత్యానంద మందెను.

సత్యదాసులైన పండితులు:—

నీలకంఠుని పాదకమలములకు దాసులైనవారు అసత్య దాసులుగారు, శివపాద సేవయే సత్యమని నమ్మిన పండితులు మధుర కవితా ప్రసక్తిలో నిష్ణాతులై తమ వాక్సుధలతో నా పరమశివుని నుతించువారై యుండిరి. వారనేక శాస్త్రములను పరిశీలించి సత్యము శివుఁడేయని నమ్మి వేనోళ్లతోఁ జాటిరి. వారి మహిమ నెఱిఁగి యెవ్వారు వర్ణింపఁగలరు? అట్టి శివభక్తులగు పండిత కవులు ప్రథమ సంఘకాలమున కపిల, పరవణ, నక్కీరాదులు ఏకోన పంచాశత్సంఖ్యాకులుండిరని నంబియాండారునంబి తన తిరుత్తొండర్ తిరువందాదిలో వాకొనెను. అట్టివారికే దాసానుదాసుఁడనని సుందరమూర్తి పలికెను.

"భగవదంకితమైన కవిత్వము సేనయు రాణించును."

# 40. పుగళ్చోళ నాయనారు

హిమాలయ శిఖరములపైఁ దమ వ్యాఘ్రధ్వజములను నిల్పినవారు చోళచక్రవర్తులు. వారు భూమిని నిరాటంకముగ ధర్మముతోఁ బాలించిరి. యశోవంతులగు చోళులచే రక్షింపఁబడిన దేశమున ప్రాచీన నగర రాజమని ప్రసిద్ధిఁగాంచిన మహా నగరము ఉఱయూరు. అందలి సౌధకాంతులచే నిశ లంధ

కార రహితములై యుండును. హర్మ్యములమీఁది ధ్వజములాకాశము నంటుచుండును. రాజమార్గముల కిరువైపుల హర్మ్యములు మేఘమండలముఁ దాఁకుచుండును. ముల్లోకమందలి శ్రేష్ఠవస్తు జాతములతో నిండిన విపణివీథులు కుబేరు నాహ్వానించు నటులుండును.

అచటి గజఘటలు మేఘములఁ దలపించుచు నేఁడు చోట్లనుండి మదమును కార్చుచు ఘీంకారములచేఁ దిక్కులఁ బిక్కటిలఁ జేయుచుండు. అశ్వశాలలందు బాలతృణములను భక్షించుచు నోట నురుగులు గార్చుచు హేషలనొనర్చు శ్వేతాశ్వములు సముద్రములా యననుండు. ఐరావతోచ్చైశ్రవములను, కల్పవృక్షమును, చింతామణిని, లక్ష్మిని, అమృతమును. దేవతలు గొంపోవుటచే వెతఁజెందిన క్షీరసాగరము మరల స్వీయవస్తుజాతముఁ బొందఁజాలక వానికై దేవలోకము నావరించి యున్నటుల కోటల నావరించి యగడితలు శత్రుజనదురాసదములై యుండును. అచ్చోట నందనవనములు వివిధ పుష్పలతలతో విరాజిల్లుచుండును. వీథులందు యాతాయాతరథంబు లగణ్యములై దేవవిమానములఁ దలఁదన్నుచుండు. అందలి స్త్రీ పురుషులు సుఖసాగరమునఁదేలి యాడుచుందురు. మన్మథుని కుసుమాస్త్రము లచట సింహేంద్ర మధ్యమలగు యువతులఁదాఁకక యువకుల వైపేఁగుచుండును. సకల భోగభాగ్యముల కిరవగు నన్నగరి సౌభాగ్య మమరావతిఁ దలపించుచుండును.

పుగళ్చోళుఁడు :—

చిదంబరేశ్వరుని పాదకమల సేవారతుఁడై కీర్తిఁగాంచిన అనపాయచోళుని వంశీయు లురయూరును రాజధానిగఁ జేసికొని పాలించుచుండిరి. అట్టి వంశమున జనించిన పుగళ్చోళుఁడను రాజు స్వీయ భుజబలముచే దక్షిణ సాగరమువఱకుఁ గల దేశములను జయించి సామంతులనుండి కప్పముఁగొనుచు నేకచ్ఛత్రాధిపతియై పాలించెను. అతని ధర్మపాలనమున లోకము సంతసించెను. అతఁడు దేశమున వైదిక శైవమును వ్యాపింపఁజేసెను. అతఁడు శివాలయముల నన్నింటిని బాగుపఱిచి నిత్యోత్సవములు పూజలు యథావిధి సాగునట్లొనర్చెను. శివభక్తుల యభీప్సితముల నెఱిఁగి వారిని తృప్తిపఱచెను. అక్కాలమున విభూతిమహిమ లోకమంతట వ్యాపించెను.

రాజధానిని మార్చుట :—

సామంతులగు కొంగుదేశీయులు, పర్వత ప్రాంతీయులగు రాజులు, మలనాఁటి ప్రభువులు, దూరస్థులగుటఁ జేసియు వారి కపుడపుడు దర్శనమొసఁగ తన రాజధానిని కరువూరునకు మార్పఁదలఁచి దేవ సైన్యములతో నింద్రుఁ డమరావతిఁ జేరునట్లాతఁడు సైన్యసమేతుఁడై కరువూరుఁ జేరెను. దానిని ప్రధాన పట్టణముఁ గావించుకొని దేశమును పాలింప సామంతులు చక్రవర్తిని దర్శించుచు కప్పములఁ జెల్లించుచుండిరి.

ఇట్లు కరువూరులో పుగళ్చోళుఁడుండు కాలమున శివకామియాండారను భక్తుఁడు శివార్చనకై తెచ్చు పూలపుటికనొక మదగజము తొండముతోలాగి, నేలఁబెట్టి కాలరాచెను. అపుడు శివద్రోహులను హతమార్చు నాచారముఁగల అతిబత్తనుఁ డా దృశ్యముఁగాంచి మావటీంద్రతో నా మత్తేభమును చంపెను. రాజా విషయమెఱిఁగి యచటికేఁగి "మీరొనర్చినది చాలదు. ఈ నా ఖడ్గముఁగైకొని నన్ను చంపి శివాపరాధ దోషముఁ దీర్పుఁడు అని ప్రార్థించి తన భక్తిఁ జాఁటెను.

ఒకనాఁడు మంత్రులు "మహారాజా! సామంతులు కప్పములఁ జెల్లించిరి. కాని యధికుఁడను వాఁ డింతవఱకు చెల్లింపక గర్వించియున్నాఁడు; అతఁడీ సమీపపర్వత దుర్గమున నున్నాఁడు. మీరాజ్ఞయిడిన వాని నోడించి వత్తుము" అని విన్నవించిరి. అంత పుగళ్చోళుఁడు "ఆ మదోన్మత్తు నోడించి వాని దుర్గమును నేలమట్టము గావించి రండు" అని యాజ్ఞాపించెను.

మంత్రులు వెంటనే సాగర చతుష్టయముఁ బోలిన చతురంగ సైన్యములతోనేఁగి యధికుని దుర్గమును ముట్టడించిరి. ముట్టడివార్త వినిన యధికుఁడు కోపించి వీరరసోన్మాదియై యెదిరించెను. పర్వతోపత్యకలందు ఇరువాఁగుల సైన్యము దలపడెను. పోరు భయంకర మాయెను. సముద్రము లొండొంటిఁ దాఁకినటుల సంకుల సమరము సాగెను. కొండలు

కొండలం దాంకినటుల గజములు గజములం దాంకెను. ధాను ష్కుల బాణజాలములకు గజములు కుప్పగూలుచుండెను. మృతవీరుల రక్తము నదులై ప్రవహింప సాగెను. శవములపై గృధ్రములు తిరుగుచుండెను. తెగిపడిన శిరములతో హస్తములతో కళేబరములతో నా యుద్ధభూమి భీభత్సమాయెను. అట్టి భయంకరాజిలో అధికుని సైన్యము సన్నగిలెను. చోళ సైన్యములు విజృంభించి పర్వతమునెక్కి యగడితలనుదాంటి దుర్గద్వారములను పగులంగొట్టి కోటను నేలమట్ట మొనర్చెను. అధికుండెట్లో తప్పించుకొని యరణ్యమునం దాంగెను. వాని ధనకనకాదులంగొని చోళసైన్యములు పుగళ్చోళున కర్పించి మ్రొక్కిరి.

పుగళ్చోళుండు పొలికలనికేంగి మృతవీరులంగాంచు చుండ నొకని శిరముపై జటాబంధము గన్పించెను. అంత నతండు కరములు జోడించి మ్రొక్కి "మంత్రులు విజయగర్వముతో మహాపరాధ మొనర్చిరి. ఈ జాటాధారి శివభక్తుండయ్యు తన రాజు నానతి మీఱంజాలక పోరి యుండును. పోరునందు నా భటులచే మరణము నందెను. వీని మరణమునకు నే హేతు భూతుండను. ఇయ్యది మహాపాతకము పాతకినైన నేను రాజ్య పాలనకు నసమర్థుండను. దీనికిం బ్రాయశ్చిత్తము నే నొనర్ప వలయును." అని తలంచెను. పిదప నతండు మంత్రులంగాంచి "నా యనంతరము నా కొమరునకుం బట్టము గట్టుండుం" అని యాజ్ఞాపించెను. వారు భయపడి తలలు వ్రాల్చిరి. రాజు

సుస్నాతుఁడై విభూతిఁదాల్చి యా జటాధారి శిరము నొక బంగరు పళ్ళెరమున నుంచి దానిని శిరమ్ముపైఁదాల్చి, చితిని రగుల్కొల్పఁజేసి జ్వాలామాలా భీకరంబగు నగ్నిని వలగొని పంచాక్షరిని పఠించుచు నందు ప్రవేశించెను.

అపుడు దేవదుందుభులు మ్రోఁగెను. పూవులవాన గురిసెను. పుగళ్చోళుఁడట్లగ్నిఁజొచ్చి శివలోకముఁ జేరి పునరావృత్తిరహితమైన స్థితి నందెను.

"భక్తాపచారము భగవదపచారమే."

# 41. నరసింగమునియరసు నాయనారు

సుభిక్షమై జనులకు సుఖదాయియగు తిరుమునైపాడి యను దేశమును న్యాయముఁ దప్పక పాలించు సామంతరాజ వంశమున నరసింగమునియరసు అను భక్తుఁడుండెను. అతనికి విభూతియే పరమధనము. అతఁడు పరరాజన్య భయంకరుఁడై శత్రువులను జయించి తన రాజ్యమున శాంతి భద్రతలను స్థాపించెను. పాపకార్యములచెంతఁ బోక నతఁడు శివభక్తుల నర్చించుచు వారి తృప్తియే తనకానందమని భావించుచుండెను. దేశమందలి జీర్ణ శివాలయముల నుద్ధరించి ధనాదుల నొసఁగి పూజాదులు సాగునట్లొనర్చెను. శివాలయముల నభివృద్ధి పఱచుటలో నాతఁడెన్నఁడు వెనుకంజ నిడలేదు. అతఁడహర్నిశ

లందు శివధ్యానరతుఁడై కాలము గడపుచుండెను. ఆర్ద్రా నక్షత్రయుక్త దివసంబులం దాతఁడు మహాదేవుని సవిశేషముగ నభిషేకించి పూజించి యానాఁడు తన్నుఁ జేరిన మాహేశ్వర భక్తులకు షడ్రసోపేతముగ విందుచేసి యొక్కొకరికి శత సువర్ణంబుల నొసఁగుచుండెను.

ఒకానొక యార్ద్రోత్సవమునాఁడు మాహేశ్వరుల నారాధించుచుండ పరాంగనారతుఁడు కామవ్యాధిపీడితుఁ డొకఁడు విభూతిఁదాల్చి భక్తకూటమున నుండెను. ఇతర భక్తులాతనిఁ గాంచి, యేవగించి తొలఁగి దూరముగ నిల్చిరి. వికృతదేహుఁడగు నాతనిఁగాంచి నాయనారు ఎదురేఁగి మ్రొక్కి యాహ్వానించి యర్చించి "లోకదృష్టికి నసహ్యముగ గన్పించి శీలరహితులయ్యు విభూతిధారులగుచోఁ బూజనీయులే" యని తలఁచి యందఱకంటె విశేషముగ నాదరించి యెక్కుడు ధన మిచ్చి మధురవార్తల నాడి సాగనంపెను. భస్మాభ్యక్తదేహు లెట్టివారలైనను గారవించి సేవించుచు ధర్మపరిపాలన మొనర్చుచు నతఁడు "పరాత్పరతరంచైవ తత్పరాత్ పరతోహరః" అని భావించి జీవించి చివఱకు శివపాదచ్ఛాయలో లీనుఁడాయెను.

"భస్మధారులు భవ్యులు."

# 42. అతిబత్త నాయనారు

(అతిభక్తుఁడు)

సూర్యవంశీయులగు చోళచక్రవర్తులచేఁ బాలితంబగు చోళదేశమునఁ బ్రవహించు కావేరీకల్పశాఖకుఁ బూచిన పువ్వు నాగపట్టణము. అయ్యది నగరరాజంబులలో నుత్త మోత్తమము. అన్నగరరాజమందు వివిధ పుష్పాలంకృత కబరీభారలగు యోషిద్రత్నంబుల కందుకక్రీడాయుతంబగు సౌధంబులు గగనమంటుచు స్వర్ణచ్ఛాయ నీనుచుండ, సాగర జలంబులఁ బానమొనర్చిన నీలమేఘము లవ్వానిఁ బర్వతభ్రాంతి సమీపించి సంచరించును. లక్ష్మీనివాసంబగు నా పురి సకల ధనధాన్యములకు నిలయమై యొప్పుచుండును. అయ్యది రేవు స్థలమగుటంజేసి సదా నౌకలు గజాశ్వములనేగాక రత్నంబులను చినిచీనాంబరములఁ దెచ్చి దింపుచుండు. వివిధ భాషలను మాటాడు జనులట వ్యాపారమొనర్చి, కోట్ల ధనమార్జించి సుఖ జీవనులై యుండిరి. అన్నగరిఁ గాంచినవా రద్దాని నమరావతి యని తలంపక మానరు.

ఆ పత్తనము నానుకొని సముద్రము గలదు. అచట నులైప్పాడి యను నది మత్స్యంబులఁబట్టి జీవించు బెస్తలకావాసభూమి. వారు తమ గుడిసెలచుట్టు వలల నెండఁబెట్టి యుంతురు. వారు సముద్రంబునఁ బట్టి తెచ్చిన మత్స్యంబు

లను విక్రయించి యపార ధనము నార్జించి సుఖజీవనులై యుండిరి. శబరకాంతలు మీననేత్రలు. ఎండిన చేపలఁ గొనిపో నేతెంచిన పక్షులతోఁ జేరి వచ్చిన రాజహంసలా కాంతల నడకల సొబగుఁగాంచి యసూయఁజెందినవో యన నచటి పొన్నచెట్లను చేరుచుండును. వలత్రాళ్లను లాగువారి ధ్వనులు, చేపల నమ్మువారి ఘోషము లొకటియై తరంగ ఘోషము నధఃకరించుచుండు.

ఇట్టి నులైప్పాడిలో నివసించు చెంబడి కుటుంబములలోఁ జేరుచెందిన యొక వంశమున నతిభక్తుఁ డుద్భవించి బాల్యము నుండియే చంద్రచూడుని పాదములందు భక్తిఁగలవాఁడై యుండెను. అతఁడచటి బెస్తలకు నాయకుఁడై మత్స్యవ్యాపారమున నధికధన మార్జించి ధనస్వామియై యుండెను. తన సేవకులగు బెస్తలు తెచ్చిన మత్స్యరాశిలో నొక మీనును చంద్రశేఖరున కర్పితమని సముద్రమున వదలుచుండును. అది యాతని దినకృత్యములలో నొకటి.

వలలో నేనాఁడైన నొకే మత్స్యము లభించినను అది శివార్పితమని తా గ్రహించకుండెను. ఇట్లాతఁడు నియమముఁ దప్పక నడచుకొనుచుండ వరుసగా కొన్ని దినంబు లొకేయొక చేఁప లభించుచుండెను. అట్లయ్యు నాతఁ డద్దాని సాగరమున శివప్రీతిగ విడుచుచుండ నాతని యాదాయము సన్నగిల్లెను. క్రమముగ నాతఁడు దరిద్రుఁడాయెను. అతని భృత్యులు బంధువులు తిన తిండిలేక కృశించిరి. అట్లయ్యు నాతఁడు

కొంచెమైనఁ జింతింపకుండెను. అతని శరీరము శల్యావశిష్ట మాయెను. కాని యాతఁడు తన సేవావిధిని మఱువక యాచ రించుచుండెను.

ఒకనాఁడు పరమశివుఁడా భక్తునిఁ బరీక్షింపఁగోరి యాతని వలలో నవరత్నఖచితమై దివ్యకాంతులనీను మత్స్య మొకటి లభించునట్లు చేసెను. అతిభక్తుని భటులా వలను తీరమునకు లాగి చూడ నందు కన్నులు మిఱుమిట్లు గొల్పుచు నొక చేఁప గన్పించెను. వారానందభరితులై యద్దానిఁ గొని వచ్చి యతిభక్తున కొసఁగిరి. అతఁడా రత్న ప్రభల నీను దివ్య మత్స్యము "నా శివునకే యర్పితమగుఁగాక" యని "యిది యా దేవుని బంగారు పాదములఁ జేరుఁగాక" యని సముద్ర మున విడిచెను.

ధనాశ కొంచెమైన లేక రత్నము లభించిన నాశారహి తుఁడై వెలుఁగొందు నా యతిభక్తునకు వృషభవాహనా రూఢుఁడై సదాశివుఁ డాకసమునఁ బ్రత్యక్షమాయెను. అతి భక్తుఁడా దేవదేవునిఁ గాంచి, యానందబాష్పములు స్రవింప భూమిపైఁబడి సాష్టాంగ మాచరించి లేచి, కరములు శిరమునఁ జేర్చి స్తుతించెను. శివుఁడాతనిఁ "దన లోకమున సుఖింపు" మని కరుణించెను. అతిభక్తుఁడు కైలాసముఁ జేరి శివగణములలో నొకఁడై సదాశివ సేవాభాగ్యము నంది సుఖించెను.

"ఆశారహితులు ధన్యులు."

# 43. కలికంబ నాయనారు

దక్షిణదేశమందు తిరుపెణ్ణాకడమను పురాతన దివ్య క్షేత్ర మొండు గలదు. అచట మహోన్నతములై యాకాశమునంటు వృక్షములుగల యుద్యానవనంబులు లెక్కకు మించి కలవు. వాని పార్శ్వములందు పంటభూము లపారముగ సస్యాఢ్యమై యుండును. అచటి జనులు సంతతోత్సాహవంతులు.

అట్టి పెణ్ణాకడమున వైశ్యకులమున కలిక్కంబరను భక్తుఁడు శివపాదసేవారతుఁడై యుండెను. అతఁడు పరమ శివుని పాదసేవయే తన జన్మతారకమని విశ్వసించి యుండెను. తిరుత్తూంగానైమాడమను నాలయముననుండు శివకొళుందునాథు నాతఁడు సేవించుచుండెను. అతనికి శివసేవాసక్తి గాక వేఱొండాశ లేకుండెను. ప్రత్యహ మాతఁడు శివభక్తులెందఱేతెంచినను దధిమధుఘృత పాయసాపూపంబులతో నన్నమిడి తృప్తిపఱచి ధనాదుల నొసఁగుచుండెను.

ఆ భక్తశిఖామణి తన గృహంబున కేతెంచు శివభక్తుల పాదంబులఁ గడిగి విధితోఁ బూజించి విందుపెట్టుచుండెను. ఒకనాఁ డాతఁడు భక్తుల పాదంబులను ప్రక్షాళన మొనర్ప నారంభించెను. అపు డతని సతీమణి గృహమును శుద్ధమొనర్చి శుద్ధజలముఁ దెచ్చిపోయ నతఁడు వారి పాదంబులఁ గడుగు

చుండ పూర్వ మాతనిచే సేవక వృత్తినుండి దోషియగుటc దొలcగింపcబడినవాc డొకcడు భక్త వేషముcదాల్చి వచ్చి యుండెను. నాయనా రాతని పాదములc గడుగcబోవ నామె వానిని గుర్తించి "ఇతcడు మన సేవకుcడు" అని తలcచి జల ములcబోయ నాలసించెను. అంతలో కలికంబనాయనారు "ఈమె భక్తుని పూర్వ వృత్తాంతమును స్మరించి వ్యసనపడి పాదపూజకు నీటిcబోయకున్నది." అని యెఱిcగి యామె తన ధర్మపత్నియనియైన తలcపక ఖడ్గముతో నామె హస్తమును ఖండించెను. పిదప తానే జలముcబోసి యాతని పాదములc గడిగి పూజించెను. భక్తులకు తానే భోజన మిడెను. ఇట్లాతcడు నిర్విఘ్నముగ భక్తపాదసేవ నొనర్చుచు శివునిcదలcచుచు నట రాజ కరుణాపాత్రుcడై కైలాసముcజేరి యానందామృత సాగరమున నిమగ్నుcడై పునర్భవ రహితుcడాయెను.

"శివభక్తులలో న్యూనాధిక్యతల నెన్నరాదు"

# 44. కలియ నాయనారు

భూలోకమునc గీర్తింగాంచిన తొండమండలమునందలి శివ క్షేత్రములలోc బ్రసిద్ధమైనది తిరుఒత్తియూరు. అందు రథ ములు సంచరింపcజాలు విశాల వీథులుగలవు. సుందహర్మ్య ములతోనది నేత్రానందకరముగ నుండును. దాని నొకవైపు

సముద్రుఁడు తాఁకుచుండు. మఱొకవైపు వంటశాలములు నారికేళ వనములు కన్నులకు విందుగొల్పుచుండు. నాట్యశాల లందు నాట్యకత్తెల యందెల రవళులు మృదంగ ధ్వనులు మిన్నంటుచుండు. అందలి వీథు లుత్సవ దర్శనాగతులగు జనం బులతో నిండియుండును. మఠములు భక్తభజనగాన గోష్ఠులతో శివలోకముఁ దలపించుచుండును, పొన్న పొగడ గేదంగి పూవుల వాసనలతోఁగూడి మారుతము శుభదాయకమై యచట వీచుచుండు. సాగరతీరమందలి యిసుక తిన్నెలు చంద్రోదయావసరమునఁ గైలాసభ్రాంతిఁ గల్పించుచుండు. సౌధములపైని మేఘ గర్జనము, సముద్రతరంగ ఘోషము, గాయకుల మృదంగధ్వను లొకటియై వర్ణనాతీతమై యుండును.

సకల సంపదలతోఁ గూడిన యయ్యూర నూనెగాండ్ర కులమువారితో నిండిన చక్కొరప్పాడియను వీథి యొకటిగలదు. అచటివారందఱు కుబేరుని మించిన ధనికులు. వారిలో కలియ నారను భక్తుఁ డొకఁడుండెను. అతఁడు శివదీక్షాపరుఁడు. సేవా మార్గము నెన్నఁడు మీఱువాఁడు గాఁడు. అతఁడు తన గానుఁగ లోని నూనెఁ గొంపోయి యాలయమున సహస్రాధిక దీప ములను వెలిఁగించుచు సేవించుచుండెను. అతని సేవచే నాల యము దివ్య కాంతులతో వెలుఁగుచుండెను.

శివుని పరీక్ష :—

అతఁ డనేక వత్సరములు నిరంతరాయముగ దీపములను వెలిఁగించుచు దృఢభక్తితో నా పరమేశ్వరుని గొల్చుచుండెను.

అట్టి సత్యభక్తుఁడైన కలియనారుని సేవను లోకంబులం జాటం బూని, శివుఁడాతని సంపదలు నశింపఁజేయదలంచెను. గజభుక్త కపిత్థమువలె శివపుణ్యముచే ద్వంద్వములు నశించునట్లు అతని ద్రవ్యము క్షీణించెను. కలియనారు పేదయయ్యు కలఁతపడక బంధువులను యాచించి తైలముఁగొని విక్రయించి యందలి లాభముతో తైలముఁగొని దీపారాధన మొనర్చుచుండెను.

ధనికులగు నాతని బంధువులు కాలక్రమమున తైలము నీయరైరి. కలియనా రా స్థితికి వెతఁజెంది కూలిపనులవలన లభించు ధనముతో దీపములఁ బెట్టసాగెను. అతఁడు ప్రతి దినము నువ్వులను గానుఁగలోఁబోసి యెద్దుల నదలించుచు పక్వము నెఱింగి నూనియఁదోడి యజమానులను మెప్పించుచుఁ గొంతకాలము కూలిపనితో జీవించుచు తన సేవను నిర్విఘ్నముగఁ గొనసాగించెను. కాని యా కూలిపనియు గొంత కాలమునకు దుర్లభమయ్యెను. దానికి నాతఁడు వెనుదివియక తావసించు గృహమునమ్మి యా ధనముతో దీపములను వెలిఁగించ సాగెను. ఆ ధనము దినక్రమమున క్షీణింప చేయునది లేక భార్యను విక్రయింపఁజూపెను. ఎవరు నామెను గొనరైరి. అతఁడు దుఃఖించుచు నాలయమున కేఁగి తైలఁ శూన్యములైన ప్రమిదలఁగాంచి యిఁక జీవించి యేమి లాభమని ప్రాణములు వీడ సిద్ధుఁడాయెను. అంతలో తన రక్తమును తైలముగ నేల యుపయోగింపరాదని భావించి కరవాలమున తన కంఠమును ఛేదింప యత్నించెను; అపుడాతని తీవ్రతను గాంచి శితి

కంఠుఁడు ప్రత్యక్షమై యాతని హస్తముఁబట్టి యాఁపెను. తన యత్నమాఁపినవా రెవరా? యని నాయనారు చూడ వృషభ వాహనారూఢుఁడైన యుమాపతి గన్పించెను. వెంటనే యతఁడు ఖడ్గముఁ బాఱవైచి నేలపైఁబడి సాష్టాంగ మాచరించి యంతర్హితుఁ డయ్యెను. శివసేవలో ప్రాణములర్పింపఁ బూనిన కలియనారుఁడు భక్తాగ్రేసరుఁడై కైలాసముఁ జేరి సుఖించెను.

"నిశ్చల భక్తితో నియమముఁ దప్పక సేవావిధిని నిర్వర్తించువారు శివప్రీతి పాత్రులగుదురు."

# 45. సత్తి నాయనారు

(శక్తి)

దిగ్దేశములందు విజయస్తంభములను నాఁటి నీతితోఁ బాలించిన చోళుల దేశము సకల దేశములకు తలమానికమై యుండెను. అచట కావేరీ పరీవాహపు దేశమందలి క్షేత్రంబులలోఁ బైరుతోఁబాటు పెరిగిన తామరలఁ బెఱికి కృషీవలులు పాఱవైవ నా పుష్పంబులనుండి స్రవించిన మధువు కుల్యాల నింపుచుండెనన నతిశయోక్తిగాదు. అట్టి దేశమున వరింజయూరను నది శివభక్తులకు నిలయమై వాసిఁగాంచియుండెను. అచట వేళాలజాతికిఁ జెందిన భక్తుఁడొకఁడు బ్రహ్మాదుల కగమ్యమైన

శివపాదారవిందములను సదా సేవించువాఁడై శివద్వేషులఁ గాంచిన పట్టి బంధించి, వారి జిహ్వాలను ఛేదించుచు వీరభక్తుఁడని ప్రసిద్ధిం గాంచియుండెను. కాన నాతని నందఱు సత్తి (శక్తి) నాయనారని పిలుచుచుండిరి.

అతఁడు శివునిఁగాని శివభక్తులనుగాని పరిహసించువారిఁ గాంచిన వెంటనే వారి నాలుకను పట్టి వెలికి లాఁగి తన వాఁడి కత్తిచేఁ గోసివేయుచుండెను. కాన నపుడు శివద్రోహులగు పాపులు పేరునకైన లేకుండిరి. ఇట్లాతఁడు వీరసేవచే శివుని సేవించుచు జీవించి, చివరకు శివకరుణాపారమ్యమునంది కైలాసముఁజేరి శివపాదచ్ఛాయలో సుఖించెను.

"శివనింద పరమద్రోహము."

## 46. అయ్యడిగళ్‌కాడవర్కోన్ నాయనారు

యశఃకాములై రాజ్యపాలనమొనర్చిన పల్లవ వంశమున అయ్యడిగళ్కాడవర్కోన్నాయనారనువాఁ డుండెను. అతఁడు కాంచీపురమును రాజధానిగఁ జేసికొని ప్రజలకుఁ గష్టము గల్గనిరీతి న్యాయముగ రాజ్యముఁ బాలించుచు శత్రుభయంకరుఁడై యుండెను. లోకము ధర్మముఁ దప్పకుండు నటులాతఁడు జాగరూకుఁడై పాలింపసాగెను. పరరాజన్యు

లను తన పాదాక్రాంతులుగఁ జేసికొని యుండెను. అతఁడు సంస్కృత ద్రావిడ భాషలందు పండితుఁడై కవిపండితపోష కుఁడై వాసికెక్కెను.

కొంతకాలమట్లు రాజ్యపాలన మొనర్చుచు శివసేవా సక్తుఁడై "రాజ్యాంతే నరకం ధ్రువ"మ్మని యెఱిఁగి రాజభోగ ముల నేవగించి విరాగియయ్యెను. తన పుత్త్రునకు రాజ్య మొసఁగి శివసేవామగ్నుఁడయ్యెను. సకల శివక్షేత్ర దర్శనా సక్తితో బయలువెడలి యొక్కొక్క యాలయమును దర్శించుచు మ్రొక్కుచు నొక్కొక్క పద్యముఁ బాడుచు సేవింపసాగెను. ఒకనాఁడు చిదంబరదర్శనాకాంక్షియై యేఁగి కనకసభలో నానందతాండవకరుఁడగు నటరాజేశ్వరుని పాదములను దర్శించి మ్రొక్కి తమిళ పద్య పుష్పమాలిక నర్పించెను.

అయ్యడిగళుఁ డచట కతిపయ దివసంబులుండి సేవించెను. వాని సేవకు మెచ్చి శివుఁడాతనిపైఁ గరుణారసముఁ జిలికెను. అతఁడంత కైలాసముఁ జేరి యచట శివసేవను సాగించెను.

"రాజ్యభోగము లస్థిరములు."

# 47. గణంబుల్ల నాయనారు.

ఉత్తరవేళారునదికి దక్షిణతీరమున సకల సంపత్సమృద్ధమై వివిధలతాతరులతో నిండిన పుష్పోద్యానావృతమైన ఇరుక్కు వేళూరను ప్రాచీన గ్రామమొండు గలదు. అచట పనస చెట్లధికము. ఫలించిన పనసఫలమునుండి స్రవించు మధుర రసము అచటి పైరుపంటలను పెంచుచున్నదా! యన నుండును. అట్టి యయ్యూర నొక శివభక్తుఁ డుండెను. అచటి జనుల కాతఁడు నాయకుఁడై సచ్ఛీలవంతుఁడుగ నుండెను. అతఁడు ధనికుఁడు. అతఁడన్వహము శివాలయమందు దీపార్చన సేయుచు పూజించి మ్రొక్కి వచ్చుచుండెను.

ఇట్టి శివసేవలో నాతని ద్రవ్యమంతయు క్షీణించెను. ఆ గ్రామముననే యుండిన తనసేవ సాగదని తలచి, కనక సభలో నటనమొనర్చు నటరాజనివాసంబగు చిదంబరమునకేఁగెను. తనకు మిగిలిన గృహాదుల నమ్మి గొనిపోయిన ధనముతో తిరుప్పులీశ్వరాలయమున దీపారాధన సేవ కొనసాగించుచుండ నా ధనమును వ్యయమాయెను. ఇతరులను యాచించి సేవసేయ దలఁచెను. కాని యాచనావృత్తి కష్టంగడు నీచమని యిండ్లకు పైకప్పుగ నుపయోగించు విడవలి, బోద మొదలగు గడ్డిగాదములఁ గోసి తెచ్చి యన్నగరిలో విక్రయించి యా ధనముతో శివసేవ సేయఁజొచ్చెను. అందువలన నాతనికి గణంబుల్లర్ అను పేరు వచ్చెను. (పుల్లు = గడ్డి).

ఒకనాఁడాతఁడు కోసి మోసి తెచ్చిన బోదగడ్డి నెవరుఁ గొనరైరి. ధనవిరహితుఁడై దీపములకు వలయు నేతిని గొన లేక దుఃఖించెను. చేయునది లేక యా గడ్డిని వెంటెగఁ బెనఁచి యాలయమునకుఁ గొంపోయి వెలిఁగించెను. అది యొక జామైన వెలుఁగక యాఱిపోయెను. పశుపాశరహితుఁడైన యా గణంబుల్లర్ తన జటాబంధమునకు నిప్పు నంటించి వెలిఁగించి నిలిచెను. శివుఁడు శిరోజములను వత్తిగ శిరమును దీపముగ నుంచిన యా సత్యాత్ముని భక్తికి మెచ్చి యాతనికిఁ గైలాస ప్రాప్తి ననుగ్రహించెను. గణంబుల్ల నాయనారు కైలాసముఁ జేరి శివగణంబులఁగూడి శివానందసాగరమున మునింగెను.

"శరీరముపై నాశను వీడి సేవించు భక్తులు
శివప్రీతి పాత్రులగుదురు."

# 48. కారి నాయనారు

వైదికులు ధర్మాత్ములు జీవించు తిరుక్కడయూరున కారియారను నతఁడుండెను. అతఁడు షట్శాస్త్రములనే గాక శివరహస్యముల నెఱిఁగినవాఁడు గనుక ధ్వని ప్రధానమైన "కారిక్కోవై" యను ప్రబంధమును రచించెను. అందలి మధుర గీతములు భావప్రధానమై మోక్షప్రాప్తి హేతువులను

గంభీరముగఁ దెల్పునవియై యుండెను. అతఁడు చేర చోళ పాండ్య రాజులకడ కేఁగి తన కావ్యార్థములను వ్యాఖ్యానించుచు వారొసఁగిన ధనాదులచే సుఖముగ జీవించుచుండెను.

కారియారు రాజప్రాప్తమైన ధనముతో ననేక శివాలయముల నందముగ గట్టించెను. శివభక్తుల కోర్కెల దీర్పసాగెను. సర్వకాల సర్వావస్థలయందు శివునే స్మరించుచుండెను. మనస్సును పశుపతియందుఁ జేర్చి జీవన్ముక్తుఁడై యుత్తరకైలాసముఁ జేరెను. "అట్టి సద్భక్తునకే దాసాను దాసుఁడ"నని సుందరుఁడు మ్రొక్కెను.

"జన్మకర్మలు శివాధీనములు."

# 49. నిన్ఱశీర్ నెడుమార నాయనారు

పాండ్యదేశమునకు ప్రధాన పట్టణమైన మధురానగరిలో దిగంత వ్యాప్త యశోవిశాలుఁడై రాజ్యపాలన మొనర్చిన ధన్యాత్ముఁడు నెడుమారుఁడు. అతఁడు యౌవనమున "సంశయముల కాస్పదమగు జైనమతమే గొప్పది"యని తలఁచి వారి కపటవాక్కులను నమ్మి శ్రమణుఁ డాయెను. పిదప తమిళ పండితుఁడైన జ్ఞానసంబంధుని పాదముల నాశ్రయించి శైవుఁడాయెను. దేశమున శైవము వృద్ధియగునటుల నొన

ర్చెను. పంచాక్షరీ మంత్ర మహిమ నెఱింగి త్రికరణములను శివాధీన మొనర్చెను.

ఉత్తరదేశపు రాజులు పాండ్యదేశము నాక్రమింప దండెత్తిరి. శివభక్తుఁడగు నెడుమార పాండ్యుఁడు చతురంగ బలముతో బయల్వెడలి నెల్వేలియనుచోట నెదిరించెను. పోరు తీవ్రమాయెను. నఱకఁబడిన వీరుల దేహములు కుప్పలు తిప్పలై పడెను. తొండములు తెగిపడిన మత్తేభముల రక్తము నదులాయెను. అట్టి నదులు కలయుటచే సముద్రము రక్తిమఁ దాల్చెను. ఏనుగుల ఘీంకారములు హయహేషలు సైనిక కోలాహలము లొకటియై యుగాంతకాలమేఘ గంభీరా ర్భటులఁబోలి చెలఁగుచుండెను. పూర్వ ముగ్రకుమార పాండ్యుఁ డొనర్చిన పోరు నదితలంపునకుఁ దెచ్చుచుండెను. అట్టి భయంకర రణభూమిలో భూతబేతాళ పిశాచములు రక్తపు మడుఁగులలో స్నానమాడి మాంసముఁదిని నాట్య మాడ సాగినవి. గజపతియైన పాండ్యుఁడు శివుని కరుణాతిశ యమునంది విజృంభించి, పోర శత్రుసైన్యంబులోడి పలాయన మంత్రముఁ బఠించినవి. అపుడు నెడుమారుఁడు జయమాలను ధరించి జనుల జయఘోషలతో మధురఁజొచ్చి సోమసుందరుని పాదకమలములకు మ్రొక్కెను.

చోళుని కుమార్తయైన మంగయక్కరిశి యను శివ భక్తురా లాతని పట్టమహిషి కా నాతఁడు శైవమ్మును పోషిం

చుచు విభూతి మహిమను ప్రకాశింపఁ జేయుచు చాలకాలము రాజ్యమును పాలించి యవసానకాలము సమీపింప శివుని కరుణ తన్నుఁజేర కైలాసముఁజేరి యానందించెను.

"రాజరాజు నటరాజు"

# 50. వాయిలార్ నాయనారు

పైరు పంటలతో భోగభాగ్యములతోఁ దులఁదూఁగునది తొండమండలము. అందు సుఖజీవులగు జనులు నివసించునది మైలాపూరు. అయ్యది సమీపమునఁగల రత్నాకరుఁడు తన రత్నములఁ గాచుట కుపయోగించిన కోశాగారమా యన విల సిల్లుచుండును. తత్సమీపమున విదేశములతో వర్తకములను సాగించు నౌకలు లెక్కకుమించి యుండు రేవుస్థల మందుఁ గలదు. తీరమున నేత్రానందకరముగ పూఁదోఁటలు విస్తరించి యుండును. నౌకలు పరదేశములనుండి తెచ్చిదించిన యేనుఁగు గున్నలు మహిపము లేకాకారములై గన్పించుచుండు. సౌధ ములపై సంచరించుచు చంద్రుఁడచటి కాంతలమోముఁ దమ్ములఁగాంచి సిగ్గిలి మేఘమండలమునఁ దాఁగుచుండును. వీథులు నిత్యోత్సవములతో శోభిల్లుచుండును. అలంకృతంబు లగు స్త్రీల కేశ పాశంబులనుండి వెడలు భ్రమరములు వారి

నాయకులకడ కేఁగు దూతలాయననుండు. అచటి గృహంబులు సుధర్మను మించియుండును.

ఇట్టి మైలాపూరునందు వేళాలజాతీయు లొనర్చిన పుణ్య ఫలమాయన జనించిన యొక భక్తుఁడుండెను. అతఁడు వయస్సుతోఁబాటు జ్ఞానమునంది శివసేవాసక్తుఁ డాయెను. అతఁడు హృదయమున శివుని నిల్పి, యచట జ్ఞాన దీపమును ప్రజ్వలింపఁ జేసి యానందాభిషేక మొనర్చి భక్తియను నైవేద్యమిడుచు, మానసికపూజ నొనర్పసాగెను. అట్లు దీక్షతో మానసిక పూజారతుఁడై నాయనారు తన జీవిత శేషముఁ గడపి యంత్యమున శివపాదచ్ఛాయలో లయంబందెను.

" బాహ్య పూజకంటె మానసపూజ సద్యఃఫలదాయి "

# 51. మునైయడువార్ నాయనారు

శత్రుభయంకరులై లోకహితముగ రాజ్యమేలిన చోళుల దేశమున కావేరీనదీమతల్లి ప్రవహించుచు నా దేశమును సుభిక్ష మొనర్చుచుండును. అచట పుష్పోద్యానము లధికములు. కర్షకులు పాటువడి పంటలఁ బండించి సుఖముగ జీవించునట్టి యా దేశమున నీడూరను గ్రామము గలదు. అందు నాస్తి యనక దానమొనర్చు శీలముగల వేళాల వంశమున నొక

భక్తుఁడుదయించి యా జాతీయులకు నాయకుఁడై యుండెను. అతఁడు శివభక్తాగ్రేసరుఁడు. వీరుఁడై నందున యుద్ధములందు సైనికుఁడై ధనమార్జించి శివభక్తుల నర్చించుచుండెను.

పరాజయమందినవా రీతనిసాయ మపేక్షించి ధనమిచ్చుచుండిరి. ఇతఁ డపారముగ ధనముఁగొని వారికి సాయపడుచుండెను. అపరయముఁడో యన శత్రువుల నుఱుమాడి స్వపక్షమునకు జయము గల్గజేసి సంతముతో వారిచ్చు ధనముఁ గొని వచ్చి భక్తజన సేవను నిర్వర్తించుచు సుఖంబుండెను. అందువలన నాతని మునైయడువారని జనులు పిలువఁ జొచ్చిరి. మునైయడువారిట్లు భక్తసేవయే శివసేవగఁ దలఁచి కాలముఁగడపి యంతమున పార్వతీపతి కరుణనంది శివలోకముఁ జేరి శివసన్నిధానమున సుఖించెను.

"ఏ యుపాయముచేనైన భక్తులఁ దృప్తిపఱచువారు ధన్యులు."

# 52. కళర్సింగ నాయనారు

లోక ప్రసిద్ధిఁ గాంచిన పల్లవ వంశమున కళర్సింగుఁడను వాఁడు జన్మించెను. అతఁడు జ్ఞానియై శివపాద తామరసంబులఁ దప్ప వేఱెద్దానిని సత్యవస్తువుగాఁ దలఁపకుండెను. అతఁడు

పట్టాభిషిక్తుఁడై యుత్తర దేశములను జయించి, ధర్మము తప్పక రాచఱిక మొనర్చుచుండెను.

పల్లవరాజైన కళర్సింగుఁడు శివాలయమున కేఁగుచు భక్తితో మ్రొక్కి సత్యసేవ లొనర్చుచుండెను. అతఁడొకసారి శివనగరమని ప్రసిద్ధిఁగాంచిన, తిరువారూరున కేఁగి రాణివాసముతో పరిజనులతో నాలయముఁజొచ్చి వల్మీకనాథునకు మ్రొక్కెను. అపుఁడాతని పట్టమహిషి యాలయమును వలగొని వచ్చుచు నచటి శిల్పసౌందర్యమునకు నచ్చెరువంది మాలికా నిర్మాణమండపముఁజేరి యచట నేలఁ బడియుండిన పుష్పమునెత్తి మూచూచెను. అక్కార్యమును కాంచిన శెఱుత్తుణయారను భక్తుఁడు రాణి యొనర్చిన కార్యము గొప్ప శివాపరాధమని నిశ్చయించి వేగముగఁబోయి లక్ష్మీసదృశయగు నామె కేశపాశములఁబట్టి లాగి నేలపైఁద్రోసి యామె ముక్కును కత్తితో కోసెను. ఆ రాణి రక్తము ప్రవహింప కేశములు విడివడ నేలపై బొరలాడుచు హాహాకారము లొనర్చుచు నేడ్చుచుండెను.

అపుడు కళర్సింగుఁడు వల్మీకనాథుని సేవించి యచటికి వచ్చెను. పుష్పితకల్పశాఖ భూమిపైఁ బడినట్లున్న తన దేవి యేడ్చుటఁగాంచి యిట్టి ఘాతకకృత్యమునొనర్చినవాఁ డెవఁడని యాగ్రహోదగ్రుఁడై యడిగెను. అపుడు శెఱుత్తుణయారు రాజుకడకు వచ్చి రాణి యొనర్చిన శివాపరాధమును తానొనర్చిన నాసికాచ్ఛేదనమును నిర్భయుఁడై తెలిపెను.

కళర్సింగుఁడు శెఱుత్తుణయారుఁగాంచి "మీరొనర్చి నది యపరాధమునకుఁదగిన దండనముగాదు. పుష్పమునే త్తిన చేతిని ఖండించుటయే తగిన శిక్ష." అని పల్కి తనఖడ్గముతో నామె చేతిని ఖండించెను. అపుడామె కరము కంకణములతో దొరలి నేలఁబడెను. అపుడటనున్న శివభక్తుల హరహర ధ్వనులు మిన్నంటెను. అపుడా కళర్సింగ నాయనారుపై దేవ తలు పుష్పవర్షముఁ గురిసిరి. శివుని కరుణాతిశయముచే నాతఁడు రాణితో కైలాసముఁజేరి శివపాదచ్ఛాయలో మునిఁగెను.

"శివాపరాధులు శిక్షార్హులు"

## 53. ఇడంగళి నాయనారు

సాగరతరంగములనెడి వస్త్రముఁ దాల్చిన భూదేవి వక్షమునందలి రత్నాలపదకమోయన నుండునది కోనాఁడు. అచటియామ్రవనములందలి కోయిలలు చూతాంకురాస్వాదక షాయకంఠములై కుహుకుహూయని ధ్వనించుచుండును. అచటి సరోవరములలోని కొంగలు జంటలు జంటలుగ మత్స్యం బులఁదిని మత్తిల్లి చల్లని గాలికి నొదిగియుండును. అట్టి కోనాఁడునకుఁ బ్రధాన నగరము కుడుంబాళూరు. అచట ఋగ్వేద శాఖీయుఁడు పొన్నంబలమును బంగరు రేకులచే

గల్పించినవాఁడగు ఆదిత్యచోళుని వంశమునఁబుట్టిన యిడంగళి యారుఁడనువాఁడు ప్రసిద్ధి వహించియుండెను. అతఁడు దిగంత విశ్రాంత యశోవిశాలుఁడు. పరసమయాచారములఁ గలనైనఁ దలఁపక శివపాద సేవారతుఁడై శివభక్తులను సేవించుచుండెను. అతఁడు వైదిక శైవమార్గము వృద్ధియగునటుల శివాలయము లందు పూజావిధులు సక్రమముగ సాగునట్లొనరించెను.

ఇవ్విధమున సేవఁజేయుచు రాజ్యమును పాలించుచుండ నొకనాఁడు శివభక్తుల కాహారమిడు నియతాచారముగల శివ భక్తుఁడొకఁడు ధాన్య మెచటను లభింపనందున తన సేవకు విఘ్నముగల్గునని భయపడి యొకరాత్రి రాజు ధాన్యాగారము జొచ్చి దొంగిలింపఁ బూనెను. అపుడచటి కావలివా రాతని చౌర్యముఁగని బంధించి తెచ్చి రాజునకు నివేదించిరి.

ఇండగళియా రాతనిఁగాంచి "యేల చౌర్యము నొన రించితివి" అని యడుగ నతఁడు తన భక్తసేవను తెల్పి భక్తుల కన్నమిడ ధాన్యము లభింపమి నట్లు చేసితినని తెల్పెను. రాజాతని మాటలనువిని మనంబున దుఃఖించి యాతని విడిపించి యితఁడే నాకోశమని పల్కి "నా ధాన్యాగారములను శివ భక్తులిచ్చకు వచ్చినటులఁ గొల్లగొట్టి కొంపోవుదురుగాక" యని నగరమందు చాటింపఁజేసెను. తన ధాన్యమునేగాక ధనరాసు లను సైతము కొల్లఁగొట్ట నాజ్ఞాపించి విభూతిమార్గము వృద్ధి గాంచునటుల చాలకాలము రాజ్యమును పాలించి శివుని పాద కమలములఁజేరి సుఖించెను.

"భక్తులకుఁగాని దేదియు ధనముగాదు."

# 54. శెఱుత్తుణ నాయనారు

గండుచేఁపలను ప్రవాహమునఁ గొనివచ్చు కావేరినది ప్రవహించు చోళదేశమున నొకభాగమగు మరుగల్నాఁడులో తంజావూరను మహానగరముగలదు. అందలి ప్రజలు జాతి ధర్మముల నతిక్రమింపక జీవించుచుండిరి. అచట వేళాల జాతికి నాథుఁడైన శెఱుత్తుణయారనువాఁ డుండెను. అతఁడు సత్యభక్తితో శివపాదపద్మములే జన్మతారక హేతువులని తలఁచి సేవించుచుండెను. అతని సేవానిరతి యనన్యసామాన్యమైనది.

అతఁడు తిరువారూరుఁజేరి వల్మీకనాథుని సేవించుచుండెను. ఒకనాఁడు కళర్సింగుని రాణి పుష్పమండపమునఁ గ్రిందబడిన పూవును మూచూచుటఁగాంచి, సహింపక సత్యభక్తుఁడగు నతఁ డామె కేశములఁబట్టి లాగి కత్తితో నామె నాసికను ఛేదించెను.

పురుష సింహుఁడైన శెఱుత్తుణ నాయనారు చాల కాలము శివసేవాధురంధరుఁడై జీవించి, తుదకు కనకసభలో నటనమాడు నటరాజ దివ్య పాదచ్ఛాయలోఁజేరి పునర్భవ రాహిత్యము నందెను.

“సత్యభక్తులు శివాపరాధమును సహింప లేరు.”

# 55. పుగళ్తుణ నాయనారు

చిఱువిలిపుత్తూరున శివవైదిక కుటుంబమున నొక మహనీయుఁ డుద్భవించెను. అతఁడు త్రిపురసంహార కాలమున మేరువును ధనువుగఁగొనిన శివుని ప్రత్యహము షోడశోపచార విధులఁ బూజించుటలో నసమానుఁడై పుగళ్తుణ యను పేరఁ బ్రసిద్ధిఁగాంచెను.

పుగళ్తుణయారుఁడు శివుని యాగమ విధుల ననుసరించి పూజించు కాలమున కాటకము లోకభయంకరముగ వ్యాపించెను. నాయనారు నిరాహారుఁడై శివుని విడువఁజాలనని శీతల జలములతో నభిషేకించుచు పూజించుచు నాయూరిని వదలకుండెను. ఒకనాఁడు తిండిలేక యతఁడు కృశించినవాఁడయ్యె, ఘటస్థ జలముతో శివునభిషేకించుచు, దానిని మోయఁజాలక సోలుచు, స్రుక్కి యా యభిషేక పాత్రను లింగముపై విడిచెను. అట్లగుటకు భయపడెను. ఆ మూర్ఛావస్థలో నతనికిని నిద్ర వచ్చెను. అపుడు శివుఁడాతని స్వప్నమునఁ గన్పించి "ఓయీ! కఱవు పోవునఱకు నీకు నేను దినమునకొక బంగరు కాసు నిత్తును" అని కరుణించెను. అంత నా భక్తుఁడు దుఃఖమువీడి లేచిచూడ పాదపీఠముపై నొక కాసు గన్పించెను. అతఁడు కాటకము నశించువఱకు ప్రతిదిన మొక కాసును పొందుచు సుఖముగ జీవించుచు తన సేవను కొనసాగించుచుండెను. చివరకాతఁడు దేవతలు స్తుతించునటుల శివపాదములఁ జేరి యానందించెను.

"భగవంతుఁ డార్తార్తిహరుఁడు."

514

# 56. కోడ్పులి నాయనారు

చోళదేశమందలి తిరునాట్యాత్తాన్కుడిలో వేళాలజాతి యందు కోడ్పులియారుఁడను భక్తుఁ డవతరించెను. అతఁ డక్కాలపు చోళరాజునకు సేనాధిపతిగ నుండెను. అతఁ డనేక యుద్ధములఁ బాల్గొని శత్రువులఁ జీల్చి చెండాడిన పరాక్రమశాలి. సేనాధిపతిగ తా నార్జించిన ధనముతో ధాన్యముఁ గొని శివాలయములకు నివేదనార్థ మొసఁగుచుండెను. అతని గృహావరణమందు ధాన్యపు బొట్టెలుండెను.

ఒకనాఁడతఁడు రాజాజ్ఞచే యుద్ధమున కేఁగవలసియుండుటచే తాను తిరిగి వచ్చువఱకు ధాన్యమును శివనివేదనమునకు మాత్రమే యిచ్చుచుండుఁడని బంధువులతోఁ జెప్పి యది శివాజ్ఞ యని కట్టడ చేసిపోయెను.

కోడ్పులియారు పోరున కేఁగినపిదప నా దేశమున క్షామము సంభవించెను. అతని బంధువులు తిండిలేక చచ్చుట కంటె శివునకై యుంచిన ధాన్యముతో జీవించి కాటకము దీఱిన పిదప మరల ధాన్యము నీయవచ్చునని తలంచి కోడ్పులి యాజ్ఞను మీఱి ధాన్యమును వ్యయమొనర్చిరి.

నాయనారు యుద్ధమున విజయముఁగాంచి రాజుకడకు వచ్చి ప్రమొక్కి కొల్లగొట్టి తెచ్చిన ధనాదుల నర్పించెను. అంత శివార్థమై తాను బంధువుల కర్పించిన ధాన్యమును వ్యయము

గావించిరని యెఱిఁగి వారిని చంప నిశ్చయించెను. తన్నెదు రొక్కని యాహ్వానించిన బంధువులతో మెల్లఁగ మాటలాడి, "ఈ సాయంసమయమున మీకు ధనాదుల నొసఁగుదు. మీరందఱు నా గృహమునకు రండు" అని చెప్పెను. వారం దఱు సకుటుంబముగ నాతనియింటఁ జేరిరి. కోట్పులి తన పేరుగల సేవకు నొకనిని గృహద్వారమున నిలిపి "యెవరిని దాఁటి పోనీయకుము" అని యాజ్ఞాపించి బంధువులఁగాంచి "శివాజ్ఞ యని చెప్పి మీపర మొనర్చిన ధాన్యరాసులను మీరు ద్రోహులై యనుభవించితిరి. మీకంటె శివద్రోహు లెవరు?" అని యాగ్రహోదగ్రుఁడై ఖడ్గముఁ జేఁదాల్చి మాతా పితృ సోదరులను, భార్యవైపు బందుగులను, ఇతర బంధు వర్గము నూఁచకోఁత గోసెను. మఱియు నా ధాన్యమును వ్యయమొనర్ప నంగీకరించినవారి తలల నెగురఁగొట్టి వారిని యమపురికి నంపెను. ఆ గుంపునుండి యొక శిశువు తప్పించు కొని గుమ్మముఁ జేరెను. కావలివాఁడీ శిశువు అన్నము తినునది గాదు; దీనిని చంపకుఁడని ప్రార్థించినను కోట్పులియారు "ఇది తినకున్నను శివధాన్యముఁ దినిన దీని తల్లి పాలిది త్రాగుటచే నిదియు వధ్యార్హమే" యని యా శిశువు నెగుర వైచి కత్తి కెఱసేసెను.

అట్లు వీరవిహారమొనర్చు కోట్పులికి మృత్యుంజయుఁడు ప్రత్యక్షమై "ఓయీ! నీ కత్తికి బలియైనవారందఱు కొంత కాలము స్వర్గమున సుఖించి పిదప నా లోకముఁ జేరుదురు.

నీవు మాతోఁ గైలాసమునకు రమ్ము" అని యాతనితో నదృశ్యుఁడయ్యెను.

"శివద్రవ్యాపహరణము పాపము."

భక్తులై మ్రొక్కు దాసులు :—

శివుని పాదములపైఁ బ్రేమఁగొని భక్తితోఁ బూజించు వారే మహర్షులు. వారు శివభక్తులఁగాంచి పులకాంకురిత దేహులై కుతూహలమున వారిఁ బొగడి సంతసింతురు. గోవును వెన్నంటు వత్సమువలె వారు భక్తుల వెంట నేఁగి కుశలప్రశ్నముఁ జేసి వారి మధురవాక్కులను విని, వినయముతో మ్రొక్కు స్వభావముగలవారై యుండువారే భక్తదాసులు. ఎవరైనను శివుని భక్తితోఁ బూజించుటను గాంచి వినయవినమితోత్తమాంగులై వారి భావముతో నైక్యతఁగాంచి సంతసించువారై యుందురు. అట్టివారు భక్తశ్రేష్ఠులు. శివభక్తులఁ గాంచి యసూయఁజెందక సంతస మతిశయింప వారిఁ బూజింతురు.

భక్తులు తా మొనర్చు కృత్యముల నన్నింటెని శివార్పణ మొనర్చి, శివుని ధ్యానించువారై యుందురు. వారికి శివపాదసేవ వినా వేఱొండు పనిలేదు. వారు జనన మను గర్తములోఁ బడనివారై యుందురు. వారు శివగాథలను వినఁ గుతూహలపడుచుందురు. వారు తమ సేవలను భక్తి మార్గములను లోకులకు బోధించుచు లోకము నుద్ధరించుచు తాము శివపాదములఁజేర నర్హులై, యా దేవదేవునకు వందన

మాచరించుటలో ద్రవీభూతమనస్కులై యుందురు. వారి మనంబులు శివధ్యానమున మునిఁగియుండుటచే నానందాతిశయము ననుభవించుచుందురు. వారి నేత్రములనుండి సదా యానందబాష్పములు స్రవించును. వారు పులకితదేహులై చేష్టలు దక్కియుందురు.

భక్తులు నిలిచియున్నను, కూరుచుండియున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, మేల్కనియున్నను, భుజించుచున్నను, సర్వకాల సర్వావస్థలందు కనకసభలో నటనమాడు నటరాజు పాదకమలములనే దర్శించుచు మ్రొక్కువారై యుందురు. వారు శివదాసులై తపోవేషముఁదాల్చి లోకులకు శివమహిమలఁ జెప్పుచు లోకముఁ బ్రకాశింపఁజేయుచుందురు. శివునకుఁ జిత్తమర్పించి మ్రొక్కువారికి నే దాసానుదాసుఁడను.

త్రిపురసంహారకుఁడు నాగాభరణుఁడు సృష్టికర్తయు సకలలోకవ్యాపకుఁడు నగు చంద్రచూడునిఁ బాడువారి మహిమను వర్ణింతును.

తమిళము, సంస్కృతము, దేశభాష వీనిలో నేదేనియొక భాషలో, బ్రహ్మాదుల కగమ్యుఁడైన శివుని వస్తువుగఁగొని రాగయుక్తముగ పద్యములఁ బాడి స్తుతించు సద్భక్తులు శివునిఁ గీర్తించువారగుదురు.

చిత్తము శివునిపై నుంచినవారు :—

బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ సదాశివులను కారణదైవములే పంచకమలములవలెఁ బ్రకాశించు హృదయము, కంఠము,

జిహ్వా, భ్రూమధ్యము, బ్రహ్మరంధ్రములను దాఁటి పైకినేఁగి సత్యరూపులై స్వయంజ్యోతులై పరమశివజ్ఞానప్రకాశితులై నాదాంతమున శివయోగమార్గమున చిత్తమును శివునిపై నుంచినవారే శివయోగులు. కనకసభలో నటనమాడు శివుని పాదములను సేవించి యాతనిఁ జేరువారే శివుని చిత్తమున నిడిన దాసులగుదురు. వారికి నే దాసానుదాసుఁడ.

తిరువారూరులో జన్మించినవారు :—

అరూపుఁడు, సరూపుఁడునై సర్వాంతర్యామియై యుమాపతియై యుండు సదాశివుఁడు సంతసింప, తిరువారూరులో జనన మంది శివదాసులైనవారి కీర్తి నెఱిఁగి వర్ణింప నేనెంతవాఁడను? తిరువారూరులో జన్మించినవారే కైలాసములోనుండు శివగణములు. పంచేంద్రియముల నడఁచి వారి పాదముల నేకచిత్తముతో మ్రొక్కువారికి మోక్షము సులభము.

ముక్కాలముల ముక్కంటినిఁ బూజించువారు :—

జీవులకు సాతసమిచ్చు శివుని, శివాగమ విధుల ననుసరించి నిర్దోషముగ భక్తితో నుదయ మధ్యాహ్న సాయం సమయములం దర్చించువా రాదిశైవమునులు. త్రికాలములందు పారంపర్యముగ శివుని షోడశోపచారములఁ బూజించుట శివవైదికులకు సదాచారము. అట్టి మహాత్ములను వర్ణింప నేనెంత వాఁడను? వారికి నే దాసానుదాసుఁడను.

విభూతిధారులగు మునులు :—

చరాచరముల కాధారుఁడగు శివుఁడు కరుణతో నొసఁగిన శివాగమములలో అగర్భము, అనుదానిని విడిచి మిగిలిన గర్భము, అనుగర్భము, ఉపగర్భమను త్రివిధ విభూతిని గల్పించు పద్ధతిని నుడివెదను. (కొండలలో పిడుగు పడినచోట నేర్పడు నది అగర్భవిభూతి. దీనిని దీక్షారహితులు ధరింతురు.)

వ్యాధిలేక వత్సముతోఁగూడిన ధేనువు గోమయమును "సద్యోజాతాది" మంత్రములతోఁ జేతనెత్తి గోమూత్రముతోఁ బిసికి యెండఁబెట్టి శివమంత్రములతో శివాగ్నియను హోమాగ్నిలో శివస్మరణతో దహించి యెత్తిన పరిశుద్ధ విభూతి గర్భవిభూతి యనఁబడును.

అడవిలో నెండియుండు గోమయముఁదెచ్చి పొడిచేసి గోమూత్రముతోఁ గలిపి అస్త్రమంత్రములతో నుండఁజేసి యెండఁబెట్టి హోమాగ్నిలో దహించి గ్రహించిన విభూతి అనుగర్భవిభూతి యగును.

పశువులు మేయుచోట చెట్లుకాలి గోమయముకాలి యేర్పడిన విభూతి, గోమయముండుచోట నిప్పుపడి కాలి యేర్పడిన విభూతి, ఇటుకలతోఁజేరి దహింపఁబడి యేర్పడిన విభూతి, యిట్టివానిఁదెచ్చి గోమూత్రముతోఁగలిపి యెండఁబెట్టి శివాగ్నిలో మతమున విధిప్రకారము దహింపఁబడిన విభూతియు. (ఉప) గర్భవిభూతి యగును.

ఈ త్రివిధ విభూతులలో దేనినైనఁ గొంత హస్తమున గ్రహించి యంతశ్శుద్ధితో భావించి నైరృతిమూల విడిచి, శివ సన్నిధానము, హోమకుండము, గురుల సమీపము నడచు దారులు, అశుద్ధ స్థలములు వీనిని పరిత్యజించి విభూతిని ధరించవలెను. విభూతి నుద్ధూళనక్రమమున గాని త్రిపుండ్ర ములుగను, చంద్రమండలముగను, దీపరూపరూపముగను అర్ధ చంద్రాకృతిగ భక్తితో ధరించనగును.

తమతమ కులాచారముల ననుసరించి తత్త్వమెఱిఁగిన మహనీయులు, నీతిమార్గగాములు, దోషరహితులు, ఆణవ, కర్మ, మాయలను త్రివిధ మలరహితులు, మహర్షులు శివాగ్ని యందు హోమమొనర్చిన విభూతి నెత్తి క్రొత్తపాత్రలో భద్ర పఱచి శివునకు మ్రొక్కి స్తుతించి యా విభూతిని దేహమునఁ బూసికొందురు. వారే విభూతిధారులు వారికి నే దాసాను దాసుఁడను.

అన్యదేశ భక్తులు :—

చేర చోళ పాండ్య దేశములలోఁగాక యన్యదేశము లందు జన్మించి శివుని పాదపద్మములఁ జేరినవారు, తిరుత్తొండ త్తొహలో స్తుతింపఁబడక శివదాసులై పూర్వాపర కాలములం దుండిన భక్తులకు నే దాసానుదాసుఁడను.

# 57. పూశలారు నాయనారు

సకల సంపదలతోఁ గూడినది తొండమండలము. అందు చతుర్వేద పారగులు, వైదికధర్మ పరతంత్రులు నివసించు తిరు నన్నిరియూరు గలదు. అచట నొక వైదిక బ్రాహ్మణకుల మందు పూశలారనువాఁ డవతరించెను. అతఁడు త్రికరణంబుల శివునకర్పించి సేవించిన శివునకు శివభక్తులకు సేవఁజేయుటకు మానవ జన్మ ముత్తమ మని భావించి తా నార్జించు ధనమును శివభక్తులకు నొసఁగుచుండెను.

పూశలారు శివునకొక యాలయమును నిర్మింపఁదలఁచి ద్రవ్యమునకై యత్నించెను. ఎంత కష్టపడిన నది యాతనికి లభించలేదు. కాన నతఁడు కొంతకాలము దుఃఖముతోఁ గడపెను! చివర కాతఁడు తన మనంబున శివున కాలయ నిర్మాణము గావింపఁ దలఁచెను. ఆలయ నిర్మాణ పరికరముల నాలోచించి యొక శుభముహూర్తము నిశ్చయించికొని, శివా గమ విధితో మనంబున నాలయమునకు పునాదులు వైచెను. భక్తితో రేయుంబగల్లు నిశ్చలుఁడై యాలయ నిర్మాణము సాగిం చెను. ఆధారము మొదలు శిఖరాగ్రమువఱకు శిల్పచాతుర్యము మీఱ మనంబున నాలయముఁ గట్టెను. అయ్యది పూర్తి యగుటకు ననేక దినంబులాయెను. గోపురముఁగూడ నిర్మించి సున్నముపూసి స్తంభమంటపాదులను నిర్మించి యొక బావిని గూడ త్రవ్వెను. ప్రాకారములను, వాని కావల నొక సరోవర

మును పూర్తి చేసెను. మనస్సులో నిర్మించిన యాలయమున శివుని ప్రతిష్ఠకై యొక శుభముహూర్తమును నిశ్చయించెను.

పల్లవరాజైన కాడవర్కోనుఁడు కాంచీపురియందొక శివాలయమును కొండఱాలతోఁ గట్టించి యందు శివునిఁ బ్రతిష్ఠింప నిశ్చయించిననాఁటి పూర్వ దివసంబున రాత్రి శివుఁడా రాజు స్వప్నమునఁదోఁచి "తిరునిన్త్రియూరిలో పూశలారుఁడను భక్తుఁడు గలఁడు. అతఁడు చాల దినములు శ్రమపడి నిర్మించిన యాలయమున ఱేపు నేను ప్రవేశింతును. కాన నీయాలయ ప్రతిష్ఠా ముహూర్తమును మఱొకనాఁటికి నిశ్చయించుకొనుము" అని చెప్పెను.

పూశలారుకీర్తి లోకమున వ్యాపింప శివుఁడు అట్లు పల్కిపోవ పల్లవరాజు నిద్రనుండి మేల్కని యా భక్తునిఁగాంచి మ్రొక్కఁదలఁచి నిన్త్రియూరునకుఁ బోయెను. అచటి జనులఁ గాంచి "పూశలారు నిర్మించిన యాలయ మెచటఁగలదు?" అనెను. వారు "మీరడిగిన ఆలయ మీయూర లేదు" అనిరి. అంతరా జచటి వైదికులఁ బిలిచి "భక్తుఁడగు పూశలారేఁడీ?" యని యడిగెను. వారు అతఁడా వీథిలో నున్నాఁడు పిలువమందురా" యన రాజు వలదని వారితో నాతని గృహంబునకుఁ బోయి మ్రొక్కి "దేవర దేవతలు స్తుతింపఁ గట్టిన ఆలయ మెచటఁగలదు" అని వినయమునఁ బ్రశ్నించెను. "గడచిన రేయి శివుని కరుణచే మీ యాలయమున శివప్రతిష్ఠ నేడు జరుగునని యెఱిఁగి యా దివ్యోత్సవముఁ గాంచవచ్చితి" నని విన్నవించెను.

అట్టి యాతని పల్కులను విని, యా భక్తుఁడు "నన్ను నొక వస్తువుగా శివుఁడు గ్రహించి పల్కుటచే ధన్యుఁడనైతి. ఆలయము నిర్మింపఁదలఁచి ద్రవ్యమునకై శ్రమపడితిని; కాని లభించనందున మానసికాలయముఁ గట్టితిని. అద్దానిని నీకు శివుఁడు తెల్పెను" అనెను. రాజాతని మహిమను పొగడి తన నగరములకు మరలిపోయెను.

పూశలారు తాఁ గట్టిన మానసిక శివాలయమున శివుని ప్రతిష్ఠించి పూజించుచు ననేకదినములుండి తుట్టతుదకు నటరాజ పాదచ్ఛాయఁ జేరెను.

"బాహ్య పూజకంటె మానసిక పూజ యుత్తమోత్తమము"

# 58. మంగయక్కరశియారు

'మాని' యను పేరుగల మంగయక్కరశి స్త్రీ జాతికి రత్నమువంటిది. చోళ వంశవృక్షమునకుఁ జివురై పాండ్యవంశమున కామె లక్ష్మి యాయెను. పాండ్యరాజులకు జైనమతము వలనఁ గల్గిన యపకీర్తిఁ బోఁగొట్టవచ్చిన దైవశిశువే యీ వనితామతల్లి. పాండ్యదేశమునకుఁ బ్రాప్తించిన దుఃఖమును శీర్గాళి బాలుని కరుణఁ జేసి పోనడఁచి, విభూతి వ్యాప్తికి దోహదము గల్పించిన దీ రాణియే. ఇట్టి మహిమగల పాండ్యునిరాణి స్తుత్యార్హ.

శివజ్ఞానియైన తిరుజ్ఞాన సంబంధుని, మధురశ్లోకములతోఁ గూడిన పదిహామములం దీయమ పొగడఁబడినది యగుటచే, నే నామెను స్తుతింప నర్హుఁడఁగాను. నెడుమార పాండ్యునకు శైవమార్గముఁ జూపి యాతనితోఁగూడ శైవమును పోషించుచు నీమె చాలకాలము జీవించియుండెను. పిదప నాథునితో శివ పాదచ్ఛాయయందు లీనమాయెను.

"అసన్మార్గములకు సతీమణులే సన్మార్గదర్శకులు"

## 59. నేశ నాయనారు

శీలవంతులకుఁ బుణ్యాత్ములకు సద్భక్తులకు నిలయమై దిగంత విశ్రాంతయశము నార్జించినది కాంపిలినగరము! ఇది హంపికి సమీపమున నుత్తరముగ నిరువదియైదుమైళ్లలో గలదు. అన్నగరియందు సాలెకులమున నేశరుఁడనువాఁ డవత రించెను. అతఁడు తన జాతిధర్మ మగు నేఁతయందు నిపు ణుఁడు. శివభక్తుల సేవయే పరమధర్మమని భావించి యతఁడు మాహేశ్వరుల పాదములకుఁ బ్రణమిల్లుచు కంచుకములను నేసి వారి కర్పించుచుండెను. శివభక్తులకు వస్త్రములనుగూడ నొసఁగుచుండెను. అట్లు శివభక్త పాదార్పిత హృదయుఁడై జీవించి చివరకు శివలోకముఁ జేరెను.

"ప్రీతితో నొసఁగునది శివప్రీతికరము"

# 60. కోచ్చంగచోళ నాయనారు

శరణుఁజొచ్చిన పారావతమునకు సరిగ త్రాసున తన మాంసమును దూఁచి యిచ్చిన మహిమగల శిబిచక్రవర్తి వంశీయులైన చోళుల దేశమును, సాగరుఁడు తన తరంగ హస్తములతో రతనములను ముత్తియంబులఁ దెచ్చి యర్చించుచుండును. అట్టి దేశమున చంద్రతీర్థమను కొలఁకువు పార్శ్వమున నొక వనము గలదు. అవ్వనమందలి తెల్ల నేరేఁడు చెట్టు క్రిందనున్న శివలింగము నొక శ్వేతగజము గాంచి జన్మాంతరకృత పుణ్యమున భక్తిగలదై తొండమున జలముఁ దెచ్చి యభిషేకించి సువాసనా వాసితంబులగు పూవులఁ దెచ్చి లింగముపై నిడి పూజించుచుండెను. (గతజన్మమున పుష్పదంతుఁడు శివసేవలోఁ దప్పిద మొనర్చి శాపగ్రస్తుఁడై గజముగఁ బుట్టెను.) శ్వేతగజముచేఁ బూజలందిన యా స్థలమునకు "తిరుఆనైక్కావల్" అను పేరు వచ్చెను.

మాల్యవంతుఁడను గణనాథుఁడు శివశాపగ్రస్తుఁడై తిరువానైక్కావలులో జ్ఞానముఁగల సాలెపురుపుగ జన్మించి యుండెను. అది యా జంబుకేశ్వర లింగముఁగాంచి శివునిపై నెండయు పత్రాదులు పడకుండఁ జేయఁదలఁచి తన నోటినుండి వచ్చు దారములతో శివునిపై వితానమును నిర్మించెను. మఱునాఁడా గజము వచ్చి మ్రొక్కఁబోయి సాలీఁడు గట్టిన గూఁటిని చూచి యిది యనుచితమని దానిని తొండముతోఁ ద్రోలఁ

గించెను. సాలీఁడు మజుల వితానమును నిర్మించెను. మరల నేనుఁగు దానిని ఛేదించెను. ఆ సాలీఁడు 'నా సేవ నిది నాశ మొనర్చుచున్న'దని చింతించి వేచియుండి 'యా గజము' రా, దాని తొండముఁ జొచ్చెను. గజమాబాధకు సహింపఁజాలక తలను బండకు మోఁదికొని మరణించెను. శివుఁడా యేనుఁగునకు గొప్ప పదవి నిచ్చి శివలోకమునకుఁ బంపెను. సాలీఁడు చోళ వంశమున జన్మించి లోకమును రక్షించుచు శివసేవ యొనర్చి పిదప మోక్షమునందున ట్లా పరమశివుఁడు కరుణించెను.

అక్కాలమున చోళచక్రవర్తియైన శుభదేవుఁడు తన పట్టపురాణి కమలవతితో చిదంబరమున కేఁగి నటరాజునకు మ్రొక్కి శివుని స్తుతించెను. ఆ రాజదంపతు లపుత్త్రకులు. కాన రాణి పుత్త్రు నొసఁగుమని ప్రార్థించెను. నటరాజు వారి కోరికను మన్నించి తా ననుగ్రహించిన సాలీఁడు వారికి పుత్త్రుఁ డగునటుల మన్నించెను. కమలవతి గర్భవతి యాయెను. నవ మాసములు నిండెను. ప్రసవకాలము సమీపింప జ్యోతిష్కులు ఒక గడియ దాఁటి శిశువు జన్మించిన చక్రవర్తి కాగలఁడని నుడివిరి. వారి మాటలు వినిన రాణి ఒక గడియ నెట్లేని గడ పుదునని పెగ్గడికత్తెలను పిలిచి తన కాళ్లను కట్టి తలక్రిందుగ వ్రేలాడదీయుఁడన వారట్లే యొనర్చిరి. మౌహూర్తికులు సెప్పిన సమయము సమీపింప కట్లు విప్పించుకొని యొక రత్నమువంటి పుత్త్రుం గనెను. కాలతామసమగుటచే నా శిశువు ఎఱ్ఱని కన్నులు గలవాఁడాయెను. కమలవతి బిడ్డనిఁగాంచి కోచ్చంగణ్ణనే

యని పిలుచుచు ప్రాణములను వీడెను. శుభదేవుఁడా శిశు వును ప్రేమతోఁ బెంచి యుక్తవయస్సునఁ బట్టాభిషేక మొనర్చి శివలోకముఁ జేరెను.

అనపాయ చోళున కాదిపురుషుఁడైన కోచ్చెంగ చోళుఁడు శివునికరుణచే పూర్వస్మృతి గలవాఁడై జ్ఞానియై లోకముఁ బాలించుచు శివభక్తుఁడై యుండెను. శివాలయ నిర్మాణములఁ గావించెను. తిరువానైక్కావలున కేఁగి చక్కని యాలయముఁ గట్టించెను. శివారాధనమునకుఁ దగిన వసతులఁ గల్పించెను.

అతఁడొకనాఁడు చిదంబరమున కేఁగి నటరాజునకు మ్రొక్కి దీక్షితులకు గృహంబులఁ గట్టించి యొసఁగెను. ఇట్లాతఁ డనేక సేవల నొనర్చుచు చివరకు శివలోకముఁ జేరెను.

"శివభక్తిం జేసి పశు పక్ష్యాదులు మోక్షముఁ జెందును."

## 61. తిరునీలకంఠయాల్పాణ నాయనారు

దక్షిణాపథమందలి మధ్యదేశమున తిరుఎరుక్కత్తంబులి యూరునందు పాణజాతిలో నవతరించినవాఁడే తిరునీలకంఠ యాల్పాణుఁడు. అతఁ డంత్యజాతీయుఁడయ్యు వీణావాదన మందు నిపుణుఁడు. అతని గృహిణి రాగరూపిణి. మతంగ చూడామణి. భర్త శివకీర్తనములను వీణియయందు మ్రోఁగింప నామె మధురకంఠమున వాని నాలపించుచుండును.

ఆ దంపతు లిరువురు శివక్షేత్రముల కేఁగుచు మధురను చేరి సోమసుందరుని యాలయ గోపురద్వారముకడ నిలిచి, వీణియ మీటుచు దేవగంధర్వులు చకితులగునటులఁ బాడిరి. ఆ మధురగానాకర్షితుఁడై సోమసుందరుఁడు అర్చకుల స్వప్నమునఁ దోఁచి "యాల్పాణ దంపతులను తన సమీపమునకుఁ గొనితెం"డని యాజ్ఞ యిడెను. మఱునాఁడు వారు శివాజ్ఞను తలదాఁల్చి యా దంపతులను స్వామి సన్నిధికిఁ గొంపోయిరి. పాణుఁడిదియు శివాజ్ఞయే యని వీణ మీటుచు నేఁగి శివుని స్తుతించెను. అచట త్రిపురసంహార వృత్తాంతమును, గజాసుర సంహారమును, కామదహన వృత్తాంతమును, భక్తుల ననుగ్రహించు మహిమను వర్ణించు కీర్తనలఁ బాడి వీణ మ్రోఁగించెను. శివుఁడాతని గానమును ప్రీతితో వినెను. పాణున కొక పీఠమిండని శివుఁ డాజ్ఞాపించెను. అపుడు భక్తులా పాణుని నొక స్వర్ణఫలకముపైఁ గూర్చుండఁ జేసిరి. అతఁడు దానిపైఁ గూర్చుండి లోకాలోకములు మూర్ఛనందునటుల దివ్య గానమున శివునిఁ గీర్తించి యాతని కృపాపాత్రుఁడాయెను.

పిదప నీలకంఠ యాల్పాణుఁడు మధురను వీడి యనేక శివక్షేత్రములను సేవించుచు తిరువారూరుఁ జేరెను. జాతి ధర్మమునకుఁ దగినటుల నతఁడు త్యాగేశుని వాకిట నిలిచి, యముని శిక్షించిన విధమును మాతృవాత్సల్యమును కీర్తనలం దిమిడ్చి పాడెను. శివుఁడాతనిఁ గరుణించి యాలయమునకు నుత్తరదిశలో మార్గముఁ గల్పించి లోనికి రమ్మన నతఁడేగి మూలస్థానేశ్వరునిఁ గన్నులారఁ గాంచి మ్రొక్కి సేవించెను.

అచ్చట కొంతకాలముండి యుమాదేవి యొసఁగిన జ్ఞాన క్షీరములఁ గ్రోలిన సంబంధుని పాదములకు మ్రొక్కఁదలఁచి శీర్గాళికి వచ్చెను. పాణుని రాక విని సంబంధుఁ డాతని కెదు రేఁగి తోడ్తెచ్చెను. ఉచితముగ గారవించెను. అతఁడచట నివసించుచు సంబంధుఁడు పాడిన పాటలను స్వరపఱచి వీణి యపై మీటు భాగ్యమునంది యాతనితోఁ జాలకాలముండి. చివరకా సంబంధుని కల్యాణ సమయమున నాతనితో జ్యోతిఁ జొచ్చి శివలోకమున కేఁగెను.

"భక్తికి జాతు లడ్డంకులు గావు."

# 62. శడయ నాయనారు

పరమేశ్వరుని తనకు మిత్రునిగఁ జేసికొని పరవయారు కడకు దూతగ నంపినవాఁడు, చేరమానున కాప్త స్నేహితుఁ డగు సుందరమూర్తినిఁ బుత్రునిగఁ బొందిన భాగ్యశాలియే శడయనాయనారు. అతఁడు తిరునావరూరులోఁబుట్టి శైవ బ్రాహ్మణ జాతికి వన్నెఁదెచ్చినవాఁడు. అతని మహిమ నెన్నఁ జాలక యాతని పాదపద్మముల నుతింతును.

# 63. ఇశై జ్ఞానియారు

(62)

శివభక్తాగ్రేసరుఁడగు శడయనారుని సతియే ఇశై జ్ఞానియారు. ఆమె శివునివలన దాసునిగ గ్రహింపఁబడిన సుందరమూర్తిని గనిన సతీమతల్లి. శ్రేష్ఠమైన వైదికులమునఁబుట్టి సుపుత్త్రునిఁగాంచిన ఈమె మహిమ నల్పుఁడనగు నేను వర్ణింపఁజాలను. ఆ పుణ్యదంపతులకు నే దాసానుదాసుండను.

"సుపుత్త్రులఁ గనినవారు ధన్యులు."

సుందరమూర్తి కైలాసముఁ జేరుట :—

సోమశేఖరుని రూపమే సుందరుఁడు; గాన యతని రూపసంపదను జ్ఞానము నెవరు వర్ణింపఁగలరు? ఫలించిన శివభోగమైన సుందరుఁడు తిరువారూరులోనుండు కాలమున నొకనాఁడు చేరమాణ్ పెరుమాళుని స్మరించి యాతనిఁ గాంచఁదలఁచి శివు ననుమతినంది మలదేశమునకుఁ బయనమాయెను.

కావేరీతీరమున శివుఁడుండు క్షేత్రములఁ గాంచుచు మ్రొక్కుచుఁబోయి కొంగు దేశమునఁగల తిరుప్పుక్కొళియూరు (అవినాశి)ను జేరెను. అచట వైదికులుండు వీథిలోఁ బోవుచుండ నెదురెదురు గృహములం దొకదానియందు మంగళఘోషమును మఱొకదానియందు శోకధ్వనిని విని, యచటివారిఁ గాంచి యా విచిత్ర మేమని యడిగెను. వారు అతనితో "పంచ

వర్ష వయస్కులగు బాలకు లిరువురు కొలనిలో స్నానమాడఁ బోయిరి. అందొకని మకరి మ్రింగెను. తప్పివచ్చిన బాలకున కీ యింట నుపనయనము సాగుచున్నది. ఆ యింట మృత బాలకునకై యేడ్పులు. ఇది వృత్తాంత" మనిరి.

పుత్రమరణ దుఃఖితులు సుందరుని రాక విని, వచ్చి మ్రొక్కిరి. శోకమునువీడి తన్ను మ్రొక్కినవారిఁగాంచి "పుత్రునిఁ గోలుపోయినవారు మీరే యగుదురా?" యని యడుగ వారు "అది జరిగి చాలకాలమైనది. అది యటుండ నిండు. దాసులమగు మేము దేవరంగాంచఁ జాలకాలమునుండి యాశగొని యున్నారము. మా కోరిక ఫలించినది. మీ దర్శన భాగ్యము నందితిమి." అని మ్రొక్కిరి. వారి ప్రేమ వాగురల్లోఁ జిక్కిన సుందరుఁడు "వీరు పుత్రశోకమును మఱచి నా రాకకు సంతసించుచున్నారు. కాన వీరి పుత్రుని శివుని కరుణచే మకరముఖాంతరమునుండి గొనివచ్చి పిదప శివుని దర్శింతు"నని తలఁచి వారి దుఃఖమును వారింప యత్నించెను.

బాలుని మ్రింగిన మకరాలయ మెచటగలదని యడిగి తెలిసికొనిపోయి తత్తీరమున నిలిచి "నేనేల మఱతు...భక్త రక్షణ పరతంత్రా! నాగాభరణా! ఆద్యంతరహితా! అవినాశిశివా! మకరిమ్రింగిన పుత్రుని యముఁడు తెచ్చి యిచ్చునట్లు జేయుము" అను పదిహముఁబాడి స్తుతించెను. అప్పటి కా బాలుఁడు మరణించి రెండేండ్లయ్యెను. యముఁ డా బాలుని యుక్తవయస్కునిగఁజేసి తెచ్చి యీయ వెంటనే

మొసలి వానిఁ దీరమునకుఁ దెచ్చి వదలెను. అపుడా బాలుని తల్లి ప్రేమపొంగి పొరల పరుగిడిపోయి వాని నెత్తి ముద్దాడెను. ఆ దృశ్యముఁగాంచిన జను లాశ్చర్య పరవశులైరి. దేవతలు పూవుల వానఁగురిసిరి. సుందరుఁ డా బాలునితో నవినాశి యాలయమున కేఁగి మ్రొక్కి స్తుతించి వచ్చెను. పిదప బాల కునితో వాని గృహమున కేఁగి వాని నుపనీతుఁగావించి పర్వత వనావృతమగు మలయాళ దేశమున కేఁగెను.

అచటి భక్తులు సుందరునిరాక నెఱిఁగి పరుగిడిపోయి చేరమానునితో "మకరిమ్రింగిన బాలుని బ్రతికించిన సుంద రుఁడు వచ్చెనని తెల్పిరి. ఆ శుభవార్తఁ దెచ్చినవారికి నాతఁడు ధవకనక వస్తువుల నొసఁగెను. సంతోషాతిశయమున నతఁడు, "నానాథుఁడు సుందరుఁడు వచ్చె. నన్ను దాసునిగ గైకొను పురుషోత్తముఁడు వచ్చె. ఆరూరి శైవశ్రేష్ఠుఁడు వచ్చె. నా మిత్రుఁడు వచ్చె" నని యనేకవిధములఁ బల్కుచు నగరము నలంకరింప నాజ్ఞాపించెను.

పిదప చేరమానుఁడు నీతికోవిదులగు మంత్రులఁ బిలి పించి సుందరుని గౌరవముగ నెదుర్కొని తోడ్తెచ్చు నేర్పా టులఁ గావింప నాజ్ఞయిడెను. తా భద్రగజ మారోహించి సుందరున కెదురువోయి గజమునుండి దిగి, వేగముగఁబోయి యాతని పాదములపైఁబడి మ్రొక్కెను. సుందరుఁ డాతనికిఁ బ్రత్యభివాదన మొనర్చి కౌఁగిలించెను. రాజు తిరువారూరు

క్షేమవార్తల నడిగి, విని యానందించెను. వారిరువురి స్నేహముఁ గాంచినవారు చంద్రోదయమున సాగరమువలె నుప్పొంగిరి.

రాజు సుందరుని భద్రగజముపై నాసీనుఁజేసి యాతనికి శ్వేతాతపత్రముఁ బట్టెను. సైన్యములు జయజయ ఘోష మొనర్చెను. మంత్రులశ్వములనెక్కి వారిని వెన్నంటిరి. రాజు సుందరుని యుత్సవముగ రాచనగరికిఁ గొనితెచ్చెను. అచట వైదికుల వేదధ్వనులు మిన్నంటెను. ఏనుఁగులు ఘీంకారము లొనర్చినవి. విప్రులు పూర్ణకుంభముఁ గొనివచ్చిరి. ముత్తైదువలు పుష్పంబులఁ జల్లిరి. నాట్యకర్తల ఆట పాటలు చెలఁగెను. అపుడు వారు గజము దిగిరి. శ్వేతాతపత్ర చ్ఛాయలో వారు అంతఃపురము జొచ్చిరి.

అచట చేరుఁడు సుందరుని సింహాసనాసీనుఁ గావించి విధ్యుక్తముగఁ బూజించెను. కొన్ని దినములుగడవ సుంద రుఁడు చేరునితో మలదేశమందలి శివక్షేత్రములకు యాత్ర జేసి సేవించివచ్చెను.

సుందరుఁడు గజారూఢుఁడై కైలాసమున కేఁగుట :—

ఒకనాఁడు చేరుఁడు స్నానమాచరించుచుండ పరమ శివు నాజ్ఞచే నీ లోకమునకువచ్చి సత్సేవలొనర్చిన సుందరుఁడు కాలము సమీపింప తిరువంజై కళమను నాలయముఁజేరి వలగొని మ్రొక్కి " ఈ సంసార బంధములఁ ద్రెంపి కరుణించి యీ దాసుని పాదములకడకుఁ జేర్చికొనుము..." (తేలక్కుతలై

మాలె...) అను పదిహాముఁ బాడెను. అపుడు కైలాసనాథుఁ డాతని మొఱను విని, తన్ను సేవించు బ్రహ్మాదులఁగాంచి "మీ రిపుడేఁగి మదర్పిత చిత్తుఁడగు సుందరుని భద్రగజము నెక్కించి కొనిరండు" అని యాజ్ఞాపించెను. వారు మహాదేవు నాజ్ఞను శిరసావహించి శుద్ధస్ఫటిక సంకాశమును జ్యోతిర్మయమగు గజమును వెంటఁగొని మహోదయమను తిరువంజిక్కళమునకు వచ్చి సుందరునకు మ్రొక్కి శివాజ్ఞను తెల్పిరి. సుందరుఁడు నీలకంఠుని స్మరించుచు భద్రేభము నధిరోహించెను. పంచ వాద్యధ్వనులు మిన్నందుచుండ చేరమానుని తలంచుచు సుంద రుఁడు కైలాసముఁ గూర్చి వెడలెను.

చేరమానుఁడు కైలాసంబున కేఁగుట:—

శివున కాంతరంగిక మిత్రుఁడగు సుందరుఁడు కైలాస మున కేఁగుచున్నాఁడని చేరుఁడెఱిఁగి వెంటనే యశ్వము నెక్కి తిరువంజికళమున కేఁగి శ్వేతగజముపైఁబోవు సుందరునిఁ గాంచెను. ఆ సుందరునిఁజేర తలఁపుఁగొని గజమును వెన్నంటు మని యశ్వకర్ణమున పంచాక్షరిఁ జెప్పెను. అపుడా తురగ మాకసమున కెగిరి సుందరుని గజమును వలగొని ముందునకు సాగి వేగముగ పోయెను.

అశ్వము నెక్కి కైలాసమున కేఁగు చేరునిఁగాంచి సైని కులు దృష్టి గోచరుఁడగునంతవఱకుఁ జూచి, పిదప తమ కత్తు లతోఁ బొడిచికొని మరణించి చేరు ననుగమించిరి. చేరుని

తురగము ముందుగఁ బోవుటఁగాంచి సుందరుఁడు "తాను నా కంఠెమ్ముం దేఁగుచున్నాఁడు..." (తా౯ యనై మున్నడిత్తా౯.) అను పదిహాఱుఁ బాడుచు కైలాస దక్షిణ ద్వారముఁ జేరెను.

సుందరుఁడు శివానందసాగరముఁ జొచ్చుట:—

సత్యభక్తులు సుందర చేరమానులు గజాశ్వములనుండి దిగి యొకటిగఁజేరి యనేక కక్ష్యలు దాఁటి శివుని సభాంగణ ద్వారమును సమీపించిరి. అట నంది చేరమాను నడ్డగించెను. సుందరుఁడు తల్లిని గాంచిన వత్సమువలె పరుగిడి శివుని పాద కమలములపైఁబడి సాష్టాంగమాచరించి స్తుతించెను. పరమ శివుఁ డాతనిఁగాంచి "సుందరా! వచ్చితివా!" యని కరు ణించెను. అంత నతఁడు "దేవా, దాసుని యపచారములను క్షమించి సేవకునిఁగ గ్రహించి కరుణించితిరి" అని మ్రొక్కి శివానందసాగరమున మునిఁగెను.

చేరుఁడు తిరుఉలా పాడుట:—

సుందరుఁడు మహాదేవునిఁగాంచి "గంగాధరా! నీ పదములఁజేర చేరుఁడు వచ్చి నందిచే నడ్డగింపఁబడి వాకిట నున్నాఁడు" అని విన్నవించెను. శివుఁడు చేరుని ప్రవేశపెట్టు మన నంది యట్లే యొనర్చెను. చేరమానుఁ డుమాపతికి సాష్టాంగమాచరించెను. శివుఁడు మందస్మిత మొనర్చి "మేము నిన్నుఁ బిలువకుండ రాఁ గారణమేమి?" అనెను. అపుడు చేరుఁడు మ్రొక్కి "ఈ దాసుఁడు సుందరుని పాదములను

విడువఁజాలక శ్వేతగజము ననుసరించి వచ్చెను. మీ కరుణయే నన్నిటకుఁ దెచ్చినది. దాసుఁడు విన్నవించునది యవధరింప వలయు. దేవదేవా! ఈ దాసునకు సుందరుని స్నేహముఁ గల్పించిన కరుణామూర్తులు తమరేగదా! దేవరపై భక్తితో నీ దాసుఁడు తిరుఉలా పాడియున్నాఁడు. దాని నిపుడు విని కరుణింపవలయు ''నని ప్రార్థించెను.

అంత శివుఁడు 'వినిపింపు'మన, చేరుఁడు జ్ఞానఉలాను, కైలాసఉలాను పాడెను. (''నాయికానాయక భావముతో శృంగార రసమయముగ భగవంతునిఁ గీర్తించు ఛందమునకు ఉలా'' అని పేరు). అంత నా చంద్రశేఖరుఁడు ''నీవు సుంద రుఁడును గణనాథులై మమ్ము సేవింపుఁడు'' అని కరుణించెను. వారా జగత్పిత పాదకమలములకు మ్రొక్కిరి.

సుందరుఁడు హాలాహల సుందరుఁడై యథాపూర్వము శివుని సేవింపసాగెను. చేరుఁడు గణనాథుఁడయ్యెను. శివు నాజ్ఞచే భువి నవతరించిన పరవయారు శంగిలియారులు విగత పాశలై యుమాదేవి కరుణచే కమలిని అనిందితలై యా దేవిని సేవింపసాగిరి.

సుందరుఁడు తాను కైలాసమునకు వచ్చుచు పాడిన ''తాఁ ఎనైమ్ముఁ పడైత్తాఁ'' అను పదిహమును లోకు లెఱుఁగునటుల వరుణునకిచ్చి భూలోకమున కంపెను. వరుణుఁ

డద్దానిని తిరువంజిక్కళమునకుఁ గొనివచ్చి లోకుల కెఱిఁగించెను. చేరుఁడు పాడిన జ్ఞానఉలాను అపుడు వినిన మాశాత్తనారు వైదికులుండు తిరువ్వాయూరునకుఁ గొనివచ్చి భక్తితో బహిరంగపఱచెను.

ఓం తత్సత్.

# 64. శేక్కిళారు

తొండమండలములో కున్రత్తూరను నొక గ్రామము గలదు. అందు వేళాలజాతీయులు పెక్కండ్రు గలరు. వారు కర్షకులు. సన్మార్గగాములు. సచ్ఛీలురు. క్రీ. శ. 11 లో నందు అరునోృద్దేవరుఁడు, అతని సోదరుఁడు పాలరావయారు అనువారుండిరి. వారిది శేక్కిళారు వంశము. అక్కాలమున అరునోృద్దేవరుఁడు విద్యావినయసంపన్నుఁడై ప్రసిద్ధిఁ బడసియుండుటచే నతని జనులందఱు వంశనామముతో శేక్కిళారని పిలుచుచుండిరి. అతఁడు నీతిశాస్త్రనిపుణుఁడు. కావున అనపాయచోళుఁ డాతని కీర్తి ప్రతిష్ఠలను విని తనకు మంత్రిగఁ జేసికొనెను. శేక్కిళారు రాజునకుఁ గూర్చు నెచ్చెలియై తన పదవిని చక్కఁగ నిర్వహించుచు, ప్రజాప్రీతిపాత్రుఁడై యుండుటఁ గాంచి రాజాతనికి "ఉత్తమ పల్లవుఁడు" అను బిరుదు నొసఁగి

గారవించెను. శేక్కిళారు తిరునాగేశ్వరునిం గొల్చు దాసుండు; గాన కున్నత్తూరులో నాగేశ్వరున కాలయముం గట్టించి పూజాదులు సక్రమముగ సాగునట్లొనర్చెను. అహ్వాము విభూతిం దాల్చి శివపాదసేవారతుండై యుండెను.

అక్కాలమున శైవసమయాచారములందు జనులకేగాక రాజునకును విశ్వాసము సన్నగిలియుండెను. రాజగు అనపాయ చోళుండు జైనమతగ్రంథములపై నాసక్తిచూపుటచే ప్రజలును జైనమతగ్రంథములం జదువసాగిరి. చోళరాజు జీవకచింతామణి యను జైనగ్రంథము నెపుండు చదువుచుండుటను శేక్కిళా రెఱింగెను. ఒకనాండా యమాత్యుండు రాజు హస్తమున జీవక చింతామణి యుండుటంగాంచి "మహారాజా! మీ పెద్దలు శైవులు. మీరు వంశానుస్యూతముగ వచ్చు శైవమునంద ప్రీతిం జెంది జైనమతముపై నాశ సూపుచున్నారు. ఇది మీ కెంతయుం దగదు. మీరీ యసత్యమతమును గారవించిన ప్రజలు దానియందే ప్రీతిం జూపుదురు. మీరు సత్యమార్గమున నడచుచో ప్రజలు మిమ్మనుసరింతురు. రాజెట్లో ప్రజలట్ల యను నా నుడి మీ రెఱుంగనిది గాదు" అని విన్నవించెను.

అంత రాజు "అమాత్యవర్యా! సత్యమత మెద్ది? యని యడిగెను. "అపుడు శేక్కిళారు సుందరమూర్తి సెప్పిన "తిరుత్తొండత్తొగై," నంబియాండారునంబి రచించిన "తిరు వందాది" యివి సత్యమును నిరూపింప సమర్థములు." అని

వానిఁగూర్చి చెప్పి యందలి గొప్పతనమును కొంత వివరించెను. అపుడా యనపాయచోళుఁడు కొంత యుత్సాహియై తిరువం దాదినిపెంచి విపులముగ వ్రాసిన నేనేగాదు, లోకులు సత్యార్థ మెఱింగి ధన్యులౌదురుగదా యనెను. శేక్కిళారు తిరువందా దినిపెంచి యరువదిమూవ్వురు శివభక్తుల చరితమును వ్రాయ నంగీకరించెను. రాజు "చక్కని శైలిలో సులభావ బోధక ముగ కావ్యమును వ్రాయుఁ"డని పార్థించెను. అంతియగాక యతనికి విశ్రాంతి నిచ్చుచు నపారముగ ధనము నొసఁగెను.

శేక్కిళారు వెంటనే చిదంబరమున కేఁగెను. అచట నటరాజుంగాంచి "దేవా! నీ భక్తుల చరితమువిన అనపాయ చోళుఁ డాశఁగొని యున్నాఁడు. నన్ను దాసులగాథలను కావ్యముగ వ్రాయఁ బ్రోత్సహించెను. ఎట్లా కావ్యముఁ బ్రారంభించుటయో తెలియకున్నది. ఈ దాసుని కరుణించి నా కావ్యారంభమున కాదిపద మెత్తియిచ్చి ధన్యుఁజేయుము" అని సాష్టాంగ మాచరించెను. వెంటనే ఆకాశమునుండి "ఉలహెలాం" అను పద మాతనికి వినిపించెను. (ఎవని లోకమెరుగదో) శేక్కిళా రా యమృతపదమును విని పులకిత దేహుఁడై, శివుని కరుణను స్తుతించి యాపదమునే తన కావ్యాది పదముగ గ్రహించి కావ్యము వ్రాయ మొదలిడెను. తన కావ్యమున కాతఁడు "తిరుత్తొండర్ పురాణము" అని పేరిడెను. అదియే పెరియపురాణము.

ధనాదులం గైకొని చిదంబరమున కేఁగిన మంత్రి కావ్యము నెంతవఱకు రచించెనో యని రాజు తెలిసికొనఁ భటుల నంపెను. వారు శేక్కిళారుని తిరుత్తొండరు పురాణము పూర్తియాయెనని విన్నవించిరి. రాజా వార్త వినిపించినవారికి బంగారము రత్నాభరణంబుల నొసఁగెను. అది యాతని నిర్భరానందమున కొక చిహ్నము. వెంటనే అనపాయచోళుఁడు చతురంగబలముతో చిదంబరమునకుఁ బయనమయ్యెను. అచట కవిరాజగు శేక్కిళారునుగాంచి సాగిలపడి మ్రొక్కి యాతని దివ్యతేజమునకు చకితుఁడై పాదపూజ గావించెను. రాజు శేక్కిళారునితో పరివారముతో భక్తులతో నటరాజసన్నిధి కేఁగి మ్రొక్కెను. అప్పు డాకాశవాణి "చోళరాజా! నా మాటను ప్రథమ పద్య పాదాదిగ శేక్కిళారు మదీయ ప్రియభక్తుల చరితమును రచించెను. దానిని భక్తి శ్రద్ధలతో విని ధన్యుఁడవుగమ్ము" అని పలికెను. ఆ మాటలను వినిన రాజానందాబ్ధిలో మునిఁగి శేక్కిళారును కావ్యమును వినిపింపఁ బ్రార్థించి "లోకులందఱు వచ్చి వినుఁడని" చాటించెను,

ఆలయమును చక్కఁగ నలంకరించిరి. కావ్యగాన సభా మండపమున కవులు పండితులు భక్తులు గృహిణీగృహస్థులు ఇసుక వైచిన రాలని రీతి సమావేశమైరి. వ్యాకరణాది షట్శాస్త్ర వేత్తలు వేదవిదులు వచ్చిరి. సభామధ్యమున నొక శ్వేతవస్త్రాచ్ఛాదితమైన మహోన్నత పీఠముపై నున్న పట్టువస్త్రముపై గ్రంథము నుంచిరి. మొదట గ్రంథమును పూజించిరి. కర్పూర

హారతుల నొసఁగిరి. శివప్రార్థన మొనర్చిరి. పిదప రాజు లేచి ముకుళితహస్తుఁడై శేక్కిళారుఁగాంచి "మహాకవీ! భక్తాగ్రేసరా! తమ గ్రంథములోని యొక్కొక్క పద్యముఁ జదివి యందలి మధుర గంభీరార్థములను వివరించి మమ్మానందింపఁ జేయ ప్రార్థించుచున్నాఁడ "నని మ్రొక్కి విన్నవించెను. శేక్కిళారు దాని కంగీకరించెను. అది యార్ద్రా నక్షత్రము. ఆనాఁటి నుండి దినమునకు కొన్ని పద్యములఁ జదువుచు శివభక్తుల సేవలు, ఆత్మసాక్షాత్కారములు వివరింపసాగెను. అట్లొక వత్సరము గ్రంథపఠనము సాగెను. రాజు వినవచ్చువారిని యన్వహ మిష్టమృష్టాన్నములచేఁ దృప్తులఁ గావించుచుండెను. మరల చైత్రమాసమున ఆర్ద్రానక్షత్రయుక్త శుభదినమున గ్రంథశ్రవణము ముగిసెను.

ఆనాఁడా గ్రంథమును పూజించి పీతాంబరమునునుంచి భద్రగజముపైఁబెట్టి యూరేఁగించిరి. శేక్కిళా రాగజము నధిరోహింప రాజు హస్తద్వయమున వింజామర ద్వయముఁ గ్రహించి వీచసాగెను. కవినట్లు సేవించుట "తనభాగ్య "మని యారాజు భావించెను. తానెన్ని పుణ్యములు చేసినందుననో తన కామహాకవిని సేవించు నదృష్టము లభ్యమయ్యెనని యానందించెను. ఆ యుత్సవమునకు ముందు బ్రాహ్మణులు వేదములఁ బఠించుచు నేఁగిరి. దీక్షితులు వారివెనుక తేవారములను గానము సేయుచుఁ బోయిరి. మంగళ వాద్యధ్వనులతో శంఖనాదములు బ్రహ్మాండము నిండెను. సమలంకృతమైన చిదంబరనగర రాజవీథులం దుత్సవముసాగి మరల కనకసభ కందఱు వచ్చిరి. గ్రంథమును స్వామి బంగరు పాదములకడ నుంచిరి. అపుడు

రాజు "తొండర్‌సీర్ పరవువర్" అను బిరుదముచే కవిని సన్మానించెను. రాజా మహాకవికి పాదాభివందన మొనర్చి పూజించెను. అంతియగాక రాజు ఆ నాఁటినుండి యీ గ్రంథము "తిరుమురలో" పండ్రెండవపదిగా పరిగణింపఁబడునని ప్రకటించెను. అట్లే తామ్రశాసనమును వ్రాయించి చిదంబర నటరాజాలయమునఁ బ్రతిష్ఠించెను. ఆ నాఁటినుండి నేఁటివఱకు పెరియపురాణము జనస్తుత్యమై కవిపండిత శిరోధార్యమై భక్తసేవ్యమై శాశ్వతయశముతో విరాజిల్లుచున్నది. శేక్కిళారు తన జీవిత శేషమును చిదంబరమున గడపి చివఱకు శివపాదారవిందములఁ జేరెను.

## 65. మాణిక్యవాచకుఁడు

మాణిక్యవాచకుఁడు సుందరమూర్తి తిరుత్తొండత్తొహాను చెప్పు నాఁటికి జననమందలేదు. ఇతఁడు పిదప ప్రసిద్ధిఁగాంచిన మహాభక్తుఁడు. జ్ఞానసంబంధ వాగీశాది గణములలోఁ జేరఁదగిన మహాకవి. భక్తాగ్రణి. ఐహిక సుఖములు తుచ్ఛములని వదలి మహాయోగియై తన కవితామృతముతో దక్షిణదేశమును ముంచెత్తి లోకము నుద్ధరించి శివునిఁ జేరిన ధన్యుఁడు.

మాణిక్యవాచకుఁడు పాండ్య చక్రవర్తులకు రాజధానియగు మధురకు ముప్పదిమైళ్లలోనుండు తిరువడవ్రూరు అను గ్రామమున అమాత్య బ్రాహ్మణ వంశమున జన్మించెను.

షట్శాస్త్ర పారంగతుఁడాయెను. పాండ్యరాజులు సాధారణముగ అమాత్యకులమున జన్మించిన విజ్ఞులనే మంత్రులుగ గ్రహించు చుండిరి. ఆనాఁడు సమర్థుఁడగు మంత్రికై వెదకుచు రాజు చివరకు తిరువడవూరులోనుండు యువకుఁడు, నీతిశాస్త్ర పారంగతుఁడు యౌగంధరాయణాదులకు సాటివచ్చు ధీశాలియగు మాణిక్యవాచకునిఁగాంచి యాతఁడే యమాత్యపదవీ నిర్వహణ దక్షుఁడని తలంచి కొలువున కాహ్వానించెను.

మాణిక్యవాచకుఁడు బాల్యమునుండి శివసేవారతుఁడు. మనమెల్లపుడు శివునిపై నుంచి తన్మయుఁడయ్యెడివాఁడు. కాన లౌకికాధికార వాంఛలకు విముఖుఁడై యుండి, రాజు ప్రార్థనను త్రోసి పుచ్చెను. అరిమర్దనుఁ డెట్లో యొప్పించి యాతని మధురకుఁ దెచ్చి మహామంత్రి పదవి నిచ్చెను. శివభక్తుఁడయ్యు మంత్రిపదవిని స్వీకరించి దక్షతతో నా పదవిని నిర్వహించెను. ఇతఁడు పొరుగు రాజులతో విరోధముఁ బెంచక వారి సామనస్యము నార్జించి దేశమున శాంతి భద్రతలను నెలకొల్పెను. అతఁడు ప్రజలపై పన్ను విధించినను ఇతరులవలెఁగాక యా ధనమును చాలవఱకు ప్రజోపయోగకార్యములకు వినియోగించి ప్రజాదరణ పాత్రుఁడయ్యెను. అతఁ డనేక పాఠశాలలను స్థాపించెను. చెఱువులను పునరుద్ధరించి కాఁపులకు నీటి వసతులను కల్పించెను. బాటలను చక్కఁబఱచి యంత స్దేశవిదేశ వ్యాపారములు చక్కఁగ సాగునట్లుచేసి కోశము నభివృద్ధి పఱచుటయేగాక జనుల సుఖజీవనమునకు దోహదమొనర్చెను.

మాణిక్యవాచకుని నైపుణ్యమును గుర్తించి రాజు ఆతనికి "బ్రహ్మరాయ" అను బిరుదు నొసఁగి గౌరవించెను. ప్రజలా మంత్రుని కన్నతండ్రి యనియే భావించిరి.

మాణిక్యవాచకుఁడు రాజ్య నిర్వహణ కార్యములలో మునిఁగినను ఆతనిమనం బెపుడు శివునియందే లగ్నమైయుండెను. అతని శివసేవ కా రాజకార్యములు ప్రతిబంధకములు గాలేదు. తనకు జ్ఞానమార్గముఁజూపు సద్గురు వెపుడు లభించునా యని యాతఁ డెదురుచూచుచుండెను. అతఁడిట్లు శివాధీనమనస్కుఁడై యుండ నక్కాలమున దైవభక్తి నశించి జనులలో భోగాసక్తి, నాస్తికభావము, పెంపొందుచుండెను. జనులు స్వార్థపరాయణులై సన్మార్గముపొంతఁబోవ నిచ్ఛగించకుండిరి. నాస్తికులు పాషండులు ప్రబలి "దైవము లేఁడు. మత మేమిటి? ఆచారము లేమి? ఇవి పిచ్చివారి భ్రమాజనితములు" అని ప్రచారము చేయసాగిరి. 'పుట్టుట తినుటకే.' అను భావము ప్రబలెను. మద్యపానము కామేచ్ఛలు పెచ్చుపెరిగెను. ఒకవైపు తన ధీశక్తిచే ప్రజలు సుఖులై యుండుట గాంచియు వారు మాయలో మునిఁగి ప్రపంచ సుఖానుభవములే శాశ్వతములని నమ్మి అసన్మార్గ గాములగుటకు మాణిక్యవాచకుఁడు చింతించెను. అతఁడు జనులకు శివాస్తిత్వమును నిరూపించి వారి నుద్ధరించు శక్తిని జ్ఞానమును తన కొసఁగుమని సర్వజ్ఞుఁడైన శివునిఁ బ్రార్థింపఁ జొచ్చెను. పవిత్రమైన భూమిని రక్తపంకిలముఁ గానీయక చతుర్విధోపాయములలో సామోపాయము నే తన రాజనీతిగ మాణిక్యవాచకుఁడు నడపుచుండ

అరిమర్దన పాండ్యుఁడు తన నామమును సార్థకపఱచికొన పరదేశములను జయింపఁ గోరుచుండెను. కావున నతఁడు సైన్యమును పెంపొందింపఁ దలంచెను. అతఁడు పరరాజులను తన పాదాక్రాంతులఁ జేసికొని గొప్ప సామ్రాజ్యమును స్థాపింపఁ గోరుచుండ "మాహింస్యాత్ సర్వాణిభూతాని" అని మంత్రి రాజునకు బోధించుచుండెను. రాజ్యాభివృద్ధియం దాసక్తిగల నృపునకు చల్లని మాటలు చెవికెక్కునా! అది యొక మదము.

అక్కాలమున రాజులు సైన్యమునకు వలయు నశ్వములను అరబ్బీయులనుండి విలిచెడివారు. ఆజానేయములు. పారసీక హయములనగిన రాజులకు మక్కువ మెక్కువ. అపుడొక అరబ్బీయుల గుంపు గుఱ్ఱములను విక్రయింప తొండి యను పాండ్యదేశపు రేవుస్థలమునకు వచ్చియుండుట రాజెఱింగి, మాణిక్యవాచకునిఁ బిలిచి "సువర్ణరాసులఁ గొనిపోయి యశ్వములను గొని తెమ్ము" అని యాజ్ఞాపించెను. అతఁడు మాఱువల్క నోడి ధనముతో తొండికి బయలుదేఱెను. మార్గమున పెరుందురయను గ్రామమున నొకనాఁడు విడిసెను. అచట నొక వృక్షముక్రింద నొకసన్న్యాసి భగవద్విషయములను బోధించుచుండెను. అతని సుధామధురోక్తులు వినుటకు ఆ వృక్షచ్ఛాయయందు జనులు తండోపతండములుగ చేరియుండిరి. ఆ దృశ్యము మాణిక్యవాచకుని హృదయము నాకర్షించెను. అచటి భక్తులు మాటిమాటికి హరహరమహాదేవా! యని ఘోషించుచుండిరి. ఆ ధ్వని యినుము నయస్కాంత

మాకర్షించునటుల నాతని మనంబు నాకర్షించెను. అతఁడది యొక దేవసభయని భావించి పరుగిడిపోయి, యా యోగి పాదములకు వందనమాచరించి "మహాత్మా! శరణు. అజ్ఞానాంధకారమునుండి నన్నుద్ధరింపుము. సద్గురూత్తమా? కరుణించుము" అని ప్రార్థించెను. ఆ యోగి యాతని నాశీర్వదించెను. అతనిలోని భగవద్దర్శనా కాంక్ష నుద్దీపింపఁజేసెను. ఆ గురు సన్నిధానమున నతఁడొడలు మఱచెను. అనిర్వాచ్యమైన బ్రహ్మానందానుభూతి నతఁ డందెను.

మాణిక్యవాచకునిలో నొక మార్పు గలిగెను. ఎంత కాలమునుండియో తీఱనివాంఛ నేఁడు నెఱవేఱినది. సద్గురువు లభించెను. జ్ఞానభానూదయ మయ్యెను. అజ్ఞానాంధకారము విడి పోయెను. వెంటనే యాతఁడు తన మంత్రి వేషమును తొలఁగించెను. అలంకారములను తీసివైచెను. సేవకులను పిలిచి "మీరు రాజుకడ కేఁగి "శ్రావణ మాసమున గుఱ్ఱములు రాఁగలవు. అని చెప్పుఁడు" అని పంపెను. పిదప రాజాజ్ఞను మఱచి విభూతిని దేహమందంతట దాల్చి రుద్రాక్షమాలాధరుఁడై గురువు పాదముల చెంత నాసీనుఁడై పరబ్రహ్మానుసంధాన సాధనపరుఁడై యుండెను. ఇంతలో పాండ్యరాజు కొనదలఁచిన గుఱ్ఱములను మఱొకరాజు కొనెను. ఇఁక గుఱ్ఱములేవి? మాణిక్యవాచకుని మాట యెట్లు నిర్వర్తింపఁబడును?

గురువు జీవ శివైక్యములఁ గూర్చి బోధింప మాణిక్యవాచకుఁడు సమాధి నిష్ఠుఁడై యైక్యసంధాన మొనర్చుచుండెను. ఇట్లుండ నతనికి ఆత్మ సాక్షాత్కారము గల్గెను. వెంటనే యతఁడు తన దివ్య కవితాధారతో "శివా! నిన్ను విడిచి నే

బ్రతుకఁజాల. నీ యాత్మ నా యాత్మను పొందియున్నది. శరీరము గగుర్పొడిచినది. నా హృదయము నీకై పరితపించుచున్నది. [illegible]. నా కన్నులనుండి యానందబాష్ప ధార లెట్లు స్రవించుచున్నవో! నేను నీ పాదములను బట్టియున్నాఁడను. కరుణించుము. నన్ను వదలకుము. నాకు అంతట నీవే గన్పించుచున్నాడవు. నా యైహిక బంధముల ద్రుంచితివి. శివా! శిలాకఠినమగు నా హృదయము ద్రవించి నీ కరుణాసాగరమునఁ గలియుచున్నది. నన్ను నీవు ప్రేమవాగురలనుండియు కామినీకాంచనములనుండి దూరము చేసితివి. ఈ నీచునకు నీ దివ్యప్రకాశమును కన్పఱచితివి. నా అంతరాత్మలో నీ బాహ్యవిశ్వమునందీ వొకటియై వెలుఁగుచున్నాఁడవు. నీవు సృష్టిస్థితిలయకారకుఁడవు. నా జీవితమంతయు నిన్ను స్తుతించునట్లొనర్చుము. నా ప్రాణమొక పవిత్రపు పాటయై నీ కర్పింపఁబడుఁగాక. నీ పాటలను పాడుచు, నాడుచు నీ భక్తులఁగూడియుండ ననుగ్రహింపుము. శివా! ప్రభూ! నిను మరలఁ గాంచగలనా! రా! రమ్ము. లేనిచో నీ దేహము వీడి జీవాత్మతో నీకడకు కేఁగివత్తును. ఈ కొండలనుండి దొరలిపడి యీ దేహమును నశింపఁజేయుదు" నని లేచి దేహత్యాగమునకు నుద్యుక్తుఁడాయెను. అపుడాతనికి దివ్యవాక్కు "మాణిక్యవాచకా! మాణిక్యములవంటి వచనములతో నన్ను కీర్తించుటకై జీవింపుము. నీవు చేయవలసిన పని ముగిసిన పిదప నిన్నునేఁ బిలుతు" అని వినిపించెను. వెంటనే యతఁ డా వాక్కు వినిపించిన దిశకు మ్రొక్కి "ఓ నా భాగ్యమా! ఓ మాతృస్వరూపా! ఓ తండ్రీ!

పాపపరిహారకా! నేనీ యసత్యలోకమును నమ్మి నాకాలమును వ్యర్థముగఁ గడపితిని. కరుణామూర్తీ! నిన్నుఁ దెలిసికొన, చూడ, స్పృశింప, ననుగ్రహించితివి. సదాశివా! [redacted] గావలసిన దేమి?'' యని పాడి స్తుతించెను.

మాణిక్యవాచకుఁడు ధైర్యముతో రాజిచ్చిన ధనములోఁ గొంత బీదల కిచ్చెను. తన గురువుండిన వృక్షముక్రింద శివున కొక సుందరాలయమును నిర్మించెను. పూజలకు వేదపారాయణములకు భూముల నొసంగి పండితులను సత్కరించెను. ఇట్లు రాజద్రవ్యము నంతటిని పుణ్య కార్యములకు వెచ్చించెను. పిదప నిశ్చింతగ నతఁడు శివునకు ముందాసీనుఁడై ధ్యానించుచు కీర్తించుచు, నృత్య మొనర్చుచు జనులకు బోధించుచుండెను.

ఇది యిట్లుండ కొందఱు రాజు కడ కేఁగి "రాజా! ఈ మంత్రి మోసకాఁడు. రాజ ద్రోహి. నిన్నాతఁడు మోసగించెను. అతఁడొక కపట సన్యాసి. అతని మాటలనువిని నీ ధనమును దుర్వినియోగ మొనర్చెను. అతఁడు నీ ధనముతో నాలయము గట్టించి యిపుడు బిచ్చమెత్తుకొనుచున్నాఁడు. అతఁడొక పిచ్చి వాఁడు. వాని పిచ్చిని తొలఁగింపవలయు'' నని చెప్పిరి. అరిమర్దనుఁడు కోపించి మాణిక్యవాచకుని బంధించి తెండని భటుల నంపెను. వారేఁగి భక్త్యున్మాదియై తిరుగు మాణిక్య వాచకునిఁ గాంచిరి. కాని యాతని బంధింప వారు ధైర్యము చాలనివారై యాతనిఁగాంచి "రాజు మిమ్ము ధనముతో గాని గుఱ్ఱములతోఁగాని రమ్మనుచున్నాఁడు'' అని తెల్పిరి.

మాణిక్యవాచకుఁ డా సమస్యను తీర్పుమని శివునిఁ బ్రార్థించెను. అపుడతనికి దివ్యవాక్కు "రాజుకడకు పొమ్ము.

గుఱ్ఱములు శ్రావణమాసమున వచ్చును అని తెల్పుము'' అని వినిపించెను. అతఁడు భటులతో మధుర కేఁగెను. అచట జను లాతనిఁగాంచి ''తన గొప్ప మంత్రిపదవిని నిలుపుకొనలేనివాఁ'' డని పలికిరి. రాజాతనిఁ గాంచి ''నా ధనమునుగూర్చి యేమి చెప్పెదవు. గుఱ్ఱములెచట?'' అని గద్దించెను. మాణిక్యవాచకుఁడు ''దేవుని కరుణచే నంతయు శుభమే యగును'' అనెను. దానికి రాజు మండిపడి ''ఒక రాతికొఱకు ఒక రాతిగుడి కట్టించి యేల నా ధనము నపహరించితివి?'' అని యడుగ నతఁడు ''అయ్యా! అవి రాతికొఱకుఁ గట్టిన యాలయములు గావు. నీ ధనమును నేను శివునికై వెచ్చించితిని. అందువలన ప్రజల హృదయములు పవిత్రములగును. నేను గుఱ్ఱములనే కొని తెచ్చియుండిన అది ప్రజల రక్తపాతకమునకు కారణమై యుండును. ఇట్లు నేను చేయుట శివాజ్ఞచేతనే'' అనెను. ''శివుఁడే నీ కష్టములను పంపఁగలఁ''డనెను. రాజు వాని చూతమని యతనిని వదలి రహస్యభటుల నాతని గమనింప నిడెను. నిర్ణీతదినము వచ్చెను, కాని గుఱ్ఱములు రాలేదు. మాణిక్యవాచకుఁడు ధ్యాననిష్ఠుఁడయ్యెను. ''శివా! నన్ను లోకులు పిచ్చివాఁడనుచున్నారు. నేను నీ పిచ్చిలో నున్నాను. నన్నీ సంసారాంబుధిలోనుండి యుద్ధరించితివి. నా దేహాత్మలను నీ కర్పించితిని. ఏమి సంభవించినను సరియె. మంచి చెడుగులలో నేదియైన నీ యిచ్ఛయే'' అని ప్రార్థించెను.

అరిమర్దనుఁడు కోపఘూర్ణితహృదయుఁడై మాణిక్యవాచకుని బంధింప నాజ్ఞయిడెను. వారట్లేచేసి యాతని బాధింపసాగిరి. చెఱలో నతఁడు ''నాథా! ఈ ప్రాణము లీ దేహమును భరింపఁజాలకున్నవి. పరమాత్మా! నేను ఖడ్గము

నకు కాలకూటవిషమునకు భయపడను. కాని జనులు నిన్ను ప్రేమింపజాలకుండుట గాంచి భయపడుచున్నాను. దేవా నీ రక్షణ యేదీ! కరుణ యేదీ! ఈ బాధలను భరింపఁజాలను. నన్ను నీవు మఱచితివా!'' యని వేడుకొనసాగెను. శివుఁడూరకుండునా! ''నమేభక్తః ప్రణశ్యతి'' యనిగదా యాతని ప్రతిజ్ఞ.

ఒకానొకనాఁడు గుఱ్ఱము లేతెంచెను. అరిమర్దనుఁడు చెఱసాలకు వచ్చి ''బ్రహ్మరాయా! శ్రేష్ఠజాతీయములైన యశ్వములు వచ్చినవి. వానిని తెచ్చినవాఁడు చక్కఁగ గుఱ్ఱపుస్వారి చేసెను. నీవు నీ మాట నిలిపికొంటివి. ఇఁక నీవు నాకు మంత్రివై దయచూపుము'' అనెను. మాణిక్యవాచకుఁడు రాజు కోరికను నిరాకరించి ''నా కోరిక యొకటియే గలదు. అహర్నిశలు నటరాజును కీర్తించుచు కాలము గడపుదు'' అనెను. ఒకనాఁడా మాణిక్యవాచకునకు నక్కల కూఁతలు వినిపించెను. జనులు దిక్కు తెలియక పరుగిడుచుండిరి. సైనికులను నక్కలు చీల్చసాగెను. గుఱ్ఱము లదృశ్యములాయెను. రాజు కోపించి యది యంతయు మాణిక్యవాచకుని యింద్రజాలమని భావించి యాతని చెఱఁబెట్టి బాధింపసాగెను. అతఁడు ''ఆర్తార్తిహరా! ఈ శిక్షచే నా దేహము పవిత్రమగును. కాని యెంతకాల మీ బాధలను భరింపఁగలను! నే రక్షింపఁబడిన లోకులు నీ శక్తిని విశ్వసింతురు. అజ్ఞానము నశించును. నమశ్శివాయ, నమశ్శివాయ'' యని ప్రార్థించెను.

మఱునాఁడు వైఘ పొంగి మధురలోనికి వచ్చెను. జనులు భయపడి అంతఃపురములోనికి వచ్చిరి. రాజు ప్రవా

హామఁ జూపుటకు నింటికొకరు రా నాజ్ఞయిడెను. ప్రతి వ్యక్తియు నొక గంపతో వచ్చి ప్రవాహమునకు అడ్డుకట్ట పోయ సాగిరి. అచట వన్నియను నొక వృద్ధవనిత తినుబండముల నమ్ము కొనుచుండెను. ఆమె తనపాలికి నొకనిని పంపవలసియుండెను. అపుడు శివుఁడొక యుప్పరివాని వేషమున వచ్చి "అవ్వా! నాకు తిండి పెట్టుము. నీ పనిని నేను చేసెదను" అన నామె యాతనికి కడుపునిండ తిండిపెట్టెను. అతఁడు కట్టవేయుటకు పోయి పాటలు పాడుచు నాడసాగ జనులందఱు పని నిలిపి వాని చుట్టు మూఁగిరి. పనికి భంగమాచరించెనని రాజభటులాతనిఁ గొరడాల మోదిరి. అతఁడొక గంపెడు మట్టిపోసి యదృశ్యుఁ డాయెను. భటులు కొట్టిన దెబ్బలు రాజునకు రాణికిఁ దగిలెను. ప్రవాహము నిలిచెను. అపుడొక యాకాశవాణి "మాణిక్య వాచకుని తీవ్ర శిక్షలకు గుఱిసేయుట మీ యాపదలకుఁ గారణము" అని వినిపించెను. జనులు రాజు రాణియు భయపడి మాణిక్యవాచకుని చెఱ విడిపించి మంత్రిగ నుండ ప్రార్థించిరి. వారి మాటల వినక యతఁడు తీర్థయాత్రకు బయలుదేఱి యనేక క్షేత్రములఁ గాంచుచు కీర్తన మాలికల నర్పించుచు చిదంబరమును చేరి జీవితశేషము నట గడపెను. అతఁడచట తిరువాచకమును రచించెను. దానిని నటరాజు పాదసన్నిధినుంచి యతఁడు శివైక్యము నందెను. మాణిక్యవాచకుని చరమ శ్లోకార్థము. "జ్యోతిస్స్వరూపా! నీవు నన్ను సృజించి గ్రహించితివి. నా యాలోచనలన్నియు నిన్ను గుఱించియే.

నా జిహ్వా నిన్నే కీర్తించుచున్నది. నా హృదయము త్వద్దర్శనాకాంక్షతో నిండియున్నది. ఈనాఁడు నీవు నా హృదయమున తేజఃపుంజముగఁ గన్పించుచున్నాఁడవు. నీ కాంతి అజ్ఞానాంధకారమునకు భానుతేజమై వెలుఁగుచున్నది. నేను నీతో నైక్యమొందుచున్నాఁడను. నిన్ను నేను అంతటను గాంచుచున్నాఁడను. సకల ప్రాణులయందు నీవే నాకు గన్పించుచున్నాఁడవు. పరమేశా! జయ జయ పరమేశా'' అని కీర్తించి మాణిక్యవాచకుఁడు శివునియందు లీనుఁడై శివాత్మత నందెను.

ఓం నమో భక్తార్తిహరాయ భక్తజనపాలకాయ
భక్తజనసేవ్యాయ పరమాత్మనే సదాశివాయ.
ఓం తత్సత్. సత్యం. శివం. సుందరం.

ఇది భవానీ శంకరపాదార్పిత చిత్తుఁడు, భారద్వాజగోత్రుఁడు,
అతిరాత్రపౌండరీక సోమయాగాది క్రతువులఁ జేసి
పవిత్రంబగు పొంగూరు వంశభవుఁడు అగు
సూర్యనారాయణశర్మచే రచింపఁబడిన శివభక్త చరితము

సంపూర్ణము.

"నీలకంఠ తవపాదసేవనం సంభవంతు మమ జన్మజన్మని!"

ఓం

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | REHB020332 |
| పుస్తకం పేరు | శివభక్త చరితము |
| తారీఖు | 9/2/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | NO |
| పెద్ద సైజు పేజీలు | 626 |
| ఖాళీ పేజీలు | IIB, IVB, XXVIIA, 40B, 4B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandhu |
| పేజీలు విడదీసినది | Nandhu |
| స్కాన్ చేసినది | yameema |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |

Blank pages:- 104 A, 200 A,

290 A, 284 A, 460 A, 380 B,

536 A, 553